# ఈ సంచికలో...



ముఖచిత్రం: తొలకరి మెఱుపు

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 18–00

[illegible]క సంచికతో రు. 23.

వెన్నెలలాంటి వలపు  వలపు తలపులాంటి సంగీతం  సంగీతంలా సాగిపోయే తీయని కథ!




నిర్మాత: D. మధుసూదనరావు B.A.,  దర్శకుడు: V. మధుసూదనరావు:  అన్నపూర్ణ ఫిలిమ్స్ రిలీజ్




ఆర్యా,

జూన్ నెల సంచికలో ప్రచురితమైన పి. కనకాంబరరాజుగారి 'పూలు పడగలు' అనే కథ చాలా బాగుంది. వాస్తవానికి దగ్గరగా వుంది. యువను అత్యంత శోభాయమానంగా తీర్చి దిద్దుతూ మమ్మానందింప చేస్తున్నందుకు మీకు నా హార్దికాభివందనములు.

—ఉపశ్రీ. నార్త్ రాజుపాళెం.

జూన్ 'యువ' ముఖచిత్రం 'పల్లవి శావు' చూడ ముచ్చటగాయుంది 'యువ'కి ఎంతో వన్నె తెచ్చింది సీరియల్‌గా ప్రచురిస్తోన్న 'మీనా' అత్యద్భుతంగా వుండి మమ్మల్ని ఆనందసాగరంలో ముంచెత్తుతోంది. "పూలు పడగలు" పెద్దకథ. "ఎండమావులు" 'పాల పొంగు" కథలు చాలా బాగున్నాయి.

—దాచర్ల సుబ్రహ్మణ్యం. విశాఖపట్నం.

జూన్‌నెల యువ చదివాము. కథలన్నీ ఎంతో ఆకర్షణీయంగా వున్నాయి "మీనా" సీరియల్ చదువుతూంటే ఇంకా చదవాలనిపిస్తుంది. కథల్లో "ఎండమావులు" చాలా బాగుంది. యువ కలకాలం ఇలాగే విలవాలని ఆశిస్తున్నాము.

—కడియం సుందరశివరావు. పాలకొండ.

జూన్ సంచికలోని పి. కనకాంబర రాజుగారి "పూల పడగలు" బాగాలేదు.. గొప్పగా వుంది!! 81 పేజీల ఈ కథ ప్రతిక్షణం ఉత్కంఠతలో ముంచుతూ, ఆశించని కొంగ్రొత్త మలుపులు తిరుగుతూ—ఆసక్తిదాయకంగా వుంది. రచయితకి నా కృతజ్ఞత.

—వెలిశాల ముత్తేందర్, కరీంనగర్

హృదయాన్ని కదిలించే కథలు తరచు మీ కృషివల్ల చదవగల్గుతున్నాము. "ఇదీ త్యాగమే" "పాలపొంగు" కథలు మాకు నచ్చేయి —కె. సునీతాప్రసాద్,

కె రాజేశ్వరరావు, వరకాల.

"పూల పడగలు" "మొదటిపాఠం" "ఎండమావులు" "పాలపొంగు" కథలు చాలా బాగున్నవి. వచ్చే సంచికకై ఆత్రుతగా ఎదురు చూస్తున్నాము.

—ఎస్. స్వతంత రెడ్డి, వగైరా

మీరు ప్రచురించిన జూన్ నెల "యువ"లో పి. కనకాంబరరాజుగారి "పూల పడగలు పెద్ద కథ మంచి సస్పెన్సుతో ఆఖరివరకూ నడిచింది. ఈ కథ సినిమాకి మంచి ప్లాట్। సుఖాంతం చేసివుంటే మంచి రిలీఫ్ ఇచ్చేది.

—వెత్సా వెంకటరమణకుమారి,
విజయనగరం.

## తప్పక చూడండి!



పి.ఎస్.ఆర్. పిక్చర్స్ వారి

# రౌడీలకు రౌడీలు

నిర్మాత: పింజల నాగేశ్వరరావు ప్ర. దర్శకత్వం: కె.ఎస్.ఆర్. దాస్

A.S. Murty

ఆంధ్ర: శ్రీ ఫిలిమ్స్ విడుదల, హక్కుదార్లు: ఆంధ్ర: రవీంద్రా ఎంటర్‌ప్రైజెస్. విజయవాడ, సీడెడ్: శ్రీ గౌరీ పిక్చర్స్. గుంటకల్లు, చిత్తూరు: శ్రీ వెంకటరమణా పిక్చర్స్. తిరుపతి, మైసూరు: శ్రీ బాలాజీ ఎంటర్‌ప్రైజెస్, నైజాం: పద్మా పిక్చర్స్.

WITH 1968 CAME RAM AUR SHYAM

WITH 1969 NANHA FARISHTA

AND NOW THE MASTER OF MASTERPIECES B.NAGI REDDI

PRESENTS THE GREATEST FAMILY FILM OF THE DECADE

# GHAR GHAR KI KAHANI



EASTMANCOLOR BY FILMCENTER

DIRECTION : T. PRAKASH RAO

MUSIC : KALYANJI ANANDJI

DIALOGUE : INDER RAJ ANAND

A FILM ABOUT YOU AND ME

A NOBLE FAMILY EPIC BOLD, UNUSUAL UNIQUE



A VIJAYA INTERNATIONAL FILM



# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 23 | జూలై —1971 | సంచిక 7


కొత్త ఆర్థిక సంవత్సరం ఆరంభించింది. అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలూ, తమ వార్షిక బడ్జెటులను ప్రకటించారు. కొత్త పన్నులను, కొద్దో గొప్పో వేశారు. కేంద్ర ప్రభుత్వ బడ్జెటుకూడా ప్రకటించబడింది. అసలే దిక్కు, తెన్ను తోచకుండా వున్న మనిషి నెత్తిమీద సుత్తితో కొట్టినట్టుగా, కొత్త పన్నులు విధించబడ్డాయి. రైల్వే చార్జీలు కొన్ని పోస్టలు చార్జీలుకూడా ఎక్కువ చేయబడ్డాయి.

స్వాతంత్ర్యం వచ్చిన యీ ఇరవై నాలుగు ఏండ్లలో, ప్రతి సంవత్సరమూ పన్నులు ఏదో ఒకరీతిగా ఎక్కువ అవడమే తప్ప, ఒక్క సంవత్సరంలో కూడా తగ్గించడం జరగలేదు. మితిలేకుండా పెరిగిపోతున్న పన్నులవల్ల ప్రజల నిత్య జీవితం దుర్భరం అవుతున్నది. ఒకానొకప్పుడు, ఒక నిర్ణీత ఆదాయం లోపు ఆదాయం వచ్చే ప్రజలు పన్నులు చెల్లించవలసిన అవసరం వుండేది కాదు. కాని, యీనాడు ఆదాయంమీద పన్నులేకాక, నిత్యావసర వస్తువులు అనేకంమీద పన్నులు క్రమ క్రమంగా ఎక్కువ అవడంవల్ల బీదప్రజలు కూడా తమ కొద్ది ఆదాయంతో జీవితం గడపలేని పరిస్థితి ఏర్పడింది. మధ్య తరగతి ప్రజలు, తమ ఆదాయంలో పెద్ద భాగాన్ని పన్ను క్రింద చెల్లించి బీద జీవితాన్నే గడపవలసి వస్తున్నది. భాగ్య వంతులు క్రమంగా మధ్య తరగతి దారిలోకి. ఆ తరువాత బీదరికంవైపుకూ నడవ వలసి వస్తున్నది. ఈ విధమైన పరిస్థితిని కల్పించే పన్నులు దేశపు ఆర్థిక స్థితిని

బాగుపరచ జాలవు.

పరిమితి లేకుండా, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు పన్నులను ప్రతి సంవత్స రమూ పెంచుతూ పోవడానికి కారణం ఒక్కటే, పరిపాలనా నిర్వహణకు అయ్యే ఖర్చును అదుపులో పెట్టలేకపోగా, పెంచుకుంటూ పోవడం.

ప్రభుత్వ పరిపాలనా నిర్వహణకు అయ్యే ఖర్చును అదుపులో పెట్టి, పరిపాల నను సమర్థంగా నిర్వహిస్తూ ఖర్చును తగ్గించినట్లయితే, ప్రజలనుంచి వసూలుచేసే పన్నులను కూడా కొంతవరకు తగ్గించడానికి అవకాశం ఏర్పడుతుంది. కాని, మన రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు యీ విధంగా ఏ మాత్రమూ ఆలోచిస్తున్నట్టే లేదు.

పరిపాలనా నిర్వహణానికి అయ్యే ఖర్చులను తగ్గించాలంటే, మంత్రులు ముందుగా తమ ఖర్చులను తగ్గించుకోవాలి. అత్యవసరమైన పనిఉంటే తప్ప అయినదానికీ కానిదానికీ మంత్రులు దేశమంతటా ఊరేగడం మానుకోవాలి. తమ కార్యాలయాలలో సిబ్బందిని విపరీతంగా పెంచి, ఎవరికీ పనిలేకుండా కూచుని కబుర్లు చెప్పుకొనే అధ్వాన్న పరిస్థితిని మార్పించి, వీలైనంత తక్కువ సిబ్బందితో పరి పాలనా కార్యక్రమాలు చురుకుగా సాగేటట్టు చూడాలి. మంత్రులూ, గవర్నరులూ, రాష్ట్రపతులూ దేశమంతటా, అస్తమానూ ఊరేగుతూ వుండడంవల్ల, కనపడేదీ కనపడనిదీ కోలెక్కుడబ్బు ఖర్చు అవుతోంది. ఇదంతా ప్రజల డబ్బు. ఈ ఖర్చు ఎక్కువ అయితే, దానిని ఇచ్చుకోవలసినవారు ప్రజలే.

మంత్రుల ఖర్చును తగ్గించడంతోపాటు, ప్రతి రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ మంత్రుల సంఖ్యనుకూడా తగ్గించాలి. రాజకీయ పార్టీలలోని వర్గాలను సంతృప్తి పరచడంకోసం మంత్రులను నియమించే పద్ధతి పోతేనేగాని మంత్రుల సంఖ్యను తగ్గించడానికి వీలుపడదు. ఇంతమందికంటె ఎక్కువ మంత్రులు వుండకూడదు అనే ఒక నియమాన్ని పెట్టుకొని, ఏ పరిస్థితులలోనూ ఆ సంఖ్యకంటె ఎక్కువమందిని మంత్రులను నియమించకుండా వుంటే, ఆ రాష్ట్రపు పరిపాలనావ్యయం చాలా తగ్గు తుంది. ప్రస్తుతం కొన్ని రాష్ట్రాలలో దాదాపు యాభైమంది మంత్రులు వున్నారు. ఇంతమంది మంత్రులు చేసేపని ఏమీలేదు. మంత్రుల సంఖ్య ఎక్కువ అయినకొద్దీ, మంత్రిమండలిని పడగొట్టడానికి ప్రయత్నించేవారి సంఖ్యకూడా ఎక్కువ అవుతోంది. ఒక నిర్ణీత సంఖ్యకంటె ఎక్కువగా మంత్రులను నియమించడం జరగదు అని స్పష్టపడినప్పుడు, తాము మంత్రులు అయ్యే అవకాశం లేదని చాలామంది గ్రహించుకొని, ఉన్న మంత్రిమండలిని పడగొట్టే ప్రయత్నాలు చెయ్యరు. మంత్రులు తక్కువ అయితే, వారి సిబ్బంది తగ్గుతుంది; వారి సంచారాలు తగ్గుతాయి. ప్రజల

డబ్బు తక్కువఖర్చు అవుతుంది. ప్రజలు యిచ్చుకోవలసిన పన్నులు ఎక్కువ అవవు

ప్రజా సంక్షేమ విధానాలను అమలు పెట్టదలుచుకున్న ప్రభుత్వం చెయ్యవలసిన పని ఏమిటంటే, ప్రజలందరికీ సుఖ జీవనం సాగించడానికి తగిన అవకాశాలను, కల్పించడం. అలా కాకుండా, భాగ్యవంతుల నెత్తికొట్టి, వారికివున్న కాస్తా, కూస్తా డబ్బును పన్నుల రూపంలో తీసుకొని, మంత్రులకోసమూ, పెద్దపెద్ద ఉద్యోగుల కోసమూ, రాష్ట్రియోజనకరమైన ప్రణాళికలకోసమూ ఖర్చుపెట్టడంవల్ల, ధనికులు చక్కగా బీదలు అవుతున్నారుగాని, బీదలు మాత్రం ఏ కొంచెమూ బాగుపడలేదు. పరిశ్రమలను పెట్టి, తాము జీతం ఇచ్చే పనివారు సరిగా పనిచేసినా పనిచెయ్యక పోయినా, తాము మాత్రం కష్టపడి తమ పరిశ్రమలను నిర్వహించుకుంటూ, తమ పెట్టుబడిమీద కొద్దిపాటి లాభమూ, తమ శ్రమకు కొద్దిపాటి ఫలితమూ ఆశించే పెట్టుబడి దార్లు సంపూర్తిగా నిస్పృహ చెందడంవల్ల, ఎన్నో పరిశ్రమలు దెబ్బతింటాయి. అలాటప్పుడు, ప్రభుత్వమే పరిశ్రమలన్నిటినీ నిర్వహిస్తుందా? ప్రస్తుతం ప్రభుత్వం నిర్వహిస్తున్న పరిశ్రమలలో, ఏటా ఎన్నికోట్ల రూపాయలు నష్టం అవుతున్నదీ ప్రభుత్వానికీ తెలుసు, ప్రజలకూ తెలుసు. పెట్టుబడికీ, కృషికీ తగిన ఫలితం వుంటుందంటే, ఏ వ్యక్తి అయినా కృషిచెయ్యడానికి ఉత్సాహం చూపుతాడు. పరిశ్రమ ఏమయినా, నెలనెలా తన జీతం తనకు వస్తుందని అనుకున్న వ్యక్తి, ఆ పరిశ్రమను సమర్థతతో, లాభదాయకంగా నిర్వహించాలనే శ్రద్ధ వుండదు.

అందుచేత, ప్రభుత్వం ఇకముందు ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలలో ఎక్కువ ఎక్కువ పెట్టుబడి పెట్టడంమాని, పెట్టుబడి లాభదాయకం అయేటట్లుగా పరిశ్రమలను నిర్వహించడంలో శ్రద్ధవహించినట్లయితే, ప్రజల డబ్బును దుర్వినియోగం కాకుండా చూడవచ్చును.

ప్రజల వద్దనుంచి ప్రభుత్వం డబ్బును జాగ్రత్తగా ఖర్చుపెట్టడం ప్రభుత్వ ధర్మం. అలా చేసిననాడు, ప్రభుత్వం ప్రజల నుంచి ఏటేటా ఎక్కువ పన్నులను వసూలు చెయ్య నక్కరలేదు.

పన్నులు తగ్గి, నిత్యావసర వస్తువులు తక్కువ ధరకు దొరికిననాడు, తాము చెల్లించే పన్నులు తగ్గిననాడు, తమ ఆదాయంతో తమకు కావలసిన నిత్యావసర వస్తువులను కొనుక్కొని సంతోషంగా జీవితం గడపగలిగిననాడు, ప్రజలు తమ ప్రభుత్వం మంచి ప్రభుత్వమని సంతోషిస్తారు. అదే నిజమైన ప్రజారాజ్యం.




మూడో ఝాము దాటి. తెలతెల్లవారబోతూంది. ఊరంతా పెత్తనాలు పాగించి వచ్చిన రాసమణి ఇప్పుడు ఇంటిముఖం పట్టింది. ఆమెకు ముందరగా పది పన్నెండేళ్ళ కుర్రది ఒకత్తె నడుస్తూవుంది. అది రాసమణి మనమరాలు.

ఆ పల్లెటూరి ఇరుకు దారిలో ఒక మేకపిల్లని ఇవతలవేపు కట్టేశారు. అది అవతల పక్కకి పోయి పడుకుంది. అది కంటబడగానే రాసమణి పెద్దగా అరవటం మొదలెట్టింది—"ఒసేవ్ అమ్మీ! తాడు దాటబోకు! ఆ తాడు దాటబోకు!—

"దాటావూ?—అనుకున్నంతా చేసేతీరావ్!—కళ్ళు నెత్తిమీద పెట్టుకు నడుస్తున్నావేమే, పాపిష్ఠిదానా!—కట్టివుంచిన మేకపిల్ల చక్కా అలా కనబడుతూవుంటే. నీకేం కళ్ళు రెండూ పోయినయా?"

"మేకపిల్ల నిద్దరోతూంది, నాయనమ్మా!—" అన్నది మనమరాలు.

"నిద్దరోతోందా? నిద్దరోతూంటే దోషంలేదూ?—ఇవాళ మంగళారప్పొద్దుకదా. చక్కగా కట్టుతాడు దాటతావుటే!—"

"దాటితే యేమవుతుంది, నాయనమ్మా!" అనడిగింది, మనమరాలు.

"ఏమవుతుందని అడుగుతావేమే, పాడుమొహమా?—బ్రాహ్మణ పుట్టుక పుట్ట లేదూ నువ్వు? పది పన్నెండేళ్లు దాటొచ్చాయి, ఏం లాభం?—శుద్ధ మొద్దావతారం! కట్టుతాడు దాటరాదనీ, తొక్కకూడదనీ ఆమాత్రం తెలీదూ? పైగా ఏమవుతుందని అదో ప్రశ్నా?— మేకల్ని మేపుకోవాలని దిక్కుమాలిన యావ! ఆ ఆత్రంతో అడ్డ మైనవాళ్ళూ ఎక్కడపడితే అక్కడ మేకల్ని కట్టేస్తారు. నలుగురూ నడిచే దారిలో వాటిని కట్టేస్తే నడవటాని కెంత యిబ్బందో కాస్తంతయినా తెలుసా వాళ్ళబుర్రకి?—

"ఉష్!—ఈ మంగళారం మాపటి పొద్దు, మా పిల్ల కట్టుతాడు దాటిందే. రామా? ఇలా దారి కడ్డుగా మేకల్నెందుకు కట్టెయ్యాలీ అంట?—వాళ్ళకిమాత్రం పిల్లలూ పాపలూ లేరా? మేలూ కీడూ కలుగుతుందని వాళ్ళకిమాత్రం తెలియొదా అని అడుగుతా!—"

ఉన్నట్టే ఉండి, రాసమణి దృష్టి అకస్మాత్తుగా అక్కడేవున్న ఒక పిల్లమీద పడ్డది. అది పన్నెండు పదమూడేళ్ళ యానాదిపిల్ల, అక్కడ దార్లోంచి మేకపిల్లని తీసేదామని అది భయపడుతూ యిటు వస్తూంది.

ఇప్పుడు రాసమణి ఎదట లేనివాళ్ళని తిట్టడం మానేసి, ఎదురుగ్గా వస్తున్న ఆ యానాదిపిల్లమీద విరుచుకు పడింది—"ఎవత్తెవే నువ్వు, పాడు పీనుగా!— బొత్తిగా రామణ నే పోతున్నావే? కళ్ళు లేవూ? చూపు ఆనదూ? నీ కొంగు మా పిల్ల దాటకేసి కొడతావా?—" అంటూ తీక్షణమైన కంఠస్వరంతో దయ్యబట్టింది.

"లేదండవ్వగారూ! నే నవతల్నుంచి ఎడంగానే వచ్చానండి!" అన్నది, యానాది పిల్ల అతి భయంతో.

రాసమణి ముఖం అదోలా వికారంగా పెట్టింది "అవతల్నుంచి ఎడంగా వెళ తున్నావా? అలా వెళ్ళాలిసిన అవసర మేమిటొచ్చిందీ అంట, నీకు? అయితే, ఈ మేకపిల్ల నీదే కామోసు! నీ కులమేమిటే, అసలు" అంటూ గద్దించింది.

"మేం యానాదివోళ్ళమండి, అవ్వగారూ!"

"ఏమిటీ!—యానాదులా?—అయితే, ఇలా వేళగానివేళ మా అమ్మాయిని తాకి, స్నానం చేయిస్తావా?"

ఈ ప్రశ్నకు మనమరాలే జవాబు చెప్పింది—"లేదు నాయనమ్మా! అది నన్ను తాకలేదు."

రాసమణి కోపంతో—"ఛీ! పాపిష్ఠీ. ఊరుకో! దాని కొంగు అంచు నీకు రాచుకు పోవటం నే కళ్ళారా చూశానే. పద. ఈ చలిలో చెర్లోమునిగి ఛస్తువుగాని. తలారా మునగాకనే మళ్ళీ ఇంటో కాలెట్టడం, తెలిసిందా?—

"ఓయ్ దేవుడా!—ఇహ జాతేమిటి, జన్మేమిటి? ఇవేమీ ఉండేట్టు లేదు. అంతా మట్టి కలిసిపోయింది!—అలగా జాతివాళ్ళకి అతిశయం హెచ్చింది. ఆదుపు మీరిపోయారు. దేవతలంటేను, బ్రాహ్మలంటేను భక్తిలేదు, భయంలేదు. ఎవళ్ళనూ లెఖ్ఖ చేసేట్టు లేరు వీళ్ళు —ఛండాలప్పిల్లా!—యానాది గుడిసెల్లోంచి పనిగట్టుకుని బ్రాహ్మణ అగ్రహారంలోకి వచ్చావా, మేకపిల్లని కట్టెయ్యటానికి?" అన్నది.

యానాదిపిల్లకి అమిత సిగ్గేసింది. అది భయపడిపోయింది. మేకపిల్లని ఎత్తుకుని, గుండెకి అదుముకుంది "ఈ అమ్మాయిగార్ని నేనేం అంటుకోలేదండీ అవ్వగారూ!" అని మాత్రం చెప్పి ఊరుకుంది.

"అంటుకోకపోతే మరి. ఈ వీధి కెందుకొచ్చావే, ఛావడానికా?" అంటూ కసిరింది రాసమణి.

ఆ పిల్ల చెయ్యెత్తి, దగ్గరలోనే కంటికి కనబడకుండా ఎక్కడో వున్న ఓ ఇంటికేసి చూపించింది. "అదుగోనండి, ఆ మారాజా వారి పసుల పాకలో ఒక మూలని కాస్త జాగా యిచ్చారండి. మమ్మల్ని ఉండ నిచ్చారండి. అయితేనేం. నన్నూ అమ్మనీ మా తాత తగిలేసినాడు కదండీ, మరి!" అన్నది.

ఎవళ్ళకయినా సరే, కారణం ఏమైతేనేం—అపకారం జరిగిందన్నమాట వింటే చాలు, రాసమణికి మండుకొస్తుంది. అలాంటిది, ఇప్పుడామె హృదయం కొంచెం వికసించింది. ఈ విషయం ఆద్యంతం తెలుసుకుందామని రాసమణికి కుతూహలం కలిగింది.

"ఏమిటేమిటీ!—నిజమేనా? నిన్నూ మీ అమ్మనీ తగలేశాడా? ఎప్పుడూ?—" అనడిగింది, ఆత్రంతో.

"మొన్ననేనండి, రాత్తిరికి రాత్తిరండి!" అని చెప్పింది యానాదిపిల్ల.

"ఓహో!—అయితే, నువ్వు ఆ యానాదిదాని కూతురివా?—అల్లా చెప్పవేం? చచ్చేందుకు సిద్ధంగావున్న ఆ ముసిలిముండా వాడు మిమ్మల్ని తన్ని తగిలేశాడా?—మీ అలగా జాతి మొహం మండిరి!—ఆయనగారు కాస్త చోటిచ్చాడు కదా అని మీరు వచ్చేసి బ్రాహ్మణ వీధిలో మకాం పెడతారా?—మీరేం తక్కువవాళ్ళు కారు."

"మీ అమ్మని తీసుకొచ్చిం దెవరూ? రామతన్ బెనర్జీ అల్లుడేనా? ఆయన్ని మించిన ప్రబుద్ధు డెవరులే!—ఇంత ఇలాటి మహావిద్య మరెవరికి చేతనవుతుందీ, ఇంటి అల్లుడు ఇంటల్లుడుగానే వుంటే బాగుంటుంది కాని, ఇదేమిటీ ఘోరం!—మావగారి ఆస్తి వచ్చిపడింది కదా అని ఎంత గర్వం? అంత కళ్ళు మూసుకుపోవాలా?—బ్రాహ్మణాగ్రహారంలోకి ఎరికలాళ్ళనీ, యేనాదాళ్ళనీ, మాలాళ్ళనీ మూద

గాళ్ళనీ, దొమ్మరాళ్ళనీ దిమ్మరాళ్ళనీ తీసుకొచ్చి తేవిణీ వేయిస్తాడా!——'' అంటూ, రాసమణి "సంధ్యా!——ఓ సంధ్యా! ఇంటో ఉన్నావా అంట!'' అని గట్టిగా కేక వేసింది.

అక్కడ కొంచెం ఖాళీస్థలం, దానికి అవతలే వుంది రామతన్ బెనర్జీగారి గుమ్మం. ఆ పిలుపువిని, దగ్గరసా ఉన్న గుమ్మం తలుపులు తెరుచుకు వచ్చింది ఒక సుందరి—— పందొమ్మి దిరవై ఏళ్ళుంటాయి, నిండు యౌవనంలో ఉన్న చక్కటి కన్య, ముఖం బయటికి పెట్టి, "ఎవరా పిలిచేదీ?——నువ్వ టమ్మా, అమ్మమ్మా! ఏం, ఎందుకూ?'' అని అడుగుతూ ఇవతలికి వచ్చింది.

"అమ్మాయీ!——మీ తాతగారు రామతన్ బెనర్జీ అంటే ఎంత పేరు, ఎంత ప్రతిష్ఠ!——ఆయ నెటువంటి శిష్టాచార సంపన్నుడు! అలాంటి ఆయనింటో పందుల్ని తినే యానాదులు కాపరం పెట్టనా? ఛఛ——ఎంత సిగ్గుచేటు? ఈపని చేసిన మీ నాయన బుద్ధి ఏమని చెప్పుకోవాలీ?——''

అంటూ రాసమణి పెదవిమీద వేలేసుకుని, మళ్ళీ ఇలా అందుకుంది——"ఇదుగో, మీ అమ్మని ఒక్కమాటు పిలూ. దీనికి తగినట్టుగా జగ్గు ఏమయినా ప్రతిక్రియ చేస్తే సరేసరి. లేకపోతే నేనే స్వయంగా చటర్జీ దగ్గరికెళ్ళి చెప్పొస్తా. ఛటర్జీ అంటే ఎవరనుకున్నావో?——పేరు పొందిన పెద్ద జమీందారు.——దీనికి ఆయనేం సమాధానం చెబుతాడో, అదీ వింటాగా, ఒకసారి.

ఆశ్చర్యంతో సంధ్య. "ఏం జరిగిందేమిటమ్మమ్మా?'' అనడిగింది.

"మీ అమ్మ నొకమాటు పిలుస్తూ. ఏం జరిగిందో ఆవిడ గారితోనే చెప్పిపోతా'' నంటూ తన మనమరాల్ని చూపించింది. "ఇదిగో, ఈ పిల్ల మంగళవారప్పూటా మేక కట్టుతాడు దాటింది. ఆ యానాదిముండ దీన్ని కొంగేసి కొట్టింది, ఇంతకంటే యేం జరగాలీ?'' అన్నది.

అందుకు సంధ్య "అవునుటే, నువు కొంగేసి కొట్టావా?'' అని యానాదిపిల్లని అడిగింది.

ఇంత పేపట్నించీ అది పాపం! ఆ మేకపిల్లని గుండెకు అదుముకునేవుంది, దారి తప్పుకుని ఓ పక్కగానే నించునివుంది. సంధ్య అడిగిన ప్రశ్నకు జవాబుగా "లేదండీ, అమ్మగారూ.'' అన్నది ఏడుపు గొంతుకతో.

మనమరాలు కూడా దాని మాటలతోనే మాట కలుపుతూ, "లేదు, అక్కా!—— అది నన్ను తాకలేదు. అటుకేసి....''

రాసమణి హుంకరించేసరికి పిల్లదానిమాట టకీమని అక్కడికి ఆగిపోయింది.




"మళ్ళీ అంటున్నావా అది ముట్టుకోలేదని, ఛాండాలురాలా! పద, ముందు ఇంటికి పద, ముట్టుకుందో లేదో చూపిస్తా, అక్కడి కెళ్ళాక. ఉం—నడు!—"

ఈ మాటకు నవ్వుతూ అంది, సంధ్య—"బలవంతంగా దాన్ని చెర్లో ముంచుతావు. అంతకంటే ఏం చేస్తావ్? అంతేనా అమ్మమ్మా?—"

సంధ్య నవ్వేసరికి రాసమణి మండిపడింది. "బలవంతమో గిలవంతమో నాకు తెలుసులే, అమ్మాయ్!—అది నాపని, నీకెందుకు? కావి. మీ నాయన చేసిన పనేమన్నా బాగుందా? కులం తక్కువవాళ్ళని ఎవడయినా ఇంటో తెచ్చిపెట్టుకుంటాడా?- అందులోనూ కేవలం యానాదివాళ్ళని? వాళ్ళు కల్లు తాగుతారుగాని నీళ్ళు కాదుగా?—పందుల్ని తింటారుగాని అన్నం కాదుగా? ఇల్లాంటి అలగా జాతివాళ్ళని బ్రాహ్మణ వీధిలోకి తెచ్చిపెడతాడా, అంట?—ఇల్లరికపు అల్లుడు ఇల్లరికపుటల్లుడుగానే వుంటే మంచిది కానీ...." అంటూ కారాలూ మిరియాలూ నూరటానికి ప్రారంభించింది.

ఇలాంటి అవమానకరమయిన మాటలతో, నిందలతో తండ్రిని దూషించేటప్పటికి సంధ్య మరి సహించలేకపోయింది, కోపంతో ఆమె ముఖం ఎర్రబడింది. ఆ అమ్మాయేం వెనకబడలే, కరుకుగానే జవాబుచెప్పింది :

"మా నాన్నగారు పరాయి వాళ్ళెవళ్ళ ఇంటోనూ అలగా జాతివాళ్ళని తెచ్చిపెట్ట లేదండమ్మమ్మా!—బాగా ఆలోచించిన మీదటే, తన సొంత జాగాలోనే వాళ్ళకి కాస్త చోటిచ్చారు. ఈపాటి దానికి నీకెందుకు అమ్మమ్మా ఇంత ఒళ్ళుమంట?—"

"నా కెందుకింత ఒళ్ళు మంట అనడుగుతావా?—ఎందుకో, చూస్తూవుగానిలే! ఒక్కమాటు ఛటర్జీ దాదా ఇంటికి పోయిరానా? పోయి. చెప్పేసి రానా?" అని ప్రశ్నించింది.

"ఆఁ— మంచిదే పోయి చెప్పుకోరాదూ? ఆయనగారి చోటులోకి యానాది వాళ్ళ నేమన్నా తీసుకొచ్చి పెట్టాడా మా నాన్నారు? ఆయన మహా గొప్పవాడు లెద్దూ, నాన్నగారి తల తీసేస్తాడా? తీసేసినప్పుడు చూదాంలే!" అంటూ తలాయించి చెప్పింది, సంధ్య.

"ఓహో, కబుర్లు బాగానే నేర్చావే, చిలకలాగా? పిట్టకొంచెం, కూతఘనం అంటూ రిదే కాబోలు! బాగున్నాయి నీ మాటలూ నువ్వూను. ఆ మొహానికి తగ్గట్టే వున్నాయిలే, సరిగ్గా!

"ఇదుగో! ఆయనంటే మీకు వేళాకోళంగా వుంది కామాసు, ఆయన మరేవరో కాదు, గోలోక చటర్జీ సుమా! తెలుసుకో, ఆయనెలాంటివాడో ఆసంగతి ఇంత దాకా మీకు తెలిసినట్టుగా లేదు. సరే, కానీ!—"

ఇంత గందరగోళం జరిగేసరికి, అంతావిని జగద్ధాత్రి ఇవతలికి వచ్చింది ఆమె కంట పడంగానే రాసమణి అగ్గిలా భగ్గుమని మండిపోయింది. పేట పేటంతా ఎగిరి పోయేట్టు ఇలా అరవటం ప్రారంభించింది—

"అమ్మా, జగ్గా! నీ కూతురు విద్యాధరి మాటాడే అతిశయం మాటలు ఒక్కపారి వినమ్మా! శాస్త్రి!—చదువులూ సంధ్యలూ నేర్పిందిగా? "పో పో, పోయి చెప్పుకో గోలోక ఛటర్జీతో! మా నాన్న తల తీసేసినప్పుడు చూదాంలే! యానాది వాళ్ళయితేనేం, ఎరికల వాళ్ళయితేనేం, మా యింటో మేం పెట్టుకున్నాం గాని ఎవడి అబ్బగాడి చోటులోనూ ప్రవేశ పెట్టలేదే! మహా గొప్పవాడులే మీ ఛటర్జీ! ఇలాంటివాళ్ళని చాలామందిని చూశాం. నీ చాతనయిం దేమిటో చేసుకో!" అంటూ ఇలా బుకాయిస్తుంది, జగ్గూ!—వినమ్మా, నీ కూతురుమాట లోకమాటు, విను!" అని గోలపెట్టింది.

విస్తుపోయింది జగద్ధాత్రి "అన్నావా ఈ మాటలన్నీ, పొణికి!—" అనడిగింది, కూతుర్ని.

తల తిప్పుతూ సంధ్య ఇలా చెప్పింది—"లేదు, నేనేం అల్లా అనలేదు."

కోపం కొద్దీ రాసమణి సంధ్య మొహంమీదనే చేతులు తిప్పి, బుగ్గలు పొడుస్తూ "అనలేదూ? వీళ్ళంతా సాక్ష్యం లేరనుకున్నావా?" అని గట్టిగా గద్దించింది.

అయితే—మరుక్షణంలోనే కంఠస్వరాన్ని అతి విచిత్రంగా మార్చివేసింది.




ఎంతో నేర్పుతో పత్తమంవించి మందరంలోకి ఒఖ్ఖమాటుగా దించేసింది. దించి జగద్ధాత్రితో ఇలా చెప్ప నారంభించింది :

"జగ్గూ!—నే నెంతో మంచిగానే చెప్పానమ్మా మీ అమ్మాయితో: "మంగళ వారప్పూటా పిల్లది మేక కట్టుతాడు దాటింది. అది చూసి "ఓసీ, దార్లో అడ్డంగా ఈ మేకపిల్ల నెవరే కట్టేసింది!" అని నే నడిగామా. అడిగేసరికల్లా ఆ యానాది పిల్ల గబ గబ పరుగెత్తుకుంటూ వచ్చేసి, మా అమ్మాయి ముఖంమీద కొంగేసి కొట్టింది. కొట్టి, పైగా "మారాజు మాకు జాగా ఇచ్చారు, అందులో మా మేక పిల్లని కట్టేసుకున్నాం. మధ్యని నువ్వెవరవు అడగటానికి?" అంటూ బూకరించింది.

"అందుకోసమని సరిగ్గా ఈ మాటలే, మీ అమ్మాయినీ పిలిచి ఇలా చెప్పాను: "అమ్మాయీ, వేళకాని వేళ మా మనవరాలు పిల్లని చన్నీళ్ళలో ముంచాల్సి వచ్చింది. మంగళ వారప్పూటా ఈ శుద్ధమొద్దు మేకపిల్ల కట్టుతాడు దాటింది. మీ నాన్న ఎక్కడెక్కడిన్నించో ఈ యానాదాళ్ళనీ వాళ్ళనీ తీసుకొచ్చి ఇంటో పెట్టుకోడం వల్లకదా ఇదంతా వచ్చింది; కనక కాస్త చూసి, ఈ మేకల్నీ గీకల్నీ ఎక్కడ కట్టించాలో అక్కడ కట్టేయించమని చెప్పు. చూస్తే ఈ వరసేం బాగాలేదు. అలగా జాతి వాళ్ళకి ఆచారం లేదు, [illegible]ంఉండదు, మన అలవాట్లూ వ్యవహారాలూ వాళ్ళకేం తెలుసు

"అదీగాక—ముసిలాయన ఛటర్జీ ఉన్నాడే. ఆయన తరుచు ఈ దారివే వస్తూ పోతూ ఉంటాడు. ఇలా కట్టుతాళ్ళూ అవ్వీ తొక్కితే ఆయన కోపంవచ్చి. చక్రమంటాడు'' అని—అమ్మా జగ్గూ!—ఇంతేనమ్మా నేనన్న మాటలు. ఇహ చూసో. ఈ మాటలకే మీ అమ్మాయి నన్ను కొట్టడమంటే కొట్టలేదు గాని ఒళ్ళు తెలియకుండా ఎన్ని మాటలయినా అన్నది.

"పో పో!—మీ ఛటర్జీ బాబు ఎవరో నేనూ చూస్తా. పిలుచుకురా!—ఆయనేదో మహా పెద్దమనిషి అనుకుంటున్నావు కాబోలు. ఇలాంటివాళ్ళ నెంతోమందిని చూశాము. మా యింట్లో మేం యానాదివాళ్ళకి జాగా ఇస్తే. మధ్యని ఆయనెవడూ మమ్మల్ని శాసించటానికి?'' అంటుందమ్మాయ్. జగ్గూ—ఇవేనా ఆడపిల్ల అనాల్సిన మాటలూ?'' అన్నది.

జగద్ధాత్రి మండిపడింది. "అవునుటే. అమ్మాయీ!—నువ్వీ మాటలన్నీ అన్నావా లేదా?'' అనడిగింది.

ఇప్పటిదాకా సంధ్య ఆశ్చర్యంతో సంభాషణంతా వింటూ రాసమణి ముఖంవేపే చూస్తూ నించునివుంది. తల్లి కంఠస్వరం వినబడగానే ఉలిక్కిపడింది. ముఖంతిప్పి. "అనలేదు'' అని చెప్పింది.

"అనలేదూ? అయితే. ఈ మాటలన్నీ పిన్ని కల్పించిందా?''

"అలా అడుగు, అమ్మాయీ. నీ కూతుర్ని! అలా అడిగిచూడు. ఒక్కసారి'' అని ఉటంకించింది. రాసమణి.

ఒక్కక్షణం ఊరుకుంది సంధ్య—"ఎవరి మాటలు అబద్ధమో నాకేం తెలియదమ్మా! నీ కడుపున పుట్టిన కూతురి మాటలే నీకు నమ్మకం లేకపోయిందీ. ఎక్కడి చుట్టమో,—ఈ పిన్నిగారు చెప్పిందంతా నీకు నిజ మనిపిస్తూంది సరేలే. ఆవిడగారి మాటలే నమ్ము!'' ఇలా అనేసి. మళ్ళీ రెండో ప్రశ్న తల్లి వెయ్యకముందే. తెరిచివున్న గుమ్మంలోకి గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

అప్పుడు వాళ్ళిద్దరూ కళ్లు యింత చేసుకుని. సంధ్య వెళ్ళిన దారివేపే చూస్తూ నిలబడిపోయారు. సందు ఎప్పుడు దొరుకుతుందా. ఎప్పుడు ఉడాయిద్దామా అని కాచుక్కూచున్న ఆ యానాదిపిల్ల కూడా మేకపిల్లని గుండెకు అదుముకుని మెల్లిగా అక్కడ్నించి జారుకుంది.

"చూశావు కదా జగ్గూ. నీ కూతు రెంతటిదో. దాని అతిశయమెంతో. విన్నావుగా ఆ మాటలూ అవ్వీనీ? నే నెక్కడి చుట్టమోనట!—ఆవిడగారు మహా గొప్ప ఇంటి ఆడబిడుచు కదూ. అందుకనే అలా అంటూంది. పెళ్ళిచేస్తే ఈ పాటికి ఆరుగురు



బిడ్డల తల్లి అయ్యేది! నేను ఎక్కడో దూరపు చుట్టాన్నట. దూరపు చుట్టా!—నీ చెవులతో నువ్వేకద విన్నావ్!—

ఈ మాటలకి జగద్ధాత్రి ఏం అనకుండా ఊరుకుంది. రాసమణి కూడా కాస్సేపు మాటాడక కిమ్మని ఊరుకుంది. ఉన్నట్టే ఉండి హఠాత్తుగా

"ఆఁ—అన్నట్టు జగ్గూ!—అమృత చక్రవర్తి కొడుకుని మీ ఇంటికి రానిస్తున్నా రటగా? విన్నాన్లే, ఆ సంగతి. ఏమిటి, నిజమేనా?" అనడిగింది.

ఈ ప్రశ్న వినగానే జగద్ధాత్రి మనసులో చాలా భయపడ్డది.

రాసమణి మళ్ళీ యిలా మొదలెట్టింది: "నీకు తెలుసునో తెలియదో. ఆనాడు. పులినుడి తల్లికీ నాకూ పెద్ద లడాయైపోయింది. నేనేమన్నా ననుకున్నావ్?—"ఆమె

జగద్ధాత్రి కాని మరెవరూ కాదు సుమా! హరిహర బెనర్జీకి మనమరాలు, రామతన్ బెనర్జీ కూతురు! శూద్రులని చెప్పి వాళ్ళెవళ్ళూ కాయస్థుల యింటిగడప ఎన్నడూ తొక్కరు. అలాంటివారి ఇంటపుట్టిన జగద్ధాత్రి సీమ వెళ్ళొచ్చిన ఈ మ్లేచ్ఛుణ్ణి అడుగు పెట్టనిస్తుందా? కనక లేనిపోని మాటలన్నీ మీ రెండుకమ్మా అంటారు?'' అని నే నావిడతో పోట్లాడాను, జగ్గూ!—''

తన హితవుకోరి ఇలా రాసమణి సానుభూతి చూపినందుకు జగద్ధాత్రి కాస్త సిగ్గు పడింది. తెరగా నవ్వుతూ యిలా చెప్పింది—

"పిన్నీ! నువు సరిగ్గా చెప్పావ్ సమాధానం. కానై తే—తెలుసుగా నీకు? అరుణ్ చిన్నప్పటినించీ యిక్కడికి వస్తూ పోతూ వుంటాడు. ఎంతో చనువతో నన్ను పిన్నీ పిన్నీ! అని పిలవడం కూడా మామూలై పోయింది! అంచేత, ఒకవేళ ఎప్పుడయినా అతడు వచ్చినా, ''అరుణ్!—ఇహనుంచి నువు మా యింటికి రావొద్దు సుమా!'' అని చూస్తూ చూస్తూ నోరువిప్పి నేను చెప్పలేకుండా వున్నాను. ఎప్పుడో చుట్టపు చూపుగానే కాని అతడూ అస్తమానం రాడు పాపం!—తలి దండ్రుల్లేని బిడ్డకదా! అతడి మొహం చూస్తే జాలేస్తుంది, మనస్సు నీరై పోతుంది. అదేం మాయోగానీ."

రాసమణికి ఏం చెబుదామన్నా నోట మాట రాలేదు. తరవాత కోపంతో కూడిన కంఠస్వరంతో "నీ మాయ తగలడిరి!'' అన్నది.

అంటూండగానే, ఆవిడగారి కోపం హఠాత్తుగా చివరిమెట్టెక్కిపోయింది. అయితే ఆ క్రోధానికి అనుగుణంగా తన కంఠస్వరాన్ని అదుపులో పెట్టుకుని, ఉపన్యాసం మళ్ళీ సాగించింది—

''అమ్మా జగ్గూ!—వాడేం సామాన్యపు ఘటమనుకున్నావు కాబోలు. వట్టి పొగరు మోతు వెధవ. ఇలాటి మాలాణ్ణి ఇంటోకి రానిస్తున్నారా? ఇదుగో, చెబుతున్నాగా,— వీడిలాటి దురాచారపరుడు ఈ వూరు మొత్తానికే మరి కనబడ్డవి తెలుసుకో!

'ఛటర్జీ దాదా అంటే యెంత పలుకుబడి ఉన్నవాడో, ఎంత గొప్ప జమీందారో అందరూ ఎరుగుదురు అటువంటి సంపన్నుడు ఆ అభాగ్యుణ్ణి కబురెట్టి పిలిపించి యిలా చెప్పాడు—''అరేయ్ అబ్బాయీ, అరుణ్!—జీతం అక్కర్లేకుండా స్కాలర్‌షిప్‌మీద చదువుకోవచ్చు కదా అని చంకలెగరేస్తున్నావు. అలాంటి ఆశలన్నీ గంగలో కలిపెయ్. ఇంటో ఉన్నవాడివి. చక్కా ఇంటోనే ఉండిపోయి చదువుకో గాని, సీమకూ గీమకూ వెళ్ళడం పెట్టుకోబోక?'' అంటూ శతవిధాల మారిపోసి హితవు చెప్పారు. మంచి మాటలు చెవికెక్కితేనా?—అంత గొప్పవాడు తన క్షేమం కోరి చెబుతున్నాడు కదా అని, ఆయన మాటకి ఏమైనా మర్యాద ఇచ్చాడా?—పైగా

ఎదిరించడం, పెద్దమనిషిని వెటకారం చెయ్యడమున్నూ.

"సీమకి పోటోయే ముందు వాడేమన్నాడో తెలుసా?— "సీమ వెళ్తేనే జాతి పోతుందా? పోతే పోనీండి....నాకదీ మేలే....కాని, గోలోక ఛటర్జీలాగ మేకల్నీ, గొర్రెల్నీ విదేశాలకు ఎగుమతిచేసి డబ్బు ఆర్జించటం మటుకు నా కవసరం లేదు. సంఘానికి నాయకుణ్నని చెప్పుకుని "వాళ్ళజాతి చెడిందీ, వీళ్ళజాతి భ్రష్టయిందీ" అంటూ అందరినీ నిందిస్తూ తిరగడం నాకు అగత్యం లేదు...." అంటాడు.

విన్నావా జగ్గూ, వాడు అన్నమాటలు? ఉష్!—నేనే గనక ఆ సమయంలో అక్కడవుంటే, చీపురు తిరగేసి వాడిమొహం చక్కజేసి ఉండేదాన్ని. ఆయ నంతర మేం, వీడి అంతరమేం?—గోలోక ఛటర్జీ అంటే ఎంత ఆచార పరుడనుకున్నావ్? భోజనం చేశాక, గోమయంపెట్టి ముఖం శుద్ధి చేసుకుంటాడు. అంతటి ఆయనతోనా ఇలాటి మాటలు?—"

అప్పుడు జగద్ధాత్రి ఎంతగానో ఆచి ఆచి ఇలా జవాబు చెప్పింది— 'కాని, పిన్నీ!—అరుణ్ ఎప్పుడూ ఎవర్నీ నిందించేవాడు కాదే?"

"అయితే నేనే అబద్ధాలు చెబుతున్నాననా నువ్వనేదీ? మరి, ఛటర్జీ మహాశయుడే...." అనబోయింది, రాసమణి.

"అబ్బెబ్బే!—ఆయనెందుకని అబద్ధమాడతారూ? లోకులు కాకులు కదా! వాళ్ళే ఉన్నవీ లేనివీ కల్పించి, చిలవలూ పలవలూ కలిపి చెబుతుంటారు...." అని చెప్పింది, జగద్ధాత్రి.

ఇందుకు మళ్ళీ రాసమణి ఇలా అన్నది—"ఎప్పుడూ నీది అదేమాట జగ్గూ!— లోకులకీ ఆతడికీ సహపంక్తి భోజనాల్లేవు కదా. అంచేత ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పడంలో మేం లేదులే. పోనీగాని. ఈ ప్రబుద్ధుడు సీమకెళ్ళి వచ్చాడు. సరే, ఏమన్నా మహా దిగ్గజమై దిగాడా?—ఏడవలేక యెవసాయమంటారు. అలాగ యెవ్వసాయం నేర్చుకొచ్చాడు అంతదూరం విదేశాలకెళ్ళి. ఎవళ్ళన్నా వింటే నవ్వు చేటు!—చక్రవర్తే కానీ మరెవరయినా కానీ, బ్రాహ్మణ కుర్రవాడే కదా. మన దేశంలో ఎవసాయం చేసుకునే రయితులూ వాళ్ళూ లేరూ? వాళ్ళలాగే ఇహ ఇతగాడు కూడా నాగలి బుజాన వేసుకుని పొలాలంట తిరుగుతాడా, దున్నటానికని? ఇంతకంటే ఛావు వేరే యేముందమ్మా?...."

రాసమణి కంఠస్వరం ఎంతో తీవ్రంగా ఉందికదా! దాని తాలూకు పరిమళం త్వరలోనే ఊరంతటా వ్యాపించ బోతుందని పసికట్టింది జగద్ధాత్రి. అటువంటప్పుడు గ్రామ పెద్దలంతా తేనెటీగల్లా ఎక్కడొచ్చి ముసురుకుంటారోనని భయపడింది కూడా.

అంతేత మెల్లి మెల్లిగా ఇలా అంది—"పిన్నీ!—నించున్న దానివి నించున్నట్టే ఉండిపోయావే! కాళ్లు తీపెట్టవూ?—దా, కాస్త ఇంటోకిపోయి కూచుని మాటా మంతీ చెప్పుకుందాం. పద!—" అంది.

అందుకు రాసమణి. "వొద్దమ్మా జగ్గూ!—వొద్దు పొద్దు పోయిందా మరి, వేళ దాటింది. పోవాలి. ఇంకా ఈ పిల్లముండవి చెర్లో ముంచి తీసుకురావడం ఒహ టుందిగా?—అన్నట్టు—అదేమయిందమ్మా, యానాది పిల్ల?—మెల్లిగా పారిపోయి వచ్చే వుందే, చూస్తే!—"

మనమరాలు చెప్పింది: "అవున్నాయనమ్మా!—మీరు మాటలు చెప్పుకుంటు న్నారుగా? అప్పుడు వెళ్ళిపోయింది. కాని, అది నన్ను తాకలే, నాయనమ్మా!—"

"ఓసి ఛడవా!—మళ్ళీ మళ్ళీ అదేమాటా?—మళ్ళీ లేదంటున్నావా? ఇదుగో, జగ్గూ—నిన్ను చెయ్యిచ్చుకు బతిమాలుకుంటా గానీ, నేను చెప్పేమాట ఒక్కటి విను, తల్లీ!—వీధిలో యానాదివాళ్ళనీ దొమ్మరాళ్ళనీ తెచ్చి పెట్టొద్దని అల్లుడు గారితో కాస్త చెప్పమ్మా!—" అన్నది రాసమణి.

"మెల్లిగా అంటావేమిటి పిన్నీ!—తప్పకుండా చెబుతా. ఎందుకు చెప్పనూ? రేపొద్దునే వీళ్ళవి వెళ్ళగొట్టిస్తా, చూద్దుగాని. వీళ్ళిక్కడ ఉండటం మాకూ ఇబ్బందే సుమా! నూతిలో వీళ్ళతోడి పారబోస్తారు మైల పరుస్తారు. వాళ్లు పారబోసిన నీళ్ళే మడిగుడ్డలతో మనం తొక్కుకుంటూ పోవాలిగా!"

"అల్లా చెప్పు తల్లీ, అలా చెప్పు! లేకపోతే మనజాతీ జన్మా ఎలా నిలిచేది మరి? ఈ మాటలు నేనిలా చెబుతున్నానే కానీ, ఈ కాలపు పిల్లలకి నచ్చుతాయా, జగ్గూ!—వాళ్ళేమన్నా లక్ష్య పెడతారా?

'ఇందుకోసమనే కదా—ఆనాడు ఛటర్జీబాబు ఆశ్చర్యపోయి ఏమన్నాడో తెలుసా?—"రాసూ!—మన జగద్ధాత్రి కూతురికి వాళ్ళ నాయన చదువు సంధ్యలు చెప్పిస్తున్నాట్టగా? మరీ ఇదయి పోతున్నారే వీళ్ళు?—నిజమేనా ఈమాట? నిజమే అయినట్టయితే వొద్దని చెప్పు. వొద్దూ అని చెప్పు. ఆడపిల్ల చదువు సంధ్యలు నేర్పిస్తే అంతా నాశనానికే దారి. నరకప్రాప్తి సంభవిస్తుంది సుమా!" అన్నాడు.

జగద్ధాత్రికి చెప్పలేని భయం పట్టుకుంది. 'అలా అన్నాడా? ఛటర్జీ మామ అలా అన్నాడంటావా?' అనడిగింది.

అందుకు రాసమణి బదులు చెప్పిందిలా—"అనడా మరి? ఆయన బ్రాహ్మణ్యాని కంతా తలకాయ లాంటివాడు, గ్రామ మొత్తానికే పెద్ద జమీందారు. ఆయన చెవిని పడకుండా ఏ చిన్న విషయమైనా ఉండటానికి వీలుందా?—అందాకా ఎందుకూ?—




నేనే ఉన్నాను. నన్నే తీసుకో. నాకూ ముసిలరికం ముంచుకువచ్చేస్తూంది అనుకో. చదువు సంధ్యలేం పెద్దగా తెలుసునని చెప్పుకోను గాని. అయినా—నాకు తెలియని శాస్త్రం ఏమిటుందో చెప్పూ? రాసమణి ఇటువంటి అశాస్త్రీయమైన పని చేసిందీ అని చెప్పి ఎవరైనా వేలెట్టి చూపించ గలరూ? ఎవడబ్బతరం?

"ఈ కుర్రది కట్టుశాడు దాటిందనగానే, జగ్గూ!—నమ్మూ, నా ఒళ్ళు గరిపొడిచి కంపరమెత్తి పోయిందనుకో! వెంటనే అన్నాను కదా!—"ఓసీ పాపిష్టి పిల్లా!— ఎంతపని చేశావే, ఇవ్వాళ మంగళవారప్పొద్దు కదా! మేక కట్టుశాడు దాటేశావే. ముండా కూతురా!" అని అనేశాను. నేను ఉన్నదీ అని చెప్పిన మాటలో దోషం లేదని ఏ పండితు డంటాడో అనమనూ, చూదాం. లేరమ్మా! అనలేరు! ఎప్పుడూ అనేపనే లేదమ్మా జగ్గూ! మేం మా తలిదండ్రుల దగ్గిరే ఈ ధర్మ సూక్ష్మాలన్నీ నేర్చుకున్నాం తల్లీ! అయితే, మీ అమ్మాయి చదువుకుంటూందిగా? పిలుకొస్త ఇలాటి దేమయినా చెప్పగలదేమో....!"

అవు నన్నట్టుగా, తనది తప్పేనని ఒప్పుకున్నట్టుగా జగద్ధాత్రి విశ్శబ్దంగా ఉంది. "కాస్త కూర్చుని పోరాదు, పిన్నీ!" అన్నది.

"లేదమ్మా. ఇప్పటికే వేళయిపోయింది. మరో నాడెప్పుడైనా వస్తాలే." అని చెప్పింది. మనమరాల్ని ముందుకు నడిపిస్తూ "పదవే బండమొద్దూ, పద, ఇంటికి పద!" అంటూ గెంటింది. రెండడుగులు వేసినట్టే వేసి చటుక్కున వెనక్కి తిరిగింది.

"అవునుగానీ, ఏం జగ్గూ!—అటువంటి చక్కటి సంబంధాన్ని చూస్తూ చెయ్యి జార్చుకున్నారేం? కాస్త చెబుదూ, వింటానూ!" అన్నది, రాసమణి.

అందుకు జగద్ధాత్రి—"లేదు పిన్నీ! లేదు. ఇంకా చెయిజారి నట్టుకాదు ఆ సంబంధం. అయితే మట్టుకి ఒక్కసంగతి—వాళ్ళకి పొలం పుట్రాలేదు, ఇల్లూ వాకిలి అయినా లేదు. అంతకంటే ముఖ్యం వయస్సు ముదిరిపోయింది మీ అల్లుడు గారి కేమంత ఇష్టంగా లేదు, పిన్నీ!" అని చెప్పింది.

ఆమట్టునే ఆశ్చర్యంతో నిలబడిపోయింది రాసమణి.

"ఏమిటంటున్నావ్? మళ్ళీ అను ఆమాటా! అతడికిల్లు లేదన్నావ్. మీకుందా అవి అడుగుతా. చూడబోతే మరి, మీకింక పిల్లల్లేరాయె. ఉన్నదల్లా ఒక్క ఆడపిల్ల. దానికోసం ఇంత ఆలోచనెందుకు జగూ? కూతుర్నీ అల్లుణ్నీ పెట్టుకుని వాళ్ళ కాలక్షేపం చేసుకోవచ్చుకదా. ఎంత వైభవంగా వుంటుందీ!—

"వయస్సు ముదిరిందంటావా? కులీనుడైన గృహస్థుకి నలభై నలభై రెండేళ్ళంటే అదో ఈడు ముదరటంలో లెక్క కాదుసుమా! ఆహా!—రసికపురం జయరామ ముఖర్జీగారి దౌహిత్రుడు!—ఈ సంగతి తెలిస్తే అతడి వయస్సెవరు చూస్తారు. జగూ? చెప్పు.

"సరే, ఆ గొడవ అలా వుంచు. ఒక్కమాటు నీకూతురి వయస్సు కూడా లెక్కవేసి చూసుకో, మరి! ఇలా మీన మేషాలు లెక్కట్టుకుంటూ!కూచుంటే ఇహ చేసినట్టే పెళ్ళి —తాత్సారం చేసి చేసి. ఆఖరికి మీ చిన్నత్తలాగా అమ్మాయినీ జన్మ జన్మాంతం వృద్ధ కుమారిగానే కూచో పెడతావు కాబోలు! అంతేనా?" అనడిగింది.

ఈ మాటకు సిగ్గుపడింది జగద్ధాత్రి. "నేనూ ఇలాగే చెబుతున్నాను పిన్నీ! కాని, పిల్లదాని తండ్రికే ఏమ్మీ...."

మాట పూర్తి అయేదాకా నయినా రాసమణి ఓపిక పట్టలేక పోయింది. మండి పడుతూ యిలా అంది—"పిల్లదాని తండ్రిట, తండ్రి అన్నాడట!—ఎందుకనడూ? ఆయనగారికి మహా ఉన్నాయి కదా—ఎన్నో ఇళ్ళూ, వాకిళ్ళూ, పొలాలూ, సంపత్తూ ఆహాహా! ఎంత జమీందారీ వెలిగిపోతూంది!—ఎవళ్ళకీ తెలియదా యేం?—మీ మాటలూ చూస్తే నవ్వొస్తుంది.

"అంతేకాదులే. మీ వారిప్పుడు ఆ అరుణ్‌గారింటోనేటగా రాత్రింబగళ్లు విడిది? అక్కడేట కదూ పాట కచ్చేరీలూ, హుక్కా పీల్చడాలూ, కాపీ పర్యంతం దినచర్యలూ అవీని? విన్నాలే. అలాంటి మాటలు ఆయన గారవేవుంటాడు. అవందీ, ఛటర్జీబాబు

వోటంట వస్తాయా అకారణంగా? మరీ హద్దుమీరి పోయింది జగ్గూ, మీ పని!

"ఇదుగో నమ్మాయీ!—ఒక్కమాట చెబుతున్నా. విను ఎవడో ఒహ వరుడు దొరికా డనేటప్పటికల్లా వెంటనే ముడెట్టేసుకోవటం మంచిదికావి. "వాడికి వయస్సెక్కువ. వీడికి ఆస్తి తక్కువ" అని ఏవో వంక లెంచుకుంటూ కూచోవడం బాగా లేదు సుమీ!

అతిలోభం నాశనానికే నంటారు పెద్దవాళ్ళు. మీ చిన్న మేనత్త—ఎరుగుదువుగా. పెళ్ళీ పెటాకులూ లేకుండా వృద్ధ కుమారిగానే ఉండిపోయి ఎలా చచ్చిందో! మీ నాయన ఎంత కొట్టుకున్నా మేనత్త లిద్దరికీ అసలు పెళ్ళి కానే కాలేదుగా? నీ సంగతి మాత్రం ఏమిటీ మహ? మీ అమ్మా నాన్నా కాశీకి పరిగెత్తుకపోతే, సమయానికి నీకు పెళ్ళయేదా?

"ఎటువంటి మంచి సమయంలో నీకు పెళ్ళయిందో ఆ సందర్భాలేమన్నా గుర్తుందీ?—మీ అత్తగారేమో కాశీలో వుండే కట్నంకానుకల బెడద యేమీలేదు. నీ మొగుడేమో ఇస్కూల్లో చదువుకుంటున్నా డాయిరి. వెనకముందుల జంఝాటమేం లేదు. వరుడు దొరికాడనగానే చటుక్కున ఆ మూడు ముళ్ళూ వేయించేశారు పిల్లనీ, అల్లుణ్ణీ చక్కా వెంటపెట్టుకువి. ఊళ్ళోవాళ్ళు ఊళ్ళోకి వచ్చేశారు. ఎవళ్ళన్నా పడగొడతారేమో నన్నభయంతో ఒకళ్ళకూ కబురయినా పంపలేదుగా? ఏమయితేనేం, మంచి పని చేశార్లే! లేకపోతే, నీకు పెళ్ళి అయేదో లేదో దేవుడికే తెలుసు

"పదవే, మొద్దా పద, ఇంటికి—

"జయరాం ముఖర్జీగారి దౌహిత్రుడికి అందముందా, ఆస్తివుందా?—అనడుగుతారుట!!—హవ్వ!—రోజురోజుకి ఎంతలేసి వింతలు పుట్టుకొస్తున్నాయ్? ఎలాంటి విడ్డూరపు మాటలు వినాల్సి వస్తూందీ?

"పదవే పద—ఇహ ఆలస్యం చెయ్యకూ. బాగానే వుందివాళ. బట్టలూ అవీ ఉతుక్కునీ, దీపం పెట్టుకునీ, జపం తపం పూర్తయ్యేసరికి రాత్రి ఝాం పొద్దయేట్టుంది, చూస్తున్నాగా?—

"అయినా, ఒక్కమాటమాత్రం తప్పనిసరిగా చెబుతున్నానిప్పుడే. జగ్గూ!—విను: కిరస్తానీ వాళ్ళనీ, మాలాళ్ళనీ మట్టుక ఇంటో తిరగనిచ్చేవు సుమా! పెళ్ళీడు పిల్ల. దాంతో మాటామంతీ ఆడనివ్వకూడదు వాళ్ళని. హాస్యాలూ జోస్యాలూ చేస్తుంటారు, అలాంటి వేవీ జరగనివ్వకూడదు. ఇలా జరిగిందని కాస్త ఏమూలనైనా ఉలికిందంటే, వాయువేగంతో ఊరంతా పాకేస్తుంది. అటువంటప్పుడు మొగుడు దొరకడమంటే చాలా కష్టమై పోతుందమ్మా జగ్గూ!

"లేవే, బండపీనుగా! ఒహాళ్ళని గురించిన మాటలు వినడానికయితే చెవి కోసు కుంటావ్! కదలవేం! పద!—" ఇలా అని తెగవాగుతూ, ముందరవున్న మనమ రాలు పిల్లని తొందరచేసి నడిపించుకుంటూ, బయల్దేరింది రాసమణి.

రాసమణి వెళుతుంటే జగద్ధాత్రి ముఖం ఇంతచేసుకుని, ఆ వేంపే చూస్తూ నిల బడ్డది. హఠాత్తుగా ఆమె ఆలోచన చెదిరిపోయినట్టయింది.

మనమరాల్ని వెనక్కి పిలిచింది. "అమ్మాయీ! నిలబడమ్మా! పొలంనించి వంకాయలూ, అనపకాయలూ, చేమ దుంపలూ వచ్చాయి. కాసిన్ని పట్టుకెళ్దగానుండు. ఇదుగో ఇప్పుడే వచ్చేస్తా, క్షణంలో"—అని గబగబా ఇంట్లోకి పోబోతూంది.

రాసమణి చకితురాలైంది. "ఆసీ! వంగ అప్పుడే కాపు పట్టిందా, జగ్గూ!" అనడిగింది. వెంటనే మళ్ళీ కంఠస్వరం కాస్త తగ్గించి మనమరాల్ని యిలా మందలించింది—"ఒసే పాడు మొద్దా! కూడా కూడా పోకుండా, అలా విగ్రహంలా నించుండి పోతావేమే?"

ఇలా చెప్పిన మరుక్షణంలోనే మళ్ళీ వెనకనించి ఒక్క కేకవేసింది—"నేను ముందుగా నడుస్తుంటా గానీ, నువు తొందరగా పరుగెత్తుకొచ్చేసెయ్!"

## 2

జపం తపం ముగించుకున్నాక జగద్ధాత్రి పూజా మందిరంలోంచి బయటికొచ్చింది. చూస్తే, ముందర వసారాలో సంధ్య ఎంతో శ్రద్ధగా కుట్టుపని చేసుకుంటూంది. క్షణంసేపు కూతురికేసి అట్టే చూసింది. "ఏమే సంధ్యా!—పొద్దుటినించీ ఇదే పని పెట్టుకు్కూచున్నావ్, ఏం మునిగిపోయిందనీ? ఇహ తిండీ తిప్పలూ అక్కర్లే? నిన్న గాక మొన్ననే కదా పథ్యం పుచ్చుకున్నావు. ఇంత పొద్దో గొట్టుకుంటే మళ్ళీ తిరగబెట్టదూ? చెప్పాల్సిన మాట చెప్పాను. తరవాత నీ యిష్టం తల్లీ!" అన్నది.

పైకి లాగిన సూదిని పళ్ళతో బిగపడుతూ, ఇలా అన్నది సంధ్య—"నాన్నగారింకా రాలేదమ్మా."

అందుకు తల్లి—"ఆ సంగతి నాకూ తెలుసు, డబ్బూ దుబ్బూ లేని వైద్యం ఎందుకొచ్చిందో! ఇలాటి పోడి వైద్యం చెయ్యటానికి ఎంత పొద్దయినా ఎక్కుతుంది. పోనీ, పొద్దుపోతే నేను కనిపెట్టుకున్నానుగా, నువ్వెందుకమ్మా, ఉపోషం చేస్తూ కూర్చోవడం?" అనడిగింది.

చడీ చప్పుడూ లేకుండా సంధ్య తన పనేమో తను చేసుకుంటూ కూర్చునే వుంది గాని, జవాబు చెప్పలేదు.



– ఈ రెండేళ్ళ స్కీముకు రెండు లక్షలు ఖర్చవుతాయి – ప్రభుత్వం ఏడాదికి లక్షా పాతిక గ్రాంటు ఇస్తే అమలు చేసుకుంటాం!

"పోనీగానీ. ఏమిటా కుట్టేదీ, కాస్త చెబుదూ వింటాను' అన్నది జగద్ధాత్రి.

బదులు చెప్పటం యిష్టంలే. సంధ్యకు. అందుకని వినీ వినబడనట్టుగా "రెండే రెండు గుండీలున్నాయి అవి కాస్తా కుట్టేసి లేస్తాలే" అంది.

"తెలుసునే తల్లీ ఆ మాత్రం! ఆ సంగతి నాకూ తెలుసు. నా బట్టగానే కుడుతున్నావా అని అడుగుతున్నా ననుకుంటున్నావా? లేదమ్మా! ఈ భూలోకంలో నీ ఒకత్తెకే మహా ఉన్నాడు తండ్రి, ఇంకెవ్వరికీ తండ్రులు లేనట్టు చెబుతున్నావు. ఏ చొక్కాకి గుండీ ఊడిపోయినయో, ఏ పంచె ఏ మూలని పిగిలిందో, ఎక్కడ దాగు పడిందో, ఏ బూడ్సులి కెక్కడ కుట్లూడిపోయాయో—ఈ పనుల్తోటే నీకు రాత్రీ పగలూ తెల్లారి పోతుందాయె, మరో వ్యాపకమేం లేనట్టు."

కాస్త తలెత్తి, చిరునవ్వు నవ్వుతూ అంది సంధ్య—"నాన్నగారు యివేం చూసుకోలేరమ్మా! ఆయనకి దృష్టే ఉండదూ."

ఈ జవాబు విని తల్లి ఏమీ సంతోషించలే. డబ్బు లేకుండా చేసే డాక్టరీయేగా? అలాంటి వృత్తిలో తీరికెక్కడ వుంటుంది మరీ? అందుకని యిటుకేసి దృష్టి ఉండదు? నువ్వు చెప్పినట్టు. అవునుగాని ఆ యానాదివాళ్ళు లేచి పోయారా లేదా?" అనడిగింది.

"లేచి పోకుండా యెలా ఉంటారూ?"

"ఇంకా ఎప్పుడని? ఇల్లూవాకిలీ అష్టమంగలం చేసి, అందర్నీ తాకి తగ లెట్టిన

తరవాత? అపి నీ పని కూలా! మళ్ళీ కుడుతున్నావా? ఈ సూదీ దారం ఎక్కడి దావరించాయో కాపీ నీకు? అటయితే ఇహ లేవవు లాగుందే?''

"నువు వెళుతూండమ్మా. నేనూ నీ వెనకాలే వచ్చేస్తాను.''

''జబ్బు వొళ్ళయింది కదా నీకు తోచిందల్లా చేస్తూంటే ఎలా తల్లీ?—కావీ, ఇష్ట మొచ్చినట్టల్లా చేసుకో!—నీకూ మీ నాయనకీ చెప్పలేక చెప్పలేక నా తల పగిలి పోతూంది. ఇహ నాకీ ఇల్లూ వొద్దు. సంసారమూ వొద్దూ. కాశీ వెళ్ళిపోయి, మా అత్తగారి దగ్గరే ఉండిపోతా ఇదే చెప్పడం. తెలిసిందా?'' అంటూ కోపంగా ఇత్తడి బిందె బుజాన పెట్టుకుని దొడ్డివారిని గబగబా చెరువు కెళ్ళిపోయింది.

సంధ్య తల వంచుకుని కూర్చునుంది మొహం చిట్లించుకుని. కాస్త నవ్వింది కాని తల్లి మాటకేం బదులు చెప్పలేదు. చేతిలో కుట్టుపని పూర్తి అయింది. సూదీ, దారపుబంతీ అవీ ఎప్పటిలాగా వబ్బుబిళ్ళల పెట్టెలో సర్ది పెట్టింది. లేదామనుకునే టంతలో తండ్రి వచ్చిన అలికిడయింది. అందుకని ఉలిక్కిపడి తలెత్తి చూసింది.

ఆయనగా చెప్పటూ గడబిడగా, అతి బిజీగా ఉంటాడు—చేతిలో ఒక హోమియో పతీ మందులపెట్టె, చంకన ఒకటి రెండు వైద్య గ్రంధాలూ—వీటితో ఆయన అతి వేగంగా ఇంట్లోకి వచ్చాడు. ఎదట కూతురు కనబడగానే "మాదు, సంధ్యా!—కాస్త లేచి, నా మందులపెట్టె పెద్దది—ఊఁ—చప్పున?—చిక్కువచ్చిపడింది—ఇప్పుడేం చెయ్యాలో ఏం తోచటం లేదు....'' అన్నాడు.

చటుక్కున లేచింది సంధ్య. తండ్రి చేతిలో పెట్టే, పుస్తకాలూ తీసి ఓ వేపున పెట్టింది. తండ్రిని చెయ్యిచ్చుకు తీసుకెళ్ళి వరండాలో పరిచివున్న చాపమీద కూర్చో బెట్టింది. విసనకర్రతో విసురుతూ ''ఇంతాలస్య మయిందేం నాన్నా, యివాళ?'' అనడిగింది.

"ఆలస్యమా! తిండి తినటానికి లేడటానికి నాకు తీరిక ఉన్నదనుకుంటున్నారు కాబోలు, మీరు? నే నే రోగిని చూడకపోతే ఆ రోగికే ఎంత కోపం, ఎంత అభి మానం!—అబ్బబ్బా! ప్రియముఖర్జీ చేతి మాత్ర ఒకాటి పడకపోయిందో, ఏ రోగి బతికే ఎత్తు లేదు. ఈ భయం కేవలంగా అబద్ధ మనటానికి వీల్లేదు.

"అయితే ప్రియముఖర్జీ ఒక్కడేగాని యిద్దరు కాదుగా?—నందమిత్ర ఎటువంటి వాడైతే మనకేంలే. ఏదో కొద్దో గొప్పో ప్రాక్టీసు వెలిగిస్తున్నాడనుకో నాలుగయిదు మందుల పేర్లు అతగాడికెక్కడా తెలియక పోవులే. ఆయితే అతడెందుకూ పనికిరాడు.

"ముఖర్జీని పిలవక తప్పదు. ముఖర్జీ లేకపోతే పనిసాగదు. ఈ వైద్యులందరికీ : నేం చెబుతుంటా వినుకున్నావ్ —''ఒకమందు తాలూకు సిమ్టమ్ అంటే స్వభావం

లేదా విధానం కంఠస్థం చేసెయ్యగానే తీరిందనుకున్నారా? అరె!—ఇదేమంత తేలిగ్గా, చూడగానే వచ్చే విద్య కాదు సుమా! అంత సులభంగా వచ్చేస్తే ఈ పాటికి అందరూ డాక్టర్లే అయ్యేవారు అందరూ ప్రియముఖర్జీలే అయ్యేవారు!" అని.

"నాన్నా! కోటూ, చొక్కా విడిచెయ్, ముందూ" అన్నది సంధ్య.

"ఇదుగో, విప్పుతానమ్మా, విప్పుతా!—ఇదుగో యిప్పుడే!

ఇదంతా మామూలు విషయమేగా? చూడూ, గమ్మున 'పల్‌సెటిలా' యిచ్చేశా. నువ్వు ప్రాక్టీసయితే చేస్తున్నావుగాని, దాని యాక్షన్—అంటే అది చేసే పని, ఏమిటో కొంచెం చెప్పగలవ్, చూస్తాను? నాలాగా కంఠస్థం చెయ్యకపోతే యెలా చెప్పగలవ్, సంధ్యా? ఏదీ పుస్తకం తెరిచి చూడూ, 'పల్సెటిలా'—

"ఎందుకు నాన్నా, దీనికోసమని పుస్తకం తెరవటం? భోజనమయ్యాక ఆ మందును గురించి నీ దగ్గిర పాఠం చదువుకుంటాగా! మరయితే నాకు పాఠం చెబుతావా నాన్నా?—"

"చెప్పకేం తల్లీ!—తప్పకుండా చెబుతా, "నక్స్‌వామికా"కూ దీనికీ భేదముంది కూడా అసలు. ఏదీ ఆ పుస్తకం ఒకమాటు—"

"అంతదాకా నీ కాళ్ళకి చమురు రాయనా నాన్నా? ఎంత పొద్దు పోయిందో చూడూ. అమ్మ వచ్చిందంటే మళ్ళీ కోప్పడుతుంది" అని అంటూ చెరువువంచి తల్లి స్నానంచేసి వస్తోందో లేదో అని ఒక్కమాటు బెదురుతూ బెదురుతూ అటు చూపింది. వద్దు అని తండ్రి అనకముందే సీసాలో నూనె కొంచెం తీసి కాళ్ళకి పులిమింది.

"అబ్బ! కాస్సేపు ఆగకపోయావా అమ్మా! ఒకసారి చూపేస్తే...."

"అవునుగానీ, ఇవాళ ఎవరెవర్ని చూసి వచ్చావ్ నాన్నా? పంచామల్లాహ్ బాబానీ...."

"వాడా, ఆ ముసిలాడా? వాడు బతికే దేమిటి? నువ్వోసారి చూసిరా సంధ్యా ఇదుగో—ఆ పరాన్ ఛటర్జీ ఉన్నాడే దుర్మార్గపు వెధవ!—వాడిమీద కేసుపెట్టే తీర తాను, పెట్టక మానను. నేను ఏరోగి దగ్గరికి వెళ్తానో,—నే ఇవతలికి వచ్చేయ గానే—తనూ ఆ రోగి దగ్గరికే వెళ్ళి నా ప్రాక్టీసు పడగొట్టేస్తున్నాడు. నేను తొలి నాడిచ్చిన మందు తప్ప, మళ్ళీ మన్నాడు ఎవళ్ళూ నా మందు పుచ్చుకోవటం లేదుగా? ఎంచేత నంటావ్? ఈ నీచుడివల్లే. ఈ అపాత్రుడి మూలంగానే. "వాడు చేసిన పనేమిటో తెలుసా?—పంచాబాబాకి నేనోమందు సెలెక్టుచేసి ఇచ్చి వచ్చా. నేను ఇవతలికి రాగానే ఈ పాడుకట్టె మెలిమెల్లిగామారి, "ఏదీ ఆయనిచ్చిన

మందు? ఏమిచ్చాడో చూదాం!'' అన్నాట్ట.

"తరవాత....?'' అనడిగింది సంధ్య కోపంతో.

అంతకంతె కోపంతో రెచ్చిపోయి, తండ్రి ఇలా అన్నాడు :—' అంట్ల వెధవ! అపాత్రపు వెధవ ! ! !—నేనిచ్చిన మాత్రలన్నీ నోట్లో పోసుకుని, నమిలేశాట్ట! 'ఛ! ఇదేం మందు?—చూశారు కద, అన్నీ ఒక్క క్షణంలో అమట్లున మింగేశాను. ఏదీ! నామందు తాగమనండి మీ డాక్టర్ని! చూస్తాను'' అని చెప్పి, ఒక బుద్ధితో ఆమదం ఇచ్చేసి వచ్చాట్ట!—

"ఇవాళ నేను వెళ్ళగానే వాళ్ళన్నారు కదా—"స్వామీ —మీ రిచ్చినమందు అంతా ఆయన ఒక్క గుటకలో మింగేశాడు. మరి ఆయన మందు మీరుకూడా అలా తాగ్గలిగితే మీ మందు మేం పుచ్చుకుంటాం. లేకపోతే లేదు'' అని.

కలవరపడింది సంధ్య. "కొంపదీసి, ఆ మందు నువుగానే తాగలేదు కద నాన్నా?'' అనడిగి ఏం చెబుతాడోనని ఎదురు చూసింది.

"లేదు లేదు. అది నేను తాగుతానా?—కాని. ఇప్పటిదాకా ఇల్లిల్లూ తిరిగినా, ఒక్క కేసుకూడా దొరకలే. ఇదుగో, నీతో చెబుతున్నాను గా సంధ్యా!—వరాన్ మీద నేను కేసు పెట్టక మానను.''

సంధ్య మహా క్షోభపడిపోయింది మనస్సులో. అభిమాన పడ్డది. అందవల్ల ఆమె కళ్ళలో అశ్రువులు జల జల్లాడాయి. పైగా సంసారంలో ఎన్నెన్ని ఆఘాతాలు, ఎన్ని ఉపద్రవాలు, ఎన్ని నిందలూ పరిహాసాలున్నూ? ఈ అన్నింటినుంచీ తను తన తండ్రిని కాపాడుకోవటంకోసమని రెండు చేతులూ పదిచేతులుగా చేసుకుని అడ్డం పెట్టుకుంటూ వస్తూంది.

"నాన్నా! నువ్వెందుకు ఒహాళ్ళని గురించి ఇలాగా రాత్రనక పగలనక తిరగటం? ఎంతోమంది మీ మందుకోసమని మనింటి చుట్టూనే తిరిగి పోతున్నారు!'' అన్నది సంధ్య.

ఈ మాట పూర్తిగా నిజంకాదు. ఊళ్ళో బీదా, బిక్కీ కొంతమంది మాత్రం ముఖర్జీబాబు మందు కావాలంటూ ఇంటికి వచ్చేమాటలో కొంత సత్యముంది. అయితే—అరావడం సంధ్యదగ్గర మందు పుచ్చుకుందామని కాని, తండ్రి దగ్గర నించి పుచ్చుకుందామని కాదు.

సంధ్యకూడా చిన్న చిన్న రోగాలకు చికిత్స చెయ్యడం తండ్రి దగ్గిర నేర్చుకుంది. సామాన్యంగా ఆమె ఇచ్చేమందు పనిచేయక పోవడమంటూ కూడా లేదు.

డాక్టర్ ప్రియముఖర్జీని చూస్తే రోగులు యముణ్ణి చూసినట్టుగా భయపడతారు.




తంచేత వైద్యం చేస్తారంటే—ఇంటి అరుగులవేపూ గుమ్మాలవేపూ కాస్త విదాళించి చూసి, ఆయనింట్లో లేడుకదా అని సావధానంగా ఆలోచించి నిశ్చయించుకుని మరీ లోపలికి వెళతారు. వెళ్ళి, అతడు లేని సమయంలో సంధ్య దగ్గరకొచ్చి మందు తీసుకు పోతుంటారు. ఈ సంగతి సంధ్యకూ తెలుసు. కాని, తండ్రి కోపమని ఇప్పుడిలా అబద్ధమాడ్డం తప్పనిసరి అయింది.

సంధ్య చెప్పినమాటకు తండ్రి కంగారు పడ్డాడు—"వచ్చినవాళ్ళు తిరిగి వెళ్ళిపోయారా? ఎవరా వచ్చింది? ఎవరి తాలూకువాళ్ళు? ఎంత సేపయింది వాళ్ళు వెళ్ళిపోయి? ఏదారిని వెళ్ళారు? పోనీ, ఊరూ పేరూ అయినా, కనుక్కున్నావా కాస్త?—" ఇలా ప్రశ్నల వర్షం కురిపించాడు.

లోలోపలే సంధ్య ఎంతగానో సిగ్గుపడింది. "వాళ్ళ ఊరూ పేరూ, అడ్రెసూ మనకెందుకు నాన్నా! ఈ మాటు మళ్ళీ వాళ్ళంతట వాళ్ళే వస్తారు" అన్నది.

"హ. మీతో నేను వేగలేకుండా వున్నానర్రా దేవుడా!—కాస్త, పేరేమిటో అడిగి తెలుసుకుంటే ఇంతలో ఏం ముంచుకుపోయింది? ఇప్పుడే ఒక్కట్రిప్పు తిరిగి వచ్చేసేవాణ్ణి గదా! ఆలస్యం అమృతం విషం!—జాప్యంచేస్తే జబ్బు ఎక్కువవుతుంది. ఒక్క మాత్రతో వాళ్ళ రోగాలూ గీగాలూ ఎగరకొట్టేవాణ్ని. వైద్యం చెప్పి వెళ్ళలేవా?—"

మాటాడక కూర్చుని, సంధ్య తండ్రి కాళ్ళకి చమురు పాముతూంది.

"మళ్ళా ఎప్పుడు వస్తామన్నారూ?" అడిగాడు.

"సాయంత్రం రావచ్చు, బహుశా."

"రావచ్చా అంటావా? ఎంత పొరపాటు జరిగిపోయిందో కాస్తయినా ఆలోచించావ్? ఇహ రానే రారేమో! పోయి పోయి, పీళ్ళా విపినుడిదగ్గరికిపోయి పడరు కద. కొంపదీసి!—వాడున్నాడే. ఆ దుర్మార్గుడు పరాన్, వాడెప్పుడూ ఈ చూపు మీదనే వుంటాడు. ఈ లోపుగా ఇది వాడిచెవిని పడదుకద!—ఓయి దేవుడా. నేవింక ఈ కొంపలో వేగలేను బాబూ!—అమ్మాయీ!—ఏ శనగపప్పు లాంటిదో చేతిలోపెట్టి నేనొచ్చేదాకా కాస్సేపు వాళ్ళ నాపలేక పోయావా? ప్రతిదీ చెప్పాలి. అన్నీ చూపించాలి!

"ఎవరది? ఎవరా తొంగిచూసేది? లోపలికి రారామా? ఒహో, రామమయ్. వచ్చినట్టుందే? ఏం, అల్లా కుంటుతున్నావ్?" అంటూ పలకరించాడు.

ముఖర్జీ ఇంత ఆదరంగా పిలవడంవల్ల, నడిప్రాయపు వాడు, ఆ రైతు రామమయ్ లోపలికి వచ్చాడు. వచ్చి ముంగిల్లోవించుని. అదోలాంటి ఉదాసీనమైన స్వరంతో "చిత్తం, మరేం లేదండి!" అన్నాడు.

"ఏమీ లేదూ. చిత్రంగానే వుంది నీ మాట!—చక్కగా కుంటుతున్నావే, ఏం లేదంటావేం?—కాస్త నూనె రాయడం ఆపు, సంధ్యా! "ఏమి లేదంటావేమిటయ్యా. "ఆరవికా" కేసు స్పష్టంగా కనిపిస్తుంటేనూ?—కాదు కాదు, ఇదేం తమాషా కాదు. రామమయ్! ఏదీ, ఎక్కడో సరిగ్గా చూపించు కాలూ!

"చూపించు కాలూ!" అనగానే రామమయ్ ఒక్కసారి సంధ్యకేసి జాలిగా చూశాడు. ఆ తరవాత యిలా చెప్పాడు. "అవునండి బాబయ్యా. ఈ కాలు కాస్త మడతపడి వలిగింది విన్న. ఆపళంగా జారి కింద పడ్డానండి!"

ప్రియబాబు కూతురికేసి చూసి ఒక్కమాటు నవ్వాడు. "చూశావా సంధ్యా!—చూసీ చూడంగానే చెప్పేశా, ఇది ఆరవికా కేసు అని. మాకు అలా తెలిసిపోతుంది. "ఊ—ఎల్లా పడ్డావ్?" అనడిగాడు.

"చెప్పాను గదండీ, కాలు జారి పడ్డానని? మా ఇల్లుంది కదండీ, ఇంటి గుమ్మం పక్కనే ఒక చిన్న జలదారి తగలడిందండి దానిమీంచి నడవటానికి ఓ చిన్న బల్ల కట్టిందండి. అదెప్పుడు లాగేశారో గుంటవెధవలు, తీసేశారండి. నేనేదో కాస్త పరధ్యానంగా ఉండి........"

"పరధ్యానమా! ఏగనప్—ఎపిస్!—'సంధ్యా, జాగర్తగా విను. కనిపెట్టవలసిందే అసలు స్వభావం. అదే అసలు ప్రధానం. హేరింగ్ మహాశయుడు ఏం చెప్పాడంటే—ఊ—పరధ్యానంగా ఉంది....తరవాత?"

"లోపల కాలుపెట్టాను. మడతపడి. కీలు...."

"ఆగు, ఆగు!—కాలు మడతపడిందని చెప్పావుగా ఇప్పుడే. మళ్ళీ కీలు తప్పిందంటున్నావ్. మెలికపడటమూ, కీలు తప్పడమూ ఒకటికాదు రామమయ్!"

"కాదండి. అదే, అదే. కాలు మెలికపడి. జారి కిందపడ్డాను."

"ఊఁ—సరే. పరధ్యానంగా ఉండి....అన్నావ్ కదూ. రామూ? అంటే జ్ఞాపకం ఉండదన్నమాట. మనస్సు ఎక్కడో వుంటుంది కాని తిన్నగా ఉండదు. ఇప్పుడే చెప్పడం, ఇప్పుడే మరవడం రెండూ వుంటాయి. ఏగనస్—ఎపిస్. హా!—తరవాత?—"

"తరవాత ఇంకేమిటుంది బాబయ్యా!—నిన్నటినించీ కాలు నేలమీద మోపలేకుండా వున్నాను." అని అంటూ, రామమయ్ ఒక్కమాటు సంధ్య ముఖంకేసి చూసి నిట్టూర్చాడు.

అప్పుడు సంధ్య తొందరపడుతూ, నాన్నా, పొద్దోయింది, కొంచెం ఆరనికా...."

"కొంచెం ఆగు సంధ్యా! కేసు కొంచెం స్టడీ చెయ్యనీ! సిమిలియా సిమిలిబస్. రెమిడీ సెలెక్టు చెయ్యడమంటే పిల్లాళ్ళతో ఆడుకోవడంకాదు. ఏమాత్రం ఎటూమటీ అయినా కేసు కాస్తా పాడై పూరుకుంటుంది. పేరు చెడిపోతుంది. ఊఁ—తరవాత? నొప్పి ఎలా వుంటుందో చెప్పు. చూస్తా, రామూ!"

"అయ్యో దేవుడ!—నొప్పంటే నొప్పా? మహచెడ్డ బాధపడిపోతా వున్నానండి బాబయ్యా!"

"అది కాదోయ్ రామమయ్! అదికాదు. అది ఏరకంనొప్పి అని? ఘర్షణవతా? మర్షణవతా? సూచీ విద్ధవతా? వృశ్చికదంశవతా?—అంటే, నీకు బాగా తెలిసేట్టు మళ్ళీ అడుగుతా. ఈ మాటు సరిగ్గా చెప్పు : పీకుతున్నట్టుందా, నమిలేసి నట్టుందా, సూది గుచ్చుతున్నట్టుందా, తేలు కుట్టినట్టుందా, కర కరమంటుందా, భగ భగ మండు తున్నట్టుందా?"

"చిత్తం చిత్తం, అవునండి. సరిగ్గా అలాగ్గే వుందండి బాబుగారూ!"

"అయితే—భగ భగ మండుతున్నట్టుందా? సరిగ్గా ఆ తే నన్నమాట. తరవాత?"

"ఆ తరవాత మరేమిటుంది బాబయ్యా! నిన్నట్నించీ నొప్పి భరించలేక సచ్చి పోతావున్నాను!"

"ఆగు, ఆగు!—ఏమిటంటున్నావ్? సచ్చిపోతా వున్నావా?"

విసుగు పుట్టింది రామమయ్కి.

"సచ్చిపోక మరేంటండి? నిన్నట్నించీ కుంటు కుంటూ నడుస్తున్నాను. కాలు తిన్నగా మోపలేను. ఇంతకంటే చావు మరేం కావాలండీ—ఆ క్షుద్ర సన్నాసులు.

చుడుకు వెధవలు చెప్పినట్టూ వినండి. వద్దురా అంటే మానండి. అస్తమానం ఈ బల్లతోటే వాళ్ళ ఆటలు! ఎప్పుడో ఓనాడు కాలుజారి అందులోపడి వచ్చే పోతాన్లాగుంది. నా ఖర్మ ఎలావుంటే ఆలా అవుతది. కానీండి. బాబయ్యా! కాస్త మందిచ్చి పంపేసెయ్యండి. ఇప్పటికే శానా పొద్దోయింది" అని తొందరపడ్డాడు రైతు రామమయ్య.

"నాన్నా! అరవికా.... రెండు చుక్కలు...."

ప్రియముఖర్జీ కూతురికేసి చూసి కొంచెం నవ్వాడు. "కాదే తల్లీ. కాదు. ఇదెంతమాత్రం అరవికా కేస్‌కాదు. విషమదే అయినట్టయితే, నిశ్చయంగా అరవికా ఇచ్చేవాడే. నాలుగుచుక్కలు ఎకొనైట్—త్రిహండ్రెడ్‌పొటెన్సీ. రెండు గంటల కోసారి పుచ్చుకోవాలి...."

కళ్లు రెండూ విప్పార్చింది సంధ్య. "ఎకొనైటా నాన్నా?" అనడిగింది

"అవునమ్మా. అవును! మృత్యుభయం—మృత్యుభయం!—పడి చస్తానేమో నని భయం! సిమిలియా సిమిలిబస్ క్యూరెంటార్! హేనింగ్ మహాశయు డేం చెప్పాడో తెలుసా?—చికిత్స రోగానికి కాదు. రోగికి!—అన్నాడు. మృత్యు భయానికి ముఖ్యమయింది ఎకొనైటే.

"ఇదే విషమదయితే.... ఛ ఛ—ప్రతి వెధవా, అర్ధమైనవాళ్ళూ—చికిత్స చేస్తామని బయల్దేరటమే!

"రామూ!—సీసా తీసుకుని మా అమ్మాయితో కూడా వెళ్ళు. రెండేసి గంటల కొక మోతాదు చొప్పున నాలుగుసార్లు పుచ్చుకో. తెలిసిందా?—సాయంకాలం నేవచ్చి చూస్తాలే.

"మరో ముఖ్యమైన సంగతి: సమయానికి గుర్తొచ్చింది. బాగావిను—వాడు న్నాడే, వాడు—ఆ పఠాన్ డాక్టర్. ఏమంటా డనుకున్నావ్? "ఏదీ. ఏం మం దిచ్చాడో చూతాం" అని అడుగుతాడు. ఖబడ్దార్!—సీసామాత్రం బయటికి తీసి చూపావో, నీపని వుందే! ఇప్పుడే ముందుగానే చెబుతున్నా—ఆ గాడిద—ఛటా చోర్—నే నిచ్చిన సీసా ఎత్తి గడ గడ మంటూ తాగేసి, అందులో కేస్టరాయిల్ నింపి పోతాడు.

"ఊ(—అబ్బా!—కడుపులో నొప్పి, నొప్పి! మెలేపేస్తూందే!!—"

రామమయ్యకి మందివ్వటానికని సంధ్య లేచి నిలబడింది. తండ్రి మాట వినగానే భయపడి తల్లడిల్లి పోయింది. "కొంపదీసి, ఆ అనుదమంతా నువు తాగేసి రాలేదు కద, నాన్నా?" అనడిగింది.



"ఉహూఁ—లేదు, లేదు, చెంబెక్కడే....?"

"అలాగయితే, నువు బహూశా ."

"లేదు. లేదు. చప్పున తే చెంబూ, తొందరగా... తగలడ్డ కొంపనే!—సమయానికి ఏ వస్తువయినా దొరికితేనా?—పోనీలే, చెంబు దొరక్కపోతే పోయింది...." ఇలా అంటూ అంటూ, ఎగరోజుతో ప్రియబాబు పెరటితలుపు తీసుకొని బయటికి వెళ్ళిపోయాడు.

అప్పుడు రామమయ్య, "అక్కయ్యగారూ!—అయితే ఆ మందు....అయితే"

అనేసరికల్లా సంధ్య చకితురాలైంది. "మందా?—ఇదుగో, ఇప్పుడే తెచ్చిస్తానుండు" అని చెప్పింది.

"అమ్మాయిగారూ!—మీ రింటాకా చెప్పారు చూడండి. మందు పేరు........ 'ఆ-ర-వి' అనో, మరేమిటో? అదివ్వండమ్మా. రెండు చుక్కలు! బాబయ్యగారి మందుమాత్రం రాకుండా చూడండమ్మా?" అన్నాడు.

లోలోపల సంధ్య బాధపడింది. "నాన్నగారికంటే నాకేమన్నా ఎక్కువ తెలుసా, రామమయ్?" అంది.

సిగ్గుపడ్డాడు రామూ. "కాదండమ్మా. అదికాదు. బాబుగారిచ్చే మందు చాలా ఘాటైందండి. అక్కయగారూ!—అది మంత్రించినట్టుగా విలేసి పనిచేస్తుంది. నేను చూడబోతే ఉలిపిరిగొట్టువాడిని....

"ఇదుగో, నేను. పోయుండీ. ఎల్లాగో అల్లాగ మాయచేసో మరోలా నచ్చజెప్పి మాదాయ్‌ని పంపిస్తానండి. పంపకపోతే అందరుగాని, నన్ను. విన్నట్నించీ కడుపు నొప్పి మెలేస్తోందిటండి. నాన్నగారి మాత్ర ఒక్కటి తగిలిందంటే వాడికిట్టె నయమై పోతదండి. నాకుమాత్రం మండి—యిందాకా మీ రన్నారు సూడండీ, అదే—ఆ మందే ఇవ్వండమ్మా!" అని ప్రాధేయపడ్డాడు.

చిన్నబుచ్చుకుంది సంధ్య. "సరే—ఇలా రా" అని చెప్పి, రామమయ్‌ని వెంట బెట్టుకుని పక్కనున్న వరండా గదిలోకి తీసుకు వెళ్ళింది.

* * *

పూజామందిరంలోకి కావలసి, ఓ బిందెడు నీళ్ళు తెద్దాంకదా అని జగద్ధాత్రి చెరువు కెళ్ళింది. ఇంటోకి వస్తూనే, ఆ నీళ్ళబిందె దభీమని ఎత్తి పడేసింది కోపంతో 'సంధ్యా!' అని కేకేసింది. ఇంటోవున్న సంధ్య "వస్తున్నానమ్మా! ఏం?" అనడిగింది.

"మీ నాయన యింకా కొంపకి చేరలేదుగా? అయితే, ఇవాళ్టికిహ ఠాకూర్ పూజ మానుకోవల్సిందే?" అన్నది తల్లి.

గదిలోంచి సంధ్య యివతలకి వచ్చింది. "నాన్న వచ్చి చాలాసేపయిందమ్మా! నూనె రాసుకుని స్నానానికని వెళ్ళారు" అని చెప్పింది.

"ఏరీ. చెరువు దగ్గిర కనిపించలేదే?"

తండ్రి ఎక్కడికెళ్ళిందీ సంధ్యకు నిజం తెలుసు. కాస్సేపు ఊరుకుని యిలా చెప్పింది: "అలా అయితే యివాళ ఏటి కెళ్ళుంటారమ్మా! చాలాసేపయిందే, వెళ్ళి. ఈ పాటికి తిరిగి వస్తుండాలి!" అని చెప్పింది.



"ఊహూ!—లేదు, లేదు, చెంబెక్కడే....!"

"అలాగయితే, నువ్వు బహుశా ."

"లేదు, లేదు. దప్పున తే చెంబూ, తొందరగా... తగలడ్డ కొంపకే!—వమ యావికి ఏ వస్తువయినా దొరికితేనా?—పోనీలే, చెంబు దొరక్కపోతే పోయింది...."

ఇలా అంటూ అంటూ, ఎగరోజుతో ప్రియబాబు పెరటితలుపు తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు.

అప్పుడు రామమయ్య, "అక్కయ్యగారూ!—అయితే ఆ మందు....అయితే"

అనేసరికల్లా సంధ్య చకితురాలైంది. "మందా ?—ఇదుగో, ఇప్పుడే తెచ్చిస్తానుండు" అని చెప్పింది.

"అమ్మాయిగారూ !—మీ రింవాకా చెప్పారు చూడండి. మందు పేరు........ 'ఆ-ర-ఐ' అనో, మరేమిటో ? అదివ్వండమ్మా. రెండు చుక్కలు ! బాబయ్యగారి మందుమాత్రం రాకుండా చూడండమ్మా !" అన్నాడు.

లోలోపల సంధ్య బాధపడింది. "నాన్నగారికంటే నాకేమన్నా ఎక్కువ తెలుసా, రామయ్య ?" అంది.

సిగ్గుపడ్డాడు రామూ. "కాదండమ్మా. అదికాదు. బాబుగారిచ్చే మందు చాలా ఘాటైందండి. అక్కయగారూ !—అది మంత్రించినట్టుగా విలేపి పనిచేస్తుంది. నేను చూడబోతే ఉలిపిరిగొట్టువాడిపి....

"ఇదుగో, నేను, పోతుండీ, ఎల్లాగో అల్లాగ మాయచేసో మరోలా నచ్చచెప్పి, మాదాయ్ని పంపిస్తానండి, పంపకపోతే అందరుగాని, నన్ను. విన్నట్నించీ కడుపు నొప్పి మెలేస్తోందిటండి. నాన్నగారి మాత్ర ఒఖ్ఖటి తగిలిందంటే వాడికిట్టె నయమైపోతదండి. నాకుమాత్రం మండి—యిదాకా మీ రన్నారు సూడండీ, అదే—అ మందే ఇవ్వండమ్మా !" అని ప్రాధేయపడ్డాడు.

చిన్నబుచ్చుకుంది సంధ్య. "సరే—ఇలా రా" అని చెప్పి, రామయ్యని వెంట బెట్టుకుని పక్కనున్న వరండా గదిలోకి తీసుకు వెళ్ళింది.

* * *

పూజామందిరంలోకి కావలసి, ఓ బిందెడు నీళ్ళు తెద్దాంకదా అని జగద్ధాత్రి చెరువు కెళ్ళింది. ఇంటోకి వస్తూనే, ఆ నీళ్ళబిందె దభీమని ఎత్తి పడేసింది కోపంతో 'సంధ్యా !' అని కేకేసింది. ఇంటోవున్న సంధ్య "వస్తున్నానమ్మా ! ఏం ?" అనడిగింది.

"మీ నాయన యింకా కొంపకి చేరలేదుగా ? అయితే, ఇవాల్టికిహ ఠాకూర్ పూజ మానుకోవల్సిందే ?" అన్నది తల్లి.

గదిలోంచి సంధ్య యివతలకి వచ్చింది. "నాన్న వచ్చి చాలాసేపయిందమ్మా ! నూనె రాసుకుని స్నానానికని వెళ్ళారు" అని చెప్పింది.

"ఏరీ, చెరువు దగ్గిర కనిపించలేదే ?"

తండ్రి ఎక్కడికెళ్ళిందీ సంధ్యకు నిజం తెలుసు. కాస్సేపు ఊరకుని యిలా చెప్పింది : "అలా అయితే యివాళ ఏటి కెళ్ళుంటారమ్మా ! చాలాసేపయిందే, వెళ్ళి. ఈ పాటికి తిరిగి వస్తుండాలి !" అని చెప్పింది.

ఈ జవాబు విని జగద్ధాత్రి ఏమాత్రం శాంతించలేదు. సరికదా. ఉద్రిక్తమైన కంఠ స్వరంతో మనస్సులో బాధ యిలా వెలపోసుకుంది—

"సంధ్యా!—ఇహ నీయన్ని పెట్టుకుని నేను వేగలేనే అమ్మాయ్! ఇక్కణ్ణించి ఎక్కడికయినా ఆయనైనా వెళ్లాలి, లేదా నేనయినా వెళ్ళిపోవాలి. "ఇవాళ పురోహితుడు భట్టాచార్యులుగారు పూజ చేయించటానికి రారు. కనక మీరు కాస్త పెంద రాళే రండి. తప్పకుండా రండేం?" అని వెయ్యిసార్లు చెప్పా వెళ్ళేటప్పుడు. అంత చెప్పినాకూడా, ఇదేకాబోలు వేళకి రావడం! ఇప్పటివాకా నెత్తిన రెండు నీళ్ళచుక్కలం కయినా దేవుడు నోచుకోలేదు కదా!—దీవి మాటకేం?—నిన్నమట్టుకు విన్న రాత్రి ఏం చేసుకొచ్చా రనుకున్నావ్?—విరాట్ పరామణి ప్రోనోటుమీద అసలీ ఫాయిదాలు ముట్టినట్టుగా రసీదిచ్చేసి, చక్కావచ్చారు! ఇంకేమనుకోను?"

అనుమానం పట్టుకుంది సంధ్యకు. "ఎవరు చెప్పారమ్మా, అలా అని?" అనడిగింది.

"ఎవరేమిటి?—ఆ పరామణి చెల్లెలే చెప్పింది. తనూ ఆడబిడ్డా ఇందాకా స్నానానికి వచ్చారుగా?—" అన్నది తల్లి.

నవ్వడానికి ప్రయత్నించి, సంధ్య చెప్పింది—"అన్నా చెల్లెళ్ళకి పడదమ్మా! బద్ధ విరోధం అందుకనే అలా చెప్పివుంటుంది. ఈ మాట పట్టుకు నిజమను కుంటున్నావు కాబోలు నువ్వు!"

తల్లికి కోప మొచ్చింది.

"ఎందుకే సంధ్యా, ప్రతి విషయం నువు దాచి పెడతావూ? మొన్నటికి మొన్న ఆ విరాట్‌గాడు జ్వరం వచ్చింది బాబూ అని చెప్పి పిలుచుకుపోయాడు "బాబయ్యా, మీరు ధన్వంతరంతవారు" అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డాడు, మందు మింగాడు. తీరా డబ్బివ్వ వచ్చేసరికి, "తమరు జమీందారులు, దానకర్ణులు" అని పొంగేసి కొండ కెక్కించాడు. నవ్వుతూ నవ్వుతూనే దోపిడీ చెయ్యడం కాకపోతే మరేమిదంతా? పోతే పోనీ, వెధవ డబ్బు!—ఇహ ఇంటికిపోయి చేసేదేముందీ, ఇక్కడే పమిటె చెంగుతో ఈ బిందె మెడకట్టుకుని, చెర్లోమునిగి చద్దామా అనిపించింది! రాను రాను మరీ కాల్చుకు తినేస్తున్నారమ్మ! ఇలాంటి సంసారం ఎలా ఈదుకు రావటం, నువ్వే చెప్పు, సంధ్యా?"

"ఎన్ని రూపాయిలమ్మా?"

"ఎన్నని అడుగుతావా? పది పన్నెండుకి తక్కువుండవ్; పిడికెడు రూపాయిలు ఇలా ఇష్టమొచ్చినట్టూ...."

అంటూండగానే ఇంతలో ప్రియబాబు తడిగుడ్డలతోనే హడావిడిగా లోపలికి వస్తున్నాడు. వస్తూ వస్తూ పెద్దగా—"సంధ్యా!—అంగాప్రం. అంగాప్రం! అంగాప్రమే. ఒక్కమాటు ఇలా ఇయ్యమ్మా!—ఎకోనైట్ త్రిహన్డ్రెడ్ పొటెన్సీ—పెట్టెలో. తెలీదూ? సరిగ్గా మూలని...." అని ప్రారంభించాడు.

అగ్నిజ్వాలలాగా పెగలతో పొగలతో ఝుంయ్‌మంటూ లేచింది. జగద్ధాత్రి :

"నే మింగేశాను ఎకోనైటంతా!—మామగారు పెట్టే మెతుకుతోనే కదా. మీరిలా హోపు వెలగబట్టి రాజ్యమేలుతున్నారు?—ఛ! సిగ్గులేమా. మొహానికి? మంగలి విరాట్‌గాడికి వడ్డీ ఎందుకు తీసేసినట్టూ?—ఎవరు చెప్పారు తీసెయ్యమనీ?—ఆ యానాదివాళ్ళనీ ఎలికలవాళ్ళనీ మీరు కాపరం పెట్టించింది ఎవరి జాగాలో? 'గోచర' అంటూ మీరు దానమిచ్చి వచ్చింది ఎవరి పొలం? చూస్తున్నాగా? నేను కాపరానికి వచ్చింది మొదలు ఇలా నా ఎముకలు కొరుక్కుతినేస్తూనే వున్నారాయె! ఏనాటి కయినా బుద్ధి మళ్ళుతుందేమో అనుకుంటే ఉహుం—అదేం కనబడదు—ఏ కోశానా! ఇదుగో ఇదే చెప్పటం: ఇవాళ ఈ యింటోనించి నేనైనా పోవాలి. మీరయినా వెళ్ళిపోవాలి! అంతే! దీనికి తిరుగులేదు!" అన్నది ఖచ్చితంగా.

ఇందుకు సంధ్య కలుగజేసుకుని తీవ్రంగా ఇలా అంది :

"అమ్మా!—ఏమిటే. మధ్యాన్నం రెండు ఝాములవేళ ఈ మాటలన్నీ మావ్వెం దుకు మొదలెట్టినట్టూ?"

తల్లికూడా ఏం తక్కువ కాదు. ఆవిడా తీవ్రంగానే. దుడుకుగా జవాబు చెప్పింది—

"ఈ నాటకానికి మధ్యాన్నమేమిటి. పొద్దున్నేమిటే అమ్మాయ్! ఆయనెవరు నాకు? పూజ కాంగానే రెండు మెతుకులు నోటో కొట్టుకోవటం. ఈ కొంపా గోడూ మనకెందుకురా దేవుడా అన్నట్టు లేచిపోవటమూ నాకొ! దీనికోసమని వేళేమిటి పాళేమిటి? ఓర్చాను. ఓర్చాను ఇప్పటిదాకా ఎంతగానో ఓర్చాను. ఇహ సరి నా వల్లకాదు. దేవుడా!—ఉహుం—మరి ఓర్చలేను. ఓర్చలేను. ఓర్చలేను!—" అంటూ ఆవేశంగా అరుస్తూ. ఒక్కమాటుగా ఏడుపులోకి దిగింది. ఆ ఏడుపుతోనే గబ గబా యింటోకి పోయి పడ్డది!

"ఊఁ—...." అంటూ ప్రియబాబు దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఇన్ని రూపాయిలు వడ్డీ కొట్టెయ్యటానికి ఇది ఎవడి సొమ్మనీ? నేనేం ఆర్జించాననుకున్నావా. విరాట్?" అని అన్నాను నేను. అనకపోలేదు. మీరనే దేమిటీ! ఒహాళ్ళమాట ఒహాళ్ళు వినిపించుకుంటేగా?—




"అదీగాక—వాళ్ళమీదవయినా తప్పు మోపటానికి వీలుకనబడదు. మందైతే పుచ్చుకుంటారుగాని. పథ్యం పడుపుకోవటానికి వాళ్ళకి తీరికా లేకపోయె!—నేత్రమ్ టు హండ్రెడ్ పౌండ్సేస్పీ. ఒక్కొక్క చుక్క చొప్పున...."

సంధ్యకు కళ్ళవెంట జలజల నీళ్ళు రాలాయి. కాని. కనిపించకుండా పమిట చెంగుతో తుడుచుకుంది. "ఎందుకు నాన్నా!—అమ్మతో చెప్పకుండా నువ్విల్లాంటి బాదరబందీల్లో పడతావ్ ' అన్నది. విచారంతో.

అందుకు ప్రియముఖర్జీ—' ఇదుగో, చెబుతున్నాగా ! పడను, పడను. చిక్కుల్లో పడను. కావయితే—ప్రియముఖర్జీ లేందీ ఈ ఊళ్ళో ఏ పనీ సాగదు. ఏమాత్రం జరగదు—అదీ చూస్తూనే వున్నాగా ! ఎవళ్ళకెక్కడ కొత్త పడిశెం పట్టినా. ఎవళ్ళకెక్కడ...."

ఇంకా అతడు చెప్పవలసిందంతా పూర్తికాలేదు. సంధ్య వెంటనే వెళ్ళి మడిబట్టా. అంగాస్త్రం తెచ్చి ఇచ్చింది.

"ఇహ మరి ఆలస్యం చెయ్యకు నాన్నా! పూజ కానిచ్చెయ్. నే ఇప్పుడే వస్తున్నా" నని చెప్పి. గదిలోకి వెళ్ళింది. తల తుడుచుకుంటూ తుడుచుకుంటూవున్న ప్రియబాబు పూజా మందిరంలోకే వెళ్ళాలనుకుని వుంటాడు. "ఉష్! అబ్బా. కడుపు మలిమేస్తూంది! పరాన్ పేరుతో...." అనుకుంటూ వెళ్ళాడు.

## 3

సంధ్యను ఆనాడు రాసమణి మాటిమాటికీ ఎంతగానో భయపెట్టి. హడలగొట్టుతూ వచ్చింది కదా! ఎవరినిగురించి ?—ఎవరి పేరు చెబితే పులులూ. మేకలూ

ఒక్క రేవులో నీళ్ళు తాగుతాయని లోకు లనుకుంటారో ఆ హిందూ కుల చూడామణి, మహా పరాక్రమశాలి, అయిన గోలోక ఛటర్జీని గురించి. ఆ మహాశయుడు యిప్పుడే వీధి చావిట్లోకి వచ్చి కూర్చున్నాడు. కట్టింది పట్టు పీతాంబరం, వేసింది జారుముడి, అందులో దోపింది గన్నేరు పువ్వు, తొడిగినవి కొయ్య పావుకోళ్ళు. ఇవన్నీ చూస్తే యిప్పుడే ఆయన ప్రాతఃకాల పూజా పునస్కారం, జప తపాలూ పూర్తి చేసుకొని యివతలికి వస్తున్నాడా అనిపిస్తుంది.

అప్పటికింకా అక్కడికి బైటినుంచి వాళ్ళూ వీళ్ళూ రాలేదు. ఒక్క నవుకరు మాత్రం వచ్చాడు. చాపలూ, తివాసీలూ పరిచాడు. హుక్కా గొట్టంలో గొట్టా వేసి దట్టించాడు. సిద్ధం చేసి వెళ్ళాడు.

పరిచివున్న తివాసీమీద బాలీసుకి చేర్లాబడి కూచున్నాడు ఛటర్జీ. ఆలోచిస్తూ ఆలోచిస్తూ, ఒక్క దమ్ము పీలుద్దామని హుక్కాగొట్టం తీసేటంతలో నడిం తలుపు గొళ్ళెం వదిలించిన చప్పుడు వినబడింది. మొహమెత్తి చూసి, "ఎవరు వారూ?" అనడిగాడు.

లోపలినుంచి జవాబు వచ్చింది—"నేనే. ఫలహారం గటా పుచ్చుకోకుండానే అప్పుడే కచ్చేరీ సావిట్లోకి వెళ్ళిపోయారే, మహా? కోపం కాదు గదా, నా మీద?"

"కోపమా?—ఇప్పుడెవరిమీద నేను కోపం, తాపం చూపించడం చెప్పూ ఇవన్నీ మీ అక్కతోనే పోయినాయ్." అని దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"ఉహూఁ—ఇవ్వాళేమీ వద్దు. గోకుల్ భగవాన్ అవతారం చాలించిన పర్వదినం. కనక ఇహ సాయంకాలమే—స్నానం, సంధ్యా ముగించుకుని, కాసిన్నిపాలూ, ఇంత గంగాజలం పుచ్చుకుంటాను. ఇలాగే వెళతాయి ఈ నాలుగు రోజులూ," అంటూ మళ్ళీ ఒకమాటు దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు. వెంటనే హుక్కాగొట్టం పెదవులకు అందించాడు.

చాటుగా తెరలోంచి మాటాడుతున్నామె తలుపు ఓరగా తెరిచింది, ఇంటోను వాకిట్లోనూ ఎవళ్ళూ లేకుండా గుమ్మంలోంచి తొంగిచూసి, కనిపెట్టింది. మెల్లిగా సావిట్లోకి వచ్చింది.

ఆమె వితంతు. ఇరవై నాలుగు ఇరవై అయిదు ఏళ్ళలోపు ప్రాయం; పాము కుసంలాంటి తెల్లటి సైనుబట్ట కట్టుకునుంది. చేతులకేం నగా నట్రా లేవు కాని, మెడలో మాత్రం మాంచి లావుపాటి బంగారపు హారం—ముప్పేటది—ఒకటి వేలాడుతూ వుంది

చిరునవ్వుతూ ఆమె అంది—"మాటాడితే మీరు సరసాలు పట్టిస్తారు, లోకు



లేమనుకుంటారో ఆనైనా ఇది లేదేమిటండీ? అదీగాక, నే నిహ తిరిగి వెళ్ళిపో వచ్చిర్లే?—" అంటూ, మరుక్షణంలోనే ముఖం విచారంగాపెట్టి, 'ఎవరికయితే నేను ఉపచారం చెయ్యాలని వచ్చానో, ఆమె కాస్త అందరి కళ్ళల్లోనూ కారం చల్లేసి, పోనే పోయిందాయిరి! ఇప్పుడిహ నేను పోయి, మూడు కాళ్ళ ముసల్ది ఆ అత్తమామల్ని కనిపెట్టి చూసుకోవద్దూ?—మీరే చెప్పండీ!" అన్నది.

హుంకా్క పిలుస్తూ పిలుస్తూవున్న గోలోక ఛటర్జీకి అంతలోనే గాంభీర్యం పుట్టుకొచ్చింది—

"నువు చెప్పిందీ నిజమే! నా సంసారం బాగుండాలని చెప్పి మరో ఇంటి వాళ్ళమ్మాయిని తెచ్చిపెట్టుకుని, ఎంతకాలం కూర్చోపెట్టుకోవడం? అన్నీ సవ్యంగా ఉంటే, ఇంటికైన ఆ మాలక్ష్మి ఈ వయస్సులో నన్నొదలేసి ఎందుకు పోతుందీ? మధుసూదన!....సరే, అయితే ఏదో ఓ మంచిరోజు చూసుకొని, వెళ్ళు! అక్కగారికి ఉపచారం చెయ్యడానికికని వచ్చావ్. సేవ చేశావ్, గ్రామానికంతటికీ ఒక దృష్టాంత మనిపించుకునేట్టుగా ఉపచారం చేశావ్, వెళ్ళిపోతున్నావ్!' అన్నాడు.

ఇందుకు జ్ఞానద మాటాడలేదు, ఊరుకుంది. ధోవతి అంచుతో ఛటర్జీ కళ్ళు తుడుచుకున్నాడు. మాటాడకుండా ఒక్కసారి హుంకా్క పీల్చుకుని, గాఢమయిన స్వరంతో యిలా అన్నాడు—"శ్రీ మహాలక్ష్మి! గౌరీదేవి! ఆమెకి రోజులు నిండిపోయినయ్ గుమ్మం దాటి పోయింది. ఇందుకు నాకేం దుఃఖం లేదు

"కాని, సంసారం గుట్టు కాస్తా చెడింది ఆడపిల్లలంతా పెద్ద వాళ్ళయారు, వాళ్ళ వాళ్ళ అత్తారిళ్ళ కెళ్ళారు. పిల్లా పాపలతో సంసారాలు చక్కదిద్దుకుంటున్నారు. వాళ్ళకోసము దుఃఖించను, కానైతే, కుర్రవాడున్నాడు—పిల్లవాడు—వాడు పాడై పోతాడే అని బెంగ !" అని చెప్పాడు.

ఆర్ద్రమైన కంఠస్వరంతో అంది జ్ఞానద—"అలాంటి దౌర్భాగ్యం ఎందుకు పడుతుందీ? మీకెందుకు తోస్తాయి ఈ ఊహలూ?"

మొహమెత్తి ఒక చిన్న వాడిన నవ్వు నవ్వాడు ఛటర్జీ. "ఏమీ అనకుండా ఉండటమే మంచిదనుకో, కాని, అదంతా ఎదట స్పష్టంగా కళ్ళకి కట్టినట్టు కనబడుతుంటే?—మధుసూదనా! మధుసూదనా!!—నువ్వే సత్యం, అంతా మిథ్య! సంసారంమీద మతి లేకుండా పోయింది. లోకంలో ప్రతి విషయమూ విషప్రాయమై పోయింది. ఇహ బతికిన నాలుగు రోజులూ ఉపవాసాలతోనూ, భగవన్నామ స్మరణతోనూ గడిపేస్తా! కాలం చల్లగా వెళ్ళబుచ్చుకుంటా! అందుకేం బెంగలేదే ఓపూట ఇన్ని మెతుకులు దొరికినా మంచిదే, దొరక్కపోయినా ఇబ్బందిలేదు—కాని....చివరికి నాకు పట్టుకున్న చీకు ఈ కుర్రవాణ్ణి గురించే! ఇదొక్కటే నన్ను పీడిస్తున్న దిగులు! నువ్వే శరణు, మధుసూదనా! నువ్వే దిక్కు! నువ్వే గతి!!" అన్నాడు గోలోక ఛటర్జీ, మనస్సు కరిగిపోయేట్టు.

జ్ఞానద కళ్ళు రెండూ అశ్రువులతో తడిసి పోయినయ్. జ్ఞానదకి ఛటర్జీ భార్య అక్క వరసవుతుంది. అయినా స్వంత చెల్లెలికి మల్లేనే చూసుకునేది. ఛటర్జీ భార్య




తీవ్రమయిన గడ్డు జబ్బులో ఉండగా, ఒక్కమాటు జ్ఞానదని చూడాలని వుందని చెప్పింది. ఈమాట తెలియగానే జ్ఞానద వచ్చి చూడకుండా ఉండలేకపోయింది.

ఆ అక్క ఇప్పటికి సరిగ్గా ఒకనెల కిందట పోయింది. పోతూ పోతూ అవిడ తన పది పన్నెండేళ్ళ కుర్రవాడిని జ్ఞానద చేతిలో అప్పగించి, "చెల్లీ!—వీడు నీ కొడుకుసుమా!" అని చెప్పిపోయింది.

కరుణ స్వరంతో జ్ఞానద ఇలా అంది—"కాని ఏమైనా, నేనిక్కడ చాలాకాలం ఉండి పోవటానికి వీల్లేదండీ. లోకం ఏమనుకుంటుందో మీరే చెప్పండి!—"

కళ్ళు రెండూ తెరిచి పెద్దవి చేశాడు, ఛటర్జీ. "లోకులు విన్న గురించి అవ దమే! అని, ఈ ఊళ్లో బతకడమే?" అన్నాడు. ఇంతకు మించి ఆయన నోటివెంబడి మరోమాట యేమీ రాలే. రావలసిన అవసరమూలేదు.

ఈ సంగతి జ్ఞానదకు తెలుసు. అంచేత మాటాడ కూర్చుంది.

అప్పుడు ఛటర్జీ ఇలా అందుకున్నాడు!—"నా మాటకు ఎదురు చెప్పిన ఎవరయినా సరే మరెక్కడికయినా పోయి బతకాల్సిందే గాని, ఈ ఊళ్ళో మట్టుకి వీలుయింత లేదు. ఇదో పెద్ద విషయమూ కాదు, దాన్నిగురించి ఆలోచనా పనిలేదు. కాని.... నా ఆలోచనంతా అదుగో, ఆ కుర్రవాణ్ని గురించే....మీ అక్క చచ్చిపోయేముందు కుర్రవాణ్ని నీ చేతిలో అప్పగింత పెట్టి పోయింది కాని, నా చేతిలో పెట్టలేదుగా!— "చెల్లీ!—నువ్వంటే వీడికి ఎక్కడలేని ప్రేమాను" అని పిల్లాణ్ని నీకు అప్ప గించేటప్పుడు చెప్పింది, జ్ఞాపకముందా?—"

జల జల మంటూ జ్ఞానదకి కన్నీళ్లు ప్రవహించాయి. అతి కష్టంమీద అవుకో

పోయింది: "నాకన్నీ తెలుసు. ఛటర్జీ దాదా!—కానయితే నా అత్త మామలు ముసిలి పళ్ళు!—ఇంకా బతికే ఉన్నారుగా? నేను తప్ప వాళ్ళకి మరి గతిలేదు కదండీ?" అన్నది.

పరియాచకంగా ఛటర్జీ ఇలా అన్నాడు—మరే. గతిలేదు పాపం. నువ్వే దిక్కు. కాబోలు! నీ మొగుడు బతికుంటే అదో దారిగా వుండేది. కాని, నువ్వతణ్ని కంటితో వయినా చూపిన పాపాన పోలేదుగా! పన్నెండేళ్ళు నిండకముందే ముండా మోస్తివి....!" అన్నాడు

"మోస్తే మోశాలెండి! ఎవరిరాత ఎవరు తప్పించగలరు? అత్తమామలు బతికున్నన్నాళ్ళూ నేను వారికి ఉపచారం చెయ్యాల్సిందే! తప్పదు." అన్నది జ్ఞానద.

క్షణంసేపు నిశ్శబ్దంగా ఉన్నాడాయన. ఒక్కసారి గంభీరంగా నిట్టూర్చి. ఇలా అన్నాడు—"అయితే సరే వెళ్లు. ఎవరొద్దన్నారూ? నా కొంప నట్టేటముంచి వెళ్ళిపో! కాని, ఒక్క సంగతిమాత్రం బాగా ఆలోచించి చూడు, పిల్లా!—"

కోపగించింది జ్ఞానద. "అదుగో, మళ్లీ పిల్లా పిల్లా అని పిలుస్తారే! పేరుపెట్టి పిలిస్తే కాదూ? లోకులు ఎకసెకాలు పట్టిస్తారని ఎన్నిమాట్లు చెప్పాను, మీకు?" అన్నది.

"పట్టిస్తే పట్టించనిద్దూ! చిన్నీ! ఎక సెక్కాలకూ వేళాకోళాలకూ వరస కాక పోతేగా?—"

పక్కున నవ్వేసింది, జ్ఞానద. ఆ వెంటనే గాంభీర్యం తెచ్చి పెట్టుకుని, ఇలా అంది! "ఉహూఁ—వద్దు, అలా అనొద్దు. మొదట్నించీ ఏ పేరుపెట్టి నన్ను పిలుస్తున్నారో, ఇప్పుడూ అలాగే పిలవండి!" అన్నది.

"సరే సరే, అలాగేలే! అలాగే పిలుస్తా" నన్నాడు గోలోక ఛటర్జీ. చూస్తూ చూస్తూండగానే ఆయన ముఖం విచారంతో నిండిపోయింది. నిట్టూర్పు ఉబికి వస్తూంది పైకి. దాన్ని మెల్లిగా అణిచేసుకుని, తనలో తనే అనుకున్నట్టుగా ఇలా ప్రారంభించాడు—

"రాత్రీ పగలూ నా గుండెల్లో ఏదో చెప్పలేని మంట భగ్గుమని మండిపోతూ వుంటే, నాకింకా నవ్వులూ వేళాకోళాలున్నా? అయినప్పటికీ....మధ్య మధ్య.... పోనీ, అదంతా ఎందుకులే! చెప్పకుండా ఉండటమే మేలు

"పుట్టి బుద్దెరిగి ఎవళ్ళకూ నేను అసంతుష్టి కలిగించి ఎరగను. ఇహ ఇప్పుడు కలిగిస్తానా? సంపదలు విషం, సంసారం విషం. మధుసూదనా!—నీ శ్రీచరణ సన్నిధికి నన్నెప్పుడు చేర్చుకుంటావో గదా!"

కన్నీళ్ళు జల జల రాలుస్తూ, జ్ఞానద మాటాడక చూస్తూ నిలబడింది.

గోలోక ఛటర్జీ ఇంకా ఇలా ప్రారంభించాడు :—

"అసలే, ఉన్నమంటతో యమబాధ పడిపోతూవుంటే, మంటమీద మళ్ళీ మంట! పైగా రాత్రనక పగలనక పెళ్ళి సంబంధాలు తీసుకొచ్చి పెద్ద మనుషులు చేసే బలవంతాలు! నేనేమీ దాచలేనన్న సంగతి వాళ్ళకంతా తెలుసు.

"అయ్యా!—మీరంటే నాకెంతో గౌరవం. కులీనుల గౌరవ మర్యాదలు కులీనులే కాపాడాలన్న విషయం నాకు బాగా తెలుసు. ప్రస్తుతం దుఃఖంవల్లా తాపంవల్లా ఆసమయంలో నాకీ తలవెంట్రుకలు అకాలపు నెరుపు నెరిసిన మాటా నిజమే. అయితే, నెరిసిన తల ఎల్లాగూ నెరిసిందే కదా!—ఈ నెరిసిన తలతో మళ్ళీ పెళ్ళి చేసుకోవటం, మళ్ళీ ఇంకో బంధం మెడకి తగిలించుకోవటం, ఏమన్నా బాగుంటుందా?" అని చెప్పాను ఏమన్నా బాగుంటుందా, నువ్వే చెప్పు, చిన్నీ!—"

శుష్కంగా నవ్వింది జ్ఞానద. "బాగుండక పోవడమేం, భలేగావుంటుంది—చేసుసుకోండి, రెండో పెళ్ళి ..." అన్నది.

అందుకు ఛటర్జీ ఇలా అన్నాడు: "నీకు పిచ్చా, వెర్రా? మళ్ళీ పెళ్ళా నాకు? లక్ష్మిలాగా నువ్వు నా ఇంటో ఉండంగా నే? నువ్వెన్నయినా చెప్పూ, దిక్కులేని ఈ అక్క కొడుకుని నువ్వెలాగూ వదిలేసి పోలేవు. పోయేటప్పుడు నీ చేతిలో అప్పగించి మరీపోయింది, ఆమె మాట ఎల్లా అయినా నిలబెట్టాల్సిన బాధ్యత నీమీదే వుందీ....సరే, నాకు మళ్ళీ పె ...... వాకట్లో ఎవరూ?"

నవుకరు లోపలికి మెడచాచి, "మణీదార్‌గా రొచ్చారండీ" అని కబురు చెప్పాడు.

ముఖం వికారంగా అదోలా పెట్టాడు ఛటర్జీ: "అబ్బ! వీళ్ళతో పడలేను బాబూ!—నావల్ల కాదు. వ్యవహారాలూ, వ్యాపారాలున్నూ! ఎప్పుడు చూసినా పని, పని, పని! నాసంగతి వీళ్ళకేం తెలుస్తుంది? ఓమూల నాకివన్నీ విషప్రాయమై పోయినాయయ్యే. ఈ సంగతి వీళ్ళకెలా చెప్పటం? ఎవరు తెలుసుకో గలరు? మధుసూదనా!—నన్నీ నరక కూపంలోంచి ఎప్పుడు దాటిస్తావో కదా!—ఊఁ—వింటునే ఉన్నావట్రా, పో! రమ్మని చెప్పూ!—"

నవుకరు వెళ్ళి పోయాడు. జ్ఞానద కూడా లోపలికి వెళ్ళింది. గుమ్మం చాటుగా వింటుని, నెమ్మదయిన స్వరంతో "అటయితే ఇహ మీ కివాళేం పుచ్చుకోరన్న మాటేనా?" అనడిగింది.

తల ఆడించాడు, అయన, "ఉహూఁ—పుచ్చుకోను. ఇవాళ గోకుల భగవా

మడు అవతారం చాలించిన పర్వదినం. చిన్నీ!—ఇంకా మా వంటి వాళ్ళం—ఆ కాలపు నాటివాళ్ళం కొందరమైనా ఇలాటి నియమాలూ ఆచారాలూ పాటించుకుంటూ వస్తూండబట్టే. ఆకాశంలో సూర్య చంద్రులు ఉదయిస్తున్నారు. సముద్రంలో పోటూ, పోటూ కనిపిస్తున్నాయి. మధుసూదనా! ఇదంతా నీ ఇచ్ఛకదా!—'' అన్నాడు.

ఇందుకు జ్ఞానద ఇలా చెప్పింది—"అదే లెండి. పోనీ. కాసిన్ని పాలూ కొంచెం గంగా పుచ్చుకుంటే దోషంలేదు. పాలు కాచి సిద్ధంచేసి. మీకోసం కని పెట్టుకుంటాను. మీరు త్వరగా రండి!'' అంటూ చెప్పేసి తలుపు బిగించింది.

ఎదటి గుమ్మంలోంచి నవుకరూ, వెనకాలే ఒక పెద్దమనిషీ లోపలికొచ్చారు.

"రావయ్యా మణీదార్! కూచో. ఇల్లా కూచో! నీ కోసమని కళ్ళు కాయలు కాసి పోయినాయని నమ్మూ! కాస్త కబురయినా పెట్టలేక పోయ్యావూ? ఛోలూ!—గళాల్ని లోపలికిపోయి ఆ హుక్కాలో గుండా గట్టావేసి పట్టుకొచ్చి ఇతడి కియ్!—'' అన్నారు.

విష్ణు మణీదార్ గోలోక ఛటర్జీకి సాష్టాంగ నమస్కారంచేసి. ఆయన పాదధూళి తన్నున ధరించి. తివాసీమీద ఒక మూలని కూర్చున్నాడు. ఒక్కసారి నిట్టూర్చి. ఆ తరవాత ఇలా చెప్పాడు:

"ఊపిరి తీసుకునేందుకయినా తీరిక లేదే. ఇంకా కబురూ గట్రా పెట్టమంటా రేమిటి పెదబాబూ!—అయిదు వందలొకచోట—మూడు వందలొకచోట—మొత్తం ఈ ఎనిమిది వందలూ ఓడ ఎక్కించి మరీ వచ్చా నన్నమాట. మీ దర్శనానికి: అబ్బ! ఎంత హంగామా! ఎంతహంగామా!—ఏమని చెప్పేది?—''

గోలోక ఛటర్జీకి ఒక రహస్య వ్యాపారముంది—గొర్రెల్నీ మేకల్నీ దక్షిణాప్రికాకు ఎగుమతి చెయ్యడం. ఆ వ్యాపారంలో ఈ విష్ణు మణీదార్ వాటాదారు. వాళ్ళిద్దరి మధ్యనీ ఒక కంట్రాక్టు రాసుకోవడం జరిగింది: మూడు నెలల్లోగా మూడు వేల జీవాల్ని పంపాలని షరతు.

ఇప్పుడు మణీదారు అయిదూ. మూడూ వెరసి ఎనిమిది వందలు మాత్రమే ఓడ ఎక్కించానని చెప్పినవార్త ఛటర్జీకి ఏమంత సంతోషం కలిగించలేదు. సంతుష్టి లేక పోయింది. అంచేత అతడు పెదివివిరిచి ఇలా అన్నాడు—''అన్నీ కలిపి మొత్తం ఎనిమిది వందలేనా?—మరయితే—కంట్రాక్టు మూడువేలకి గదా. అబ్బో!—ఇంకా చాలా బాకీ వుంటుందే?'' అన్నాడు.

కొంచెం కింద పడినట్టు కనిపించాడు మణీదార్. "మేకలూ. గొర్రెలూ ఇప్పు



డింకా దొరుకుతున్నాయనా స్వామీ! మీ వుద్దేశం? ఎక్కడ చూసినా ఎగుమతి! అన్నీ ఎగుమతి అయిపోవటమే! ఈ ఎనిమిది వందలూ జత పర్చేటప్పటికీ నాకు తల ప్రాణం తోకకి వచ్చింది! అయినా, బెంగలేదు లెండి. "వారం పదిరోజుల్లో మరో అయిదారు వందల జీవాలను రెయిల్లో పంపిస్తున్నాను" అని చెప్పి రాపూర్‌వించి హరీంద్రుడు ఉత్తరం వేశాడు. మన పనల్లా అలా రైల్లోంచి దించటం, ఓడ కెక్కించటం! అంతే, ఇంతకూ, ఇంకా మూడు నెలలు టయిముంది కదా? దేవుడి దయ వుంది, చల్లటి చూపు చూశాడంటే, అన్నీ సప్లయ్ అయిపోతయి లెండి! అంతా సవ్యంగానే జరిగిపోతుంది!" అన్నాడు.

మణీదారు ఇలా చెప్పడంతో ఛటర్జీ మనస్సు కాస్తంత కుదుటపడింది ఊరట చెందాడు—"నిన్ను చూసుకునే నేను ధైర్యపడుతున్నాను, మణీదార్! నీ మీద నేనెంతో ఆశపెట్టుకున్నాను. ఇప్పుడు నేను ఇంచుమించుగా ఒకవిధమైన గృహస్థ సన్యాసి నన్నమాట, మీ వదినగారు పోయినప్పట్నించీ డబ్బూ దస్కం, సంపద సంసారం ఇవన్నీ నాకు విషప్రాయమై పోయినై. కేవలం ఈ కుర్రవాడికోసం గాని ...అయితే, మణీదారూ! రూపాయికి రూపాయి లాభం కలిసొచ్చేటట్టుందా, లేదా? అనడిగాడు.

తల ఊపి మణీదార్ యిలా చెప్పాడు—"రాకపోవడమేమిటి? తప్పకుండా

వస్తుంది, నిశ్చయంగా వస్తుంది. కానైతే, ఈ మాటు అహమ్మద్‌సాహెబ్ కొట్టేస్తాడు డబ్బు! ఏడాదులకు కంట్రాక్టు సంపాయించాడు. ఇంకా ఎక్కువ వచ్చేదే—కాని డబ్బు లేక పోయిందీ, సాహసించలేక పోయాడు."

కన్ను గిరిపాడు ఛటర్జీ, "అయితే చాలా కావాలా ఏమిటి?" అనడిగాడు

"అవును స్వామీ!—లేకపోతే నేను వొదులుకుంటానులెండి!" అన్నాడు మణిదార్.

ముక్కుమీద వేలేసుకున్నాడు ఛటర్జీ. "రామ, రామా! దుర్గా దుర్గా!—పొద్దున్నే అలాంటి మాట అనొచ్చా మణిదార్? వాడు జాతికి మ్లేచ్ఛుడు ధర్మం అధర్మం అనే జ్ఞానం కొంచెమయినా లేనివాడు—అయితే, పదివేలు లాభం కొట్టేసే టట్టున్నాడు! ఏం?—"

"ఇంకా ఎక్కువేనండి, స్వామీ! ఇంకా ఎక్కువే!"

"దాని ధర్మమా అని, యుద్ధం మరికొన్నాళ్ళు సాగేటట్టయితే, ఫకీర్లు పాదుషాలుగా మారతారులా కనిపిస్తూంది, కాలమహిమ! అవునా?"

"నిస్సందేహంగా అంతేనండి! ఆయితే యిది డబ్బుతో చెలగాటం ఒఖమాటుగా పోగు చెయ్యాలంటే తాతలు దిగొస్తారు."

"తాతలు దిగిరావలసినంత పనేముంది యిందులో? కంట్రాక్టు చూపిస్తాం, నోటు రాసి అప్పు తీసుకుంటాం!"

మణిదార్ తల వూపుతూ యిలా అన్నాడు:—"అవున్లెండి ఆ మాటా నిజమే. కాని డబ్బు దొరికితేగా? నాతో చెప్పాడు లెండి....." అన్నాడు.

ఛటర్జీకి ఉత్సాహం కలిగింది. "సరి, సరి, నీతో చెప్పాడా యేం? వడ్డీ ఎంతిస్తానన్నాడు?"

"ఎంతలేదన్నా....రూపాయికి అణా.. అయితే...."

"అయితే" అని చెప్పబోతూవుంటే ఆ మాటకు ఛటర్జీ కోపం తెచ్చుకున్నాడు. "అణా!—ఒఖణా? రూపాయికి రూపాయి లాభం కొట్టేస్తాడే, వడ్డీ ఇవ్వొచ్చేటప్పటికి ఒఖ్ఖ అణానా?—అర్ధరూపాయి లేదా పదణాల ప్రాంతాలలో సమ్మతమయితే ఒక మాటు కనిపించమని చెప్పు!" అన్నాడు.

ఆశ్చర్యపడ్డాడు మణీదార్. "సాయిబుకి మీరే పెట్టుబడి పెడతారా ఏం?—కాని ఈ సంగతి లోకులు వింటే...."

గోలోక ఛటర్జీ ఒక్కక్షణంలో తనను తను సర్దుకున్నాడు. చిరనవ్వుతూ, శుష్కమైన హాస్యంతో యిలా అన్నాడు! "రాధామాధవ!—నీకేమన్నా పిచ్చా



యేమయ్యా మణీదార్! చేతనయితే అడ్డుపడతాను, దానికేం? కాని, "లోకులువింటే" అని అన్నావే? ఈ విషయం నీకూ నాకూ తప్ప బ్రహ్మరుద్రదికూడా తెలియకూడదు. కానైతే ఒక్కమాట: అవసరమని వస్తే, అతడికి మదుపు పెట్టడంలో వెనకడుగు వెయ్యడమనేది లేదు. అప్పుతీసుకున్న తరవాత—ఈ డబ్బు పట్టుకెళ్ళి అతడు తండ్రి శ్రాద్ధమే పెట్టుకోనీ, భోగం ఆటలే ఆడించుకోనీ—ఆ గొడవంతా ఈ పెద్దమనుషుల కెందుకూ? దాంతో ఈ లోకులకేం పనీ?"

మణీదార్ అవునంటాడో లేదోనని ఒక్కక్షణకాలం ఆగి అతడి మొహంకేసి చూసి, తనే మళ్ళీ అందుకున్నాడు—

"అదికాదు మణీదార్! ఎదో మాటవరసకి చెప్పాను. లోకులెవరైనా సరే, ఇం లేపి అరాలు తియ్యటానికి మొదలెడితే ఏం నెగ్గరు. తెలుసుకో!—ఆ పెద్దమనుషులకి క్షణం కూడా జరగదు.

"అయితే—నువు నన్ను చాలాకాలంనించీ ఎరుగుదువు కదా? ఉత్తమమైన బ్రాహ్మణ కులంలో పుట్టినవాణ్ణి. ధర్మమార్గంలో ఉండి బిచ్చమెత్తుకున్నా అది మంచిదే నాకు. కాని, అధర్మంగా చిల్లిగవ్వయినా ఎన్నడూ కూడా అంటను. ఇదే నేను జీవితంలో పెట్టుకున్న ధర్మపథం.

కేవలం ఆ శ్రీ మన్నారాయణమూర్తి వారి పాదారవిందాలలో ఎంతోకాలంనించీ నా బుద్ధిని కట్టేసి, స్థిరం చేసుకున్నాను. కనకనే, ఇప్పుడు అయిమూళ్ళకు సభాపతినైనానంటే, ఇదే కారణం. ఒక్క నోటిమాటతో ఈనాడు బ్రాహ్మణ్ణి శూద్రుడుగానూ, శూద్రుణ్ణి బ్రాహ్మడుగానూ చేసెయ్యగలశక్తీ, సామర్థ్యం నా దగ్గరున్నాయి. తెలిసిందా?—

"మధుసూధన! నువ్వే గతి! నువ్వే దిక్కు! నువ్వే శరణు!—

"వెనకటికి ఒకసారి, నాకు ఎక్కువగా జబ్బు చేసింది చూడండి! అప్పుడు డాక్టర్ జయగోపాల్ వచ్చాడు. సోడా పుచ్చుకోక తప్పదని పట్టుబట్టాడు. అందుకు నేనే మన్నానో తెలుసా?—

"డాక్టర్‌జీ!—పుట్టుకెప్పుడుందో చావూ అప్పుడే వుంది, అదో గొప్ప విషయమేంకాదూ, కాని ఆ మాటమాత్రం ఇంకోమారెప్పుడూ ఈ గోలోక ఛటర్జీ చెవిని పడనియ్య బోకండి!" అని చెప్పా. హ్!—కేనారామ ఛటర్జీగారి పుత్రుణ్ణి. హరరామ్ ఛటర్జీగారి దౌహిత్రుణ్ణి నేను—భాండార్ హటీ మహారాజులుంగారు కూడా పాదోదకం కోసమని మనదగ్గరికి పల్లకీ బోయీలను పంపిస్తారే! తెలీదూ?" అన్నాడు.

మరోసారి మణీదార్ నమస్కరించి, లేచి నిలబడ్డాడు—"ఎవరు కాదన గలరండీ స్వామీ, ఆమాటా? ఊరూ, వాడా, లోకమంతా తెలిసిన సంగతే అది!" అన్నాడు.

ఇందుకు ఛటర్జీ ఒక్కమాటు పెద్దగా నిట్టూర్చి, "మధుసూదన! నీవే దిక్కు!!" అన్నాడు.

మణీదారు ఇహ వెళ్ళి పోదామనే యత్నంలో వుండగా అతణ్ణి వెనక్కి పిలిచాడు ఛటర్జీ—"ఇదుగో, చూడు. ఇంకోసంగతి! హరీంద్రుడి దగ్గర్నించి రైలు ప్యాకెట్ వస్తే, రాగానే నాకోసారి చూపించేం?" అన్నాడు.




తలఊపి. మణీదారు "చిత్తం!" అన్నాడు.

'అటయితే, ఎనిమిది వందలూ, మరో అయిదు వందలున్నూ పోతే, ఇహ పదిహేడు వందలు కావలసుంటుందన్నమాట? ఇంకా మూణ్నెల్లు వ్యవధివుందిగా? పోగడకపోతాయా?—ఏమంటావ్, నీ వుద్దేశం?'' అనడిగాడు.

''ఆఁ—? పోగడకపోవట మేమిటి లెండీ?" అన్నాడు మణీదార్.

ఈ మాటవిని ఛటర్జీ మళ్లీ ఇల్లా అన్నాడు—"అందుకోసమనే మణీదార్!—నీ కప్పుడే చెప్పా—ఒకేసారి ఐదువేలకి కాంట్రాక్టు రాయించుకు రావయ్యా! అని. కాని. నీకాపాటి ధైర్యం, చొరవా, సాహసం లేకపోయె!''

మణీదార్ అన్నాడు! "చిత్తం. అలా అనేశారు గానీ, తీరా అప్పు గొర్రెలూ మేకలూ దొరక్కపోతే—,''

వాదం పెట్టుకోలేదు, ఛటర్జీ.

''అవునులే. అదే మంచిదిలే అదే మంచిది!'' అన్నాడు.

"ధర్మ మార్గంలో రూపాయికి సగమే కానీ, పోనీ ఇంకా అందులో సగమే, అంటే కాల్వంతు దొరికినా అదే మంచిది. కాని, అధర్మ మార్గంలో రూపాయికి మొహిరీ చొప్పున కిట్టుబాటయినా అది మంచిది కాదు. తెలిసిందా. మణీదార్?—మధుసూదన! నీవేగతి!!''

మరి మాటాడకుండా వెళ్ళిపోయాడు మణీదార్.

భగవద్భక్తుడూ గృహస్థసన్యాసీ అయిన గోలోక ఛటర్జీ మహాశయుడు ఏదో తీవ్రమైన ఆలోచనలో పడి, మెల్లిగా ఒక్క హుంక్కా దమ్ములాగాడు. ఇహ లోక

విషయాలన్నీ బహుశా, ఆయనకి నిజంగానే విషప్రాయంగా తోచడానికి ప్రారంభమై ఉండాలి.

అయితే—అటువంటి సమయంలో లోపలి తలుపు తెరుచుకుని, దాసీది ముఖం ఇవతలికి పెట్టింది—"ఒక్కమాటు చిన్నమ్మగారు లోపలికి రమ్మంటున్నారండి;" అని చెప్పింది.

చకితుడయ్యాడు ఛటర్జీ!

"ఎందుకో చెబుదూ, సదూ!" అన్నాడు.

"ఎందుకూ లేదండి. పాలు కాగబెట్టు కున్నారండి. మీకోసమని సిద్ధం చేసుకుని కనిపెట్టుకూర్చున్నారండి!" అని చెప్పింది

హుంకా తీశాడు ఛటర్జీ. చిరునవ్వు నవ్వుతూ, "నేను మీ చిన్నమ్మగారితో వేగలేకుండా వున్నానే. సదూ!—ఇవాళ పర్వదినం కదా, ఒక్కపూట ఉపవాస ముందామనుకుంటే, పడనిచ్చేట్టులే దావిడగారు."

అని అంటూ లేచి వెంచున్నాడు. వెళుతూ వెళుతూ ఒక్క నిట్టూర్పువిడిచి, ఇలా అనుకున్నాడు: "సంసారంలో ఉండిన్నీ, పరలోకానికి ఉపకరించే మంచి పనులేవయినా రెండో మూడో చేసుకు పోదామనుకుంటే—దాని కెన్నయినా విఘ్నాలే! అన్నీ ఆటంకాలే! అన్నీ అవరోధాలే!—మధుసూదన! హరిహరీ!!"

# 4

సంధ్యకు కొన్నాళ్ళుగా ఆరోగ్యం తిన్నగా ఉండటం లేదు. తరచూ జ్వరం. తండ్రి చికిత్సలో ఉన్నదామె. అందువల్ల క్రమ క్రమంగా నీరస స్థితిలోకే పోయింది గాని, మెరుగేం కనిపించలే. "డాక్టర్ విపిన్‌బాబుని పిలిపిస్తా సుమా" అంటూ తల్లి బెదిరిస్తూ వుంటుంది. కూతురికా ఎంతమాత్రం ఇష్టంలేదు. అందు చేత తల్లీ కూతుళ్ళ మధ్యని ప్రతిరోజూ చిటపొటి కలహాలు పుట్టుకొస్తూనే వుంటు న్నాయి

ఇవాళ సాయంకాలం సంధ్య ఒక పీటకు ఆనుకూర్చుంది. తల్లి ఇచ్చిన సగ్గు జావ కళ్ళు మూసుకుని గుటుక్కున తాగేసి, దోకు రాకుండా గబ గబా ఒక తమల పాకు నోట్లో కుక్కుకుంది.

సగ్గు జావంటే సంధ్యకు పరమ అసహ్యం. నోట పెట్టలేదు. అయినా, తల్లి 'ఇంత కొద్దిగానే తాగావేమే?' అనడిగితే బదులు చెప్పలేదు. మాటమీద మాట రావటం సంధ్య కిష్టంలేదు. కనక మాటాడ కూరుకోవటంవల్ల జగడాని కవకాశం

లేకపోయింది. అయితే ఏదో ఒహ మూలనించి తల్లి తనని కనిపెట్టి చూస్తూనే వుంటుందని ఆమెకు రూఢిగా తెలుసు.

ఇంతకు ముందు సంధ్య ఏదో పుస్తకం చదువుతున్నట్టుంది. ఆ తెరిచిన పుస్తకం ఒళ్లో బోర్లాగా పడివుంది. జావ నోట్లో పోసుకున్నాక ఆ పుస్తకం మళ్ళీ తీసుకు చదవబోతూంది. అంతలో ముంగిలివాకిట్లో నించి "పిన్నీ! ఎక్కడున్నావమ్మా?" అని పిలుపు వినబడింది.

పిలుస్తూ లోపలికి వచ్చాడు అరుణ్. అతడివేషం అదీ చూస్తే- ఇప్పుడే ఎక్కణ్నుంచో వస్తున్నట్టు కనబడుతూంది.

పాలిపోయివున్న సంధ్య ముఖంమీద క్షణకాలం ఒక ఎర్ర డాలు కనిపించి మాయమై పోయింది. ఆమె కళ్లెత్తి నవ్వు మొహంతో ఇలా పలకరించింది—

"కలకత్తానించి వస్తున్నావ్వలాగా వుందే? ఇప్పుడేనా రావటం? అరుణా!"

దగ్గిరకొచ్చి ఆశ్చర్యపడ్డాడు అరుణ్. "ఆ—అవునుగాని ఇంత చిక్కిపోయ్యావేం నువ్వు? మళ్ళీ జ్వరంగానే కాస్తూందా?" అనడిగాడు.

"అలాంటిదే ఏదో....అయితే నీ ముఖంకూడా వాడినట్టే కనిపిస్తూందే?" అన్నది.

నవ్వాడు అరుణ్.

"ముఖం చేసుకున్న అపరాధ మేమిటుందీ? పొద్దుట్నించీ ఇప్పటిదాకా స్నానం లేదు. తిండిలేదు. భలే మాదిరీలు పురమాయించావులే! వాటికోసం తెగ వెతికీ వెతికీ ఎంత హైరాన అయిందో! తిరిగీ తిరిగీ కాళ్ళు పడిపోయినయ్. ఇవిగో ఇందు!" అంటూ జేబులోంచి కాగితపు చుట్టఒకటి తీసి సంధ్య చేతిలో పెట్టాడు

"పిన్నేదీ? బాబయ్య ప్రాక్టీసుకని బయటికి వెళ్లాడు కాబోలునే! పోయిన శనివారంనాడు ఎంత కొట్టుకున్నా ఇంటికి రాలేకపోయా. అందుకోసమని పట్రావడం ఆలస్య మైపోయింది. వీటితో ఏమి అల్లుతావ్? పిట్టబొమ్మలా? దేవుళ్ళ బొమ్మలా? లేకపోతే గులాబి...." అనడిగాడు.

"అవన్నీ ఆలోచించటానికింకా చాలా వ్యవధి ఉందిలే. ఇవి తీసుకురావటానికే వారంరోజులు ఆలస్యమయింది కదా, వాటిని కట్టటానికీ పెట్టుకోటానికీ కొన్ని గంటలపాటు ఆలస్యం సహించలేవూ? ఇంటి కెళ్ళకుండా సరాసరి స్టేషన్‌నించి ఇక్కడికే వచ్చేశావే?" అనంది.

నవ్వుతూ అన్నాడు అరుణ్—"స్నానం, భోజనం సంగతే కద నువ్వనేదీ అవన్నీ ఇంక "సంధ్య" అయిం తరవాతనే. సరేకాని, అస్తస్తమానం నీకీ

అనారోగ్య మేమిటీ?—ఎందుకని ఈ అస్వస్థత. చెప్పూ" అన్నాడు.

అతడు అన్నటువంటి "సంధ్య" అనే మాటలో గల వ్యంగ్యం చెవికి సోకగానే సంధ్య ముఖం కాస్త ఎర్రబడింది. కాని, అదేమీ లక్ష్యం చెయ్యనట్టే నటించింది. కోపంగా ఇలా అంది—"దానికి (సంధ్యా సమయం కావటానికి) మాత్రం ఇహ ఆలస్య మేముంటుంది అరుణదా! పద, వృధాగా ఆలస్యం చెయ్యక!" అన్నది

మళ్ళీ నవ్వుతూ ఏదో సమాధానం చెప్పబోయాడు అరుణ్. కాని అంతలోనే జగద్ధాత్రి అక్కడికి వచ్చింది. ఆమె ముఖం చూసేటప్పటికి అతనికి నోట్లోమాట నోట్లోనే ఆగిపోయింది.

జగద్ధాత్రి మొహం కందగడ్డలా చేసుకుని కోపంతో అక్కడికి వచ్చింది ఇంట్లోంచి వచ్చి, కూతుర్ని చూసి ఇలా అంది—"ఆ తమలపాకు ఇంకా నములుతూనే కూచున్నావా? అది నోట్లోంచి ఉమ్మేసి, ఆ తరవాత నీ యిష్టం వచ్చినట్టూ సరసా లాడుకోవచ్చుగా!" అని అనేసి, ఆ యిద్దరిలో ఎవరివేపూ చూడకుండానే గబ గబా లోపలికి వెళ్ళిపోయిందామె.

హఠాత్తుగా ఏదో గొడవ జరిగినట్టుగా వుంది. అరుణ్ పిడుగు పడ్డటయి, అలాగే నిశ్చేష్టుడై నిలబడి పోయాడు. సంధ్య ముఖం వెల వెల బోయింది. సంధ్య వేళ ఆకాశంలో కాంతి అంతా మటుమాయమైనట్టుగా కనిపించింది.

కాస్సేపు అలానేవుంది, సంధ్య నోట్లో తమలపాకుని తుబుక్కున ఉమ్మేసి,—"మళ్ళీ నువ్వీ ఇంటో అడుగు పెడతా వెందుకు అరుణదా! సర్వ నాశనం చేస్తేగాని మమ్మల్ని వొదిలిపెట్ట దలుచుకోలేవా?" అనడిగింది, తీవంగా

అరుణ్ మొదట్లో ఒక్కమాటయినా మాటాడలేకపోయాడు, తరవాత తరవాత మెల్లిగా కోలుకుని ఇలా అడిగాడు!—"నేను నిజంగా అంటరానివాణ్ణా? నువ్వు నోట్లో తమలపాకు ఉమ్మేశావ్ కదా?" అన్నాడు.

హఠాత్తుగా పెక్కెక్కి యేడ్చేసింది సంధ్య. "నీకు జాతిలేదు మతంలేదు. నన్నెందుకని ముట్టుకున్నావ్? అనడిగింది.

"నాకు జాతీ, మతం లేవూ?"

"ఉహుం—లేవు. లేనేలేవు. నువ్వు సీమకు వెళ్లావ్, మ్లేచ్ఛుడివై పొయ్యావ్. ఆనాడు మా అమ్మ నీకు మంచినీళ్ళు ఇత్తడి చెంబుతో ఇచ్చింది, గుర్తులేదూ?"

దీర్ఘ శ్వాస వదిలాడు అరుణ్, "ఉహుం—నాకు గుర్తులేదులే, కాని....ఇప్పుడు నీ దగ్గిర నేను అంటరాని వాణ్ణి, మ్లేచ్ఛుణ్ణి!"—అన్నాడు.

కళ్ళు తుడుచుకుని అంది సంధ్య—"నాకు మాత్రమే కాదు, అందరికిన్నీ.



ఇవాళనుంచే కాదు. ఎవరిమాటా చెవిని పెట్టకుండా ఎప్పుడయితే నువ్వు సీమ కెళ్లావో ఆక్షణం నించిన్నీ...." అన్నది.

అందుకు అరుణ్—"కాని....నా మనస్సులో మాత్రం నేనే మనుకున్నా వంటే ......"

అన్నాడే కాని, తన మనస్సులో ఏమనుకున్నాడో మాత్రం బయటికి చెప్పలేక పోయాడు. క్షణంసేపు ఆగి, ఇలా అన్నాడు :

"ఇహ బహుశా, నేను మీ ఇంటికి రానులే. కాని, సంధ్యా! నువ్వుమాత్రం నేనంటే రోతపడకు. రోత కలిగించే పనులేమీ నేనెన్నడూ చేసి ఉండలే."

"ఇలా నాతో జగడం పెట్టుకు నించోడమేనా నీకు పని, అరుణవా!—ఆకలీ, దప్పీ యేమీ లేవూ?" అన్నది సంధ్య.

"ఉహుం—జగడ మాడటమే పనికాదు, నాకు. నన్నసహ్యించుకునే వాళ్ళ తోటి ఎదటపడి ముఖాముఖీ పోట్లాడేటంత పీచుణ్ని కాదు నేను." అనంటూ, మెల్లిగా వాకిట్లోకి వెళ్ళిపోయాడు, అరుణ్. అతడు పోయిన దిక్కుకే రెప్ప వాల్చకుండా చూస్తు, పాషాణ ప్రతిమలాగా అలాగే కూర్చుండిపోయింది, సంధ్య.

ఎదటికి వచ్చింది తల్లి. ప్రసన్నమైన ముఖంతో ఇలా అంది—"పోనీలే, మళ్లీ ఇహ ఇక్కడ అడుగు పెట్టడనుకుంటాను."

చకితురాలైన సంధ్య "రాడు!" అన్నది.

"వృథాగా అతగాణ్ని ముట్టుకున్నావ్. బట్టలు వొదిలెయ్!" అన్నది తల్లి

తల్లి మొహం చూసి ఇలా అంది సంధ్య—' బట్టలుకూడా వొదిలెయ్యాల్సిందే?"

సంధ్య ముఖచ్ఛాయ వాడిపోయివుంది. కాని, ఆదృశ్యం తల్లికంట పడలేదు. ఆవిడ ఆశ్చర్యపడుతూ ఇలా అంది—"వొదిలెయ్యాలా అని మెల్లిగా అడుగుతావా? అక్కర్లేమా? వర్థి కిరస్తానీ వాడాయిరి! వాణ్ని తాకితే మైల పడ్డట్టుకాదూ? ఇంకా నయం—ఒహవేళ పెళ్ళయిన వాళ్ళయితేనూ, లేదా విధవరాలూ సధవరాలు అయి తేనూ తలారా మునిగి స్నానం కూడా చేయవలసి వచ్చేది.

"ఆనాడు రాసమణి పిన్ని—ఆఁ—కొత్త బడాయి చూపించిందిలే—అయినా సరే, ఆచార సంపత్తి అంతా ఆవిడదగ్గిర నేర్చుకోవల్సిందే యీనాటిపిల్ల కొంగు తగిలిందో లేదో కాని ఆపళంగా మనమరాల్ని వేళకాని వేళ చెర్లోముంచి మరీ తీసుకొచ్చింది ఇంటికి!" అని చెప్పింది తల్లి.

"అవునమ్మా, మంచి మాటే చెప్పావ్! సరి, అలాగే చేస్తాలే!" అన్నది, సంధ్య.

* * *

తలకాయ తిప్పింది తల్లి. బ్రాహ్మల ఆచార వ్యవహారాల్ని గురించి ఇంకా యేమో ఉపదేశించ బోతూంది కూతురికి.

వెనకాతల్నించి పిలుపు వినబడ్డది— "జగ్గూ! — ఇంటో ఉన్నావుటమ్మా?" అని.

సరాసరి చావిట్లోకి వచ్చేసి నిలబడ్డాడు, గోరేశ ఛటర్జీ, మహాశయుడు. వెనక్కి

తిరిగి చూసింది జగద్ధాత్రి: "ఛటర్జీ మామే! ఆహా, ఎంతదృష్టం! ఎంత అదృష్టం!" అన్నది.

అయితే, ఆరోజున రాసమణికీ తన కూతురికీ మధ్యని జరిగిన సంభాషణ తలవని తలంపుగా జ్ఞాపకమొచ్చేసరికి, జగద్ధాత్రి మొహం ఎండిపోయింది.

సంధ్య లేచి నిలబడింది. ఇప్పుడు గోలోక ఛటర్జీ తల్లికి బదులుచెప్పటం మానేసి, కూతురికేసి తిరిగి నవ్వుతూ ఇలా అడిగాడు: "ఏమే సంధ్యా! ఎలా ఉంటున్నావ్? ఇదేమిటి. జబ్బు పడ్డట్టు కనిపిస్తున్నావేం?" అంటూ పలకరించాడు.

"లేదు తాతయ్యా! జబ్బూలేదూ, గిబ్బూలేదు. బాగానేవున్నా" నని చెప్పింది, సంధ్య

శుష్కంగా ఉన్న ముఖంలోకి కొంచెం నవ్వు తెచ్చిపెట్టుకుంది జగద్ధాత్రి

"ఆఁ—బాగానే వుంది, బాగా!—నెల్లాళ్ళాయె మామా!—రోజూ తలనొప్పే. రోజూ జ్వరమే! ఇప్పుడే కదూ సగ్గుజావ తాగి ఇలా కూర్చుంది?" అన్నది.

"అదా సంగతీ? మరి, ఎందుకు జబ్బు చెయ్యకుండా వుంటుందీ? దీన్ని మీరు ఇంటో కట్టేసివుంచారు. లేకపోతే ఈ పాటికి ఒళ్ళోను మెళ్ళోను ఇంతింత పిల్లల్ని వేసుకుని ఎక్కడో సంసారం చక్కదిద్దుకుంటూ వుండేది కద! మరైతే దీన్ని ఒకయ్య చేతిలో ఎప్పుడు పెడతారు జగ్గూ! వయస్సు చూడబోతే ..."

అలా అనగానే జగద్ధాత్రి వయస్సు సంగతి పైకి పొక్కనీయకుండా చటుక్కున తొక్కి పెట్టేసింది. "ఏం చేసేది మామా! చూడబోతే నే నొక్కత్తెను, ఆడదాన్ని, ఎన్నివేంపులని చూసుకోగలనూ? ఆయన కే గొడవా అవసరం లేదు. ఏ సంగతీ పట్టించుకోనే పట్టించుకోరు. కోతి క్కొబ్బరికాయ దొరికిందన్నట్టుగా ఈ వైద్యం పిచ్చ ఒకటీ!

"మామా!—ఏమని చెప్పమంటావ్? ఇదంతా చూస్తే, ఈ ఇల్లూ, వాకిలీ ఒదిలి పెట్టేసి, కాశీకి పోయి మా అత్తగారి దగ్గిరుండిపోదామా అన్నంత విరక్తి పుట్టుకొస్తోంది సుమా!—నేను వెళ్ళిపోయిం తరవాత ఏదేమయితే నాకేం, చూడొచ్చానా? ఎవళ్ళ గీత ఎలావుంటే అలా జరుగుతుంది...." అని చెబుతూవుంటే ఆమె కంఠ స్వరం గద్గదమయింది.

"అయితే, ఆ పిచ్చివాడింకా ఏం చేస్తూ కూచున్నాడిప్పుడూ?" అనడిగాడు, ఛటర్జీ.

అందు కామె చెప్పింది—"అసలూ, ఇది పిచ్చకాదు సుమా; మామా!—అలా అయినా బతికిపోదును. గదిలో కూలేసి, తలుపు గొళ్ళాలు బిగించేసి పెట్టేదాన్ని....

లోపలా బయటా నన్నన్నివిధాలా కాల్చి మసి చేస్తున్నారంటే నమ్మూ!" అంటూ, పమిట చెంగుతో కనుకొలకులు తుడిచేసుకుంది జగద్ధాత్రి.

అప్పుడు సానుభూతిగా స్వరంపెట్టి గోలోక ఛటర్జీ చెప్పనారంభించాడు—"అవు నమ్మా జగ్గూ! అవును. పాపం చాలా చాలా సంగతులు విన్నాను. నువ్వు చెప్పిందంతా అక్షరాలా నిజం. ఆ సంగతలా ఉండనీ. కొంతమంది పెద్దమనుషులు చేసినట్టుగా మీరుకూడా "మాకు విల్లువిరిచే రాముడిలాంటి వాడే కావాలి. అలాటి అల్లుడు దొరికినప్పుడే మా అమ్మాయికి పెళ్ళి ఖాయం చేస్తాం" అని చెప్పి పంతంపట్టి కూర్చున్నారటగా?

"సాక్షాత్తు ఆ కుమారస్వామి దొరికితే తప్ప పిల్లని అట్టే పెట్టేస్తా మంటున్నారటగా? అమ్మ బాబో! ఏమిటీ విడ్డూరం? ఏమిటీ ఆలోచనలూ!—మనబోటి గొప్ప కులంవాళ్ళ యిళ్ళల్లో యిటువంటి వెప్పుడయినా జరుగుతాయనేనా మీ వుద్దేశం? పోనీ, ఇటువంటి వెప్పుడయినా ఇంతకుముందు జరిగాయని విన్నావా; అమ్మాయీ? ఎంత కులీనులయితే మటుకి ఆ రోజుల్లో గంగాస్నానం చెయ్యకపోతే వాళ్ళ కులానికి రక్షెక్కడుందీ? ఈ సంగతి నీకు మాత్రం తెలియదా జగ్గూ?—మధుసూదనా! నీవే సత్యం!!"

కలవర పడిపోయింది జగద్ధాత్రి.

"నెమిలి వాహనంమీద ఎక్కివచ్చే అల్లుడికి తప్ప పిల్లనివ్వమన్నామని ఎవరు చెప్పారు నీకు, మామా! పిల్లముందా, కులంముందా? మా వంశంలో కాయస్థుల్ని శూద్రులుగా చూస్తారు. వాళ్ళిళ్ళల్లో ఎవరూ కాళ్ళయినా కడగరే? అటువంటిది, కార్తికేయుడే దిగి రావాలని నేను ఎన్నడయినా కోరుకుంటానా? కాళ్ళూ చేతులూకట్టి గంగలోనయినా పారేస్తాగాని, నా పిల్లని కులీనతలేని కొంపల్లో మాత్రం పడెయ్యను మామా!....ఇదే నా పట్టుదల; అని చెప్పింది.

"ఓహో! అదా కథ! అలా చెప్పు! సరేలే. అటయితే, నే చూసి పెడతాలే సంబంధం." అన్నాడు ఛటర్జీ, సంతోషంతో.

ఆ మాటలన్నీ వింటూవున్న సంధ్య, ఇదుగో వెళదాం, అదుగో వెళదాం అనుకుంది, కాని ఎర్రబడిన ముఖంతో తల వంచుకుని అక్కడే వింటుంది.

ఛటర్జీ సంధ్యకేసే చూసి నవ్వుతూ, రహస్యం చేసినట్టుగా ఇలా అన్నాడు: "జగ్గూ!—నువ్వన్నట్టు, నీకా కుమారస్వామే దిగిరావాలన్న కోరిక లేకపోతే, పిల్లని నా చేతుల్లోనే పెట్టెయ్యరాదూ! వరసా వావీ బంటలేదు. చక్కా రాజా రాణీలాగా ఉంటాం.—ఏమంటావ్ మనుమరాలా, పసందుగా ఉంటుందా?"



ఇంకో సమయంలో కనక అయివుంటే ఈ పరిహాసానికి సంధ్య అనుకూలంగా జవాబు చెప్పేదే. కానీ, అరుణ్‌తో ప్రారంభమైన గొడవ ఇప్పుడు తన తండ్రిని గురించి అనుకోవటం దాకా దేకింది. దేకేసరికి, ఆమెకు సిగ్గేసింది, కోపమొచ్చింది, దుఃఖం ఆగలేదు.

ఇన్నివిధాలుగా ఉడికిపోతున్న సంధ్య ముఖం పైకెత్తి కఠినంగా చెప్పింది—
"పసందుగా ఎందుకుండదు తాతా! ఎంతో పసందుగా వుంటుంది. సప్తకట్ల సవ్వారీ ఎక్కి మీ రిజారినే కదా దయచేస్తారూ? మీ మెడకో పసి మిమ్మల్ని వరించటానికని పువ్వులదండ చేతపట్టుకుని ఇక్కడే నేను మీ కోసం సిద్ధంగా వుంటాను!" అనేసి, గబగబా దొడ్డి గుమ్మంలోంచి అవతలికి వెళ్ళిపోయింది.

భయంకరమైన ఆమె కోపం పట్టరానిదిగా వుందని స్పష్టంగా తెలిసిపోతూనే వుంది. ఛటర్జీ పరిహాసం వ్యర్థమైంది. పైగా తీవ్రమైన ఈ నింద పొందటంవల్ల అతడికి నోట మాట రాకుండా పోయింది, చాలా సేపటిదాకా.

తరవాత—హ—హ్హ—హ్హ అని వెర్రిగా నవ్వి, ఇలా అన్నాడు:—'జగ్గూ!—ఇది పిల్లంటే పిల్లకాదే. తస్సాదియ్యా!—సీమనించి దిగివచ్చిన పైల్మాన్! అంతే అందిలే, తాతా మనమరాలి వరసకదా; అయితే, అవాళే చెప్పింది సుమా రాసమణి "దాని కెవరయినా సరే ఖాతరు లేదు. నోటి కెంతొస్తే అంతా అనేస్తుంది. తల్లి దండ్రుల మాట కూడా లెక్క చెయ్యదు" అని.

ఇంతా జరిగే తీరుతుందని మొదట్నించీ జగద్ధాత్రి భయపడుతూనేవుంది. ఏమైతేనేం, ఆమె అనుకున్నంతా అయింది. ఈ మాటుకి తీవ్రంగా పరిణమించకుండా హావ్య ప్రసంగంలో ఎలాగో అలా కొట్టుకు పోతుందిలే అని అనుకుంది, మొదట. కాని, కూతురు సంధ్యే అనవసరంగా దెబ్బ కొట్టి, పుట్టలో పాముని బయటికి తీసుకు వచ్చింది.

అంచేత జగద్ధాత్రికి కూతురుమీద కలిగిన రోతకు అంతూ పొంతూ లేదన్న మాట. పైకి మాత్రం ఏమీ పొక్కలేదు. కాని, ఎంతో వినయం నటిస్తూ ఇలా అంది :—"లేదు మామా ! ఆ రోజున అలాంటి మాటలేం అనలేదు సుమా సంధ్య! పిన్నిగారే కాస్త వుంటే గంపంత చేసి చెబుతుందని నీకూ తెలుసుగా ?" అన్నది.

"తెలుసులే, ఆ సంగతి నాకూ తెలుసు. కాని నా దగ్గిరమట్టుకి అలాంటిదేం చెయ్యదు." అని చెప్పాడు ఛటర్జీ.

"అప్పుడు నే నెదురుగానే వున్నాను కదా, మామా !"

చిరునవ్వు నవ్వాడు ఛటర్జీ "అయితే సరేలే, అంతకంటే బాగావుంది. కాని, దాన్ని అదుపులోనయినా పట్టలేక పొయ్యావన్నమాట ?" అన్నాడు.

గోలోక ఛటర్జీ నవ్విన ఈ నవ్వుతో జగద్ధాత్రి మనస్సుకి బలం వచ్చింది. వచ్చి, ఇలా అంది క్రోధంతో—"అదుపా ! అదుపూ అని మెల్లిగా అంటున్నావా ? నువ్వే చూస్తూవుండు మామా, దాన్ని ఎలా శిక్ష చేస్తానో ?" అన్నది.

ఇప్పుడు ఛటర్జీ స్నేహపూర్వకమైన స్వరంతో యిలా చెప్పాడు—"పోనిద్దూ జగ్గూ ! అవేం మాటలూ ! దానికల్లా చెయ్యాల్సింది శిక్షకాదు—పెళ్ళి ! ఓ ఇంటిదై, సంసారం నెత్తిమీద పడితే అంతా దానికే తెలుస్తుంది. తనకు తనే చక్కబడ్డు తుంటుంది. అయినా సరేగాని—పెళ్ళీడు పిల్లల్ని కాస్త అదుపులో పెట్టి ఉంచాలి సుమా !—కాలమానం చూడబోతే చాలా భయంకరంగానూ ఉత్పాతంగానూ కని పిస్తూంది. అరుణ్ ఇప్పుడింకా వస్తున్నాడా ?" అనడిగాడు.

భయపడిపోయి, జగద్ధాత్రి "అరుణ్ !—అబ్బే, రావటంలేదే ! ఊహుం—!" అంటూ అబద్ధం ఆడేసింది.

"మంచిదే. ఆ వెధవని మాత్రం రానివ్వకండేం ! వాణ్ణి గురించి రకరకాల మాటలు వింటున్నాను." అన్నాడు.

చిన్నప్పట్నించీ సంధ్య అరుణ్‌ని బావా బావా అని పిలుస్తూండేది. అతగాడు సీమకి బయల్దేరే టంతదాకా ఇద్దరూ ఎంతో నేస్తంగా ఉండేవాళ్ళు. ఇప్పుడేమో అరుణ్ సీమనించి దిగాడు కదా. అతణ్ణి అంటరాదు, ముట్టరాదు, వెలి అయి

పోయాడు బ్రాహ్మల్లోవించి. కాబట్టి, వీళ్ళ స్నేహం ఏ కారణం చేతనైనా నరివడదని కానీ, సవ్యంగా సాగకపోతుందని కానీ తల్లికి కలలోనైనా సంశయం కలగలేదు.

అయితే, కొన్నాళ్ళుగా సంధ్య చెప్పే మాటల్లోనూ, చేసే చేతల్లోనూ మధ్య మధ్య తల్లికి ఒక విధమైన మంట పుట్టుకొస్తూంది. కళ్ళు తెరిచినా, మూసుకున్నా ఆ మంట కనబడుతూనే వుంది.

ఈ విషయం ఎంతదాకా ముదిరినా, దీన్ని గురించి భయపడవలసినంత పని లేదని జగద్ధాత్రికి తెలుసు. కాని, ఆ విషయాన్నే ఇప్పుడు స్పష్టంగా ఇతరులు సూచించగా వినడంతో ధైర్యం ఆపుకోలేక పోయిందామె. "ఇలాంటి మాటలు విన్న కొద్దీ ఎన్నయినా వినొచ్చు. మామా! కాని, నా కూతుర్ని గురించి లోకులకింత అక్కసు ఎందుకు చెప్మా!" అన్నది.

చిరునవ్వు నవ్వి ఛటర్జీ గంభీరంగా చెప్పాడు:—"అవునే అమ్మాయ్, అదంతా నిజమే. కాని సరైన అదునులో హద్దుపెట్టి జాగ్రత్తపడకపోతే, లోకం నోరు ముయ్యటానికి మూత వుండదు సుమా; మరి!"

ఈ మాటకూడా జగద్ధాత్రి ఏదో సమాధానం చెప్పబోయింది. కాని, సరిగ్గా అదే సమయానికి సంధ్య చేసుకొచ్చిన పని చూస్తే ఆమె భయపడి పోయింది. ఆశ్చర్యంతోను, విపరీతమైన కోపంతోను మాటాడలేక పోయింది—

సంధ్య చెర్లో స్నానం చేసి వస్తూంది. ఇంటోకి, ఒంటివి తడిగుడ్డలు, తలకట్టు వించి ఇంకా నీళ్ళు కారుతూనే వున్నాయి. తుడుచుకోడానికి తడువెక్కడ?—ఇటువంటి స్థితిలో ఆమె పక్కగా తప్పుకుని గబగబా దొడ్లోకి వెళ్ళిపోయింది.

"అవునన్నట్టు జగ్గూ!—దీనికి జ్వర మొస్తోందని చెప్పావుగా? ఇప్పుడీ సాయంకాలంపూటా చన్నీళ్ళతో స్నానంచేసి వస్తూందేం?" అనడిగాడు, ఛటర్జీ.

"ఎందుకో నాకేం తెలీదు మామా!—" అని మాత్రం జవాబుచెప్పి ఊరుకుంది జగద్ధాత్రి. అయితే అరుణ్ ని తను అవమానం చేసిందిగా? అందుకోసమని సంధ్య పైకేమీ అనకుండా, కఠోరంగా క్రియా రూపమైన కసి ఈ విధంగా తీర్చుకుందని ఆమెకు మనస్సులో బాగా తెలుసు.

"ఇలా అపథ్యాలూ, కూడని పనులు చేస్తుంటే రోగానికి మరింత బలం కాదూ?" అనడిగాడు ఛటర్జీ.

"బలమయితే కానీ మామా!—నేనేం చేసేదీ? అది నామాట వినదూ...." అని చెప్పింది జగద్ధాత్రి.

తల ఊపుతూ ఛటర్జీ ఇలా అడిగాడు: అవున్లే, ఆ సంగతి నా కర్థమయింది,

వరేగాని. నే నొహ టడుగుతా చెప్పు: ఈ యింటికి యజమాని నువ్వా? పీ కూతురా? లేకపోతే నీ ఇంటల్లుడా? ఎవరు ఇందులో?''

"నేను తప్ప అందరూ యజమానులే మామా; ఈ యింటికీ...." అన్నది జగద్ధాత్రి.

''అలా అయినట్టయితే ఆ యజమాన్లతోనే ఇలా చెప్పు: "ఊరిమధ్యకి తెచ్చిపెట్టిన యానాదాళ్ళమా ఎలికలాళ్ళనూ ఉండటాని కెంతమాత్రం వీల్లేదు. వాళ్ళకేదో ఒహ ఏర్పాటు ఆలోచించకపోతే. నేనే కలగజేసుకో వలిసొస్తుంది సుమా!" అని—మధుసూదను వీవేగతి:—"

ఇందుకు జవాబు చెప్పినట్టుగా వెంటనే జగద్ధాత్రి మహా కోపంతో ''సంధ్యా! ఇటురా!" అని పిలిచింది.

లోపల సంధ్య తడితల తుడుచుకుంటున్నదల్లే వుంది. కా_స్త మొహం ఇవింటా కాపి ''ఎందుకమ్మా?'' అనడిగింది.

"ఈ యానాది వాళ్ళని ఎక్కడికైనా లేచి పొమ్మని నీ అంతట నువ్వు వెళ్ళ గొడతావా? లేకపోతే. రేపు స్నానానికి వెళ్ళేముందు నేనే చీపురుకట్ట ఒహటి తీసుకుని వాళ్ళని తప్పి తగిలెయ్యమంటావా. చెప్పు?' అంది

''దిక్కులేని అనాధలు! ఇద్దరాడాళ్లని చీపురుచ్చుకు బాదుతానంటావే? అదేమంత మహా గొప్పపని కాదమ్మా! వాళ్ళు ఎవళ్ళకేం హాని చేశారూ?'' అనడిగింది సంధ్య

ఈ ప్రశ్నకు తల్లి ఏమనదు కాని. ఛటర్జీయే చెప్పాడు జవాబు: ''హాని చెయ్యక పోవడమేమిటీ? మొన్నటి రోజున దారిని పోతూ కళ్ళారా చూశాను. నడి దారి మధ్యని కూచుని వాళ్ళు మేకలకి గంజి పోస్తున్నారు ఛ!—ఆ దారి దారంతా ఎంగిలి చుక్కలు! మాలకూడు!!'' అంటూ. జగద్ధాత్రికేసి చూశాడు ఒక్కమాటు.

ఆమె వెంటనే ఛటర్జీని సమర్థిస్తూ అంది: ''అవును మామా!—పడక పోవటమేం? దారంతా పడేవుంటుంది!''

అందుకాయన మళ్లీ ఇలా అన్నాడు :—

''అలా చెప్పు. జగ్గూ!—తెలియక విషమయినా తాగొచ్చు కానీ. తెలిశాక?'' అని ప్రశ్న వేస్తూ, సంధ్యకేసి చూసి నవ్వి. అన్నాడు—"మనమరాలా! నీది లేత వయస్సు గనక రా_త్రయినా స్నానం చెయగలవు గాని. నేను మాత్రం చెయ్య లేను సుమీ! నావల్ల కానేకాదు!''

మనస్సులో ఉన్న క్రోధం పొంగి పొరలి వస్తూంది సంధ్యకు. అయినా ఎలాగో ఆపేసుకుని. ఇలా అంది: ''నాకా సంగతి తెలుసు తాతా!—మా నాన్నగారు




వాళ్ళకి చోటిచ్చిన మాట నిజం. అటువంటప్పుడు మరోచోటు వాళ్ళకి చూపించకుండానే వెళ్ళగొట్టేసి, ఆయన కవమానం చెయ్యనా? ఉహుం—నే ఒప్పుకోను.''

మానం. అవమానం అనే పెద్ద మాటలు కూతురి నోట్లోవించి రాంగానే, తల్లి మరేం చెప్పలేక ఊరుకుంది.

కాని, గోలోక ఛటర్జీ అందుకున్నాడు—

'అదంతా బాగానేవుంది. సరే. చోటుకేం? వాళ్ళకి చోటుకేం తక్కువా?—దానికీ యేం లోటులేదు. అరుణుడి ఇంటి వెనకాతల బోలెడంత జాగా వుందిగా? వాళ్ళక్కాస్త చోటివ్వమని వాడితోటే చెప్పకూడదూ? యానాది వాళ్ళయితేనేం. వాళ్ళూ హిందువులే. వాళ్ళ మూలంగా అతగాడికి జాతి పోయేదేమీలేదు'' అని, జగద్ధాత్రి ముఖం పరకాయించి చూసి ముసిముసి నవ్వులు ప్రారంభించాడు.

ఆయన మాటల్లో స్వారస్యాన్ని జగద్ధాత్రి ఎంత గ్రహించినప్పటికీ, అరుణుడి ప్రసక్తి వచ్చి పడటంతో—ఎవరితో ఎలా మాటాడాలో ఏమీ తెలియని తన కూతురు తలవయిన మాట లేమిటనేస్తుందో, ఏం లేనిపోని గొడవ తెచ్చి పెడుతుందోనని ఆమె ఎంతగానో భయపడింది. ఆమె ఆత్రానికి మేర లేకపోయింది.

అలాగే జరిగింది సరిగ్గా. సంధ్య కంఠస్వరంలో పరిహాస పరిమళం వెద జల్లింది. కానయితే, ఆ మాటలు చెవికెంత సూక్ష్మంగా వినబడుతున్నాయో, అంతకు

అంత కటువుగా, కఠోరంగా వున్నాయి—''కులం పోతే పోయేదానికి జమా అర్చా?—అసలు, కులాన్నే లక్ష్యం చెయ్యని వాళ్ళకి ఇహ అది ఉండడ మేమిటి, పోవడమేమిటి? ఉన్నా, పోయినా రెండూ ఒకాటే!'' అన్నది.

నవ్వుదా మనుకుని ప్రయత్నించాడు ఛటర్జీ. కాని, ఆయన మొహం మాడి పోయింది. ''సరి, సరి, అయితే ఈ మాటలన్నీ బహుశా నీతో ఆయనగారు సంప్రదిస్తూనే వుంటాడు కాబోలు నేం?'' అనడిగాడు.

కిల కిల నవ్వేసింది సంధ్య

"తాతా! భేష్, భేష్!—మిమ్మల్నే అతడు కుక్కలకిందా పిల్లులకిందా జమ కడు తున్నాడే, కాస్తంతా లెక్కచెయ్యకుండా! ఇహ నేనొక లెక్కా, ఈ మాటలన్నీ నాతో చెబుతుండటానికి?—ఏట్లో ఏనుగులే కొట్టుకు పోతూవుంటే, ఇహ దోమ లకీ....?" అనేసింది. ఈ విషయం గురించి ఇహ వాద ప్రతివాదాలూ, చర్చలూ జరగటానికి అవకాశ మివ్వకుండా ఒక్క లిప్తలో గబుక్కున తన గదిలోకి వెళ్ళి పోయి కూచుంది!

మరి సహించలేక పోయింది జగద్ధాత్రి. 'ఛీ ఛీ! అభాగ్యురాలా!—పరాయి కుర్రాడిమీద ఇలా నిష్కారణంగా ఒట్టి అపవాదు వేస్తావా? ఎనరెరగరు అతణ్ని? అతడెన్నడయినా ఇలాంటి మాటలన్నాడా? లేదని నేను గంగలోంగి ప్రమాణం చేస్తా'' నంటూ గద్దించి చెప్పింది.

గదిలోంచి బదులేం లేదు.

అప్పుడు ఛటర్జీ ఇలా అన్నాడు:—"జగ్గూ! ఆసలీ కాలపు పిల్లలంతా ఇదే వరస అమ్మాయీ! పోనీలే, మేం కుక్కలం, పిల్లులం అయితే అయినాంలే కాని, ఒక్కమాట మాత్రం నీకు చెప్పి పోతాను: పిల్ల దాని పెళ్ళి ఇహ ఆపకు, ఎంత మాత్రం ఆలస్యం చెయ్యకు. ఎక్కడో ఒకా దిక్కున ముడెట్టించి, పాపవిముక్తి చేసుకో! పాపంనుంచి విముక్తి కలిగించుకో!" అంటూ మరిమరి నూరిపోశాడు.

ఏడుస్తూ జగద్ధాత్రి ఇలా అంది: ''నువ్వే చూసిపెట్టు మామా, ఏదయినా సంబంధం! నే నెక్కడని వెతికేది? నావల్ల కావటం లే!''

సరేనన్నట్టుగా తల ఊపి, ఛటర్జీ ఇలా చెప్పాడు: మంచిది. చూస్తాలే. కాని ఒక్కమాట—నీ కున్నదే ఒక చిన్నది. దూరా భారం ఇచ్చిచేస్తే ఎంత కష్టం. ఎంత బెంగపడాలి. మనలాంటి వాళ్ళ యిళ్ళల్లో వరుడి వయస్సు చూస్తే కాదు. మరేమిటా! పిల్లగనక ఎదురుగా దగ్గిర పడుంటే, ముప్పొద్దులా కాస్త కంటికయినా కనిపిస్తూ వుంటుంది. అంతకంటే మించిన సుఖమేముంది, చెప్పు!''

కళ్ళు తుడుచుకుని జగద్ధాత్రి జాలిగొలిపే కంఠస్వరంతో అన్నది—"అంత అదృష్టమేనా నాకు మామా? అంత పుణ్యమే!—కాని, ఎవరయినా ఇంటి అల్లుడుగా...."

ఈ మాట పూర్తి కానివ్వలే. ఛటర్జీ. "అబ్బెబ్బే!—అలాంటి మాట జన్మలో ఎన్నడూ తలపెట్టకు. ఇదేం ఇల్లరికపు టల్లుళ్ళు దొరికే చవకబారు కాలమను కున్నావా? దానివల్ల ఎంతలేసి నిందలొచ్చి పడతాయో కొంచెమైనా తెలుసా?— సరి,—ఎక్కణ్ణుంచైనా ఓ పప్పుభట్టుని గొప్పచేసి ఇంటికి తెచ్చి పెట్టుకుంటామే అనుకో. వాడు భంగూ, గంజాయి మొదలెట్టి. నీకున్న ఆస్తి కాస్త నిమిషంలో ఊదేస్తాడు కనక. ఇలాటి సంగతులన్నీ కొంచెం వెనకాముందూ చూసుకోవాలిగా!" అన్నాడు.

ఈ మాటల్లో ఉండే భావాన్ని జగద్ధాత్రి గ్రహించింది. వెంటనే ఉత్తేజం కలిగిం దామెకు. "చూసుకుంటూనే వస్తున్నా మామా, చాలా కాలంనించీ. చూసుకు చూసుకు. లోలోపలే మండి మసి అయి, కుమిలిపోతున్నా."

చిరునవ్వుతూ ఛటర్జీ ఇలా అన్నాడు :

"అల్లా అను. జగ్గూ!—పని పాటల్లేకుండా ఊరికే తిని కూచుంటే యిలాగే అవుతుంది. నీలాంటి బుద్ధిమంతురాలు ఈపాటీ తెలుసుకోలేదా?"

జగద్ధాత్రి ఉబ్బిపోయిందీ మాటకు.

"తెలుసుకోకేం మామా!—నా కంథా తెలుసు, లోపల్లోపల. కాని, నే నాడ దాన్ని. ఎటు చూదామన్నా దరీ దాపూ కనపడ్డంలే!" అన్నది.

ఆమెను ఊరడిస్తూ ఛటర్జీ మళ్ళీ ఇలా అన్నాడు : "కనబడుతుంది, కనబడుతుంది! తొందరపడితే ఎలా?—కొంచెం ఆలోచించి చెప్తాలే!—సరే, సంధ్యాకాలమైంది. యిహ పోయొస్తా!—

"ఇందాకట్నించీ ఆలా నించునే వుండిపోయావ్. ఒక్క నిమిషం కూర్చుని వెళ్ళరాదూ?" అనంది, వినయంగా వేడుకుంటూ.

"కాదులే అమ్మాయ్, కాదు!—సంధ్యావందనం చేసుకోవాలి కదా; వేళ దాటి పోతూంది. ఇహ ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు" అని అంటూ గోలోకఛటర్జీ మెల్లిగా వాకిట్లోకి వెళ్ళిపోయాడు.

అతణ్ణి సాగనంపటానికి జగద్ధాత్రి వీధి గుమ్మం దాకా, కూడా కూడా ముందు నడిచింది.

# 5

చంకన కొన్ని హోమియోపతీ పుస్తకాలు యిరికించుకుని, తువాల్లో కట్టిన మందుల పెట్టె చేత పట్టుకుని, పొద్దుటే ప్రాక్టీసుకని బయలుదేరాడు, ప్రియముఖర్జీ. గబగబా, వడివడిగా, హడావిడిగా పోతున్న అతడి వెనకాతలే ఒక యానాది విధవరాలు కూడా వెంటబడి, ఇలా ప్రార్థించింది:

"బాబయ్యా! మీరే మమ్మల్ని కరుణించాలి! తప్పదు. లేకపోతే మే మెక్కడికి పోయేది?"

ముఖం వెనక్కి తిప్పి జవాబు చెబుదామంటే ఆయనకామాత్రం తీరికేదీ; అంచేత, వెనకాలే చెయ్యి ఆడిస్తూ అన్నాడు: "ఒద్దొద్దు వీల్లేదు, ఇహ మిమ్మల్నిక్కడ, మా పాకలో క్షణంసేపు కూడా ఉండనివ్వను. మీరు కేవలం అలగాజాతి వాళ్ళు. మేకలకి గంజి ఎందుకు పోస్తున్నారూ, మియా?"

ఆశ్చర్యంతో ఆ యానాది-విధవ—"ఏఁటి బాబయ్యా అలాగంటారు? అందరి మేకలూ గంజి తాగుతయ్!" అన్నది.

ఈ మాటకు మండిపడ్డాడు ముఖర్జీ అది పాడిబిపోయేట్టు కోపగించి, "ఛీ-పో! అవతలికి. అబద్ధాలు చెబుతావ్! ఎవళ్ళ మేకలూ గంజి తాగవ్. మేకలు గడ్డి మేస్తాయ్," అన్నాడు.

"గడ్డీ మేస్తాయ్. ఆకు అలమూ నవులుతాయ్. గంజీ తాగుతయ్ బాబయ్యా!" అన్నది, అది.

ఇంకా అలాగే చెయ్యి తిప్పుతూ చెప్పాడు; ముఖర్జీ—"ఒద్దొద్దు. ఇహ మిమ్మల్ని ఉండనియ్యను. పొండి, ఇప్పుడే మీరు లేచిపొండి! బ్రాహ్మణ వీధిలో మీకు గంజి పెట్టారని గోపాల్ ఛటర్జీ చెప్పి పోయాడు. అంచేత మీ మీద నా కింక దయ లేదు. మీరు ఒట్టి అలాగా జాతివాళ్ళు!"

"అయితే బాబయ్యా! గంజి పొయ్యటం మానెయ్యమంటారా?" అనడుగుతూ, మళ్ళీ ఒకమాటు ఆఖరిసారిగా ప్రార్థించింది!

తడుముకోకుండా చెప్పాడు ముఖర్జీ:—"ఆఁ—మానెయ్యండి. మీకు ఆవులుంటే గంజి పోసుకున్నా దోషం లేదు. కాని యిదేమిటి? భయంకరమైన విషయం, మహా పాతకం! ఇప్పుడే మీరు లేచిపొండి, తెలిసిందా?

"అబ్బ, ఎంత పొద్దెక్కి పోయిందో!—సల్ఫర్ ఇచ్చేవేళ దాటిపోతూంది!" అనుకుంటూ తొందరగా పోబోతున్నాడు.




యానాదిమనిషి వెనకనించి జాలిపుట్టించే స్వరంతో యిలా అంది: "బాబుగారండీ! నిన్నట్నుంచీ మా పిల్లది రెండు మెతుకులైనా నంజలేదండి!"

ఆ మాటను వెంటనే వెనక్కి తిరిగాడు ప్రియబాబు. "ఎంచేత? ఎంచేత?—అంటే కడుపులో సులినొప్పి, లేకపోతే దోకొచ్చే టట్టుందా?" అనడిగాడు.

కాదన్నట్టుగా తల అడ్డగా తిప్పింది, ఆ యానాదిమనిషి

"అయితే మరేమిటీ?—కడుపు ఉబ్బరంగా ఉందా? ఆకలి వెయ్యడంలేదా?"

"ఆకలండి బాబయ్యా, వెయ్యిపాకలండి, కొండ మింగేటంత ఆకలండి!"

"ఓహో, ఆఁ, అలా చెప్పూ. అదీ ఒక పెద్ద రోగమే!—నేట్రమ్, అయోడమ్. ఇంకా ఇలాంటివే ఎన్నో మందులున్నాయి. ఇంతాటికీ చెప్పావు కాదేం. మరి! ఒక్క చిట్కాతో పోగొట్టే వాణ్ని గా? నడు, చూస్తా!"

కాస్తంత తటపటాయించింది అది "మందు వొద్దండి బాబయ్యా! కాసిన్ని బియ్యపు నూకలిప్పించండి బాబుగారూ, కుర్రముండకి కాచిపోస్తాను" అన్నది.

ఒక్కక్షణం ఆశ్చర్యంతో చూస్తూ నిలబడి పోయాడు తరవాత మండిపడుతూ యిలా అన్నాడు—"మందు అక్ఖర్లేదూ? బియ్యపు నూకలు కావాలా? పోపో! నా యెదటనించి అవతలికి లేచి పో! దౌర్భాగ్యపు ముండా! మీ అలాగా జాతి మొహం మండా!"

అది సిగ్గుపడి వెళ్ళి పోతోంది. ముఖర్జీ గదమాయిస్తూ మళ్ళీ ఇలా అన్నాడు:

''అంతగా తిండికి లేకపోతే, సంధ్య దగ్గరకిపోయి అడుక్కో—లేక పోయిందా !

యానాదిది మాటాడలేదు. మొహం మాత్రం ఎత్తి చూసి ఊరుకుంది.

అప్పుడు ముఖర్జీ మళ్ళీ చెప్పారు: ''ఇదుగో, అమ్మగారి దగ్గరికి మాత్రం పోకేం. వస్తావ్ ! చెరువు ఒడ్డునే వించో. మా సంధ్య వస్తుంది. వొస్తే—నా పెద్ద మందుల పెట్టెలో అర్థ రూపాయికాసు వుంది. నే విమ్మన్నానవి అడుగు

''అయితే, ముందుగానే చెబుతున్నా సుమా ; ఈ మాట మాత్రం గుర్తుంచుకో. జబ్బు చేస్తే ముందస్తిగా నన్నేపిలవాలి. అప్పుడు ఆ విపినుడి దగ్గిరకిగానే వెళ్ళా రంటే—చూస్కో, ఖబడ్దార్ ! జాగర్త !! '

"ఎవరా వచ్చేదీ ?—త్రిలోకీ కదూ ! అదుగో, షష్టీచరణుడు కూడా వున్నాడే ! సరి, సరి ! ఇంటో అందరూ ఖులాసాయేనా ?'' అనడిగాడు.

యానాదిమనిషి మెలిమెల్లిగా జారుకుంది. త్రిలోకీ, షష్టీచరణుడూ ముందుకు వచ్చి నమస్కరించారు. 'చిత్తం, మీ దయవల్ల అంతా బాగానే ఉన్నామండి !" అని చెప్పారు.

ముఖర్జీ అస్ఫుటంగా దీవించాడు.

''మంచిది, మంచిది. చాలా సంతోషం. చూడబోతే కాలమానమేమీ బాగుండటం లేదు. నాకా, స్నానం చెయ్యటానికిగాని, తిండి తినటానికిగాని తీరిక కనబడదు. ఇంటింటా, ఎక్కడ చూసినా దగ్గులూ, జలుబులూ, బ్రాంకైటిస్ అందర్నీ ఏడిపిస్తు న్నట్టుగా కనిపిస్తుంది—ఏమిటిల్లా పొద్దున్నే బయల్దేరారే ?'' అనడిగాడు.

''చిత్తం, తమ దగ్గిరకేనండి !" అన్నాడు త్రిలోకీ.

ఉత్సాహంతో ముఖర్జీ :—''నా కోసమా ! ఎందుకెందుకూ ? నా దగ్గిరకెందుకూ ? అంటూ ప్రశ్నించాడు, ఆత్రంగా.

అందుకు త్రిలోకీ ఇలా చెప్పాడు: ''ఊళ్ళోవాళ్ళు రావటానికీ పోవటానికీ మహ చెడ్డ కష్టంగా వుంటున్నదండి ముఖర్జీబాబూ ! కాలవమీద వంతెన వేయించా లండీ ! అదే ఇప్పుడు తయారుచేస్తున్నామండి. దానికిగాను వెదురుచెట్లు కావలిసుం దండి. మీరు వైకుంఠుడికి అమరకం చేశారు చూడండీ, ఆ తోట కట్టవలో ఉన్న వెదురు డీడెం ఇప్పిస్తేగాని, పని జరిగేట్టు లేదండి !''

''నేనే ఎందుకివ్వాలి ? ఊళ్లో యిహ మరెవరూ లేరా యేం ?'' అన్నాడు ముఖర్జీ, కోపంగా.

ముసిలివాడైన షష్టీచరణ్ ఇప్పటిదాకా ఏమీ అనక వూరుకున్నాడు. కాని ఇప్పుడు తల వంచి, వినయంగా మళ్ళీ దణ్ణం పెట్టాడు. ''బాబుల అభయమిస్తానంటే ఒక్క

సంగతి మనవి చేసుకుంటానండి: ఈ గ్రామం మొత్తానికి తమర్ని తప్పించితే ఇహ మరి మనిషన్నవా దెవడున్నాడండీ? తమరు కాస్తంత దయతలిచినారంటే పదిమందీ బతికిపోతారు. మేం ఉత్త పేద సంసారులం కదండీ! వాసం కొనటానికి మాకు శక్తి ఎక్కడుందండీ? తాహతు ఏదండీ? బాబయ్యా!'' అని ప్రార్థించారు.

కొంచెంసేపు ఆగి, ముఖర్జీ ఇలా అడిగాడు: అటయితే, ఊళ్ళో వామందికీ కష్టంగా వుందేమిటి?''

త్రిలోకీ చెప్పాడు—''చచ్చిపోతున్నారు బాబయ్యా. కాలవ దూకలేక విరిగి ముక్కలై చస్తున్నారండి!''

''కాని, ఇంటావిడ ఈ సంగతి విన్నదంటే కొంప మునిగిపోతుందే!'' అన్నాడు ముఖర్జీ.

అందుకు చతుష్టీచరణ్ యిలా చెప్పాడు: మీరు అనుగ్రహించి దయచేయిస్తే, దొరసావిగారు వళ్ళి మాటాడతారండి? అంతగా వస్తే, మే మంధరం గట్టగట్టుకు పోయి ఆవిడ కాళ్ళమీదే పడతామండి!''

ప్రియముఖర్జీ ఆలోచిస్తూ కొంచెంసేపు నిలబడ్డాడు—పదిమందికీ ఇబ్బందిగా ఉండి, కష్టంగా వుంటూందా! సరే, వెళ్ళి తెచ్చుకోండి! అయితే, ఒక్క విషయం: ఆవిడకి మాత్రం తెలియనివ్వ కూడదు సుమీ!—

''ఉష్....ఎంత పొద్దెక్కిందీ! రసిక్‌బాగ్దీ భార్యకి రాత్రి ఎలా గడిచిందో ఎవరికేం తెలుసు?—బ్రయోనియా తాలూకు యాక్షన్—కదిలినా, మెదిలినా నొప్పి! ఉంటుంది. ఆలానే ఉంటుందిలే! సరే, వెళ్ళాలి వెళ్ళాలి....'' అని చెప్పి గబగబా రెండడుగులు వేసి, మరి కనబడకుండా వెళ్ళిపోయాడు.

ముసలి షష్టీచరణ్ కొంచెం నవ్వాడు. కాని, త్రిలోకీ మాత్రం యిలా అన్నాడు—''చరణ్ బాబాయ్! ఈయన పిచ్చాయన పిచ్చాయన అంటారు లోకులు. నిజమే!—కాని, ఈ పిచ్చిమారాజే పేదలపాలిటి పెన్నిధి! పేదవాళ్ళ కష్టసుఖాలు ఈ పిచ్చి దొరగారికే బాగా తెలుసు. ఆయనకంటే ఎక్కువగా గ్రహించే వాళ్ళెవరూ లేరు. ఆహా!—ఆయనగారి మనస్సు ఎంత స్వచ్ఛమైంది!—గంగాజలమంత స్వచ్ఛమైంది!!—''

ఇలా అంటూ, అతగాడు ఆ పిచ్చిమారాజు వెళ్ళిన దారివేపు తిరిగి చేతులురెండూ జోడించి దణ్ణం పెట్టాడు.

షష్టీచరణ్ అన్నాడు—''హుకుం అయింది, త్రిలోకీ! ఇహ మరి ఆలస్యం చెయ్యొద్దు. తొందర తొందరగా వంతెనపని పూర్తి చేసుకునిగాని మరోపనికి

వెళ్ళొద్దు!"

"అయితే పద, పోదాం, బాబాయ్!" అన్నాడు త్రిలోకి.

## 6

సంధ్యాసమయం. చీకటి క్రమ క్రమంగా గాఢమవుతూంది. అయితే, అప్పటికింకా దీపాలు పెట్టలేదు.

అరుణ్ తన చదువుల గదిలోనే వున్నాడు. గది మధ్యనున్న టేబిల్‌మీద రెండు కాళ్ళూ పారేసి, ఎదురుగా కనబడే వస్తువులనే విదానించి చూస్తూ, కదలకుండా కూర్చున్నాడు. స్థిరంగా కూచునివున్న అతడి ఒళ్ళో తెరిచిన పుస్తకం ఒకటుంది. కాని చదవటం లేదు.

కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే, ఒక్కసంగతి బాగా విశద మవుతుంది—అతడు చదవలేకపోవటానికి కారణం—చీకటిగా వుండి, వెలుగు కనబడనందువల్లనే కాదు. వెలుతురు బాగా ఉన్నప్పుడు కూడా ఆ పుస్తకం అతడు చదవకుండా అలానే తెరుచుకుని ఒళ్ళో పడివుంది. కనక ఏమనుకోవాలి?—

అసలు సంగతి ఏమిటంటే—నిజానికి, ఆ నాటినుంచీ కూడా ఏపనీ చెయ్యటం లేదు ఏ పనియందూ ఆసక్తి, కుతూహలమూ కనిపించదు. ఇల్లు కదిలి వాకిటిలోకి కూడా రావటం లేదంటే?

"ఈ లోకంలో ఒక మనిషికి నేను సాక్షాత్తూ అంటరాని వాణ్ణయిపోయానే," అన్న ఈ ఒక్కమాట క్షణ క్షణానికీ అరుణ్‌కి జ్ఞాపక మొస్తూంది. అతడి మనస్సులో మాటి మాటికీ గిర గిర తిరుగుతూనే వుంది.

తనని తాకినంత మాత్రానికే నోట్లో ఉన్న తమలపాకులు ఉమ్మేసేటంత వరకూ—అంత దూరం పోయినాయ్ తనపైన ఆ వ్యక్తికి గల ఈసూ, రోతానూ!—ఆ వ్యక్తికి అతనిపై పుట్టిన అసహ్యమూ, అశుభ్రతానూ!

ఇంత తీవ్రంగా చేసుకుంటున్న అతడి ఆలోచనలన్నీ తక్కున ఒక్కమాటుగా విచ్చిపోయినై! తలుపు చప్పుడయింది!—ఆలోచనలకు అడ్డు తగిలినందుకు చీకాకుతో కనుబొమలు ముడేసుకుని, పైకి చూస్తూ, "ఎవరు వారు?' అని పలకరించాడు

"నేను సంధ్యను!" అన్నది. తలుపు తెరుచుకుంది, లోపలికి వచ్చింది, గోడకు ఆనుకు నిలబడింది.

గభీమని టేబిల్ మీదినించి కాళ్ళు తీశాడు అరుణ్. లేచి నిలదొక్కుకున్నాడు.




ఆశ్చర్యపడ్డాడు "ఇదేమిటి. ఇలా వొచ్చావ్? పైగా ఇలాటివేళ? రా. లోపలికి రా? కూర్చో!—" అంటూ ఆహ్వానించాడు

"కూచోటానికి తీరిక లేదు నాకు చెర్లో స్నానానికని బయల్దేరా. ఎవళ్ళకీ తెలీకుండా దొంగచాటుగా ఇప్పుడిక్కడికి వచ్చానన్నమాట! మా పరువూ మర్యాదా కాస్త నిలపాలి, అరుణదా! ఈ భారం నీపైనే వుంది.!—" అని చెప్పింది.

మరీ ఆశ్చర్య పడ్డాడు అరుణ్ : "పరువూ. మర్యాదానా? మీదా!! తప్పకుండా నిలబెడతాను. సంధ్యా! అంతకంటే నాక్కావల్సిందేమిటి?" అంటూ అభయమిచ్చాడు.

"నాకా నమ్మకముంది. ఆ సంగతి తెలిసే నిబ్బరంతో వచ్చాను." అని కొంచెంసేపు ఊరుకుంది. సంధ్య. మళ్ళీ ఇలా అడిగింది—"నాన్న చెప్పారు—కొన్నాళ్ళుగా నువ్వు ఇల్లే కదలటం లేదుట?—ఏ పనీ పాటూ చెయ్యటం లేదుట? ఎందుకనీ? నేను తెలుసుకో వచ్చా?—"

"ఒంట్లో బాగుండటం లే."

"బాగుండక పోవటం. అదేమంత పెద్ద విషయం కాదు. ఆశ్చర్య పడాల్సిన పనీ లేదు. అసలది కాదు. శరీరానికి సంబంధించిన అనారోగ్యమే అయితే. ఆమాట ముందర స్తిగానే చెప్పేవారు. నాన్న!" అన్నది సంధ్య. మాటాడలే అరుణ్.

కొ స్సేపటిదాకా సంధ్య మౌనంగానే ఉండిపోయింది.

"కారణం నాకు తెలుసులే. అరుణదా!—కాని, ఇంకెప్పుడూ నువ్వు మా ఇంటికి రాలేవు!" అన్నది.

మెల్లిగా తల ఊగిస్తూ, అరుణ్ అన్నాడు :

"రాను, సంధ్యా —మీ ఇంటికి మాత్రమే కాదు. ఈ వూళ్లో కాపరమే ఎత్తేదా మని వుంది. నా మనస్సులో ఉద్దేశం. ఎటువంటి దోషం లేకపోయినప్పటికీ, ఒకళ్ళ నొకళ్ళు ఇంత తేలిగ్గా, తక్కువగా, లాఘవంగా, రోతగా, హీనంగా, వింద్యంగా చూడకుండా వుంటారో, అలాంటి చోటుకి పోయి ఉందామని రాత్రిందిగళ్ళు తీవ్రంగా ఆలోచిస్తున్నా."

"అయితే, జన్మభూమి వొదిలేసి వెళ్ళిపోదామనా?" అనడిగింది సంధ్య మొహ మెత్తి.

"జన్మభూమే నన్నొదిలి లేపింది. సంధ్యా!—దగ్గరికొచ్చి నంతమాత్రాన్నే నన్ను చూసి నువ్వు నోట్లో తమలపాకులు ఉమ్మేయ వల్సినంత అపవిత్రుణ్ని కదా, నేను ఇంతకంటే అపహాస్యం మరేం కావాలి?—ఇలాటి రోత సహించి కూడా నన్నింకా ఈ వూళ్ళో ఉండమంటావా?—"

జవాబేమీ చెప్పలేక, తల వంచుకుని అలానే నించుంది సంధ్య.

అరుణ్ ఇలా అన్నాడు: "చిరకాలంనించీ ఆచారమనే పేరుతో వస్తున్న సంస్కారం ఇది. ఇహ ముందీ సంస్కారం బహుశా ఇంకెన్నడూ మీ మనస్సులకు అంటనైనా అంటదని నా ఉద్దేశం. కాని, ఎక్కడయితే అదినన్ను స్పృశిస్తుందో, అక్కడ ఒహ మనిషి చేతిమీదుగా సాటి మనిషికి జరిగే ఈ అవమానం "వేదన" అనే శూలంతో ఎంత దూరంవరకూ గుచ్చుతుందో—ఆ సంగతి ఎప్పుడో ఒకనాడు నేను ఈ రీతిగా అనుభవించవలసి వస్తుందని, కల్లోనైనా అనుకోలేదు, సంధ్యా!"

కాస్సేపు మౌనంగావుంది సంధ్య.

"కాని, ఈ అవమానం నీ అంతట నువ్వు తెచ్చిపెట్టుకున్నదే కదా, అరుణదా? దారే పోయే దయ్యాన్ని నువ్వేకదా పిలుచుకు వచ్చిందీ?"

"వచ్చాను కాబోలు!—పోనీకాని సంధ్యా!—ప్రాయశ్చిత్తం చేసుకో దలిస్తే దీనికేమైనా ఉపాయం ఉంటుందేమో చెప్పగలవా నువ్వు?"

"ఉపాయం ఉండొచ్చు, కానయితే, ఆత్మగౌరవం పోతుందని భయపడి, ఇది వరకు నువ్విందుకు ఒప్పుకున్నావు కాదు. అలాంటి నువ్వే—మళ్ళీ ఇప్పుడు ఆత్మ

గౌరవం వదిలేసు కుంటావా. అరుణదా!—అదే నీ ఉద్దేశమయితే. నువ్వేమయినా చెయ్యి గానీ. ఈ ఊళ్లోమట్టుకి ఉండొద్దు."

"సరి. నే నింకో ఊళ్ళో ఉంటేకూడా. అక్కడమాత్రం నువ్వు నన్నుసహ్యం చుకోవూ?"

"ఒకవేళ అలాగే నేను ఏవగించుకుంటా ననుకో. అందువల్ల నీకు కలిగే నష్ట మేమిటీ?"

"సంధ్యా!—నువ్వో అనగలిగావా ఆక్షరాలా ఈ మాట?"

అందుకు సంధ్య చెప్పింది—

"నా లజ్జకూ, సంకోచానికీ గల ఆవరణ కూడా నువ్వు ఉండనివ్వావు కావు అరుణదా!—ఈ విషయాన్ని ఇంగితచేతా, ఆభాసచేతా ఎన్నోసార్లు నీకు సూచనగా తెలిపాను. కాని సార్థక మేమిటుంది?—నువ్వు బలిమిని చేసిన యాచన ఏవిధం గానూ ఆగలే దీనికి మానాన్న ఒప్పుకుంటే ఒప్పుకోనీ. మా అమ్మ మరిస్తే మర వనీ. కాని నేనయితే మాత్రం ఎన్నటికీ మరిచిపోలేను. నే నెంతో గొప్ప బ్రాహ్మణ కన్యను!"

"మరి, నేనో? అని అడిగాడు అరుణ్. ఆశ్చర్యంతో. మతిమాలిన వాడి లాగా.

"నువ్వూ నాజాతి వాడవే!—కాని పులీ, పిల్లీ ఒకటి కాదుగా. అరుణదా!"— ఈ మాటయితే అనేసింది కాని. వెంటనే లోలోపల గడ గడలాడి వొణికిపోయింది.

మరి మాటా, పలుకూ ఆడలేదు. అరుణ్. ఆశ్చర్యంతోనూ. అంతులేని వేదన తోను నిండిపోయిన తన రెండుకళ్ళూ సంధ్య ఎదటనించి తప్పించుకున్నాడు.

బలవంతగా తెచ్చిపెట్టుకుని నవ్వుదామని ప్రయత్నించింది సంధ్య.

"మవెక్కడిక యినా వెళ్ళు అరుణదా!—ఎక్కడి కెళ్ళినా నన్నుమాత్రం మరిచి పోవటం అంత తేలికైన పనికాదు. ఎప్పుడూ నీకు జ్ఞాపకముంటా. ఎందుకంటే— చీటికీ మాటికీ నేను చేసినన్ని అవమానాలు నీకు మరెవ్వరూ చెయ్యలేదు. కనక. నీ హృదయంలో నాకు శాశ్వతమయిన స్థానముంది!" అన్నది.

మొహం ఎత్తి అరుణ అడిగాడు: "ఇంతకీ. నువ్వెందుకోసమని వచ్చావో. ఆసంగతి చెప్పావు కాదేం; ఇంతదాకా?"

ఇందుకు జవాబుగా సంధ్య చిరునవ్వు నవ్వింది! ఒక్కక్షణం ఆగి ఇలా అన్నది "ఈ ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విషయాలకు అంతూ పొంతూలేదు...." అని ఇంకా ఏదో చెప్పబోయి, ఆగింది.

మళ్ళీ అన్నది—' అయినప్పటికీ, నా మర్యాదను నువ్వు కాపాడకపోతే, ఇహ కాపాడేవారు మరెవ్వరూ లేరు. ఈ మాట నువ్వు నమ్ముతావా, అరుణదా?''

అరుణ్ చూస్తూ ఊరుకున్నాడు, మౌనంగా.

''ఒక యానాదివాడు కోడల్ని, మనమరాలినీ ఇంటోంచి వెళ్ళ గొట్టేశారు. ఆ స్థితిచూసి మానాన్న వాళ్ళని వెంటబెట్టుకొచ్చాడు. నేను వాళ్ళకి చోటిచ్చాను.'' అని చెప్పింది.

''ఎక్కడ?'' అనడిగాడు.

''మా పశువుల పాక ఉందిగా, పాతది? అందులో, కాని, బ్రాహ్మణ వాడకట్టున వాళ్ళ నుంచటానికి వీల్లేదు.''

విస్మయంతో అడిగాడు అరుణ్! ''ఎంచేత?''

అందుకు సంధ్య ఇలా చెప్పింది :—

''ఎంచేత నేమిటీ?—వాళ్ళు యానాదివాళ్ళు కదా వాళ్ల మన నూతుల్లో, చెరువుల్లో, రేవుల్లో ఎగబడి నీళ్ళు తోడుకుంటారు నదిదార్లో మేకలకి గంజి పోస్తారు. గోలోక చటర్జీ తాతగారు ఎంత మహా పూర్వాచార పరాయణుడు! తెలియక ఆయన ఎక్కడ తొక్కుకుపోతాడో అ అంటు సొంటూ అని చెప్పి మా అమ్మకి భయం. అందుకని, రేపొద్దున్నే వాళ్ళని పేషరుకట్ట తిరగేసి, నాలుగు తిన్ని తగిలేసి, మరీ స్నానం చెయ్యాలి అని చెప్పి పంతం పట్టి కూర్చుంది. వాళ్ళకొక్కొత్త చోటివ్వాలి అరుణదా! వాళ్ళకేంలేదు పాపం! తల దాచుకోటానికైనా నిలవ నీడలేదు.'' అని చెప్పింది.

అందుకు అరుణ్—''సరి, నువ్వు చెప్పిందంతా బాగానే వుంది. కాని, చోటెక్కడుంది?''

''అదంతా నాకేం తెలుస్తుంది? ఎక్కడయినా ఉందేమో నువ్వే చూడు. నీతో గాకపోతే, మరెవ్వరిదగ్గరికి పోయి చెప్పనూ ఈ విషయం?''

ఆలోచనలో పడ్డాడు, అరుణ్.

''మాకు ఒరియా తోటమాలి ఉన్నాడు, తెలుసుగా? ఇప్పుడు వాడు వాళ్ళ దేశం వెళ్ళాడు. మరైతే వాడి పాకలో ఉండగలరేమో కనుక్కో! వాళ్ళు గనక ఉండేట్టయితే, ఆజాగా సర్దించి సిద్ధం చేయిస్తా'' నన్నాడు.

ముఖంఎత్తి నోటితో జవాబు చెప్పలేకపోయింది, సంధ్య, సరేలే, కాపీ అన్నట్టుగా తలమాత్రం తిప్పి అంగీకారం తెలిపింది.




''అలా అయితే వాళ్ళ నిక్కడకు పంపించు. ఒహవేళ తోటమాలి తిరిగివస్తే, వాడికి మరో ఏర్పాటేదయినా ఆలోచిస్తా తరవాత." అని చెప్పాడు అరుణ్.

ఈ మాటకూ సమాధానం చెప్పలేకపోయింది సంధ్య. ఇందాకటి లాగే నత నేత్రాలతో నించుని ఉండి తనకు తనే సంభాళించుకుంటూందో, యేమో! అలాగే ఉండివుండాలి.

ఆ తరవాత కొంతసేపటికి మెల్లిగా యిలా అన్నది—''ఇప్పుడు నా నోట్లో తాంబూలం లేదు. పైగా స్నానం చేసి పోదామని వచ్చా. కనక ఇప్పుడే మీకు ఒక్క మాటు నమస్కరించి, పాదధూళి తీసుకువెళతా!'' నంటూ, ఆమె సాష్టాంగ పడి పాదాభివందనం చేసి, అతడి పాదధూళిని శిరస్సున ఉంచుకుని, గబగబా అక్కణ్నించి వెళ్ళిపోయింది.

సంధ్యను మళ్ళీ వెనక్కి రమ్మనటానికిగాని, మరేమయినా అడగటానికిగాని, ఎంత మాత్రం ప్రయత్నించలేదు అరుణ్. ఆమె వెళ్ళిన దిక్కే చూస్తూ స్తంభంలాగా కదలక మెదలక అలాగే నించున్నాడు.

# 7

అటు తరవాత బహుశా రెణ్ణాళ్లయి వుంటుంది—ఒకనాడు జగద్ధాత్రి చెరువుకి స్నానానికని వెళ్ళి తిరిగి ఇంటికి వస్తూంది. వస్తుంటే దార్లో రాసమణి యెదురు పడ్డది.

రావమణి కళ్ళూ మొహమూ చూడబోతే, అపరిమితమైన ఉత్తేజంతో వున్నాయి. వాటిల్లో పట్టుదల కనిపిస్తూంది. ఈ లక్షణాలతో ఉబ్బి తబ్బిబ్బయి పోతున్నది. కళ్ళ నీళ్ళతో గద గదమంటూ అలా దగ్గరసా వచ్చింది.

అదో విధమయిన కంఠస్వరంతో ఇలా అంది: "జగ్గూ!....మా అమ్మ, జగ్గువి కాదటే!—నీకూతురు పిచ్చితల్లి, ఉండుండి చివరికి ఎంతెలాంటి తపస్సు చేసుకుందే! ఎంత పుణ్యం, ఎంత పుణ్యం! ఆహా!—ఇది స్వప్న కథల్నికూడా మించిపోయిందే! ఎంత అతీతమయిన విషయం! ఎంత వింత! ఎంత ఆశ్చర్యం!—"

ఇదేం అర్థంకాలే జగద్ధాత్రికి. అయితే, ఆమె నోట్లోంచి తన కూతురిమాట రాగానే మనస్సులో చెప్పలేనిభయం పట్టుకుంది.

అమిత ఆత్రంతో ఇలా అడిగింది—"ఏం జరిగిందేమిటి పిన్నీ? మా సంధ్య ఏం చేసిందీ?—"

"ఏం చేసిందా? అదేం చేసిందో, అలాంటిది మరే పిల్లయినా ఈ ప్రపంచంలో చేసిందేమో చెప్పూ, చూదాం! సరే కాని ఈ తడిబట్టలతోటే, ఈ తడితలతోనే ఈ మట్టున పవిత్రంగా వెళ్ళి ఆ శ్రీధరుడిముందు సాష్టాంగ నమస్కారంచేసి రా! పంచానను డికి విశాలాక్షీదేవికి సహస్రనామ పూజలతోనహా భోగం చేయించూ! ఆ దుర్గాదేవికి పసుపు కుంకుమలు నలిపించూ! వీటన్నింటి మాటకేం, ఇదుగో ముందుగానే చెప్పి పెడుతున్నా—అమ్మాయి ధరించటానికిచ్చే ఇష్ట కవచంతోపాటు, నేను మెళ్లో వేసుకోటానికిగ్గానూ ఒక మోటయిన బంగారపు హారంకూడా తయారు చేయించాలి సుమా!—అన్నది.

కలవరపడింది జగద్ధాత్రి.

"ఏమిటిపిన్నీ, ఏం జరిగిందేం?—విప్పి చెప్పకపోతే నాకేం తెలుస్తుందీ?" అన్నది.

రావమణి నవ్వుతూ అంది—"విప్పి చెప్పాలా? చెప్పాల్సిందేనా? అటయితే చెప్తా, విను: మీ తల్లీ కూతుళ్ళు చేసుకున్న పుణ్యం ఇంతా అంతాకాదే! ఎంతో మహాపుణ్యం చేసుకున్నారు. లేకపోతే ఇంత పొందికగా, ముచ్చటగా ఎన్నటికయినా జత పడేదేనా! పిల్ల దానిపెళ్ళి ఎల్లా చేస్తావా అని ఆలోచించి అట్టుడికిపోతున్నా, దిగులెట్టుకు ఛస్తున్నానంటే నమ్మూ! ఇహ భయవాలేదు. పో!—ఒక్కమాటుగా రాజుగారికే అత్తగారివై కూర్చో, పో!" అన్నది.

జగద్ధాత్రి ఈ మాటలువిని, కంటిగుడ్లు కపాలంలో పెట్టుకుని, చూస్తూ నిల బడ్డది.

ఎంతో దయ ఒలకబోసే మాటలతో రాసమణి ఇలా అన్నది—ఇది తెలియని దోషం. నీ ఒక్కత్తె దోషమే కాదు. ఈ సంగతి విన్నప్పుడు మొదట నాకూ అలానే అనిపించింది. నేనూ నీకుమల్లేనే గుడ్లప్పగించి చూశాను. నిదరోతూ నిద్ర రోతూ కల గంటున్నానా యేం చెప్మా అని కూడా అనుకున్నాను" అని చెప్పింది.

"విప్పి చెప్పు పిన్నీ. ఏం జరిగిందో? ఆకాశమూ పాతాళమూ గాలించినా కూడా అసలు విషయమేమిటో అంతుపట్టక ఛస్తున్నా!" అన్నది జగద్ధాత్రి.

అప్పుడు రాసమణి జగద్ధాత్రి కుడిచెయ్యి తన పిడికిటితో పట్టుకుంది. దగ్గరకు ఆమెను లాక్కుంది చెవిదగ్గిరికి మూతి పోనిచ్చి. ఇలా గుస గుస లాడింది :

"అమ్మాయీ!—ఇదుగో, ఈ సంగతి పరమ రహస్యంగా ఉంచాలి సుమా. సంతోషం పట్టలేక, ఉత్సాహం కొద్దీ నలుగురి ముందరా ఇప్పుడే చెప్పేసేవు గనక! ఎంతోమంది పడగొట్టెయ్యాలనీ, కాకుండా చెయ్యాలనీ చూస్తుంటారు.

"ఛటర్జీ దాదా ఈ లోకంలో నన్నుతప్ప ఇంకో నరమానవుణ్ని నమ్మడు తెలుసా? అంచేతనే చీకటితో నన్ను పిలిచి, "జగద్ధాత్రి దగ్గిరకెళ్ళి, ఈ కబురు చెప్పిరా. పో!—ఇహముందు పిల్ల దాని పెళ్ళికోసమని బెంగెట్టుకు హతమైపోవలసిన పనిలేదు. దాన్ని నా చేతిలో నేపెట్టి, ఏకంగా రాజుగారికి అత్తగారిపై కాలుమీద కాలేసుకుని నిర్భయంగా కూచోమను" అని చెప్పాడు.

"ఈ మాటలు వినగానే నేనే మనుకున్నానో తెలుసా?—అసలే మా వైకుంఠ పురం బావురుమంటూ శూన్యంగా కనిపిస్తూంది. ఆ పిల్లవాణ్ని పెంచటానికా ఆ దిక్కు లేకపోయె. సరే ఇప్పుడు బాగానేవుంది—ఒక్కపనితో రెండు కార్యాలూ కలిసొచ్చాయి! మొదటిది బ్రాహ్మడి కులం రక్షించడం. రెండోది ...
ఊళ్లోనే ఉండిపోవటం. మీకయినా ఒక్కత్తే కదా కూతురు—"

ఇలా అన్నది కాని, రాజుగారికి కాబోయే ఆ అత్తగారి మొహంచూసి, చెబుతూ చెబుతున్న తన మాటను మరి పూర్తి చెయ్యలేకపోయింది.

జగద్ధాత్రి వింటూ వింటూనే కొయ్యబారిపోయింది.

డిల్లబోయింది రాసమణి : "అదేమిటే జగ్గూ! అల్లా అయిపోయావ్?" అన్నది.

జగద్ధాత్రి కాస్సేపటికల్లా తేరుకుని, యథాస్థితికి వచ్చింది. ఒక్కసారి విట్టూర్పి ఇలా అంది—"కాదులే పిన్నీ! ఛటర్జీ మామ అలా విన్ను తమాషాచేసి వుంటాడు; అంతే!" అన్నది.

"తమాషా ఏమిటి జగ్గూ—నా కిన్నేళ్లొచ్చినయ్, తమాషా అంటే ఏమిటో ఎరగనంటావా? అదీగాక, అక్కా తమ్ముళ్ళ మధ్యని ఎక్కడయినా తమాషా

లుంటాయా, చెప్పు!''

''కాకపోతే మరేమిటి పిన్నీ! ఇదెన్నడయినా జరిగే మాటేనా?'' అనడిగింది. జగద్ధాత్రి.

రాసమణి నవ్వింది కొద్దిగా. ''నిజమేనా అమ్మాయీ! మొట్టమొదట నాకూ ఈ విషయం తమాషాయే అనిపించింది. ఏమిటిదంతా? ఇప్పుడు నేను కలగానే కంటున్నానా, మేలుకునే వున్నానా? అని అనుకున్నాను. లేదు లేదు. మేలుకునే వున్నానని వెంటనే తెలుసుకున్నా. ఇదంతా నిజానికి పిల్లదాని అదృష్ట మనుకో! మరేం కాదు. కాకపోతే కులీనుల కన్యకు ఇంతటి అదృష్టం పట్టడం ఎప్పుడయినా విన్నామా? మన పిచ్చి తల్లికి కన్నెచెర వొదిలిపోవాలి, దాని పసుపు కుంకుమలు చల్లగా వుండాలి!'' అని దీవిస్తున్నా. నేను ఇందాకా చెప్పినట్టుగా అంగరంగ భోగాలు చేయించు, ఆ తరవాత వైభవం నువ్వే చూస్తువు గాని! ఇక ఈ మాట అయిదో చెవిని పడనీయకు సుమా! కానియ్యండి, తక్షణమే ప్రధానం కానిచ్చెయ్యండి, తాంబూలాలు పుచ్చేసుకోండి!'' అంటూ వేగిరపెట్టింది రాసమణి.

నోటమాటరాక, బొమ్మలా అలానే నిశ్చేష్టురాలై నిలబడి పోయింది, జగద్ధాత్రి.

మళ్ళీ అందుకుంది రాసమణి!—

''చూడు జగ్గూ!—ఈ మార్గశిరం దాటిందంటే మళ్ళీ యేడాదిదాకా మంచిది కాదు, పెళ్ళిళ్ళ ముహూర్తాలు లేవుట. మా ఛటర్జీ దాదా వుద్దేశం—''

కొంచెం ముసిముసినవ్వులు నవ్వింది రాసమణి, ఇంకా యిలా చెప్పింది :—

''మనసు మారడం అనేది ఎందుకు సంభవిస్తుందిలే, పిల్ల బంగారు బొమ్మ. కేవలం శ్రీమహాలక్ష్మి విగ్రహం! దాన్ని చూస్తే మహామహా మునీశ్వరులే మోహపడతారు, వాళ్ళకి సయితం మనస్సు చెదిరిపోతుందే? అలాంటిది ఇక మన ఛటర్జీదాదా అనగా ఎంత? ఆయన లెఖ్ఖేమిటి?—''

అంటూ జగద్ధాత్రి చేతిమీద వేలితో కొట్టి చిన్నచిటిక వేసింది, ''పదవే తల్లీ!— ఊఁ—వెళ్ళమ్మా, వెళ్ళు! తడి బట్టల్తో అలా నించోకు!—చాలా పొద్దోయింది, నేను వెళతా, తరవాత మళ్ళీ ఓమాటు వస్తాలే. ఇంకా చెప్పాలిసిన మాటలు చాలా ఉన్నాయ్!'' అని చెప్పి, మరొక్క క్షణంకూడా వృధాకానివ్వకుండా ఇంటికేసి దారి తీసింది, రాసమణి.

ఈ విధంగా సంభాషణ జరగ్గానే చెరువువించి వస్తున్న జగద్ధాత్రి తూలుతూ తూలుతూ ఎలాగో అలా యింటికి చేరుకుంది. వచ్చి వచ్చి పూజామందిరానికి పక్కగా వున్న అరుగుమీద నీళ్ళబిందె భదేల్మని కూలేసింది. ఆ తడిగుడ్డలతో తనుకూడా

అక్కడే కూలబడింది. ఆమె కళ్ళు రెండూ వేడి కన్నీళ్ళతో నిండిపోయినయ్.

ఆమెకు గల సంతానం ఈ కూతురు ఒక్కర్తే. ఈ కూతురు సంధ్య— రూపంలో నైతేనేం, గుణాల్లో ఆయితేనేం నిజంగా లక్ష్మి! అటువంటి ఈ లక్ష్మి ప్రతిమని గోలోక ఛటర్జీ అనే నరక కుండంలో విడిచిపెట్టాయ్యాలని పిలుపు వచ్చింది.

వయస్సునిబట్టి చూస్తే, ఈ గోలోక ఛటర్జీ అనే వరుడు సంధ్య తాతగారి కంటే కూడా ఎంతో పెద్ద! అటువంటి ఛటర్జీ మహాశయుడి చేతిలో పిల్లని పెట్టడంకంటే ఆ యమధర్మరాజుకి అప్పగించడమే మంచిది.

ఈ ఉద్దేశం అగ్నిశిఖలాగా తల్లిహృదయంలో మసులాడుతూంది. అయినప్పటికీ "ఇవ్వను" అనే ఒక్కమాట తన నోటితో తను పైకి అనలేకపోయింది.

సహజ సిద్ధంగా ఆమె సద్బ్రాహ్మణ వంశంలో పుట్టింది—తన సంఘంలోనూ, తోటి కుటుంబాల్లోనూ ఇలాంటిదో వింత కాదు. విచిత్రం కాదు. ఇంతకు మించిన ఘోరాలనూ, వైపరీత్యాలనూ ఆమె కళ్ళారా చూసింది. అంచేత, తన కూతురి మాట తలపు వచ్చినప్పుడల్లా హృదయంలో మంట రగుల్తూనే వుంది.

అలా అని చెప్పి,ఇలా జరగడ మనేది అసంభవం అని ఆ మంటను ఆర్పేయ టానికి ఎంత వెతికినా, ఆమె కొక్క నీటిబొట్టయినా దొరకలేదు.

ఒక్కర్తే మౌనంగా కూర్చుని, కళ్ళొత్తుకుంటూ వుంటే, ఆమెకు మనస్సులో యిలా తోచింది— 'ఇహ కొద్దిరోజుల్లో తప్పక ఈ సంబంధమే ఖాయమై కూర్చుం టుంది. రోతమనిషి అయిన ఆ ముసిలాడికి దీన్ని పెళ్ళాడాలనే దుష్ట ఆలోచన బాగా కలిగింది. భయంకరుడయిన ఆ ఛటర్జీకి ఒక వాంఛ కలిగిందంటే, అది తుడిచివెయ్యటానికి ఎవ్వరికీ సాధ్యం కాదు. కనక దీని కేమిటిప్పుడు ఉపాయం? దారి? తెన్ను?—ఏమీ దొరికేట్టు కనిపించదు దేవుడా!—" అని ఒకవిధమయిన భీతాహం పట్టుకుంది.

ఆ రోజున గోలోక ఛటర్జీ తనతో రహస్యంగా మాటాడిపోయిన మాటలే జగద్ధాత్రి హృదయంలో గిర్రున తిరుగుతున్నాయి. ఆ మాటల్లో ఇంత విషం మిళితమై ఉందని అప్పుడెవరూ సందేహించ లేక పోయారు కదా!

* * *

ఒక్కొక్కడుగే వేసుకుని, ఓ ఉత్తరం చదువుతూ చదువుతూ, ఎదటి గుమ్మం లోంచి సంధ్య లోపలికి వస్తూంది. ఉత్తరం చదవడం యింకా అప్పటికి పూర్తి అయి వుండదు, బహుశా కన్నెత్తి అటూ యిటూ చూడకుండానే 'అమ్మా! ఎక్కడే

అమ్మా!'' అని పిలిచింది.

గబగబా కళ్ళనీళ్ళు తుడిచేసుకుని జగద్ధాత్రి చటుక్కున ఇవతలికి వచ్చింది.

''ఎందుకే తల్లీ!'' అని పలకరించింది.

తల్లిమాట భారంగా, కంఠస్వరం బొంగురుపోయినట్టుగా వినిపించింది. అంచేత వెంటనే సంధ్య ఆశ్చర్యంతో ముఖం పైకెత్తి చూసింది. మెల్లి మెల్లిగా దగ్గరికొచ్చి, ''ఏం జరిగిందేమిటమ్మా!'' అనడిగింది.

కూతురుతీక్షణదృష్టితో చూడటం కనిపెట్టింది జగద్ధాత్రి. ఆ వాడి చూపులనించి మొహం పక్కకి తిప్పి, తప్పించుకుని ''ఎబ్బే, ఏంలేదమ్మా!'' అని అంది.

తురికా_త్త దగ్గరకొచ్చింది సంధ్య తల్లి కళ్ళు తన పైటకొంగుతో జాగర్తగా తుడిచింది. జాలి గొంతుకతో అడిగింది—''మా నాన్న యివాళేమయినా చేశాడా అమ్మా?''

''ఎబ్బే, లేదమ్మా! ఏం చెయ్యలే!!'' అన్నది తల్లి.

కూతురి కీ మాట ఎంతమాత్రం నమ్మకం తోచలేదు మెల్లి మెల్లిగా తల్లి దగ్గిరసా వచ్చి కూచుంది. ''అమ్మా!—సంసారంలో సందర్భాలన్నీ మనకి అనుకూలంగా ఉండవమ్మా! అలా ఉంచుకుందామంటే అది మన అధీనంలో విషయంకాదు. మా నాన్నని అందరూ ''పిచ్చి మారాజు, పిచ్చి మారాజు'' అని పిలుస్తూ ఉంటారు. వాళ్ళలాగా నువ్వూ అలాగే అనుకోరాదమ్మా?'' అన్నది.

''అనుకుంటారమ్మా, లోకులూ!—వాళ్ళయితే అనుకోవచ్చు. దానివల్ల వాళ్ళకి కలిసొచ్చిందీలేదు, పోయిందీలేదు. కాని, నా లాగా ఈ బడబాగ్నిని ఎవరూ సహించలేరు అమ్మాయ్!'' అని చెప్పింది జగద్ధాత్రి.

''ఏమిటీ బడబాగ్ని? అదెటువంటిది? దాని తాపాన్ని ఎవరికోసం ఎవరు ఓర్చి సహిస్తున్నారు?'' ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నకు సంధ్య సమాధానం తెలుసుకో లేకపోయింది. తన తండ్రి ఒకరికి అపకారం తలచడు. అతనికి విరోధి అన్న వాడెవ్వడూ లేడు. ఇతరుల బాధలన్నీ ఆత్రంతో తనపై తెచ్చిపెట్టుకుని వాటిని తనే అనుభవిస్తాడు. ఎంత తెలివితక్కువవాడూ!

అటువంటి అమాయకుడైన తండ్రిని గురించి విచారిస్తున్న సంధ్య మనస్సు పితృభక్తిచేతా, సమవేదనచేతా కరిగిపోయింది. కళ్ళు రెండూ నీళ్ళతో నిండిపోయినయ్. అశ్రువులు జలజల రాలాయి.

''అమ్మా!—నాకు సాధ్యమయే పనైతే, మా నాన్నని నేను ఏ అరణ్యాల్లోకో, పర్వతాలమీదికో తీసుకుపోయి వుండేదాన్ని. ఆయన దుఃఖం అప్పుడెవరూ సహించ




వలసిన పని వచ్చేదికాదు!'' అన్నది.

గబుక్కున జగద్ధాత్రి కూతురి బుగ్గలు పుణికి ఒక్క ముద్దెట్టుకుంది. ప్రేమతోనూ. వాత్సల్యంతోనూ.

"ఏమిటే అమ్మా. అలాంటి అమంగళపు మాటలు? నీకు నేనేం పవిత్తల్లిని కాదుగా! మీ నాయనగారిని ప్రేమించేదానిలో సంగోరయినా. నన్నెన్నడైనా ప్రేమించావుటే. సంధ్యా!'' అంది.

"అయితే. నిన్ను నేను ప్రేమించటం లేదా అమ్మా?'' అనడిగింది కూతురు.

"అది కాదులేవే! ఏమైనా నీ ప్రాణమంతా ఆయనమీదే. దార్లో నడుస్తూంటే నాన్నగారి కాళ్ళలో కరకర ఎక్కడ గుచ్చుకుపోతుందో అన్నట్టుగా వుంటుంది నీ మనస్సు.

"ఆయనిచ్చేమందు ఏమీ పనిచెయ్యదని నీకు బాగా తెలుసు. అయినా, ఆయనెక్కడ చిన్నబుచ్చుకుంటారో, ఆయన మనస్సుకేం కష్టం కలుగుతుందో అని మరెవళ్ళమందూ తీసుకోక ప్రాణాలమీదికి తెచ్చిపెట్టుకుంటున్నావ్. ఈ సంగతి నాకేం తెలియదనుకున్నావా సంధ్యా!''

చేతులు రెండూ తల్లి మెడకి పెనేసుకుని, యిలా అన్నది: సంధ్యా—"అదేమిటే అమ్మా. అల్లాగంటావ్? మా నాన్నలాంటి డాక్టరు మరెక్కడయినా ఉన్నాట్టమ్మా?'' అనడిగింది.

"లేదు తల్లీ. లేదు! నువ్వన్నమాట నిజం!'' అన్నది తల్లి.

కోప మొచ్చింది సంధ్యకు. "పో!—ఊరికే వేళాకోళం చేస్తేనరా? ఎవళ్ళకన్నా జబ్బు ఒక్కనాటికే నయమవుతుందా? ఇదివరకటికన్న నా కిప్పుడు చాలా తేలిగ్గానే వుంది సుమా!" అని ఆ ప్రసంగం అక్కడికి ఆపేసింది.

మాట మార్చి సంధ్య మళ్ళీ యిలా అంది:—

"యానాదివాళ్ళు అక్కడ్నించి లేచి పోయారమ్మా! బతికి పోయారు, పాపం!"

"ఎప్పుడూ?"

"ఏమో నాకేం తెలుసు? చీకటితోనే లేచి వెళ్ళిపోయారు కాబోలు!"

ఇలా తనకేం తెలియనట్టు సంధ్య నటించింది. కాని కృత్రిమమైన ఈ ఉదాసీనత తల్లిని మరిపించ లేకపోయింది.

"వాళ్ళెక్కడికి వెళ్ళారో తెలుసా?" అనడిగింది, జగద్ధాత్రి.

మళ్ళీ అలాగే తనకి తెలియనట్లు నటిస్తూ అంది—"అరుణదా ఇంటి వెనకాతల తోట వుందిగా? అక్కడ వాళ్ళ తోటమాలీ గుడిసె లేదూ? అందులోకిగానే పోయారేమో, బహుశా!"

"అరుణ్ దగ్గరికి వాళ్ళ నెవరు పంపారు? నువ్వే ననుకుంటానే!" అంది తల్లి.

చిక్కులోపడింది సంధ్య. ఇలా యిరుకున పడినందుకు లోలోపలే కంగారుపడినా చివరికి తను చెప్పిన అబద్ధాన్ని యిలా సమర్థించి, బతికించుకుంది.

"అరుణద దగ్గరికి వాళ్ళని నే నెందుకు పంపుతానమ్మా! ఎవళ్ళనీ ఎవరిదగ్గరికీ నేను పంపించలేదు." అంటూ, అసందర్భమయిన ప్రసంగాన్ని చటుక్కున మార్చి దాటేసింది.

వెంటనే తన చేతిలోవున్న ఉత్తరాన్ని మడతవిప్పి విదిలించి పట్టుకుంది.

"ఇంతకీ, అసలు సంగతి నీ కింకా చెప్పనే లేదే అమ్మా! ఈ మాటు తప్పక వస్తున్నానని నాయనమ్మ కాశీనించి ఉత్తరం రాసింది. ఆవిడ ఎప్పుడూ అబద్ధం చెప్పే మనిషి కాదమ్మా! ఈ సారి ఎలాగో ఆమెకి దయపుట్టి నట్టుంది!" అని చెప్పింది.

"అత్తగారు రాశారా? ఎప్పుడొస్తా నన్నారూ?" అనడిగింది జగద్ధాత్రి ఉత్సాహంతో.

జగద్ధాత్రి అత్తగారు సన్యసించి, కాశీలో నివాసం ఏర్పరచుకుని వుంటూందిగా? కాశీపట్నం వదిలిపెట్టి బయట ఎక్కడి కెళ్ళాలన్నా ఆమె ఎంతమాత్రం ఇష్టపడదు. అటువంటి అత్తగారికి జగద్ధాత్రి యిలా ఉత్తరం రాయించింది—

"అత్తగారికి నమస్కారం. నాకిది ఒక్కర్తే కూతురు కదా! ఈ మనమరాలి

పెళ్ళికి మీరు తప్పక రావాలి. రావడమే కాదు. కన్యా ప్రదానం మీ చేతులమీదుగా జరిపించాలి ' అని అనేకవిధాల బతిమాలుతూ ఉత్తరం రాయించింది.

కన్యాదానం చెయ్యడాని కయితే ఆ అత్తగారు ఎంతమాత్రం ఒప్పుకోలేదు గాని. పెళ్ళికి ముందుగా వస్తాననిమట్టుకు జవాబిచ్చింది.

తన పెళ్ళిమాట వచ్చేటప్పటికి సంధ్య సిగ్గుపడింది. నీ ఉత్తరానికి సమాధానం నువ్వే చదువుకో అమ్మా !—'' అంటూ ఆ ఉత్తరం తల్లిముందు పడేసింది.

అంతలోనే హడావిడిగా యిలా అంది :—

' అమ్మా !—నువ్వింకా తడిగుడ్డలతోనే ఉండిపోయావే? వెళ్ళొస్తానుండు. గబుక్కున పోయి నీకు పొడిబట్టలు తెచ్చిస్తా' నంటూ గబగబా వెళ్ళిపోయింది

అత్తగారు రాయించిన ఆ ఉత్తరం భక్తికొద్దీ శిరస్సున పెట్టుకుంది జగద్ధాత్రి. "కోడలిమీద యిన్నాళ్ళకి దయ కలిగిందా, అమ్మా !" అని అనుకుంటూ, లేచి మెల్లి మెల్లిగా పూజాగృహంలోకి వెళ్ళబోతూంది

* * *

అంతలో అకస్మాత్తుగా ఆమె భర్త గోలగోల చేసుకుంటూ యింట్లోకి వచ్చి పడ్డాడు

"రెణ్ణాళ్ళు నే వోలేదు. రెణ్ణాళ్ళు చూడలేదు. ఆపళంగా హైపోకాండ్రియా డెవలప్ చేసు కుంటున్నాడు !" అన్నాడు.

మామూలప్పు డయితే సామాన్యంగా జగద్ధాత్రి మగడితో అట్టే ఎక్కువగా మాటాడదు. ఇప్పుడతడు చేస్తున్న మహా గందరగోళమూ, ఇదివరకెప్పుడూ లేంది ఇవాళ పన్నెండు గంటలు కొట్టకముందే యింటికి రావడమూ చూస్తే ఆశ్చర్యపడింది. ముఖం పైకెత్తి, అలిసిపోయిన గొంతుతో యిలా అడిగింది—' ఎవరికేమిటండీ. జబ్బా ?''

"ఇంకెవరికి ? అరుణ్‌కు. అది హైపోకాండ్రియా అని నేను సరిగ్గా డయాగ్నయిజ్ చేశా కాదనటాని కెవడి బాబుతరం ? ఇదేమిటో విపినుణ్ని చెప్పమను చూదాం, దీని సంగతి !''

ఇంకొకప్పుడయితే జగద్ధాత్రి మరి మాటాడకపోయేదే. కాని, అరుణుడి పేరు వినగానే కలతపడింది. ''అరుణ్ కేమయిందండీ ?'' అనడిగింది, ఆత్రంగా.

"చెప్పాగా, ఇంకేం చెప్పాలి ? అయినా, అదేమిటో ఆ విపినుడికే తెలియ లేదాయె, ఇహ నీకా తెలిసేది ? ఏదోలే, అతగాడు కొంచెం ప్రాక్టీస్ గ్రీక్టీస్ చేస్తున్నాడుగా ? ఈ పాటి తెలియకపోతే ?—

"సరే. అరుణ్ మూటా ముల్లే సర్దుకున్నాడు. ఇల్లూ—వాకిలీ, తోటా—దొడ్డీ, పొలం—పుట్రా సమస్తంగా అమ్మకానికి పెట్టాడు. హరీంద్రుడు కొనటానికి తయారుగా వున్నాడు. అదృష్టవశాత్తు ఇంతలో నే వెళ్ళి పడ్డా?

"ఏ పూట నయితే నే నెటుకేసి అయితే వెళ్ళనో, ఎవర్నయితే చూడకుండా వుంటానో, అపళంగా అక్కడ తప్పకుండా యిలాంటిదేదో ఒక విడ్డూరం జరిగే తీరుతుంది."

"ఇలా అయితే నే నిహ బతకలేను బాబూ —సంధ్యా!—మళ్ళీ ఎక్కడి కెళ్ళావమ్మా యిప్పుడూ? చటుక్కునపోయి మెటీరియా మెడికా ఒక్కమాటు పట్టు కొస్తూ! ఒక రెమిడీ సెలెక్టుచేసి పట్టుకెళ్ళి ఇచ్చేసొస్తాను" అన్నాడు ప్రియముఖర్జీ.

"ఇదుగో, వచ్చేస్తున్నా నాన్నా!" అంటూ ఒక లావుపాటి గ్రంథమొకటి చేత పట్టుకొచ్చి, తండ్రి దగ్గిర నిలబడింది, సంధ్య

"అరుణ్ సంగతి తిన్నగా చెప్పండి—అతడి కేమయిందో తెలిపేట్టు చెప్పండి, మీ కాళ్ళమీద పడతానూ!" అని కోపంగా అన్నది జగద్ధాత్రి.

ఉలిక్కిపడ్డాడు ముఖర్జీ. కాస్త ఆగి యిలా అన్నాడు:

"అదా? హయిపో—అంటే మానసికమైన రుగ్మత. తన ఆస్తంతా హరీంద్రుడికి తెగ నమ్మేసి, ఇవాళ రేపట్లోనే ఈ వూరువిడిచి లేచిపోతాట్ట అతడు! అలా జరిగితే చూస్తూ ఊరుకుంటామూ? వీల్లేదు, వీల్లేదు ఎంతమాత్రం జరగనివ్వను నేను. టు—హండ్రెడ్ పొటెన్సీ మందొహటి—"

సంధ్య ముఖం వెలవెలబోయింది

వ్యాకులమైన కంఠస్వరంతో జగద్ధాత్రి అడిగింది—"ఇల్లూ వాకిలీ అమ్మేసుకు పోతున్నాడా, అరుణ్? ఏమిటండీ, నిజమేనా? అతడికేమైనా పిచ్చెక్కిందా?—"

చెయ్యెత్తాడు ముఖర్జీ, ఎదురుగా పెట్టె—"ఉహుం—అది కాదు! అది కాదు!! అక్షరాలా అది హయిపో కాండ్రియా. అదేం పిచ్చికాదు. కానేకాదు. పిచ్చి అయితే ఇన్సానిటీ అని అంటారు, దాని మందు వేరేగావుంది విపిన్ అయనట్టయితే పిచ్చి అనే పేరే పెట్టుక్కూచునేవాడు, కాని .. "

ఒక్క చూపుతో జగద్ధాత్రి కూతురి ముఖంలోని భావాన్ని గ్రహించింది. ఒక్క మాటు గదమాయించి మగడి వాగ్ధాటిని టక్కున ఆపు చేసేసింది—

"మీ కబుర్లన్నీ వినేందుకు నాకు తీరికలేదు. నిజంగా అరుణ్ దేశం విడిచిపెట్టి పోదలచుకున్నాడా? చెప్పండీ?" అనడిగింది.

"ఇంకా తలుచుకోవడ మేమిటీ? అప్పుడే అంతా సిద్ధమయిపోతేనే! చెప్పుల్లో



కాళ్ళేట్టుకుంటే? సరిగ్గా నేను వెళ్ళాను గనక.....'

"ఆదిగో, మళ్ళీ నేను నే నేనంటారూ? నే నెవళ్ళకొక్కా-వాలీ. అరుణ్ ఎప్పుడు వెళతాడూ అనడుగుతూంటే?—"

పీళ్ళు నములుతూ అటూ యిటూ చూసి, ముఖర్జీ—"ఎప్పుడా? ఇప్పుడే వెళ్తే ఈ క్షణమందే వెళ్ళొచ్చు—లేకపోతే రేపయినా వెళ్ళొచ్చు. వాడు—ఆ హరీన్‌గా డున్నాడే—"

"హరీన్ అంతా కొనేస్తానన్నాడా?" అనడిగింది జగద్ధాత్రి

"అవునూ. అందుకనే కాచుక్కూ-న్నాడు వాడు. చవుకలో కొట్టేదామని...."

"అయితే, ఈ మాట ఊళ్ళో మరెవరికైనా తెలుసా?"

"పిట్టకి తెలియదు. ఈగకీ, దోమకీ కూడా తెలియదు. అదృష్టవశాత్తూ, ఒక్క-నాకు మాత్రం...."

"మీ అదృష్టానికేం లెండి అదంతా వినాలని లేదు నాకు. కాని, అతగాణ్ని ఒక్క-మాటు పిలిచి పెట్టండి. మీ పిన్ని ఒక్క-సారి తొందరగా యిప్పుడే రమ్మన్నదీ, చాలా జరుగురు పని వుందిట అని చెప్పండి!"

ఇప్పటిదకా సంధ్య ఒక్క-మాటయినా మాటాడలే. మెదలకుండా వింటుని అన్నీ వింటోంది. ఇప్పుడు కన్నెత్తి చూసింది ఆమె ముఖం పాలిపోయింది. ఏదో చెప్ప బోయింది. పెదవులు వణికాయి.

తరవాత గట్టిగా అంది—"నువ్వెందుకమ్మా చీటికీ మాటికీ అతన్ని పిలిచి అవ మానం చేదామని చూస్తావ్? ఏ నాడేనా నీ కతడు అంత అపరాధం చేశాడా? చెప్పు.

చూదాం!'' అన్నది.

భయంతోను, ఆశ్చర్యంతోను తల్లి అన్నది— ''అతడికి అవమానం ఎవరు చేయబోతున్నారు, సంధ్యా!''

వొద్దొద్దు—ఎన్నడూ నువ్వతణ్ని ఈ యింటికి పిలిపించకు అని చెప్పింది.

'రెండు మంచిమాటలు చెబుదామని పిలిపిస్తే అదీ దోషమేనా?'' అనడిగింది తల్లి.

''మంచి అయితే నీకేం, చెడ్డయితే నీకేం? అతడు ఈ ఊళ్ళోనే ఉండనీ, దేశాంతరమే పోనీ. నీ కెందుకు? ఇళ్ళూ వాకిళ్ళూ అమ్ముకోనీ, అద్దుకోనీ మన కేమొచ్చింది? రెండు మంచిమాటలు చెప్పడానికి మనకేం సంబంధం ఉందనీ? అతణ్ని నువ్వి ఇంటికి పిలిపించావో, నేను చెర్లోపడి చావకపోతే నీ మీదే ఒట్టు!— చెబుతున్నా....''

అని చెబుతూ చెబుతూనే, తల్లి ఏమంటుందోనని ఆ జవాబు వినదలుచుకోకుండానే, సంధ్య గబగబా వెళ్ళిపోయింది.

జగద్ధాత్రి సహించలేనంత ఆశ్చర్యంతో కళ్ళురెండూ ఇంతింతలు చేసుకుని, చూస్తూ నిలబడిపోయింది.

ప్రియముఖర్జీ మాత్రం ఇలా గట్టిగా కేకపెట్టి అరవడం మొదలెట్టాడు—''పుస్తకం ఇక్కడ పడెయ్యకుండానే వెళ్ళిపోయావా, సంధ్యా!—టయిమైపోతూంది ఈ లోగా ఒక్క రెమిడీ సెలెక్ట్ చేసేస్తాను గదా!''

మళ్ళా వచ్చింది సంధ్య. చేతిలో ఉన్న పుస్తకం తండ్రి ముందట పెట్టి వెళిపోయింది ముఖర్జీ అక్కడే కూర్చుని, మందు సెలెక్ట్ చెయ్యటంలో మనస్సు లగ్నం చేశాడు.

కొంచెంసేపు మాటాడక అక్కడే నించుంది జగద్ధాత్రి. భర్తని అడిగింది— ''అమ్మాయి పెళ్ళి విషయంలో ఇంక చెయ్యకపోవటానికే నిశ్చయించుకున్నారా! మీరూ?''

పుస్తకం తిరగేస్తూ తిరగేస్తూనే ప్రియబాబు ''చెయ్యకపోవడమేమిటీ? నిశ్చయంగా చేస్తా!'' నన్నాడు.

''ఎప్పుడేం? చివరికేదో ఒహటి జరిగిపోయాకనా?''

''ఊఁ—''

జగద్ధాత్రి ఒక్కనిమిషం ఊరుకుని, ''ఒఖ్ఖసారి రసికపూర్ వెళ్ళి చూసి రాకూడదూ? అన్నది.

ముఖర్జీ పుస్తకంలో చూస్తున్న చోటున వేలితో గుర్తుగా పెట్టుకున్నాడు. మొహం ఎత్తి చూసి. "రసికపూరా! ఎవరికేమిటి జబ్బు? ఎవరి దగ్గరి నించైనా కబురొచ్చిందా? ఎప్పుడు చెప్పి వెళ్ళారూ?" అంటూ అడిగాడు.

ఒక్కసారి నిట్టూర్చింది, జగద్ధాత్రి.

"జయరామ ముఖర్జీ మనమడి సంబంధం ఒహటుందని తెలిసింది ఒకసారి పోయి పిల్లాణ్ని చూసుకురాండి!" అన్నది.

అందుకు ప్రియబాబు—"ఎప్పుడు వెళ్ళమంటావ్? తీరికేది చెప్పూ. చూస్తున్నావుగా వీ అంతట నువ్వే—ఒక్కపూట నేను వెళ్ళి చూడకపోతే ఎంత ఉపద్రవం జరిగిపోయిందో! అరుణిడి స్థితి చూడబోతే అలావుందా? ఇహ చూస్తే ఛటర్జీ గారింటి నించి అర్జెంటు కబురొచ్చిందాయె—ఆయనగారి మరదలికి చాలా జబ్బుగావుందనీ."

ఆశ్చర్యంతో అడిగింది జగద్ధాత్రి—"ఎవరికి జబ్బు? జ్ఞానదకా?—ఆవిడకి మళ్ళీ ఏం రోగం!" అనడిగింది.

"పైత్యం! పైత్యం!! ఊరిఖే పైత్యం!!!—ఆహారదోషం వల్ల కలిగిన అజీర్ణం!—దోకులు. దోకులు. ఒకే దోకులు!—అరుణ్ దగ్గరికి పోయి వచ్చేటప్పుడు. ఆ దారినే వాళ్ళింటికూడా వెళ్ళి. ఒక మాత్ర...."

"వాళ్ళకి డాక్టర్లు లోటు లేదు. ఆవిడకి మందు లిచ్చేందుకు చాలామంది వున్నారు గానీ. మీ పాదాలు పట్టుకుంటా. ఒక్కసారి రసిక్‌పూర్ వెళ్ళరండి. పెళ్ళికొడుకుని ఒక్కసారి చూసొచ్చి అమ్మాయి విషయంలో ఏదయినా ఉపాయం చూడండి!" ఆవి బతిమాలుకుంది.

అశ్రువులతో కూడిన భార్య తాలూకు కంఠస్వరం ఎల్లాగో ప్రియబాబుని మన ప్రకృతిలో పడేసినట్టు కనిపిస్తుంది. ఇలా అన్నాడు—"ఏమిటీ; రసిక్‌పూరా? కాని అతగాడు చాలా ప్రబుద్ధుడని విన్నాను. ఎప్పుడూ నిషామీదే ఉంటాట్ట."

జగద్ధాత్రి కిహ ధైర్యం ఆగలేదు ఏడుపు ప్రారంభించింది—"ప్రబుద్ధుడే కానీండి. నిషామీదే ఉండనీండి. పిల్లదాని మెడలో మంగళసూత్రం అనేది కనబడేది చాలు! మీరుమాత్రం మహా తక్కువ కాబోలు! మా అమ్మా నాన్నా నన్ను మీ చేతిలో అప్పగించగా లేంది—మీరుమాత్రం పిల్లని ఒకళ్ళచేతిలో ఎందుకు పెట్టరూ?" ఆవి పైటకొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ, గబగబా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మాట చెప్పలేక క్షణకాలం చూస్తూ కూచున్నాడు. ప్రియబాబు. తరవాత చేతిలో పుస్తకం మూసేశాడు. దీర్ఘమైన ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"ఇంటో ఇద్దరూ ఇద్దరే సాంఘాతిక రోగులు! ఇలా ఎప్పుడూ నన్ను గాబరా

యు ?

పెడుతూవుంటే. ఆలోచించటానికీ. ఏదన్నా రెమిడీ పెలెక్టు చెయ్యటానికీ. ఎలా వీలవుతుంది!" అంటూ. మళ్ళీ ఒకమాటు విట్టూర్చాడు.

పుస్తకం చంకనబెట్టి మెల్లి మెల్లిగా బయటికి వెళ్ళిపోయాడు.

# 8

గోలోక ఛటర్జీ మహాశయుడు స్నానం. సంధ్యావందనం యధావిధిగా నిర్వర్తించుకున్నాడు. చాటుగా మాటుగా కాస్తంత ఆస్వాతికాహారం కూడా ఆత్మకు నివేదన జరిపించేశాడు. మూర్తీభవించిన బ్రాహ్మణ్యంలాగా మెల్ల మెల్లగా మెట్లు దిగి. బహుశా సరాసరి వాకిటిలోకే కాబోలు పోదామనుకున్నాడు!

కాని ఇంతలో ఆకస్మికంగా ఏం తోచిందో. యేమో!—చూరు కిందనుంచి వసారా పక్కకి తిరిగాడు.

వంటింటి గుమ్మానికి ఎదురుగా నిలబడి హఠాత్తుగా కలిగిన తొందరతో ఇలా అన్నాడు—"అసలే జబ్బు మనిషివి కదా. ఈ మేళమంతా నీ కెందుకొచ్చింది చెప్పు. చిన్నావిడా! ఈ కూరలూ నారలూ. కసువు తుప్పలూ. ఇలాంటి అనవసర ప్పనులన్నీ పెట్టుకూర్చుంటే శ్రమకాదూ! ఇబ్బంది కాదూ! ఇందుకోసమే నేనెప్పుడూ "ఒళ్లుముందా, పన్లుముందా!" అని అంటూ వుంటాను. శరీర మాద్యం ఖలు ధర్మసాధనం అని చెప్పారుగదా పెద్దలు!"

కత్తిపీట ముందరేసుకుని కూరలు తరుగుతున్న జ్ఞానద అలా తరుగుతూనే కూచుంది ఛటర్జీ పావుకోళ్ళ ఘోరమైన ధ్వని ఆమె చెవులకు వినబడలేదు. అదే మోస్తరుగా వేడుకతో ఆయనగారు బతిమలాడటం కూడా జ్ఞానద చెవులకు వినబడ లేదు!

ఒక్కక్షణం ఊరుకున్నాడు ఛటర్జీ. ఏమిటి. ఎలావుంది నీ వొళ్ళూ ఖమామఘా ఇవాళ పొద్దుటెలా వున్నట్టు!" అనడిగాడు.

మొహం ఎత్తలేదు జ్ఞానద. చేతిలో ఉన్న వంకాయమీదనే ఉంది చూపంతా. "బాగానే వుంది!" అని ఊరుకుంది.

ఈ జవాబుకి చాలా సంతృప్తి పొందాడు ఛటర్జీ. "మంచిది. మంచిది. అంత మాత్రం నాకు తెలియదంటావా! బాగా తెలుసు. ప్రియముఖర్జీ పిచ్చివాడే కావచ్చు— కాని. మందివ్వటంలో మాత్రం కేవలం ధన్వంతరే! అయితే. అతడు చెప్పిన ప్రకారం సరిగ్గా ఆ టైముకి పుచ్చుకోవాలి మందు. అశ్రద్ధ చేస్తే లాభం లేదసుమా! ఆ మాట ముందుగానే చెబుతున్నా". అన్నాడు.



దేనికీ సమాధానం చెప్పలే జ్ఞానద. తలొంచుకుని తనపని చేసుకుంటూ వుంది.

ఆమెకేసి కొంచెంసేపు చూశాడు ఛటర్జీ. అలాగే నించుని అడిగాడు. "రెండు వేళలా చూసి వెళ్ళాలిసుమా అని మరీమరీ ప్రత్యేకించి చెప్పాను. పొద్దున్న వచ్చారుగా?"

వంచిన తల ఎత్తకుండానే "ఆఁ—" అన్నది జ్ఞానద. సంతోషించాడు ఛటర్జీ.

"రాకపోడు! ఎందుకు రాడూ? నాపైన అతడి కెంతో గురి. కానీ. దాసీముండ ఎక్కడికి పోయింది చెప్మా! అతగాడు తప్పకుండా వస్తాడు. మందిచ్చి వెళతాడు. నువు చూడబోతే ఇలాటి పనిపాటలు పెట్టుకుని ఒళ్ళు పాడుచేసుకుంటావ్. ఇదంతా నాకేం బాగాలే.

"పనివాళ్ళంతా ఏమయిపోయారూ అని అడుగుతా!—ఈ పనులన్నీ అవతలకి తోసెయ్. వెళ్లు—నువు పైకిపోయి కాస్సేపు పడుక్కో! విశ్రాంతి తీసుకో!!—మధుసూదనా. నీవేగతి! నీవే శరణు!!"

ఇలా అని, ఆయన ఈ లోకానికి సంబంధించిన లౌకికాలూ, పార లౌకికాలూ—ఈ రెండు రకాల కర్తవ్యాలనూ కొంతయినా చక్కబరుచుకుని, ఇహ బయటికి వెళ్లాలని ఆలోచిస్తున్నాడు.

అతడి పావుకోళ్ళు కదిలిన చప్పుడయింది. ఉలిక్కిపడింది జ్ఞానద. ముఖమెత్తి చూసింది అయితే ముఖంలో ఆ నాటి ప్రసన్నమయిన చిరునవ్వు కనబడలేదు. ఇప్పుడు ఈనాడు ఆ ముఖాన్ని చింత. విచారం, దుఃఖం ఆవరించుకొని వున్నాయి కళ్ళు రెండూ ఎర్రబడి జ్యోతుల్లా ఉన్నాయి. కనురెప్పల చివరని ఇంకా అశ్రుబిందువులు కనబడుతూనే వున్నాయి.

ఇటువంటి సజలదృష్టిని ఛటర్జీమీద స్థిరంగా నిలిపింది జ్ఞానద. రుద్ధమయిన కంఠ స్వరంతో హఠాత్తుగా ప్రశ్నించింది—

"సంధ్యని పెళ్ళి చేసుకుందామని వుందా. మీకూ? నిజం చెప్పండి. నన్ను మోస గించకండి!"

నీళ్ళు నమిలాడు. ఛటర్జీ. గుటక దిగలేదు. తడుముకుంటూ తడుముకుంటూ కొంత సేపటికి తేరుకున్నాడు "నేనా? సంధ్యనా? ఏమిటి?— ఉ హుం హుం హుం!—ఎవరు చెప్పారు నీతో?"

"ఎవరు చెబితే యేం? వాళ్ళమ్మ దగ్గరికి మీరు రాసదీదీని పంపించారా, లేదా?—వచ్చే మార్గశిర మాసంలో లగ్గం ఏర్పాటయిందా. లేదా? దేవుడి ఎదట ప్రమాణీకం చేసి నిజం చెప్పండి!—" అన్నది.

గోలోక ఛటర్జీ వేలు చూపుతూ, పళ్లు పటపట కొరుకుతూ, అన్నాడు—"రాసమణి చెప్పిపోయిందా? సరిలే. చూస్తానుండు. దాని సంగతి!" అన్నాడు.

చెప్పలేని ఆవేశంతో, దుఃఖంతో—"ఇలా అయితే నన్నెందుకు మీ రన్నివిధాలా పాడుచేసి నాశనం చేసి పెట్టారు? లోకానికి ముఖం చూపగలనా? తలెత్తుకు తిరగ్గలనా?—నిలవటానికి ఆస్కారముందా. నీడయినావుందా! నా బతుకే పోయిందే ?"

అని అంటూండగానే జ్ఞానద కంఠం రోదనతో హృదయ భేదకమై, వెయ్యి వక్కలయింది!

ఈ గడబిడకు గాభరా పడ్డాడు. ఛటక్కి, నలువంకలా బెరికి చూపులు చూశాడు. హడలిపోయాడు. చేత్తో నోరు అణుచుకున్నాడు—"అవురవురా, ఇదేంపనీ—నలుగురూ వింటారు. విని పోతారుసుమా!—నువ్వు విన్నదంతా ఒఠ్ఠి అబద్ధం. శుద్ధాబద్ధం! కల్ల! తమాషాకి......"

జ్ఞానద వెక్కి వెక్కి ఏడుస్తూ అంది—"కాదు కాదు—తమాషా ఎప్పటికీ కాదు! అదంతా నిజం నిజం. అక్షరాలా నిజం! ముమ్మాటికీ నిజం! మీరేదేపడితే అది చెయ్యగలరు. మీకు సాధ్యం కానిపని అంటూ లేదు!"

"కాదు కాదు—నామాట నమ్ము. చెప్పానుగా తమాషా అని తాతా మనమరాలి సరాగం! ఇదుగో, ఇంక ఊరుకో! నక్షత్రకుల్లా జనం వస్తున్నారు."

ఇలా అంటూ అంటూ, కుందేల్లాగా బెదిరిపోయి పాంకోళ్ళు టక టక చప్పుడు చేసుకుంటూ వాకిట్లోకి పారిపోయాడు!

కూరలు తరుగుతూ వుండికదా జ్ఞానద! చేతిలో వంకాయ చేతిలోనేవుంది. బట్ట కొంగు నోట్లో కుక్కుకుని, పొర్లి పొర్లి వస్తున్న దుఃఖాన్ని ఎలా ఆపాలో తెలియక ఆపుకొంటున్న దామె.

• • •

ఇంతలో ఇంటి దాసీది గబ గబా రోజుకుంటూ వచ్చింది: "చిన్నమ్మ గారండీ, చిన్నమ్మగారూ!—గుడ్డి తాతయ్యగారండీ, వాళ్ళ పాత దాసీదాన్ని వెంటేసుకుని ఆయనే వొచ్చేశారమ్మా. సాయంగా!" అని చెప్పింది.

గభీమని కళ్ళు తుడిచేసుకుని "ఏమిటీ!" అని అడగాలని మొహం ఎత్తింది. జ్ఞానద. కన్నీళ్ళతో పలచబడి, కష్టాన్ని సూచిస్తున్నాయి ఆమె చూపులు. అటువంటి చూపులకు ఎదురుగా వున్నదాసీది ఆశ్చర్య పడింది

కొంచెం సిగ్గుతో అంది—"ఆ పాత దాసీని, ఎరగరూ చిన్నమ్మగారూ? దాన్ని వెంట బెట్టుకుని.—గుడ్డి తాతగారు మీ మామగారే కదండీ?—ఆ రొచ్చినారండీ ఇప్పుడు!"

ఈ మాట చెవిని పడేప్పటికి జ్ఞానద ముఖాన కత్తివేసినా నెత్తురుచుక్క లేకుండా పోయింది. ముఖా ముఖి ఆ మృత్యుదేవతని చూసినప్పుడు కూడా, ఎవళ్ళ ముఖమూ అంతలా పాలిపోదు!

భయపడి దాసీది. "అలా ఉన్నారేమండి చిన్నమ్మగారూ?" అనడిగింది.

ఈ ప్రశ్నకూ సమాధానం చెప్పలే. జ్ఞానద. వెర్రిచూపులు చూస్తూ కూర్చుంది.

"ఏదన్నా వంటో మస్తీ చేసిందాండీ? అని మళ్ళీ అడిగింది. దాసీది.

తలఊపి. జ్ఞానద ఇలా అన్నది—"మామగారొచ్చి ఎంత సేపయిందే. కాళీ?"

"ఏమో నమ్మా. ఎంత సేపయిందో! వాకిట్లో నిలబడి. బాబుగారితో మాటాడు తున్నారండి. ఇప్పుడే నే చూశానండి. చిన్నమ్మగారూ!" అని చెప్పింది.

ఆశ్చర్యంతో జ్ఞానద—"బాబుగారితోనా!" అనడిగింది.

అందుకు కాళీ. "ఆఁ—మరేనండి!—బయటినుంచి వస్తూంటే బాబుగారు నన్ను పిలిచారండి. "ఒసేకాళీ!—మామగారొచ్చారు. మిమ్మల్ని తీసుకు వెళ్ళటానికి" అని మీ చిన్నమ్మగారితో చెప్పు." అన్నారండి.

"ఒళెమ్మా!—అదుగో. మాటలోనే వొచ్చేశారండి." అనిచెప్పి. కాళీ కొంచెం పక్కకి ఒత్తిగిలి నిలబడ్డది. ఆ వెంటనే—కర్ర పొడుచుకుంటూ వచ్చేవారెవరో చప్పుడిని బట్టే తెలిసిపోయింది —ఏమంటే!—ఆ వచ్చే ఆయనకి వచ్చేటప్పుడూ వెళ్ళేటప్పుడూ కంటిమీద కంటె కర్రమీదే ఎక్కువ దృష్టి. నిబ్బరమున్నా.

ఆ వెంటనే—ముందగా నడుస్తూ నడివయస్సు దాటిన ఒకదాసీ. దాసీ వెనకాతల కర్ర పొడుచుకుంటూ పొడుచుకుంటూ ఒక ముసలాయనా వస్తున్నారు.

ఆయన ముందరికివచ్చి—"ఏదర్రా. మా అమ్మ ఎక్కడుందర్రా?" అనడిగాడు.

జ్ఞానద లేచివచ్చింది. తలకి గుడ్డ చుట్టుకుని. ఆయనకు సాష్టాంగపడి నమస్కరించి. లేచి నించుంది. కంటిచూపు కనబడకపోయినా. చెహరామబట్టి ఆయన లీలగా మనిషిని పోల్చి పట్టగలడు.

ఆశీర్వాదం చేదామనుకుంటూ. ఆయన దుఃఖ సముద్రంలో మునిగిపోయాడు—"ముసిలాళ్ళం మే మిద్దరమూ ఇంకా బతికే వున్నాం కదా. మమ్మల్ని మరిపించి. ఎల్లా వొచ్చేశావు. తల్లీ!" అన్నాడు.

కూడా వచ్చిన దాసీది జ్ఞానద కాళ్ళమీద పడి దణ్ణం పెట్టింది!

"నిజమేనమ్మా! నిజమే!—ముసిలి అత్తగారేమో. చావుకి సిద్ధంగా వున్నారాయె! ఎప్పుడు చూసినా "మా కోడల్ని చూపించండి! మా కోడల్ని కంటబెట్టండి!" అంటూ ఇదే పలవరింత!—పష్టి ఘడియలూ ఇదే మాట! అలాంటావిణ్ని మరిచిపోయి. ఇన్నాళ్ళెల్లా వున్నారు తల్లీ! కొంచెం చెప్పండీ!" అన్నది.

ఇలా దాసీది మోపిన నేరానికి జ్ఞానద సమాధానమేమీ చెప్పలేక పోయింది. ఒక చేత్తో కళ్ళొత్తుకుంటూవుంది. రెండోచేత్తో ముసలాయన చెయ్యిచ్చుకుని వసారాలోకి తీసుకువచ్చింది. అక్కడో పీట వేసి. ఆయన్ని కూచోబెట్టి. తలవంచుకు మౌనంగా




నిలబడింది.

పీటమీద కూచుని, ముసలాయన ఇలా చెప్ప నారంభించాడు :—

“రెండుత్తరాలు రాయించాను ఛటర్జీగారికి. నా కొక్కదానికీ సమాధానంరాలే. గొప్ప వాళ్ళకి బోలెడన్ని పన్లు. తీరికెక్కడుంటుంది? మనలాంటి పేదవాళ్ళకి జవాబు రాయాలని ఆయన కసలు జ్ఞాపకముంటుందా? అని అనుకున్నా. కాని—మా కోడలు, మా తల్లే!—మా పేద ఇంటికి లక్ష్మి........”

అంటుండగా, ఆయనమాట సాగనియ్యలేదు దాసీది. మధ్యలోనే ఇలా అందుకుంది: “కానీండి, మీ బావగారు మహా గొప్పవారయితే కావచ్చు. ఎవరు కాదన్నారు? అలా అని చెప్పి, ఒకరింటి కోడల్ని తీసి తెచ్చుకుని, ఎన్నాళ్ళు ఇంటో అట్టే పెట్టుకుంటారమ్మా?—దాని మాటకేం?—ఇంతకీ ఎవరికయితే ఇంత కాచి పోద్దామని మీ రిక్కడికి వచ్చారో, ఆ అప్పయ్యగారు కాస్తా పోనే పోయారు. ఇంక నే ననేదేమిటంటే?—”

పూర్తిగా చెప్పనివ్వలే, ముసిలాయన.

“ఆగు నదూ!—ఆ మాటలన్నీ ఎందుగ్గాని. అమ్మాయీ!—మీ అత్త పరిస్థితి చూడబోతే రేపో మాపో అనేట్టుంది. “నా కోడల్ని ఈ పాపిష్ఠికళ్ళ కొక్కమాటు చూపించరా!” అని ఒకటే వాగుడు? “ఇవ్వాళ మంచిరోజు, ఈ రోజునే తీసుకొచ్చి నాకు చూపించండి!” అని మొర్రోమని యేడుస్తే, యిలా బయలుదేరి వచ్చేశాం....” అన్నాడు.

అప్పుడు దాసీది మళ్ళీ యిలా చెప్పింది—ఆ యమ్మ ప్రాణాలింకా పోకుండా, మీ కోసమే కనిపెట్టుకు ఉండి పెనగులాడుతున్నయ్యండి. అప్పయ్యగారూ!—ఆవిడ

గారు నన్ను పిలిచనండీ. "నదూ!—మా అమ్మా, నువ్వయినా వెళ్ళి మీ అమ్మని ఒక్కసారి తీసుకొచ్చి నా కళ్ళకి చూపించవే!" అంటూ వాపోతున్నారమ్మా!" అని చెబుతూండగానే దుఃఖంతో దాని కంఠస్వరం అర్థోక్తిమైపోయింది.

మఃపిలాయన అన్నాడు కోడలితో—"నా రెండు త్తరాలూ ఛటర్జీగారికి అందలేదని నాకు తెలియనే తెలీదు. జవాబింకా రాలేదేమా, ఇంకా రావటం లేదేమా అని మహా ఆలోచించాం. ఎంతగానో ఆత్రపడ్డాం. ఆయన చాలా గొప్పవాడు, బహుయోగ్యుడు ఈ సంగతి వినగానే ఆయనేమన్నారో తెలుసా?—"అయ్యో!—ఎంతమాట!—బాగానే వుందే!—మీ కోడల్ని మీరు తీసుకెళతానంటే ఎవరు కాదంటారు?" అని చెబుతూ, ఆ వెంటనే మేనాకి బోయీలకూ కబురంపి సిద్ధం చేయించారు.

"మీ అత్తగారి జబ్బు చేసిందని వినగానే పాపం, ఎంతో యిదయి పోయాడు "అవశ్యాలంలో జ్ఞానదని మీరు ఇంటికి పంపారు. ఇప్పుడు మీరు ఇలాంటి కష్టాల్లో ఉండగా ఆమెను తిరిగి పంపటానికి అటంకం చెప్పేటంత పాషండు దెవడయినా వుంటాడా, ఈ లోకంలో! ఇప్పుడే మీరు ప్రయాణంకాండి. అందుకుతగ్గ ఏర్పాట్లన్నీ చేస్తాను" అని చెప్పాడు. ఎంతో సానుభూతి చూపిస్తూ.

ఇప్పటిదాకా జ్ఞానద నోరు మెదపలేదు. మాటాడక వింటుంది అకస్మాత్తుగా ఆమె ముఖం వెలవెలా బోయింది.

"ఛటర్జీగారే చెప్పారా ఈ మాటా? ఇప్పుడే పంపేస్తామన్నారా? ఇవాళేనా? ఇప్పుడేనా?" అనడిగింది ఆశ్చర్యంతో.

ఉత్సాహంతో దాసీ సౌదామిని యిలా అంది: "ఆఁ—ఇప్పుడే పంపిస్తామని అన్నారండి. "పంపకపోవట మేమిటండీ? ఈ వెంటనే కాస్త మంచిమాట చేసేసుకోండి. మూడు గంటలబండీ అందుకున్నారంటే తెల్లారేసరికల్లా ఇల్లు చేరుకోవచ్చు." అని కూడా అన్నారండి. ఆయనగారి లోపమేం లేదు.

"ఆమాట అలావుంచి—ఇంటిదగ్గర చావు బతుకులమీద ఉన్న రోగి ఆమె. మనం వెళ్ళేసరికి ఆమెగారి స్థితి ఎలా ఉండబోతుందో యేమో! కనక, ఇంకొక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు. ఈ అవసాన సమయంలో ఆవిడ "రామ! రామా!" అనుకోవడం మానేసి, "కోడలా! కోడలా!! అంటూ మీమీదే రెండుకళ్ళూ పెట్టుకున్నుంది!"

ఇందాకటిలాగే జ్ఞానద చెప్పినమాటలే మళ్ళీ మళ్ళీ యిలా ఆవృత్తి చేసింది—"ఛటర్జీగారే ఇలా అన్నారా? ఇవాళే పంపిస్తానన్నారా. ఇప్పుడే పంపుతానన్నారా?" అంటూ.

తల వంకించాడు ముసలాయన: "అవును తల్లీ!—ఇప్పుడు కాకపోతే యింకా ఎప్పుడూ? అగటానికి వీల్లేదమ్మా!" అని చెప్పాడు.

మరి ఆపుకో లేకపోయింది. దాసి సౌదామిని: మనస్సు విడిచి యిలా అనేసింది—"అప్పయ్యగారూ! అల్లాగంటా రేంటండీ? అత్తగారు చూడబోతె చావుబతుకులమీద వున్నారు. తమ కోడలిని తమ యింటికి తీసుకుపోవటానికి మామయ్యగారే సొయంగా వొచ్చినారాయిరి. యిహ పంపనూ అనే వారెవరో చెప్పండి! అదీగాక మీరింకా ఇక్కడుండటం ఎందుకో శాస్త్ర చెప్పండి, తెలియకడుగుతాను? వోసీ, చిన్నమ్మ గారూ! కావాలంటే, మీ బావగారినే పిలిచి అడగండి ఒకసారి!"

అయితే బావగారిని పిలవటం అవసరం లేకపోయింది. ఆ ప్రాంతంలో ఎక్కడో ఆయనగారు నక్కివున్నారు కాబోలు. పావుకోళ్ళు చప్పుడు చేసుకుంటూ, ప్రత్యక్షమైవించున్నాడు!—చాలా గందరగోళంగా గడబిడ పడుతున్నట్టుగా కనిపిస్తున్నాడు.

ముసలాయన కేసి తిరిగి, యిలా ప్రారంభించాడు ముఖర్జీ—

"అయ్యా! ఇలా మాటలు పెట్టుకూర్చుంటే కాదు. ఇహ ప్రయాణం అయినట్టే—బాగా ఎండెక్కిపోయింది. స్నానం, సంధ్య, దేవతార్చనా పూర్తి చేసుకు బయల్దేరేసరికి రైలు వేళ అవనే అవుతుంది ఆ తరవాత మళ్ళీ వర్జ్యం.

"పరిపాయె! పంపించటానికి నా అభ్యంతర మే ముందండీ?—నా క్కొంచెం యిబ్బంది అయితే అవుతుంది. బందీలేదు. అలా అని మీ పిల్లని మీకు పంపకుండా వుంటామా?—ఎంతమాట!—

"అత్తగారికి పాపం, ప్రాణంమీది కొచ్చె!—నాకా?—లక్ష వ్యాపకాలు, ఎన్నో ఝంఝాటాలు! ఎందరో వస్తుంటారు. ఇంటిముందు....ఊపిరి తీసుకోవటానికయినా తీరుబడి లేదు. నేనే స్వయంగా జ్ఞానదని వెంట బెట్టుకొచ్చి, మీ ఇంట దిగబెట్టి వచ్చేవాణ్ణి!

"రెండుత్తరాలు వేశామన్నారు. అందులో ఒక్కటయినా అందితే ఒట్టు. మీ ఉత్తరమే అందివుంటే మీకింత శ్రమ లేకుండా పోయేది. పాపం, మీరింతదూరం రావలసినంత పని ఉండేది కాదు

"కాశీ ఏదీ? ఎక్కడి కెళ్ళిందీ? భోలా ఎక్కడికి పోయాడూ? రమేశూ! వీళ్ళు తోడూ! మనవారికి మడిబట్ట! గోకర్ణం ఉద్ధరిణే అన్నీ అక్కడ పెట్టండి చప్పున!

"అయ్యా, మీరిహ తొందరపడాలి! జ్ఞానదా!—ఆలస్యం చెయ్యకు, రైలువేళ దాటిపోతుందీ, మూడు గంటలబండీ అందుకోవాలిగా, మరి—

"ఎవరదీ?—ఆఁ—మళ్ళీవచ్చి కూచున్నాడు మణేదారు!—అయ్యా, మా అవిడ

పోయింది మొదలూ అదేమిటో గాని. మతి మతిలో ఉండటం లేదండి! ఏమీ తోచదు.—మధుసూదనా! నీవేగతి! భగవాన్! నీవే శరణు!!—"

ఇలా అంటూ, చటర్జీ కొయ్యపాంకోళ్ళు టక టక చప్పుడు చేసుకుంటూ మళ్ళీ వచ్చిన దారినే బయటికి వెళ్ళిపోయాడు.

చేనికీ సమాధానం చెప్పలేదు జ్ఞానద. చటర్జీ వెళ్ళిన దారికేసే చూస్తూ, రాతి బొమ్మలా అలా నిలబడిపోయింది.

భోలా వచ్చాడు. "చినబాబు ఏటికి తీసికెళ్ళమని మారాం చేస్తున్నారండి. ఒకే ఏడుపండి తీసుకపోయి, స్నానం చేయించి తీసుకురావాండి?" అనడిగాడు.

సవుకరు మాట చెవిని పడట్టు లేదు. జ్ఞానద ఇదివరకు లాగానే కదలక మెదలక నిలుచునివుంది.

ముసిలాయన—మామగారు నేలమీద చేతులుమోపి, మెల్లిగా లేచి నించున్నాడు—"అమ్మా! నే లేచి వెళుతున్నా, ఇప్పుడే వస్తాగానీ, నువు తొందరగా తెమిలి. సిద్ధంగా వుండు!" అని చెప్పాడు.

దాసి సౌదామిని ఇలా అన్నది! "ఇవాళ నాకు షష్ఠి అమ్మా! ఈపూట భోం చెయ్యను."

చటుక్కున వెనక్కి తిరిగింది, జ్ఞానద.

"నేను రాను!" అన్నది.

ఉలిక్కిపడ్డాడు మామగారు. ఆశ్చర్యంతో "రావూ? ఏమిటమ్మా! ఇవాళ చాలా మంచిరోజు." అన్నాడు.

ఈ సందట్లో సౌదామిని తన "షష్ఠి" ఫలహారం మాట చెప్పడం మరిచేపోయింది. "చిన్నమ్మగారూ! మేం భట్టాచార్యులుగారి దగ్గరికెళ్ళి, మంచిరోజు చూసుకునే మరీ బయల్దేరామండీ! ఇంత మంచిరోజు మళ్ళీ ఇప్పట్లో కుదరదు." అంది.

జ్ఞానద ఈ ఒక్కమాట మాత్రం అన్నది—"నేను రాను. నేను రావటానికి వీల్లేదు."

గోలోక చటర్జీకి కొడుకున్నాడుగా, పదేళ్ళవాడు! పరిగెత్తుకుంటూ వచ్చి జ్ఞానద మీద పడ్డాడు.

"చిన్నమ్మా! ఏటికి వెళ్లొద్దు? పోనివ్వవ్? తీసు కెళ్ళమని నువ్వు చెప్పు చిన్నమ్మా. భోలాతోటి! నేను పోతానే, పోతా. ఏం, ఏం? అయితే...."

ఎవళ్ళకూ ఏ సమాధానం చెప్పలే, జ్ఞానద. ఆ దుడుకు పిల్లాణ్ని గట్టిగా హృదయానికి అణిచి పట్టుకుంది. "ఉహూఁఉహూఁఉహూఁ" అంటూ మెల్లి మెల్లిగా రోదన




ప్రారంభించింది.

## 9

తరువాత జ్ఞానద గదిలోకి పోయి లోపల గడియ వేసేసుకుంది. అయితే, ఆగది గడియ మళ్ళీ తెరవనే లేదు.

ముసలాయన ఉన్నాడుగా. ఆ గుడ్డి మామగారు—మధ్యాహ్నమంతా మతిపోయిన వాడిలా మాటాడక కూచుని, మెల్లిగా లేచి వాకిట్లోకి వెళ్ళిపోయాడు. దాని సౌదామిని కూడా ఆయన వెంట వెళ్ళింది. జ్ఞానద "నేను రాను" అని అనటానికి కారణమేమిటో ఎంత కొట్టుకున్నా తెలియలేదు.

ఎంత ఇదయినా ఆడదాని మనస్సు కదా. ఉండబట్ట లేకపోయింది. ఊరికే తిరిగి పోవటానికి మనస్కరించలేదు. అది జ్ఞానద గది ముందుకి వెళ్ళి, కొన్ని మాటలన్నది. అవేమంత చక్కగానూ లేవు. హితవుగానూ లేవు. కాని, జ్ఞానద ఒక్కదానికయినా జవాబు చెప్పేందా అంటే—కిమన్నాస్తి. పైగా, తన ఏడుపులూ నిట్టూర్పులూ కూడా పైకి పొక్కనీయలే.

జ్ఞానద పన్నెండో ఏట విధవరాలయింది. నాటినించీ అత్తగారే ఆమెను కడుపులో పెట్టుకుని, పెంచి పెద్దదాన్ని చేసింది. అత్తగారి పెంపకంలో జ్ఞానద ఒక్క కష్టం కూడా ఎరగదు. అటువంటి అత్తగారు ఇప్పుడు చావుకి సిద్ధంగా వుంది. తనని చూస్తేగాని ఆవిడ ప్రాణం వదిలేట్టు లేదు. ఇదలావుంచి—అంధుడూ, శతవృద్ధుడూ అయిన మామగారు తనకోసమని వచ్చి ఉత్తచేతు లూపుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇటువంటి సందర్భంలో ఈ దుఃఖమంతా ఆగదిలో ఒంటరిగా కూచుని ఎలా భరిస్తుందో ఆ జగదీశ్వరుడికే తెలియాలి ఆయన తప్ప మరి సాక్షిలేదు.

ముసలాయన వ్యక్తిపోతూంటే గోలోక ఛటర్జీ కనిపించి దారి బత్తెం ఖర్చు లిస్తా నని వినయంగా మనవి చేసుకున్నాడు. జ్ఞానద "నేను రాను" అనడంవల్ల ముస లాయనకి కలిగిన ఆశ్చర్యం దుఃఖంకంటె గోలోక ఛటర్జీ వెల్లడించిన విస్మయం వేదన ఎన్నోరెట్లు ఎక్కువగా కనిపించాయి.

* * *

ఛటర్జీ చావిట్లోకి వచ్చి చూసేసరికి మృత్యుంజయ భట్టాచార్యులు వచ్చి కూచుని వున్నాడు. లేచి నమస్కారం చేశాడు. ప్రతినమస్కారం చెయ్యలేదు ఛటర్జీ. తల కొంచెం ఊపి ఇలా అన్నాడు: "మీతో కొంచెం పనివుంది. కబురంపాను ఆచార్యులుగారూ."

"అదేనండి. ఆపోశనం పడుతూండగానే తమ కబురందింది. రెండు మెతు కులు ముక్కూ నోటా కొట్టుకుని. ఆదరా బాదరా వచ్చేశానండి." అన్నాడు.

"అవున్లే. సరే! మీరు పెళ్ళి పేరంటాలు చేయించటానికని వేళ వేళాలు తిరుగు తారే. అప్పుడప్పుడూ తెలుసుకున్న భోగట్టాలన్నీ జాగ్రత్తగా పదిలపరిచి వుంచు తారా? ఈ విషయంలో ఘటికుడంటే ఘటికుడు నిజానికి మీ తాతగారు దేశంలో ఎక్కడి కెళ్ళినా రామతారణ శిరోమణి చెయ్యివుండేనే ముడి పడటం! అంత ప్రఖ్యాతి! సంఘమంతా ఆయనకి వేళ్ళచివర ఆడుతూ వుండేది కదా."

"చిత్తం. మీరన్నదంతా అక్షరాలా సత్యమేనండి!—కానీండి అయ్యా! ఆడాళ్ళు చేసేపను లివేనాండీ? దాని మాటకేం. అదలా ఉంచండి!—జగద్ధాత్రి కూతురు సంధ్య. దాని కెంత పొగరో, ఎంత అహంకారమో చూశారా? రాసమణి పిన్ని చెప్పింది. ఆ సంగతి విన్నప్పట్నించీ నా ఒళ్ళు మహ మండుకుపోతూంది.

"ఏమి టేమిటీ? ఏమిటా సంగతి?" అని అత్యాశ్చర్యంతో అడిగాడు ఛటర్జీ.

"మీరేం వినలేదా? మీదాకా రాలేదా?"

"లేదు లేదు. ఏమీ వినలేదు. ఏం జరిగిందేం?—"

"మీ ఇల్లు చూడబోతే శూన్యంగా ఉందా యారి ఆ పిల్లతా ఇంకా పెళ్ళి కాలే దాయె: తమరు దయతలిచి, మూడు ముళ్ళువేసి బ్రాహ్మణకులం రక్షించా లను కున్నట్టు తెలిసింది.

"కాని—ఆ దుండగప్పిల్ల పదిమందితోనూ ఏమనుంటూందిటండీ —అబ్బ!— ఆమాట తలుచుకుంటేనే వొళ్లు గగుర్పొడుస్తుంది. చెబుదామంటే కూడా నోరు రావటం లేదండయ్యా!—మన్నించాలి!—"ఆ చచ్చినాడి మెళ్ళో చిరుగు చెప్పుల దండ వేస్తాను" అన్నది టండీ! పిల్ల తల్లీ, తండ్రీ కూడా ఆమెతో ఏకమై, ప్రోత్స

హిస్తున్నారుటండీ!—"

ఛటర్జీ కళ్ళు, ముఖం కోపంతో కందగడ్డలా ఎర్రబడినై. మరుక్షణంలోనే ఆయన తనకు తను కుదుటపర్చుకున్నాడు. "హహ్హహ్హా" అని ఓ మాటు వెర్రి నవ్వు నవ్వి, "అది వొట్టి వాగుడుపిట్టలెండి!" అన్నాడు.

భట్టాచార్యులు కూడా ఉగ్రుడయ్యాడు. "అయితే కావచ్చు ననుకోండి! కాని, చిన్నా పెద్దా తారతమ్యం తెలుసుకోకుండా ఇంతమాట అనేసెయ్యడమే? ఎంతపని! ఎంతపని —తమ పాదకమలాలు పట్టి పూజిస్తే, తన సప్త సప్త పురుషాంతరాల వాళ్ళు తరిస్తారన్న జ్ఞానం కొస్త కూడా లేదు కాబోలు! ఏం సెలవు?"

ఛటర్జీ శాంతంగా నవ్వుతూ, ఇలా అన్నాడు—"పసిపిల్ల! కసుగాయ! దానిమీద మనం కోపగించకూడదు మృత్యుంజయా! కళ్ళు తెరవని పసికూన. దానికేం. తెలుస్తుంది నా మర్యాద? నీకు తెలుసు, మీ అందరికీ తెలుసు, పది పూళ్ళవాళ్ళు యావన్మందికీ తెలుసు."

అప్పుడు మృత్యుంజయుడు అతి కష్టంతో కంఠస్వరం తగ్గించి అడిగాడు—అయితే ఆ సంగతి నిజమేనా?—రాసుపిన్నిగారి ద్వారా మీరు....?"

అందుకు ఛటర్జీ—'రామరామా!—నీక్కూడా పిచ్చేనా, ఇలాంటి వార్తలు నమ్మేందుకు? ఆ గృహలక్ష్మి పోనేపోయిందిగా. మళ్ళా ఇంకో...." అంటూ చెప్పబోయి, ఆకస్మాత్తుగా నిట్టూర్చాడు. "మధుసూదనా! శరణు, శరణు!—" అన్నాడు. ఈ విధంగా భక్తితో కూడిన తన నిట్టూర్పుకి భట్టాచార్య లేమంటాడో చూతామనే కుతూహలంతో అతని మొహంచేసి చూస్తూ ఊరుకున్నాడు. కొన్ని క్షణాలపాటు అలానే చూశాడు.

చూసి చూసి ఒకవిధమైన ఉదాసీనతతో మళ్ళీ ప్రారంభించాడు ఛటర్జీ—

నాయనా, ఇదంతా ఉత్త చెత్త. ఇలాటి గొడవలన్నీ నా మనస్సుకి ఎంతమాత్రం ఎక్కనే ఎక్కవు. లోకులు ఎడతెరిపి లేకుండా నాదగ్గరికొచ్చి, "అతణ్ని, బతికించండి, ఇతణ్ని కాపాడండి, వాళ్ళకులం నిలబెట్టండి" అంటూ రాత్రీ పగలూ పీక్కుతినేస్తారు, మొదటినించీ నేను దేనిలోనూ కలగచేసుకోననీ, ఉదాసీనంగా వుంటాననీ నీకు తెలుసుగా? కనుక, మనస్థిమితం లేక ఎవళ్ళతోనయినా ఏమైనా అంటే అన్నానేమో!—మధుసూదనా! నీవే శరణు! నీవే గతి!!"—

మృత్యుంజయ భట్టాచార్యులు బలే ఘటికుడు. అతడి క్కావలసిన అసలువిషయం దొరికేసింది. అతివినయంగా ఇలా అన్నాడు: "అలా అయితే మా ప్రాణకృష్ణ ముఖర్జీ కూతురుంది—పదమూడు పధ్నాలుగేళ్ళది. దాని కన్నెచెర తప్పించాలి తమరు.

పిల్ల అంత మేమిటనుకున్నారు! కేవలం లక్ష్మీదేవే!—పాపం. అతడూ చాలా పేద బ్రాహ్మడు."

"ఎంత అసూయకుడివోయ్ భట్టాచార్యులూ! ఇలాంటివన్నీ పెట్టుకూర్చుంటే ఏం బాగుంటుందోయ్ నాకూ! సరే లే. పిల్లకి పద్నాలు గేళ్లొచ్చాయా! అయితే. కాస్త బొద్దుగా ఉంటుందని విన్నాలే!"

ఉత్సాహం కలిగింది ఆచార్యులికి. "చిత్తం—చాలా బొద్దుగానే ఉంటుందండి అమ్మాయి అంతేకాదు. ఎంతవిమ్మళస్తురాలో అంత అందగత్తె సుమండీ."అన్నాడు.

చటర్జీ చిరునవ్వు నవ్వాడు. "ఆచారీ!—ఇంకా నాకు అందచందాలూ. రూపురేఖలూనా! సాక్షాత్తు లక్ష్మీ విగ్రహాన్నే పోగొట్టుకున్నాను కదా!—మధుసూదనా! ఎవరు కష్టంలో ఉన్నా. దుఃఖిస్తున్నా నేను సహించలేను సుమా!—అటువంటి దేదయినా వింటే దుఃఖం ఆగదు!—

"అయితే—పదమూడు పద్నాలు గేళ్ళుంటాయని మీరనగానే. మరో రెండేళ్లు అని అంచనా వేసుకోవచ్చు. బ్రాహ్మడు పాపం. చాలా ఆపత్తులో పడ్డాడని అందురూ!"—అన్నాడు.

తల తిప్పుతూ. "సందేహ మేముందండీ!" అన్నాడు. భట్టాచార్యులు

చటర్జీ మళ్ళీ చెప్పాడు—"ఇదంతా నాకు తెలుసునయ్యా మృత్యుంజయా! కులీనుడి కులం కులీనుడే నిలబెట్టాలి. కాపాడి తీరాలి! అలా చెయ్యలేకపోతే మహాదోషం.

"కాని. నా విషయం ఆలోచిస్తే—అటు శోకం. తాపమున్నా. ఇటు వయస్సు చూస్తే యాభై దగ్గర దగ్గర పడ్డాయి. అయినా. నా స్వభావమేమిటో నాకే సరిగా అర్థం కాదు. ఎవళ్ళకయినా ఆపద వచ్చిందని వింటే ఆ ఆపద నాకే వచ్చినట్టుంటుంది. ప్రాణాలు విలవిల్లాడిపోతాయ్ కాదు—లేదు అనే మాట మాత్రం నా నోట రాదు."

చటర్జి చెప్పినదానికల్లా భట్టాచార్యులు తల తిప్పుతూనే వున్నాడు. గోలోక దీర్ఘంగా నిట్టూర్చి మళ్ళీ అందుకున్నాడు—

"కులీనులకు కూడలిగా ఉండే పరిశుద్ధమయిన ఈ గ్రామంలో సమాజానికి ఆధిపత్యం వహించడమనేది ఎంత చిక్కులమారి పని! ఆ లోగుట్టు నా మనస్సుకే తెలుసు. ఎవరికి తిండిలేదు. ఎవరికి గుడ్డలేదు. ఎవరికి సరిగా వైద్యసౌకర్యం లేదు. ఇవన్నీ కనుక్కోవలసిన భారం నామీద వుంది. అది అటుండగా—ఇప్పు డిలాటి బాధ్యతలన్నీ కూడా వచ్చి నెత్తిన పడితే ఇహ బతకలేను. మృత్యుంజయా!

"పాపం. ప్రాణకృష్ణుడు ఉత్త గర్భదరిద్రుడు—అయితే. అతడి కూతురికి పెళ్ళీడు తప్పిందంటావా!—పిల్ల పదమూడు పద్నాలుగేమిటిలే. పదిహేను పదహా

రింటికి వయస్సు జంకదు. పోనీ....ఒకసారి వచ్చి నన్ను చూడమని ఆ ప్రాణకృష్ణ ముఖర్జీతో అనలేకపోయావా?

గాభరాపడ్డాడు భట్టాచారి.

"ఇప్పుడే వెళ్ళి ఆయన్ని పంపిస్తానండి. లేదా కూడా వెంటబెట్టుకురమ్మంటే. అలాగే...." అన్నాడు తొందరపడుతూ.

అందుకు, ఉదాసీనమైన స్వరంతో ఛటర్జీ ఇలా అన్నాడు—" సరి అలాగే పంపించు. కాని, నన్ను చాలా చిక్కున పెట్టేశావోయ్ మృత్యుంజయా!—పేద బ్రాహ్మడి కిటువంటి విపత్తు సంభవించిందే. నా వల్లకాదు అని ఎలా చెప్పను?—మధుసూదనా! "త్వయా హృషీకేశ హృదిస్థితేన," నాచేత నీవేది చేయిస్తే చేయవలసి వుంటుంది మేము వట్టి నిమిత్తమాత్రులం. అంతకంటే వేరేమీ లేదుకదా!"

వింటూ మౌనంగా కూర్చున్నాడు మృత్యుంజయ భట్టాచార్యులు.

గోలోక ఛటర్జీకి ఏదో విషయం ఛటాల్న జ్ఞాపకం వచ్చినట్టయింది. "ఆఁ— ఇదుగో చూడు! అసలింతకీ విన్నేందు కయితే పిలిపించావో ఆ సంగతి చెప్పనేలేదు ఈనెల చాలా కటాకటిగా వుంది నీనోటు బాపతు వడ్డీ....!"

అతిదీనంగా అన్నాడు ఆచారి—"ఈ ఒక్క నెలమాత్రం తమరు కాస్త కరుణించాలి...."

"సరే. సరే. అలాగేలే. ఒకర్ని కష్టపెట్టి ఒకపైసా అయినా తీసుకోవడమంటే నాకు గిట్టనేగిట్టదు. అయితే— ఇదుగోనయ్యోయ్, ఆచార్యా!—నీవల్ల నాకో చిన్నపని కావలసుంది" అన్నాడు, ఛటర్జీ.

మృత్యుంజయుడికి మొహం చేటంత అయింది. 'చిత్తం, చిత్తం. సెలవిప్పించండి!—" అన్నాడు వినయంగా.

"మృత్యుంజయా! ఒక ముఖ్యమైన సంగతి చెబుతా. వింటావా?—సనాతన శైవటువంటి మన హిందూధర్మం నిలవాలంటే కులీనుల సమాజాన్ని కాపాడుకుంటూ రావాలి. ఇదేం సామాన్యమయిన పనికాదు సుమా! ఇదెంతటి మహాభారమో తెలుసు కదా!—దీన్నెవడైతే నెత్తిమీద పెట్టుకుంటాడో వాడు వెయ్యి కళ్ళు పెట్టుకుచూడాలి. వెయ్యి చెవులు పెట్టుకు వినాలి!—

"ప్రియముఖర్జీ తల్లి తెలుసుగా? ఆవిడగారి విషయంలో ఏదో గందరగోళం వచ్చిందనీ గోలగోలగా వుందనీ విన్నాలే. కాగా పోగా, ఇప్పుడు మనం చెయ్యాల్సిన పనేమిటంటే—వాళ్ళ ఊరు పోయి— ఈ విషయం అతి జాగ్రత్తగా అతిరహస్యంగా తెలుసుకు రావాలి.

"మీ తాతగారుండే వారే, శిరోమణి మహాశయుడు—ఇలాంటి విషయాల్లో ఆయనెంత ఘటికుడు. ఎంత సిద్ధహస్తు డనుకున్నావ్? ఆయనగారికి ఇరవై మున్ఫయి పూళ్ళ భోగట్టాలు యావత్తూ కంఠోపాఠమే!

"నీకు జ్ఞాపకముందో లేదో—వెనక భూపతి ఛటర్జీగారింటికి పదేళ్ళపాటు ఒక్కవాకలిగాని మంగలిగాని పోకుండా కట్టుకట్టించావే—చివరికా అపాత్రుడు "దేవుడా!" అనుకుంటూ సగం చచ్చి ఊరు వదిలిపెట్టి లేచి పోయాడుగా?—ఇంతపని ఎలా చెయ్యగలిగా వనుకున్నావ్? దీనికంతకి మీ తాతగారి సహాయమే. ఆయనగారి అండదండలే నాకు కావి. అటువంటి ప్రజ్ఞాశాలి కీర్తిప్రతిష్ఠలు నువు నిలబెట్ట లేకపోయావే అని. నీ ఎదటే చెప్పేస్తే మంచిదని అనేస్తున్నా—మనస్సులో దాచుకోలేక."

తన పూర్వ పురుషులతో తులతూగ లేకపోతిమే అన్న అసమర్థతకు కొంచెం చిన్నబుచ్చుకున్నాడు మృత్యుంజయ భట్టాచార్యులు. నొచ్చుకున్నాడు. సిగ్గుపడ్డాడు.

"ఇదుగో. చూడండి మహాశయా!— ఒక్క వారంరోజులు గడు విప్పించండి. నాకు. చాలు. వాళ్ళ కడుపుల్లో దాచుకున్న పరమ రహస్యాల్ని వెళ్ళగించి బైటికిలాగి తమ ఎదట పెట్టకపోతే అందురుగాని." అన్నాడు.

ఛటర్జీ ఇప్పుడు భట్టాచారికి హుషారీ ఇస్తూ ఇలా ప్రోత్సహించాడు.—

"నాకామాత్రం తెలియ దనుకున్నావా. మృత్యుంజయా!—లాక్కొస్తావ్. నువ్వు తప్పకుండా లాక్కురాగలవ్! నువ్వెటువంటి గొప్ప ఇంటి బిడ్డవి! మీ వంశమెటువంటిది! అలాంటి వంశంలో పుట్టిన వాడు మొనగాడు మరేమిటీ!

"కా నయితే, ఒక్కమాట! చూడు నాయనా! ఈ సంగతిమట్టుకు అయిదోచెవిని పడకూడదు. మనిద్దరి మధ్యనే ఉండిపోవాలి. ఇది అతి రహస్య విషయం సుమా! పరమ రహస్యం!!—

"సంఘంయొక్క మానం, మర్యాదా రక్షించాలంటే చాలా వివేచన కావాలి. అయితే చూడూ, కావాలంటే వడ్డీ మాత్రమేకాదు. అసల్లో కూడా కొంత....ఆలోచించి చూస్తాలే. కష్టాల్లో ఉన్నావ్, పాపం! ఈ సంగతి లోగడే తెలిస్తే ..."

మృత్యుంజయుడి ఒళ్ళు పులకరించింది. లేచి నిలబడి, "తమ తమ దయ! మేం మీ పాదాల్ని నమ్ముకుని తమ సన్నిధానంలో పడి ఉన్నవాళ్ళం. తమరు సెలవిచ్చిన అమాకీ పట్టి తేవటానికి చీకటితోనే లేచి వెళతా!" అంటూ వెళ్ళబోయాడు.

ఛటర్జీ వారిక కొరుక్కున్నాడు. "అంతమాట ఎప్పుడూ అనబోకు మృత్యుంజయా!—నేను కేవలం నిమిత్త మాత్రుణ్ని. ఆ పరమాత్ముని శ్రీ చరణాలముందు పడివుంటే కోటాను కోట్ల జీవరాసులలో, పరమాణువుల్లో నే నొక పరమాణువుని!



అంతే." అని చెప్పి, ఆకాశం కేసి శివనేత్రంపెట్టి దృష్టిని మలిపి, చేతులు రెండూ జోడించి నమస్కారం చేశాడు.

రెండడుగులు వేశాడు మృత్యుంజయ భట్టాచార్యులు. మనస్థిమితంలేదుగా ఛటర్జీ మహాశయుడికి!—కనక, వెళ్ళబోతున్న భట్టాచార్యుల్ని ఉద్దేశించి, పరధ్యానంతో ఇలా అన్నాడు—

"ఇదుగో చూడు, మృత్యుంజయా!—ఆ ప్రాణకృష్ణుణ్ని ఒక్కమాటు పంపడం మరిచేవ్ గనక!—బ్రాహ్మడు పాపం, ఆపదలో ఉన్నాడని విన్న దగ్గర్నించీ నా ప్రాణాలు విలవిల్లాడి, కొట్టుకుపోతున్నాయని నమ్మూ!—నారాయణ! మధుసూదనా! నీవే శరణు!!—"

## 10

సంధ్య పెళ్ళి సంబంధం ఖాయ మయిపోయింది.

వరుడు:—సుప్రసిద్ధ జయరామ ముఖర్జీగారి దౌహిత్రుడు: చిరంజీవి వీరచంద్ర బెనర్జీ. రేపటి రోజున మగపెళ్ళివారు నిశ్చయతాంబూలాలు పుచ్చుకోవటానికని వస్తారు. అందుకు అవసరమైన ఏర్పాట్లూ, సన్నాహాలూ అన్నీ ఇప్పుడింట్లో చకచక మని జరుగుతాయి

ఈ యేడు లగ్నం ఒకే ఒకటున్నది—మార్గశిర బహుళంలో. ఆ తరవాత మళ్ళీ మూణ్ణెల్లదాకా ఏకంగా మూఢమి—అంటే కార్యకలాదులేం జరగటాని కెంతమాత్రం

పటికిరాదు. మూరతమి ముందుండటంచేతనే లగ్నం అతి దగ్గరలో నిశ్చయమైంది. మరో అపురూపమైన విషయం ఏమిటంటే—

జగద్ధాత్రి అత్తగారు—అంటే సంధ్యకు నాయనమ్మ కాశీలో నివాస ముంటూం దిగా! అవిణ్ని ఎన్నోసార్లు ఇక్కడి కొన్నాళ్ళపాటు రమ్మనమని బతిమాలారు. ప్రార్థిం చారు. ప్రాధేయపడ్డారు. నసేమిరా రాను అనేసింది గాని పీఠం కదపలే. అటువంటి ఆ అత్తగారు అతి కష్టంమ్మీద ఈ పెళ్ళికని ఇప్పుడు కాశీవించి ఇవ్వాళ్ళకు వచ్చింది.

చీకటిపడింది. వంటింటో దీపం పెట్టింది జగద్ధాత్రి. పెళ్ళికోసం పిండివంటలు తయారుచేయటానికని కూడుంది. వృద్ధురాలైన అత్తగారు "కాశీతార" ఆమెకు దగ్గరపానే చిత్రాసనంమీద కూర్చుని రుద్రాక్షమాల తిప్పుతూ జపం చేసుకుంటూంది.

ఇప్పుడు శీతాకాలం ఆరంభమయింది. కనక అందుకు తగినట్టు ఆవిడ ఒక జేగురురంగు వస్త్రం ధరించింది. అలాటిదే ఒక కాషాయి శాలీ వొంటికి కప్పుకొని వుంది.

ఉన్నట్టేవుంది. జపమాల తిప్పడం ఆపేసి. కోడలివేపు తిరిగిందామె—

"అన్నట్టు—లగ్గానికిహ పది రోజులేగా వుందీ!" అని శాంత స్వరంతో అడిగింది.

జగద్ధాత్రి ముఖం పైకెత్తింది. "పది రోజు లెక్కడం దత్తయ్యా! ఇవ్వాళ్టితో కలిపి సరిగ్గా తొమ్మిది రోజులేగా! ఏదో దేవుడి దర్మాన. మీ చలవవలన కార్యం కాస్తా పూర్తి అయిందంటే. బతికి బయటపడతాం! ఈ పాడుదేశంలో తల పెట్టిన కార్యం నెరవేరిందాకా నమ్మకం లే." అన్నది

కొంచెం నవ్వింది అత్తగారు—

"మీ ఒక్క వూళ్లోనే కాదమ్మా! అన్ని వూళ్ళలోనూ. అన్ని దేశాల్లోనూ ఉండే భయమే ఇదీ. అయితే. ఇలాంటి బంగారపు లక్ష్మి విగ్రహాన్ని వీళ్ళలో వొదిలేసి వచ్చేటప్పుడు ఇలా అనుకోవటం దేనికీ.—నెరవేరేదాకా నమ్మకం లేదనీ!"

జగద్ధాత్రి దీక్షగా తన పనేదో తను చూసుకుంటూంది గాని. సమాధానమేం చెప్పలే.

అత్త చెప్పింది—"మా వాడిదగ్గిర సంగతి సందర్భాలన్నీ వినేవచ్చా. పొద్దున్న స్నానానికి పోతూ అరుణుడ్ని కూడా చూశాను. చంద్రబింబంలా వుండే అతడు నీకు నచ్చలే. కోడలా!" అనడిగింది.

జగద్ధాత్రికి ఈ ప్రశ్నవల్ల ఏమంత సంతోషం కలగలే. "నచ్చితే సరిపోయిందా; అత్తయ్యా! అంతమాత్రాన అన్నీ అయినట్టేనా!" అన్నది.

అత్త మళ్ళీ అన్నది—"కాదు గాని, స్నానం చేసుకువచ్చాక సంధ్య వడిగి ఎన్నెన్నో సంగతులు చెప్పించుకు వింటివి కదా. చెవిని పడేసరికే దుఃఖం ఆగక, గుండెలు పగిలిపోయినయ్. ఆఁ—! తల్లిపై ఉండికూడా నువ్వు ఈ విషయం గ్రహించ లేకపోయావే!"

విజావికి, చెవిపెట్టకపోలేదు జగద్ధాత్రి. ఇదంతా ఆమె దృష్టిలోపడి చాలా కాలమయింది. తెలిసినా ఆవిడ ఒప్పుకోదు. ఒప్పుకోవటం కేవలం అసంభవం!

అంతేగాకుండా—భయంతో ఆ దిక్కూ ఈ దిక్కూ చూసి, గొంతుక అణి చేసుకుని, ఇలా అంది: "ఇది పనిసమయం కదా. పదిమందీ వచ్చిపోయే ఇల్లు. వాళ్లూ వీళ్లూ విని పోతారుసుమండీ, అత్తయ్యా!"

ఇహనేం మాటాడలే అత్తగారు.

అయితే, జగద్ధాత్రి తను కటువుగా, కొంచెం దూకుడుగా మాటాడినందుకు తనే సిగ్గుపడింది.— మెల్లి మెల్లిగా ఇలా అంది—

'పరేగానండి అత్తయ్యా! మీరు కూడా ఇలా అంటారేమిటి ? మీ కులమర్యాద అంతా కాలదోసి, గంగలో కలిపి, ఇహ లోకుల మొహం ఎలా చూస్తారో చెప్పండి! ఇంతకీ అతగాడికి కులం కూడా లేదాయిరి. ఈ మాటలన్నీ మీ దగ్గిర చెప్పటానికి వకాల్తా పుచ్చుకున్న ఆ పెద్దమనుషులు—ఈ కాస్తంత మాటా మీ చెవిన వెయ్య లేకపొయ్యారా!'

ఇహ అడగటానికి గాని చెప్పటానికి గాని మరేం ఉండదని అనుకుంది జగద్ధాత్రి. కాని అత్తగారు ఊరుకోలే. అంతటితో, తలతిప్పి ఇలా అన్నది—

"చెవిన వెయ్యకపోవటమేం ? వేశారు నా చెవిన పడెయ్యక ఎల్లా వూరుకుంటారు కోడలా! అంతా సరిగ్గానే వుంది. అతడికి విద్యాబుద్ధు లున్నాయికదా అవి మాత్రమే కాదు చెప్పేది. అలగా జాతివాళ్ళు అని చెప్పి, దిక్కూ మొక్కూ లేని యానాది ఆడవాళ్ళిద్దర్ని మీరు వెళ్ళగొట్టేశారుగా! మీరు లేవగొట్టేసిన ఆ అనాధుల్ని— అక్కుపక్షుల్ని అతగాడు హృదయపూర్వకంగా ఆదరించాడు. భగవంతుడి వరంచేత అతడి జాతి అమరమైపోయింది తల్లీ! ఇహ అతడి జాతిని మారణం చెయ్యటం మానవుల వల్ల కాదు.'

లోపల్లోపల కోపమే వచ్చింది జగద్ధాత్రికి. "దిక్కులేనివాళ్ళే కావచ్చు. అలా అని చెప్పి యానాదివాళ్ళనీ, ఎరికలాళ్ళనీ బ్రాహ్మల కొంపల్లోకి తెచ్చిపెట్టుకుంటారు అమ్మా. అత్తయ్యా! అలా పెట్టొచ్చునని శాస్త్రాల్లో ఎక్కడయినా వుందా?"

అందుకు అత్తగా రిలా అన్నది—

"శాస్త్రాలేం చెబుతున్నాయో ఆ సంగతి నాకు సరిగ్గా తెలియదు తల్లీ!—కాని. నా వ్యధ ఎంతటిదో అదిమాత్రం సరిగ్గా నాకు తెలుసు. అయితే. నా సంగతి ఒహరికి చెప్పుకునేదేం కాదు. కాని. ఈ వ్యధ నీకే గనక అనుభవానికి వస్తే. ఒక్క విషయంమటుకు బాగా తెలుసుకో గలుగుతావ్—అదేమిటంటే—తక్కువ కులం వాళ్ళూ. నీచజాతులవాళ్ళూ అనిపేర్లు పెట్టి సాటి మానవుల్ని రోతగా చూసి అసహ్యించుకున్నందుకు దేవు దేరూపంలో తప్పకుండా తగినశాస్తి చేస్తాడో. ఆసంగతి. ఆ ధర్మసూక్ష్మం తెలుసుకో గలుగుతావ్!

"ఇదిగో—కులమూ. గౌరవమూ అని ఏవో పెద్దమాటలు అంటున్నావే. అంటే అది ఎంత మహాపాపమో. ఎంత బరువైన మోసమో కానంత నువ్వు మనస్సుకి నిజంగా పట్టించుకున్నట్టయితే. నువ్వు నీ కూతుర్ని ఈ విధంగా బలిచేసుకోలేవు! తెలిసిందా! కులమూ జాతీ ఈ రెండూ సత్యమూ—బతికి ఉన్నంతవాకా అనుభవించాల్సిన ఇద్దరి ప్రాణాలూ సుఖమూ దుఃఖమూ—అదంతా మిథ్యానుటమ్మా. కోడలా!"

కలవరపడింది జగద్ధాత్రి—"అలా అయితే. అత్తయ్యా!—ఈ మిథ్యవల్లనే జగత్తంతా నడుస్తున్న దంటారా?" అనడిగింది.

కొంచెం వాడు నవ్వు నవ్వింది అత్తగారు.

"జగత్తు నడవటం లేదు తల్లీ!—నడిచేదల్లా మన జాతిలాగా అభిశప్తమైన జాతులే. నేనూ పరదేశాలలో వున్నాను. నాకూ వయసు మళ్ళింది. చాలా చాలా చూశాను. చాలా చాలా దుఃఖా లనుభవించాను. అయితే—దేన్ని నువ్వు కుల గౌరవమని అనుకుంటున్నావో దాని నిజా నిజాలూ. లోగుట్లూ నాకు తెలుసు. కాని. ఆ కథంతా నేను నీకు విప్పి చెప్పనూ లేను. ఒహవేళ చెప్పినా నీకు సరిగా తెలియక పోవచ్చు కూడా.

ఏమయినా గానీ—నే చెప్పే ఒక్కమాట మాత్రం బాగా గుర్తుపెట్టుకో! మిథ్యకు మర్యాద ఇచ్చి. ఎంత గొప్పదనాన్నయినా దానికి కట్టబెట్టు. దాంట్లో అంతకష్టం. అంత మాలిన్యం. అంత అనాచారం చూస్తూండగా పెరిగిపోతాయ్. పేరుకు పోతాయ్. అలా జరిగింది కూడాను." అని చెప్పింది.

ఏమేమో సమాధానం చెప్పాలని చూస్తూంది జగద్ధాత్రి. అంతలో కూతురు అక్కడికి రావడంతోనే మాటాడక ఊరుకుంది.

ఇప్పటిదాకా సంధ్య తను పెంచుతున్న పూల మొక్కలకు నీళ్ల పోస్తూవుంది. చేతిలో బిందె అరుగుమీద పెట్టింది. ఇప్పుడే వంటింటోకి వచ్చి నిలబడింది.

నిలబడి తల్లికేసి చూసి ఇలా అంది:

"అదేమిటమ్మా, కొబ్బరి లవుజులా!" అంటూ, వెంటనే హఠాత్తుగా నాయనమ్మకేసి తిరిగింది. "నాయనమ్మా! అందరూ లాడూలు చేసుకుంటారు కదా. మనింటో ఆనవాయితే లేదంటా రెందుకనీ?" అనడిగింది.

వాత్సల్యంతో నవ్వి కౌశికార అంది: "అలాగటే అమ్మాయీ! ఆ సంగతి నాకు తెలీదమ్మా!"

"ఆఁ—? అటయితే, మీ అత్తగార్ని అడగలేకపోయావా?" అనడిగింది, సంధ్య.

"షట్టి బుద్దెరిగి నేను అత్తవారిల్లే ఎరక్కపోతినే. ఎవళ్ళ నడగటం అమ్మాయీ, ఇహా?"

ఈ సంగతి జగద్ధాత్రికి తెలుసు. కనక సిగ్గుపడి, తలొంచుకుని, తనవని తను చూసుకోడం మొదలెట్టింది.

"అయితే, నాయనమ్మా! ఒకమాటకి సమాధానం చెప్పూ! నీకు సవతు లెంత మంది?—వందమందా—రెండొందల మందా—మూడొందలమందా—నాలుగువందల మందా?" అనడిగింది, సంధ్య.

నాయనమ్మ మళ్ళీ నవ్వి. ఇలా అంది—"సరిఘ్గా తెలియదే అమ్మాయీ! కాని, నువ్వు చెప్పిన లెఖ్ఖకూడా కాదనటానికి వీల్లేదు. మరైతే చెబుతా విను. విని నువ్వే లెఖ్ఖ కట్టుకో—నాకు పెళ్ళయింది ఎనిమిదో ఏట. అప్పటికే మావారికి ఎనభై ఆరుగురు భార్యలు. నా తరవాత కూడా ఆయన కానా పెళ్ళిళ్ళు చేసుకున్నారుట. అయితే, ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకున్నారో ఆయనకే తెలియదంటే, ఇహ నా కెలా తెలుస్తుంది?"

సంధ్య అడిగింది—

"అయితే, నాయనమ్మా!—వాట్ల కేమైనా లెఖ్ఖ పత్రం వుందా? అలాంటి ఖాతా పుస్తకం ఆయన దగ్గిర లాక్కుని దాచివుంచితే ఎంత బాగుండేది? నాన్నగారి చేతికిచ్చి మొత్తం లెఖ్ఖ కట్టించి వుందును. లెఖ్ఖవేస్తే—వాళ్ళందరూ ఇప్పు డెక్కడెక్కడ ఉన్నారో తెలిస్తే—నాకు పినతండ్రు లెంతమంది? పెత్తండ్రు లెంత మంది? అన్న దమ్ము లెంతమంది? అక్కాచెల్లెళ్ళెంత మంది? తేలిపోతుందిగా? వాళ్ళని చూసివస్తే ఎంత బాగుండును?—అని కొంచెం నవ్వేసింది.

"సరేగాని నాయనమ్మా!—ఒకవేళ నూటికో కోటికో మా తాతయ్యవస్తే, ఎన్ని రూపాయ లివ్వాల్సి వచ్చేదీ? ఇచ్చి పుచ్చుకోవడాల్లో మీకూ మీకూ జగడమవుతూ ఉందే దనుకుంటానే, అవునా?' అని మళ్ళీ ప్రశ్న వేసింది.

ఇదంతా చూసి జగద్ధాత్రికి బాగా కోపమొచ్చేసింది. "ఏమిటీ పిచ్చి కళలు! ఇవన్నీ కట్టిపెట్టి. దేవుడి గదికి గొళ్లెం వేసిరా పో! సంధ్యా!" అన్నది.

నాయనమ్మ నవ్వింది కొంచెం. "అన్నీ తెలిసేనా, ఈ ప్రశ్నలు? అయినా మళ్ళీ మళ్ళీ విందామనే వ్యామోహ మింకా పోలే?" అనడిగింది.

విరుద్ధంగా, అకటా వికటంగా ఉంటున్న ఇలాంటి ఆలోచనలంటే మొదటి వించీ కిట్టదు జగద్ధాత్రికి. ఇకేం బాగాలేవు. నచ్చలేదామెకు. పైగా, మనస్సులో విరక్తికూడా అంతకంతకు ఎక్కువవుతూంది. అత్తగారి మాటలకు ఇలా జవాబు చెప్పింది—

"ఆకాలపు మాటలయితే నాకేం తెలియవు గానీండత్తా!—ఈ కాలంలో మటుకు, అబ్బ!—అన్ని పెళ్ళిళ్ళు ఎవళ్లూ చేసుకోరని మాత్రం చెప్పగలం. అప్పుడున్నన్ని అత్యాచారాలూ లే విప్పుడు. ఏదో కాలంలో ఎవరో కొంతమంది ఏమో చేసేశారు! అన్యాయం జరిగిపోయింది! అలా అని చెప్పి ఇప్పటి వారెవరయినా కుల గౌరవాలు కూలదోసుకుంటారుటండీ. అత్తయ్యా! అనాడు నేనే బతికివుంటే ఇలాంటి పిచ్చి పనులు ఏవయినా జరగనిచ్చేదాన్నా? ఎన్నటికీ జరగదు!" అన్నది.

గృహ యజమానురాలైన కోడలి కంఠస్వరం. ధోరణి కనిపెట్టింది అత్తగారు. ఇది పనికానని మాటాడక ఊరుకుంది.

సంధ్య ఇందుకు చాలా నొచ్చుకు బాధపడింది. నాయనమ్మ కింకా కొంచెం దగ్గిరగా జరిగి కూర్చుంది. కోమలమయిన కంఠస్వరంతో ఇలా అంది:

"అయితే మరీ,—నాయనమ్మా! ఇలాటి అత్యాచారాలన్నీ వీళ్లెందుకుని చేసే వారూ? వాళ్ళకి.... మమత్వ మయినా ఉండేది కాదా?"

సంధ్య చెయ్యిచ్చుకుని నాయనమ్మ ఇంకా తన పక్కకి లాక్కుని కూర్చో పెట్టుకుంది. "ఎలా వుంటుందే అమ్మాయీ, మమత్వం? బతికున్నంతవరకు ఒక్క రాత్రిపూట తప్ప మరి చూడటమే ఎవళ్ళకి పడదో, అలాంటివాళ్ళకి మమత ఉండ టానికెల్లా వీలు? అలాంటివాళ్ళకి ఎక్కడైనా ప్రాణం విలవిల్లాడట మనేది వుం టుందా? దాని మాటకేం?—ఈనాడు మాత్రం అటువంటి అత్యాచారాలు జరక్కుండా మానాయా? ఎక్కడో, ఎప్పుడో ఎందుకూ!—ఇప్పుడు నీ విషయంలో జరగ బోతున్న అత్యాచారం వాటివేటికన్నా తీసికట్టా?" అన్నది.

చేస్తూ చేస్తూవున్న చేతిలో పని అవతల పారేసింది జగద్ధాత్రి. లేచి నించుంది. అతిక్షితనంగా కూతురితో ఇలా అంది! "దేవుడి గదికి నువ్వెళ్తొస్తావా, లేదా? ఈ పన్లన్నీ ఎక్కడి వక్కడ వొదిలేసి నేనే పోయేదా, సంధ్యా? అంటూ మంద




లించింది.

ఒక్కసారి తల్లి ముఖంకేసి చూసింది సంధ్య. కాని, వెళతాను వెళ్ళనూ అనేది ఏమాటా చెప్పలే. వాలకం చూడగా అవలక్కడివించి లేచే ప్రయత్నంలో వున్నట్టుకూడా కనిపించలే. ఎంతసేపూ నాయనమ్మ నేదో అడుగుదాం. తనకి తెలియని కొత్త కొత్త విషయాలు తెలుసుకుందాం, అని ఇదే ధ్యాసా, ఆసక్తీ, కుతూహలమున్నూ.

ఇప్పుడు మళ్ళీ మెల్లిగా ఇలా అడిగింది—"అయితే, నాయనమ్మా! ఏ వస్తువ కయితే ఇంతకాలంగా, ఇంత గౌరవం ఇస్తూ వచ్చారో, అటువంటి విలువయిన దాన్ని ఇప్పుడీ రోజున వొదిలేసెయ్యటం మంచిదంటావా నాయనమ్మా?"

ఈమాటు కోడలి కఠోర స్వరాన్ని అత్తగారు లక్ష్యం చెయ్యలేదు. అసలు పట్టించుకోనే లేదు. మనమరాలి ప్రశ్నకు పూసగుచ్చినట్టు ఇలా జవాబు చెప్ప నారంభించింది:

"ఎంచక్కటి ప్రశ్న వేశావే, నా తల్లీ!—నాకు తెలిసిందేదో చెబుతావిను. జాగ్రత్తగా, ఏదైనా సరే, ఏ ఆచారమైనా సరే, ఎటువంటి అలవాటయినా కానీ, అనుస్యూతంగా చిరకాలంనించీ—అంటే మనతాత తాతవాళ్ళ ముత్తాత్తల కాలం నించీ వస్తూంది కదా అని చెప్పి, అది మంచిదనుకోవటం పొరపాటు, శుద్ధ తప్పు! దానికి కొంతమంది ఏదో గౌరవ మిస్తున్నారనే అనుకుందాం, అయినప్పటికీ, అది మంచిదవటానికి ఎంతమాత్రం వీల్లేదు. తరాలు గడిచిన కొద్దీ, మనం చెయ్యాల్సిన పని ఏమిటంటే—ఆ వస్తువు మంచిదా చెడ్డదా అని చెప్పి మధ్య మధ్యని, మన

బుద్ధిబలం ఉపయోగించి, తిరగేసి చూసుకుంటూ రావాలి. నిశితంగా ఆ ధర్మ సూక్ష్మాలన్నీ కాలంమార్పుతోపాటు, అప్పటప్పట పరిశీలించుకుంటూ రావాలి.

"ఇది పూర్వుల కాలనించీ వస్తూన్నది కదా, అంచేత చాలా మంచిదీ, పవిత్రమైందీ అయివుంటుంది. దీనికి తిరుగు లేదు. అడ్డు చెప్పకూడదు. ఈ ఆచారాన్నీ అలవాటునీ ధిక్కరించరాదు." అనే మమత్వంతో గుడ్డిగా నమ్మి, కళ్ళు మూసుకూర్చున్నవాళ్ళు నశించిపోయారు తల్లీ!—వాళ్ళకి సర్వ నాశనమే గతి. అదే శరణ్యం. అదే గుడ్డిగా నమ్ము కూర్చున్నందుకు ఫలితం!—ఇది తిరుగు లేని సత్యం!—తెలిసిందా?—

"అమ్మడూ!—నా కథ వుందే, అది ఒకాళ్ళతో చెప్పుకునేందుకు లేదు తల్లీ:—కాని, ఇప్పుడు నీ నెత్తిన పడిన విషయముందే, అదే నా జీవనానికి విషజ్వాల అయింది. నన్ను చుట్టేసి దహించి పారేస్తూంది అమ్మా!" అని అంటూండగానే చెబుతూ చెబుతూ వున్న ఆ వృద్ధురాలి కంఠస్వరం—లోలోపల బాధిస్తున్న యాతనతో వేదనతో క్రమక్రమంగా బిగుసుకుపోతూ వచ్చింది.

ఈ స్థితిలో సంధ్య ఆవిడ చేతిని మెల్లిగా తన చేతిలోకి తీసుకుని, "ఈ మాట లిహ అలా ఉణ్నిచ్చెయ్. నాయనమ్మా! తరవాత చెప్పుకోవచ్చు!" అని అన్నది.

ఆవిడ తన రెండోచేత్తో మనుమరాల్ని వక్షం దగ్గరికి చేర్చుకుంది. తనకు తనే ఒక్క క్షణంలో కుదుటబరుచుకుంది. తన సహజసిద్ధమైన కంఠస్వరంతో మెల్లి మెల్లిగా మళ్ళీ చెప్పటం ప్రారంభించింది—

"అమ్మాయీ, సంధ్యా! ఈ లోకంలో జాతులూ కులాలూ ఏమిటో. వాటికిచ్చే గౌరవం మర్యాద ఏమిటో, ఇవన్నీ ఎప్పుడు పుట్టాయి. ఎలా మారుకుంటూవచ్చాయి.-ఈ పరిణామం అంతా ఓ చిత్రమైన కథ తల్లీ!—ముక్కుపచ్చలారని పసికూనవి. నీకెలా తెలుస్తాయి ఈ గాథలు? అందుకనే చెబుతా విను, జాగ్రత్తగా:

"దేశాల్ని పాలించే రాజులే అను, ప్రభువులే అను, ఒకానొక కాలంలో గుణాలనే ప్రధానంగా ఎంచి, వీరు మంచిగుణాలు కలవారు అనిచెప్పి కొంతమందికి కుల గౌరవమిచ్చి, ఇది బ్రాహ్మణజాతి అని ఏర్పాటు చేశారు. ఇంతవరకూ బాగానేవుంది. కొంతకాలం గడిచేసరికి ఈ బ్రాహ్మణజాతిలో మంచిగుణాలు మాయమై, చెడు గుణాలు అంకురించి వృద్ధికావటం చూసి, దేశపు రాజులే ఆ బ్రాహ్మణ జాతిని ఏం చేశారు? ఆ వంశధరుల దోషాల్ని మాత్రమే లెక్కవేసి, మళ్ళీ ఒకజాతిగా ఏర్పాటు చెయ్యకతప్పని దుర్దినం కూడా వచ్చింది!—

"త్రుటీ, అనాచారమూ అనే ఈ రెండింటి పునాదిమీదా ఏ గౌరవమయితే ప్రతిష్ఠ



చేయబడిందో. దానిలోపల ఉండే మిధ్యను తెలుసుకోవాలి. తెలుసుకున్ననాడు—ఇప్పుడు ఏ కులం చూసుకుని మీరు ముగ్ధులైపోతున్నారో ఆ కులం ఒక్కటేకాదు—"తక్కువ కులం వాళ్లు" అనిచెప్పి ఏ యానాది ఆడవాళ్ళదగ్గర్నీ మీరు వెళ్ళగొట్టి పారేశారో, ఆ యానాదివాళ్ళ కులంకూడా 'తక్కువ కులం' అని అనటానికి సిగ్గుపుట్టి మీ తలలు నేలకి వాలిపోతాయ్! తెలిసిందా, సంధ్యా."

పట్టరాని కోపంతో, చెప్పలేని విరక్తితో జగద్ధాత్రి అక్కడ మరి నిలవలేకపోయింది. అక్కణ్నించి వెంటనే ఆ మట్టున లేచి వెళిపోయింది. కాని సంధ్య మాత్రం మెదలకుండా అక్కడే అలా కూర్చొనివుంది.

ఇప్పుడు సంధ్య మనస్సుకి ఒక్కవిషయం హఠాత్తుగా తట్టింది—సిగుతో, దుఃఖంతో కలిసిన ఒకానొక సంగతి ఏదో తన నాయనమ్మ మనస్సులో తప్పక ఉండితీరాలి. దానివల్ల ఆమె హృదయం పగిలి, దగ్ధమైపోతున్నది. అ... ఆ విషాద కధను పైకి చెప్పాలేక లోపల ఇముడ్చుకోనూ లేక యమబాధ అనుభవించిపోతున్నదామె! ఈ సంగతులన్నీ స్పష్టంగా ఊహించుకోగలిగింది, సంధ్య. తన తాతగారికి అనేక వివాహాలు జరిగినట్టు విన్నదికదా. కనక వాట్లకీ, వాట్లతో నాయనమ్మ పడుతున్న ఈ దుఃఖానికీ ఏదో గట్టి సంబంధం ఉండివుండాలని రూఢి చేసుకుంది.

కొంతసేపు అలా నిశ్శబ్దంగా కూర్చున్న తరవాత, సంధ్య మళ్ళీ మెల్లిగా అడిగింది! "నాయనమ్మా!—మనజాతిలో చాలా పెద్ద అనాచారమే ప్రవేశించింది. నాయనమ్మా! దేన్ని చూసుకుని మేమింతగా కులుకుతున్నామో, అందులో ఇంత

మోసముందన్న మాట! కాబట్టి, ఈ మనజాతీ, కులం—ఇదంతా వట్టిబోలు! ఉ_ బూటకం!!—అవునా, నాయనమ్మా?" అనడిగింది.

"దాంట్లో లోపం ఎంతవుందో నాకంటే ఎక్కువగా తెలిసినవారు మరెవరూ లేరు, తల్లీ!" అని ఇలా చెప్పబోతుండగా, కళ్ళ నీళ్ళు గిర్రున తిరికి అంతరాయంగా ఏర్పడ్డాయి. ఇలా అశ్రువులతో ఆమె కళ్ళు నిండిపోవడం ఆ మసకచీకటిలో కూడా సంధ్యకు కనబడకుండాపోలే.

వృద్ధురాలు చేత్తో కళ్ళు రెండూ తుడిచేసుకుని, మళ్ళీ చెప్పటానికి ప్రారంభించింది—

"కానయితే, మధ్య మధ్యని నేనే మనుకుంటూ వుంటానో తెలుసా, సంధ్యా!—మనిషికీ మనిషికీ మధ్య గిరిగీసినట్టు కనబడే ఈ సరిహద్దులు ఎన్నటికీ కూడా భగవంతుడు కల్పించినవి కావు. ఇవి దేవుడి నియమం కానేకాదు. ఆ పరమాత్మను చేరుకునేందుకు బాహాటంగా తెరిచివుంచిన ఆ సింహద్వారంలో మానవుడే ముళ్ళకంపల మీద ముళ్ళకంపలు వేసి, అత్యాచారమనే ఈ దడిని కడుతున్నాడు ఎంతకట్టినా అది, అనాచారాలతో అంతంత ముక్కా చెక్కలయిపోతూనే వుంది వాటిల్లోనించి తెలియకుండానే, చెత్తా చెదారం, పాపం గీపం ప్రవేశిస్తూ వుంటున్నాయి."

ఇలా చెప్పిన తరవాత, ఇద్దరూ కాస్సేపు మాటాడక ఊరుకున్నారు. నాయనమ్మ చెబుతున్న ఈ మాటలకూ, తన తాత పెళ్ళిళ్ళకి ఏదో నిండ్యమయిన సంబంధం ఉందే తీరిందని, సంధ్య మనస్సులో ఈ ఊహ గట్టిపడడం మొదలయింది. అయితే ఆ వృత్తాంతమేమిటో అసలు, తలా తోకా తెలియదుగా! తెలియకపోయినా, సంధ్య మనస్సులో యిది చెప్పలేని భయానికి కారణమయింది.

అప్పుడన్నది నాయనమ్మ—

"అమ్మాయీ!—వెళ్ళి ఆ దేవుడిగది పనేదో చూసుకో అమ్మా. లేకపోతే మీ అమ్మకి చాలా కోపమొస్తుంది!"

"ఆ పనేదో ఈ పాటి కావిడే చేసేసుకునుంటుంది నాయనమ్మా!" అని ఆవిడ చెయ్యిపుచ్చుకుని, "రా, నాయనమ్మా! నా గదిలోకి పోదాం! అక్కడ కూచుని నీ కాలంనాటి అచ్చట్లూ ముచ్చట్లూ కాస్త చెప్పుకుందాం!" అంటూ ఓ రకంగా ముసిలావిణ్ని బలవంతపు బ్రాహ్మణార్థంగానే తన గదిలోకి లాక్కుపోయింది, సంధ్య.

## 11

పల్లెటూళ్ళల్లో ఏమాత్రం పొద్దోయినా ఎంతో గంభీరంగా ఉన్నట్టుంటుంది. ఇప్పు

దివాళ రాత్రి ఏమంత పొద్దుపోలే. బహుశా జాము పొద్దో యుండవచ్చు. అయినా ఎంత గంభీరంగానో కనిపిస్తూంది.

జ్ఞానద పడుకునే గదిలో ఆముదపు దీపం ఒక మూలని మినుకు మినుకుమంటూ వెలుగుతోంది. జ్ఞానద ఉత్త నేలమీద కూర్చుని వుంది. ఆమె పక్కనే రాసమణి కూచుని, ముఖమూ చేతులూ తిప్పుతుంటూ, యిలా మందలించటం ప్రారంభించింది:—

"చూడు జ్ఞానదా!—నే చెప్పినట్టూ విను. వెర్రి కళలు వెయ్యబోక. ఛక్కా మందిచ్చి వెళ్ళాడా, ఆయనగారూ? గుటుక్కుమని మింగేసెయ్. అంతే! ఆ శాస్త్రా కడుపులో పడిందా అంతే, నీకేం తెలుసు—ఎలావున్న దానివి అలా మళ్ళీ మామూలు మనిషివై పోతావ్! చూస్తే కనిపెట్టనయినా కనిపెట్ట లేరన్నమాట! తాగమ్మా, తాగేసెయ్ ఈ శాస్త్రాను!—"

కళ్ళ నీళ్ళు కారుతూ ఉండటం చేత జ్ఞానద ఆగుతూ ఆగుతూ గద్గద స్వరంతో ఆపి ఆపి ఇలా అన్నది;—

"అక్కగారూ! ఇలాంటి మాటలు మీరు నా కెలా చెప్పగలిగారండీ? జరిగిన పాపం జరిగిపోయింది గాక, దానిపైన మరో మహాపాపానికి ఎలా ఒడిగట్టుకోనండీ? ఈ పనిచేస్తే ఆ నరక లోకంలో కూడా నాకు జాగా ఉంటుందంటారా?—"

ఇలా అనేటప్పటికి రాసమణి బుస్సుమని లేచింది: "గొప్పే, మహా!!!—ఇటు వంటి దొడ్డ కులానికి ఇంత మసిపూసిన నువ్వు, అందలమెక్క దలుచుకున్నావు కాబోలునేం? స్వర్గ మొహటా నీకు, స్వర్గం!!—బుద్ధి తెచ్చుకుని, తిన్నగా ఆలోచించుకో! నే చెప్పినట్టల్లా చెయ్యి!—ఇలా మంకుపట్టు పట్టితే కుదరదు. ఊరుకోం. పెంకితనం మానేసి, నే చెప్పినట్టూ నడుచుకో, తెలిసిందా? హూఁ!—దేశానికి కంతటికీ పూజ్యుడు, మా తమ్ముడు, అతడి తల తీసెయ్యకు! ఖబడ్దార్!?—"

చేతులు రెండూ జోడించి ఏడుస్తూ అంది జ్ఞానద—"ఆ మందు నే శాస్త్ర కూడా మింగనండీ. మీ వ్యూహం ఏమిటో నాకు తెలిసిపోయింది. విషం పెట్టి నన్ను చంపెయ్య దలచుకున్నారు మీరు!"

ముఖం అతి వికారంగా అదోలా పెట్టింది రాసమణి. "ఓహో, అలా చెప్పూ! చచ్చిపోతానని భయమా? అందుకనా, మందు మింగక పోవటం? అలా అని యేడవకా, "శిశు హత్య మహా పాపం, భ్రూణహత్య చెయ్యకూడదు!" అంటూ ధర్మ పన్నాలు ఏకరు పెడతావెందుకే? "ఛస్తానని నాకు భయం!" అని అక్షరాలా

చెప్పేసెయ్ ; తీరిపోతుంది!''

"అది విషం కదా!'' అన్నది జ్ఞానద.

మళ్ళీ అందుకుంది రాసమణి—

"అది విషమయితే నీకేం, మరైతే నీకేం చావవులే." అన్నది తీక్షణంగా. అంటూనే, ఒక్క రెప్పపాటు కాలంలో స్వర్గాన్ని అతి కోమలంగా, దయ ఉట్టిపడేట్టు మార్చేసింది.

"నువు గాకపోతే, ఈ లోకంలో నీ కంటే వెర్రి దేవతయినా వుంటుందా? నీకు మేం చెడు చేసే మందు పెడతామటే చెల్లాయ్. ఆలోచించు కాస్త! ఎక్కడయినా వుంటుందా ఇంతటి విడ్డూరం? రాసమణి ఇలాటి పని చేస్తుందని ఎవళ్ళయినా అనగలరేమో చెప్పు! ఏదీ. అదంతా వొట్టిది.

"బ్రహ్మరాతవల్ల ఎలాగో నీ కడుపున శత్రువు వద్దాడు ఆ శత్రువుని కాస్తా కరగి పోనీ. అదెంతల్లో వని!—ఈ కాస్త గొడవా తీరిపోగానే ఇహ మళ్ళీ ఎప్పట్లాగే అయిపోతావ్ నువ్వు!—అటుపయిన హాయిగా తిను, తిరుగు, తీర్థాలు సేవించుకో, పురాణశ్రవణాలు చేసుకో—స్నానాలు, ధర్మాలు, వ్రతాలు, నోములు, పుణ్యకార్యాలు ఎన్నయినా ఇష్టమొచ్చినట్టూ జరిపించుకుందుగాని. నీ ఇష్టమే యిష్టం! ఇహ—పై మాటలు ఎవళ్ళకు తెలుస్తయ్? ఎవరు చూడొస్తారు?''

మాటాడక తల వంచు కూర్చుంది జ్ఞానద

"అటయితే తీసుకురమ్మనేదా?'' అనడిగింది రాసమణి.

మొహం ఎత్తకుండానే ఒక్క యేడ్పు ఏడ్చేసింది జ్ఞానద. "ఏమైనా సరే, ఆ మందు నేనంటను, ముట్టను. ఊహూ—ఆ మందు తాగితే నేనెన్నటికీ బతకను" అంది.

భయంకరంగా విపరీతమైన కోపం తెచ్చేసుకుంది, రాసమణి.

"ఇదెక్కడి మొండితనమే లోకంలో యేళ్ళిశా చూశ్శేదూ! మహా అన్యాయంగా వుందే! తాగవ్? ఇదే చెప్పడం—తాక్కపోతే లేచిపో ఇక్కడ్నించి!—ఏదో చిన్నపని చేయనేచేశాడే అనుకో, దానికోసమని ఆడాళ్ళంత రాద్ధాంతం చేసుకుని, పట్టు పట్టి నెగ్గగలవా అనడుగుతా! ఈ వెర్రి వేషాలేవీ సాగవ్, తెలుసుకో!—

"చటర్జీ తమ్ముడు చెప్పవే చెప్పాడు, ఏమన్నాడో విన్నావా?— "సరి—అయిం దేమో అయిపోయింది, దానికో యాభై రూపాయ లిస్తాను, కాశీకే వెళుతుందో,బృందా వనమే దర్శించుకుంటుందో, దానిష్టం'' అని చెప్పాడు. ఇహ అటువంటప్పుడు ఇందులో ఆయన తప్పేం లేదుగా?—ఆయన్ని అనవలసిన పనేమీ లేదుగా? జ్ఞానదా! ఆయనిచ్చే రూపాయిలు కాసిన్నా, కూసిన్నా?—ఒక్కమాటుగా ఓ గుప్పెడు....కళ్ళ



చూస్తావ్!'' అన్నది.

అందుకు జ్ఞానద ఇలా చెప్పింది—

''నా కెందుకండీ రూపాయిలు, అక్కగారూ! — నే నెక్కడి కెళ్లాలి? ఇవి తీసుకుని ఏంచేసేది? ఎక్కడా ఎవరి మొహమూ ఎరగనే! — నేనెక్కడికి వెళ్ళిమాత్రం తలెత్తుకు నెలా నిలబడనండీ? ఈ మొహం లోకానికి ఎలా చూపించేదండీ?'

రాసమణి మళ్ళీ అన్నది— ''ఇదంతా చూడగా—మమ్మల్ని మెడలువంచి, లొంగదీసి, నీయిష్టమొచ్చినట్టూ ఆడించటానికి చేసే ఉపాయంలాగా కనిపిస్తోంది. లేకపోతే యేమిటీ? — కాశీ అనీ, బృందావనం అనీ లోకులు మాటిమాటికీ చెప్పుకుంటూనే వుంటారు, వెళ్లొస్తుంటారు గదా, నువ్వెప్పుడూ వినలేదు కామోసు. వంగనాచివి? — ఇంతమంది జనానికి అక్కడ చోటుండగా లేంది, నీ ఒక్కదానికా లేకుండా పోయింది!'' ఏం మాటలే, నేర్చావ్ ఎలాగయితేం!''

కాస్సేపు నిశ్శబ్దంగా ఊరుకుని, ఇలా అన్నది జ్ఞానద—''ఇదంతా నాకు తెలుసు, రాసుదీదీ! — రేపటిరోజున ఆయన ప్రాణముఖర్జీగారి పిల్లకి పుస్తె కడతారని తెలుసు. కాబట్టి—నేను విషంతాగి చావనీ, లేదా కాశీకి లేచిపోనీ, మరేమయినా కానీ—ఈ యింటో జ్ఞానద మరి లేకుండాపోవాలి మీకు, ఇదేకదా మీ కోరిక?—

"కాని ఓ దేవుడా! ...అని అంటూండగానే జ్ఞానదకు పట్టరాని దుఃఖం వచ్చింది. బావురుమని ఏడిచింది రెండు చేతులూ ఎత్తి దణ్ణంపెట్టి, మళ్ళీ అందుకుంది—

"ఓ దేవుడా! నీ పాదాలముందు ఇంతమందికి చోటిస్తివే! నాకుమాత్రం ఇవ్వవా —చిన్ననాటినించీ ఏ పాపమూ చేసిఎరగను చెయ్యవలసినంత అవసరమూ నా కెన్నడూ కలగలేదు. నీకు తెలియనిదేముంది భగవాన్!—ఉపాయం తెలియని అమాకురాల్ని, దిక్కూ దివాసీ లేనిదాన్ని. కనక ఈ పాపపు బండిని నేనొక్కత్తెనే లాక్కుపోవాలా? ఇదేనా నీ ఆజ్ఞ?"

దేవుడిపేరు ఎత్తేసరికల్లా రాసమణికి ఎక్కడలేని కోపమూ వచ్చి పడింది!— "అయితే ఛావు! శాపనార్థాలు కూడా పెడతావేమిటి? పాలుతాగే పసిపాపవి కాబోసు పాపం. నువ్వు? ఇంకానయం, అదుపులో ఉంచబట్టిగాని, లేకపోతే ఈపాటి కెంత మందిని మింగేసేదానివో! ఇంతకీ—నీవేపాటి అయినా చనవిచ్చి, రేపెట్టకపోతే మగ వాడు నీ ఒంటిమీద చెయ్యి వెయ్యగలడా? ఎన్నిగుండెలు!—అయినా మగవాడికి తప్పేముందిలే! ఇటువంటి వ్యక్తి ఏనాడయినా ఏ దేశాన్నయినా ఉన్నాడేమో రాసమణికి చెప్పమను. చూస్తాను!" అన్నది.

ఇహ దీనికి సమాధానమేముంది చెప్పటానికి? — పైటకొంగుతో జ్ఞానద కళ్ళొత్తుకో నారంభించింది. ఇదివరకన్నా టే స్వరం కాస్త తగ్గించి, రాసమణి మళ్ళీ నిమ్మళంగా ఇల్లా చెప్పింది—

'ఏమే, చెల్లాయ్! ఇదుగో, ఆ కోయదాని మందుచ్చుకోవడం నీకు భయంగా వుంటే పోనీ, ప్రియముఖర్జీ మందంటే నమ్మకమేగా?—అతగాడేదయినా మాత్ర యిస్తే . ?'

తెల్లబోయింది జ్ఞానద: "ప్రియబాబు ఇస్తారా అటువంటి మందులు?" అనడిగింది.

"హు!—ఇవ్వడూ? ఛటర్జీ తమ్ముడు ఇవ్వమంటే ఇవ్వకుండా పోతాడా? ఫరవాలేదు, ఇస్తాడులే, కబురెళ్ళింది, "ఇదుగో వస్తున్నా"నని చెప్పి సమాధానం కూడా వచ్చేసింది. ఈపాటికి వస్తూంటాడు ముందస్తుగానే నీకు చెప్పిపెడుతున్నా! ఆయన వచ్చినప్పుడు అన్ని సంగతులూ మాయామర్మం లేకుండా చెప్పెయ్యాలి సుమా! ఏమీ దాపరికం పెట్టకూడదు, మనస్సులో!

మరి మాటాడలేదు జ్ఞానద, చూస్తూ కూచుంది. ఆమెకు రాసమణి ఇంకా యేవో ఉత్సాహం కలిగించే మాటలు చెప్పబోతూంది. అంతలో దాపునే బూట్సుల చప్పుడు వినబడ్డది. ప్రియముఖర్జీ మాటలు కూడా ఇలా వినబడ్డాయి!

"ఏమిటీ దారి? అంతా అడివి మాలోకం. అంధకారబంధురంగానూ వుందే!

పాతకాలం వాడిలా ఉన్నాడు - ఇంటిదాకా తోడు వస్తా నన్నాడు!

ఒక్కదీపమైనా పెట్టలే దెంచేత? నవుకర్లందరూ ఏమైపోయారు?"

ఇలా అని ప్రియముఖర్జీ టకటక చప్పుడు చేసుకుంటూ గబగబా ఇంటోకి వచ్చేశాడు. చంకలో ఇరికించుకుని వున్న అయిదారు చిన్నా పెద్దా గ్రంథాలు తీసి మేజా బల్లమీద పెట్టాడు. చేతిలో మందులపెట్టె కిందవి పెడుతూ పెడుతూ. కుశలప్రశ్నలు ప్రారంభించాడు—

"జ్ఞానదా, ఇవ్వాళ ఎలా వున్నదమ్మా? హుం హుం హుం హుం! అని మూలుక్కుంటూ కూచుంటే ఎల్లా? అలా అయితే కుదరదు సుమా, ఇంత చలిగాలి కొడుతూందే? కిందవి కూచుంటివి; జలుబట్టుకోదూ రెమిడీ—అంటే మందు కొంచెం మార్చాల్సి వుందనుకుంటాను. ఇవాళ.

"ఓహో. పిన్నిగారా? వచ్చి ఎంతసేపయిందమ్మా? అంతా ఖులాసాయేనా? వస్తూ వస్తూ దార్లో మీ మనుమరాల్ని చూశాను పిన్నీ! అంత ఆరోగ్యంగా కనిపించలేదేం? అయితే, ఆ పిల్లకి ఆకలి ఎలా వున్నట్టు?" రేపోమాటు తీసుకొచ్చి. చూపించు. దాని నాలిక పరీక్ష చెయ్యాలి.

"ఏరోజూవ నేనేదిక్కుకి పోనో. అక్కడ ఆపళంగా ఏదో ఒక విధ్వూరం పుట్టుకొచ్చేసిం దన్నమాటే? చచ్చేందుక్కూడా నాకు తీరికలేకుండా వుంది.

"ఇదిలా వుండగా. రేపే మా అమ్మాయి పెళ్ళి. రేపుదయమే. పిన్నీ!—కనక ఎవళ్ళనిచూపినా రేపు చీకటితోనే చూడటం. పిల్లపెళ్ళికదూ! ఆ తరవాత మరి బయటికెక్కడి కెళదామన్నా ఇహ తీరికేవుండదు ఇంతకూ. ఈ రోగుల గతి ఏమిటా. వీళ్ళంతా ఏమైపోతారా?—అని ఇదే ఆలోచన పట్టుకుంది. ఇదే విచారం!—

"ఒకళ్ళా ఇద్దరా? ప్రియముఖర్జీని తప్పిస్తే. ఇప్పుడెవళ్ళూ ఆ విపినుణ్ని పిలవడంలేదు. పూర్తిగా మానుకున్నారు. కాని. వాళ్ళు ఇలాంటి పిచ్చి పెట్టి ఉక్కూచుంటే కష్టమే!

"పాపం. అతగాడు కూడా ఏదో కొత్త నేర్చుకున్నాడుగా? ఎవళ్లూ వెళ్ళకపోతే అతడికిమాత్రం జరుగుబాటు ఎలా? పాపం. ఇప్పుడు చూస్తే జాలేస్తుంది.

"సరే. ఏదమ్మా. చెయ్యి ఒకసారి!—పంచూడీకి గుండె జబ్బుట! ఓ మాటువెళ్ళి అతణ్నికూడా చూసిరావాలి. ఏదమ్మా—చెయ్యేదీ. ఒకసారి!—'

చెయ్యివ్వలేదు. జ్ఞానద మెదలకుండా తల వాల్చుకుని కూచుంది

రాసమణి అడిగింది—

''అప్పనుగానీ. దీని వ్యాధి ఏమిటో సరిగ్గా కనిపెట్టారా ప్రియబాబూ?

ముఖర్జీ ఆవిడకేసి చూసి—''డిస్—అజీర్ణం. దోకు. పైత్యం .'' అన్నాడు.

ఇతడు ఇలా చెబుతుండగా. ప్రశ్నవేసిన రాసమణి—నీకేం తెలుసు నన్నట్టుగా అడ్డుగా తలతిప్ప నారంభించింది. మూతి ఒదోలా పెట్టింది. ఇది క్రితంట కని పెట్టాడు ప్రియబాబు. అంతకష్టపడి నేర్చినటువంటి అమూల్యమయిన తన వైద్య విద్య యావత్తూ అంతటితో అంతరించిపోయిందా అని తోచిందతడికి

ఖలే ఖంగారెత్తిపోయింది ముఖర్జీకి. తొట్రుపడ్డాడు. ''ఏమిటేమిటీ? ఎందుక్కాదూ? నే చెప్పింది ఎందుక్కాదూ? విపినుడుగానే వచ్చాడాయేం? ఏమిటని చెప్పాడు? ఏం మందిచ్చి పోయాడూ? ఏదీ. అమందేదీ? కొత్త చూస్తాను.'' అన్నాడు అపరిమితమైన తొందరపాటుతో.

పరస్పరమూ విరోధమైన ద్వంద్వాలు కొన్ని కొన్ని ఉంటున్నాయ్. లోకంలో—సత్యం—అసత్యం. యుక్తం—అయుక్తం. కాఠిన్యం—కోమలత్వం.—ఇలాటి వెన్నో. అయితే రాసమణి ముఖంలో మట్టుకు ఈ ద్వంద్వాలన్నీ ఒకదాని కొకటి విరుద్ధం కాకుండా కాపరం చేస్తాయి. ఏదన్నా ఒక ఉపోద్ఘాతం ప్రారంభిస్తుంది. అలా మొదలేసిన దానితో అసలు విషయానికి మెరుగు పెడుతుంది. ఈ ప్రజ్ఞ ఆమెకు దైవమిచ్చిన వరం! అయినప్పటికీ. అటువంటి వరప్రసాదిని అయిన రాస మణి సైతం ఇప్పటి స్థితిలో వెనక ముందాడవలసి వచ్చింది.

ఆవిడ మళ్ళీ మరోవిధంగా తలతిప్పి ఇలా చెప్పింది :

''లేదు నాయనా. లేదు! విపినుడికి కబురు చెయ్యలే. పరాన్ ఛటర్జీని పిలిపించ లేదు. నీముందు వాళ్లెంత? వాళ్ళమొహం: వాళ్ళకసలు వైద్యమనేది ఏమన్నా తెలుసునా అంట? మా తమ్ముడు గోలోక ఛటర్జీ అందరి ముందరా ఈ మాటలే అంటూ

వుంటాడు!" అంటూ పొంగవేసింది.

"ఎందుకనయ్యా? అందరూ అంటారు. ఈమాట. విపిను దున్నాడే. వాడూ వాడగ్గర ఇంకా పదేళ్ళపాటు చదువుకోవాలి. ఆనాడు "వల్ సెటిలా" ఇచ్చి...."

"అవునవును నాయనా — కీరక మరో చిన్న సంగతి : ఈ భరవాకూతురు కూడా మరేం తక్కువగాదు - విన్ను తప్పితే ఇంకొకాహర్ని పిలవటానికి వీల్లేని పని చేసుక్కూచుంది...."

"అదేమిటమ్మా పిన్నిగారూ?—నే నుండగా ఇంకోడు వైద్యం చెయ్యటానికీ యింటో కాలెట్టడమే?—కాని పిన్నీ!—ఈ రోగాలు నయం కావటానికి కొంత టయిమ్ అవుతుంది సుమా! అయితే. ఏమాట కామాటే చెప్పుకోవాలి. నేను కొద్ది రెమిడీలు మాత్రమే వాడతాను. అంటే—రెండు మూడు మందుల కంటె ఎక్కువ వాడను. ఇప్పు డా రెండు నెంబర్ల మందులతోనూ నోట్లో నీరూరదం. కట్టిందా లేదా? చెప్పమ్మా. జ్ఞానదా! నిజం చెప్పు!—"

"నేను వంచిన ఈ తల నేలతో కలిసిపోతే బతికిపోయేదాన్ని కదా!" అనుకుంది మనస్సులో. జ్ఞానద.

జ్ఞానద నోరువిప్పి ఏం చెప్పలేదు గాని. అందుకు బదులుగా రానమణి కల్పించుకుని ఇలా చెప్పింది—

"మా జ్ఞానదకు నీమీద తప్ప మరొకాహ రెవళ్ళ మీదా నమ్మకం లేదు నాయనా!—నిన్ను సాక్షాత్తు ఆ ధన్వంతరి అని నమ్మింది. నీమందే దానికి అమృతం!—కాని. ప్రియబాబూ!—దీనికి పట్టిన జబ్బు నువ్వనుకున్నది మాత్రం కాదు సుమా!—నువ్వనుకున్నదానికి కేవలం విరుద్ధం. పాడుమొహం! ఉత్త దురదృష్ట వంతురాలు!

ఉద్రేకంతో చెయ్యెత్తి ఇలా అన్నాడు ప్రియముఖర్జీ—

"విరుద్ధం కాదమ్మా పిన్నీ! విరుద్దం ఏమాత్రం కాదు. విపినుడి చెయ్యి—ఆ పాపిష్ఠి చెయ్యి పడితే విషమించేదే. కాని. ఈ వచ్చిందెవడో తెలుసా?—ప్రియముఖర్జీ సుమీ!—మరెవడూ కాదు. కాబట్టి భయపడ నక్కర్లే!—"

మొహం మొత్తుకుంది రానమణి.—"నిజమేనయ్యా నాయనా!—నువు బతికింవా వంటే భయంలేని మాట నిజమే! కాని. ఈ నష్టజాతకురాలు—ఈ ముండాకూతురు అందరి నెత్తిమీదా చేతులెట్టి. సర్వనాశనం చేసుక్కూచుంది! నువు బాగా ఆలోచించి. ఇప్పట్లో తగిన మందువేస్తే ఒడ్డెక్కుతుంది. లేదంటే ఈ ఇంటికీ, ఈ కులానికీ కూడా మైల అంటుకునే గతి పట్టింది. నాయనా!" అన్నది.

రానమణి చెప్పిన మాటల్లో చిట్టచివర మాట ముఖర్జీ అంత పెద్దడాక్టరికి కూడా

అర్థంకాలే. అతడిమొహం చూస్తూనే ఈ సంగతి—అంటే అసలు విషయం అతడి కేం బోధపడలేదన్న సంగతి రాసమణి ఇట్టె గ్రహించేసింది. కనక ఇంకా తేట తెల్లంగా చెబుదామనే వుద్దేశంతో, అతన్ని ఇంకో గదిలో ఒక మూలకి తీసుకు పోయింది. అక్కడతని చెవిలో ఏవో కొన్ని మాటలు అస్ఫుటంగా చెప్పింది.

చెప్పగానే, ప్రియబాబు ఉలిక్కిపడి, "ఏమిటి పిన్నీ! ఏమంటున్నావ్? జ్ఞానదా! జ్ఞానదా!!" అనడిగాడు ఆత్రంగా.

"ఇంకేం చెప్పమంటావు నాయనా! బ్రహ్మరాత!—నుదుట రాసినగీత! తుడిచి పారెయ్యటానికి ఎవరితరం చెప్పూ?—తలెత్తుకు తిరుగుతున్న మా గోలోక ఛటర్జీ నేలకి తల వాల్చకుండా ఉండేట్టు—ఏదయినా తగిన మందియ్యి నాయనా! అత డింట్లో ప్రవేశించి ఈవిడ ఎలాంటి పనిచేసి పెట్టిందో, చూడు నా తండ్రీ!—" అంది.

తెల్లబోయాడు ప్రియబాబు అతడి ముఖం వెలవెల బోయింది. ఒక్కసారి జ్ఞానదా ముఖం చూడాలని ప్రయత్నించాడు.

తరవాత మెల్లిగా ఇలా అన్నాడు: పిన్నీ ;—మీరు విపిన్ డాక్టరునే పిలిపించడం మంచిది. దీనికి తగిన మందులన్నీ నా దగ్గిర లేవు." అని చెప్పి, తన పుస్తకాలూ మందులపెట్టే తీసుకోటానికని వంగాడు.

రాసమణి ఆశ్చర్యపడింది.

"ప్రియనాథ్!—ఏమిటన్నావ్? ఇది నలుగురికీ తెలియొచ్చా? యెంత చెడ్డా, నువ్వు మనవాడివి. విపినుడు పరాయివాడు, పైగా శూద్రుడు! బ్రాహ్మల మానమర్యాద లతడికి తెలియవచ్చా?" అనడిగింది.

ఇలా అడిగే లోపలే హఠాత్తుగా గోలోక ఛటర్జీ తలుపు తోసుకుని లోపలికి వచ్చేశాడు. ప్రియబాబు చెయ్యి పట్టుకు బతిమలాడుతూ యిలా అన్నాడు:—

"చూడు బాబూ! ఇదిగో—ఇది విషం అనుకుని భయపడి ఎవరు మందిచ్చినా మింగటం లేదు! లేకపోతే నీ కింత శ్రమ కలిగించకపోదును. ఈ ఆపత్తు నువ్వే దాటేయించాలి, ప్రియబాబూ!"

ప్రియబాబు చెయ్యి గబీమని లాక్కుని వదిలించేసుకున్నాడు.

"ఎబ్బే—ఇలాంటి చాటుమాటు పన్లు నేను చేసేవి కావు. రోగిని చూడ్డం, రెమిడీ సెలెక్టు చెయ్యడం, బస్!—అంతే నా పని!—ఇహ మీరు పోయి విపినుణ్ని, గిపినుణ్ని పిలిపించుకోండి, వాళ్ళనడిగి సలహా తీసుకోండి. వాళ్ళకయినా తెలుసునో తెలియదో!—" అంటూ, పుస్తకాలు మళ్ళీ చంకలో ఇరికించుకోటాని ప్రయత్నంలో వున్నాడు.



ఛటర్జీ మళ్ళీ ఒకమాటు ఆతని చెయ్యిచ్చుకుని తన చేతిలో పెట్టుకున్నాడు ఇంచు మించుగా ఏడుపు గొంతుకతో అన్నాడు :—

"బాబూ, ప్రియబాబూ!—ఈ ముసిలివాణ్ని కాస్తంత ఒడ్డెక్కించు నాయనా? చుట్టరికాన్నిబట్టి చూస్తే నేను నీకు మామగారి వరస. నా మాట నువ్వు విలబెట్టవనీ. ఇంత గొడవ చేస్తావనీ తెలిస్తే అసలు విన్నిక్కడికి పిలిపించనే పిలిపించకపోదును. ప్రియబాబూ! బాబ్బాబూ! బతిమాలుకుంటున్నా. నీ చేతులు పట్టుకుంటూ ఇవి చేతులు కావు, కాళ్ళనుకో!—నాయన్నాయన! మా కేదయినా దారి చూపించి మరిచే వెళ్ళు బాబూ!—" అంటూ ఎన్నోవిధాల ప్రాధేయపడ్డాడు

ప్రియనాథ్ ముఖర్జీ ఇదివరకటిలాగానే చెయ్యి మళ్ళీ లాగి విడిపించేసుకున్నాడు— "మనమూ మనమూ దగ్గిర చుట్టాలయితే మంచిదేండీ! అలా చెప్పి జీవహత్య చెయ్య మంటారా? భేష్—భేష్!—భలే వారే మీరు! మీకేం, మీరు బాగానే వుంటారు. పరలోకంలో నేనేమని సంజాయిషీ చెప్పుకోవటం, దీనికి?' అని అన్నాడు

ఇంకిప్పుడు ప్రియనాథ్‌ని వదిలేసి గోలోక్ వెనక్కి తిరిగాడు. గుమ్మందాకా, ఆ కళ్ళతీరూ, కంఠస్వరమూ ఇవన్నీ కూడా ఇంద్రజాలం చేసినట్టుగా ఒక్కక్షణంలో విచిత్రంగా మారిపోయినయ్! కర్కశ కఠోర స్వరంతో గద్దించాడు—"ఇంత

పొద్దుపోయాక ఇక్కడ నీకేం పని? పెద్ద మనుషుల ఇంటో నువ్వెందుకని దూరావ్?—

ఈ ప్రశ్న వింటూనే ఆశ్చర్యపోయాడు ప్రియబాబు. అంతేకాదు. మతోయినట్లయిపోయాడు. "ఏం పనా?—చికిత్స! చికిత్స!—చికిత్స చేయించుకోటానికని నాకు కబురంపిందెవరూ?—పహావ్వా! – బాగానేవుందే!" అన్నాడు.

గోలోక్ ఛటర్జీ అపశంగా ఎగిరిపడ్డాడు—"పహావ్వా? వెధవ్వ హావ్వా!—పంచదార మాత్రిర్లు నాలుగు పెట్టిలో వేసుకు ఊరంట తిరుగుతూ వైద్యం ఎరుగుదువేం! నువ్వు వైద్యం. నీ బొందాను! దొంగ వెధవా! చికిత్సట!! చికిత్స!!!—విధి అంటే తెలియదు. నిషేధమంటే యేమిటో తెలీదు. దురాచారపు ముండాకొడుక్కి!—ఎవర్రా నిన్ను పిలిచారు? ఏదారిని దూరావ్ ఇంట్లో? దిడ్డికంత ఎవరు తెరిచారు. నీకు?—" అంటూ ఈ ధోరణిలో—ఉరుములు మెరుపులతో దులిపి దుళ్ళగొట్టాడు!

ఆ వెంటనే జ్ఞానద ఉన్న గదికేసి తిరిగాడు. "పంచ మహాపాతకురాలా!—పాపం; మూడు కాళ్ళ ముసలిఅయిందే! కళ్ళు లేవి కబోదే! అటువంటి మీ మామ గారొచ్చి. యేద్చేడ్చి. ఉత్త చేతులూపుకుంటూ తిరిగి పోయెనే! ఎన్నివిధాల చెప్పాను. చిలక్కి చెప్పినట్టు: "జ్ఞానదా. వెళ్ళమ్మా. ఇలాంటిస్థితిలో ఆ ముసిలివాళ్ళని నువు కనిపెట్టకపోతే మరెవరూ అని? అంతగా చెప్పినా. "నేను రానుగాక రాను పో!" అనే స్తివే? ముసిలి అత్తగారు ఒకమూల చావ సిద్ధంగా వుంటే. స్వయంగా నేవచ్చి "వెళ్లమ్మా. జ్ఞానదా!" అని చెబితే కూడా మొద్దల్లే కదిలేనా? ఇందుకేనా అప్పుడు కదలకపోయిందీ?—రాత్రి రెండు ఝాములవేళ చికిత్స చేయించుకోటానికేనా?—అగు—ఛాండాలపు ముండా! ఏం చేస్తానో చూదుగాని. రేపటిరోజున నీ బుర్రగొరిగించి. సున్నపు బొట్లుపెట్టించి. గాడిదమీద ఊరేగించి మరీ పంపిస్తా! లేకపోతే నాపేరు గోలోక ఛటర్జీయే కాదు!" అన్నాడు ఉగ్రమూర్తి అయి.

జ్ఞానదకు తలమీదనించి ముసుగెప్పుడు జారి కిందపడిందో ఆమెకు తెలియనే తెలీదు. ఆమె నోటమాట లేదు కళ్ళు రెండూ ఇంత చేసుకుని ఒక రాతిబొమ్మలా కూర్చునివుంది!

అప్పుడు ఛటర్జీ రాసమణి కేసి తిరిగి ఇలా అన్నాడు—"రాసూ!—వీళ్ళనీ. వీళ్ళ వ్యవహారాన్నీ నువు కళ్ళారా చూస్తూనే ఉన్నావుగా? పది గ్రామాలకు సభాపతి నయిన నా ఇంటోనేనా ఇంతటి మహా పాతకం! పెదపులి గుహలో తోడేళ్ళ కాప



రమై పోయిందే!''

ఇప్పటిదాకా రాసమణి నోరెత్తకుండా గడబిడంతా చూస్తూ చూస్తూ కూచుని వుంది.

''అవునవును. తమ్ముడూ! ఇప్పుడు నువ్వన్నట్లే అయింది, సరిగ్గా.

''నువ్వే ఇందుకు సాక్షివి సుమా!'' అన్నాడు ఛటర్జీ.

''కాకేం?—చేతిలోపని అయిపోయాక, రాత్రివేళ కాస్త తీరిక చేసుకుని, జ్ఞానద ఎల్లా వుందో చూసిపోదామని వచ్చా. వచ్చి చూస్తును కదా—వీళ్ళిద్దరూ ఒకాళ్ళ చెవిలో ఒకాళ్ళు! ఒకాళ్ళమీద ఒకాళ్ళు!! అసి, వీళ్ళాఘాయిత్యం కూలా!!!—ఏమనుకోను?—ఆ నవ్వులూ, గుస గుసలూ, ఆ వేళాకోళాలూ, వెకరా కొకరాలూ, ఊపిరి తిరక్కుండా ఒకటే కబుర్లు! ఏం చెప్పేది వహవ్వా! వహవ్వా!!—'' అని చెప్పింది.

ఇందుకూ జ్ఞానద నోరేమీ మెదపలేదు. ముందటి మోస్తరుగానే ఇప్పుడూ ఆమె ఒక రాతిబొమ్మ! శిలా విగ్రహం!!—కూచుని వుంది.

ఇంకిప్పుడు ప్రియముఖర్జీ సంగతి ఎలా వుందంటే— అగాధంలో పడినట్టయింది. దయ్యం పట్టిన వాడిలాగా అలానే చూస్తూ నిలబడి వున్నాడు।—

గోలోక్ అతగాణ్ని మోచేత్తో ఒక్క నెట్టునెట్టాడు. అతడి చంకనున్న పుస్తకాలు ఇవతలికి లాగి పారేశాడు. మెడ గట్టిగా పట్టుకుని, ఒక్కతోపు తోసి, అర్థ చంద్ర ప్రయోగం చేశాడు।

"వెధవా, ఖడవా, కుంకా, గాడిదే।—పో।—నా యింట్లోంచి లేచి పో।।—తీరా, నువ్వు మా రామతన్ బెనర్జీ అల్లుడివై పోయ్యావని ఊరుకున్నా గాని.—లేక పోతే, ఝూటా తీసి ఎడా పెడా వాయించేవాణ్ని: అంతేనా?—వచ్చిన కుక్కని ఈడ్చినట్టుగా కొనప్రాణాలతో బయటికీడ్చి, పోలీస్ స్టేషన్‌లో అప్పగించేవాణ్ని।।"

ఇలా అని అంటూ ఒక్క తాపు తన్నాడు।।।

ఈ గొడవా, గందరగోళం విని నవుకర్లూ చాకర్లూ అంతా బిల బిల మంటూ వచ్చి మూగేశారు—రెండూ పక్కలా బారులు తీర్చినట్టుగా నిలబడ్డారు. ఛటర్జీ వాళ్ళం దరి మధ్యనించీ ప్రియబాబుని ఒక్కొక్క తోపు తోసుకుంటూ, పెడీ పెడీ మని ఎడంకాలితో ఒక్కొక్క తాపు తన్నుతూ, బయటికి తరుముకు పోయాడు।—

"వాహ్।—సరి సరి।—అబ్బా। భేష్।—మజా। — అమ్మా।—అయ్యో। — మొర్రో।।—" అని కేకలు పెట్టుకుంటూ, తూలుతూ, మళ్ళీ లేస్తూ ప్రియముఖర్జీ పరుగెత్తాడు.

ఆ వెనకాతలే నవుకర్లూ చాకర్లూ కూడా కూడా వెళ్ళారు. రాసమణి కూడా మాటాడక వాళ్ళ వెనకాలే వెళ్ళి వెళ్ళి, చివరికి దారి తెలియక పక్కనే నిలబడి పోయింది.

ఇహ అక్కడ ఉండిపోయిందల్లా ఒక్క జ్ఞానదమాత్రమే. ఇంతకు ముందటి లాగానే కదలక మెదలక మాటాడక జీవంలేని రాతి బొమ్మల్లే అక్కడ కూర్చుండి పోయిందల్లా ఒక్క జ్ఞానద।—

# 12

గ్రామం గ్రామమంతా ఇవాళ పొద్దిటినించీ సన్నాయి మేళాలతో గింగురుమంటూంది. అందరికీ చెవులు తడికలు కట్టేస్తున్నా యన్నమాట. అంత వైభవంగా వుంది।—

ఇవాళ ఒక్కరోజు దాటిపోయిందంటే, మరి మళ్ళీ పెళ్ళి ముహూర్తాలు ఇంతలో లేవు. త్వరలోనే మూఢమి ముంచుకొచ్చేస్తూంది. ఆ భయంచేతనే లగ్నాలన్నీ ఈ

ఒక్కరోజున జరిగిపోతున్నాయి. ఇప్పుడీ ఒక్క ఊళ్లోనే నాలుగైదిళ్ళలో పెళ్ళిళ్లు. అన్నట్టు—సంధ్య పెళ్ళికూడా ఇవాళే! ఈ సంగతి బాగా గుర్తు పెట్టుకోవాలి!

ఊరు వొదిలేసి వెళ్ళిపోవాలని ఎప్పట్నించో అనుకుంటున్నాడు అరుణ్. కాని. ఇంతవరకూ పడలేదు. ఇందు కనేక కారణాలున్నాయి. అవేం పట్టించుకోకుండా మామూలుగా ఎప్పటిలాగానే పనిపాటలు చేసుకుంటున్నాడు. అతనిలో కలిగినమార్పు పైకి ఏమీ కనిపించటం లేదు. కాని కాస్త జాగర్తగా కనిపెట్టి చూసే మటుకి, ఒక్క సంగతిమాత్రం బాగా స్పష్టంగా తెలిసిపోతుంది—స్వదేశంమీద అతగాడికి మమకారం తప్పిపోయిందని.

లోగడ అతడు దేశానికి మేలు కలిగించే పనులు కొన్ని తలపెట్టాడు. ఎంతో శ్రద్ధతో చేయిస్తూనూ వచ్చాడు. ఇప్పుడు వాటన్నింటితో సంబంధాన్ని శిదాగా వది లేసుకున్నాడు. ఏమీ?—ఊళ్లో అతడికి వెలి! ఊళ్లో ఇవాళ ఇన్నిన్ని పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి కదా. ఒహళ్ళూ అతన్ని తాంబూలానికి గాని పెళ్ళి భోజనానికి గాని పిలవగానే లేదు! లోకం మరమ్మత్తు కోసమని అత డివాళ ఎక్కడికీ వెళ్ళలేదు. అరుణ్‌కి ఈనాడు ఊళ్ళో అన్ని ఇళ్ళూ తలుపులూ—బంద్ అన్నమాట!

సూర్యాస్తమానం అయింది. అరుణ్ తన మేడమీద రీడింగ్ రూమ్‌లో మాటాడ కుండా కూర్చుని వున్నాడు.

విపరీతమయిన చలిగాలి తోలుతున్నా మేడమీది తలుపులూ కిటికీలూ తెరిచే వున్నాయి. ఝడిగాలికి ఆ తలుపులు దడ దడ కొట్టుకుని చప్పుడవుతున్నాయి.

ఆకాశాన మబ్బులేదు. త్రయోదశి చంద్రుడి కాంతి కిరణాలు ఈ మూలనించి ఆ మూలకి వ్యాపించాయి. కిటికీ ముందర కూర్చున్న అరుణ్ కాళ్ళముందు కొన్ని కిరణాలు పడుతున్నాయి. వసారాకి దగ్గరలో అతడికి ఎదటనున్న కొబ్బరి చెట్ల ఆకులమీద పడిన కిరణాలు నిగ నిగలాడుతూ మెరుస్తున్నాయి.

సగం నిద్దరలోనూ సగం మెలకువలోనూ ఉన్న అరుణ్ ఆ నిగ నిగలు చూచి ఏమి టాలోచిస్తున్నాడో ఎవరికి తెలుసు?—

వంటవాడు వచ్చాడు. "వంటయింది బాబూ!" అన్నాడు. "నా కిప్పుడాకలిగా లేదు" అని చెప్పి వంటవాణ్ని పంపించేశాడు అరుణ్.

చీకటిలో ధూప దీపాల్లేని ఆ గది ఎదట గోడమీద గడియారం ఉన్నది. అది పదకొండు గంటలు కొట్టి. ఇహ నిద్రా సమయమయింది సుమా అని హెచ్చరించింది. అయినా. ఇవాళ అరుణ్‌కి కదల బుద్ధి పుట్టలే. ఎలా వున్నవా డల్లాగే కూచుని వున్నాడు.

తలుపు రెక్కమీద ఎవరో చేత్తో కొట్టిన చప్పుడూ, పైమెట్టుమీద ఎవరో ఎక్కి వస్తున్న కాలి చప్పుడూ, హఠాత్తుగా వినిపించాయి. "ఎవరు వారు?" అని పిలిచి, వచ్చిందెవరో కనుక్కుందామా అనుకున్నాడు ఒకమాటు. పల్లెటూళ్ళలో అంత రాత్రివేళప్పుడు ఎవరూ ఒకళ్ళ ఇళ్లకి వెళ్ళరు. కానయితే, ఇవాళ మనస్సులో అతడి కేవిధమైన సరదా, ఉత్సాహమూ లేకుండా వుంది. అందుకని ఏ ప్రశ్నా అడక్కుండా మౌనంగా ఊరుకున్నాడు.

అయితే—ఏ ప్రశ్నా అడగటానికి గాని ఏ విషయమూ ఆలోచించటానికి గాని వ్యవధి లేకపోయింది. మరుక్షణంలోనే గుమ్మందగ్గిర చిత్రమయిన శబ్దం విని పించింది—ఏమిటా శబ్దం?—పట్టుచీరె అటు యిటు కదలడంలో కసకసమని చప్పుడు! ఆ వెంటనే ఎవరో వ్యక్తి తుఫానులా దూసుకు వచ్చేయడం, అరుణ్ పాదాలముందు కుప్పన కూలబడ్డం—జరిగింది!—

గాభరాతో బెదిరిపోయాడు అరుణ్. గభీమని లేచి నిలబడి చూస్తే—ఆ వ్యక్తి ధరించిన పట్టుచీర వెన్నెల వెలుగులో తళ తళమని మెరిసిపోతూంది; తనముందు పడివున్న ఆ మనిషి ఎవరో ఒక్క చూపులో అతడికి తెలిసిపోయింది. తెలియగానే అతడికిభయం ఆశ్చర్యం హృదయంలో నిండిపోయింది. ఏం చెయ్యా లిప్పుడు? ఏమని మాటాడ్డం?—ఏమీ తోచలే.

ఈ తోచకపోవటానిక్కూడా అతడికి సావకాశం లేకపోయింది. ఏమంటే— ఎన్నో లక్షణాలతో కూడిన ఒక భయంకర ఆక్రందనం ఆ ఇంటినీ, ఇంటి చీకటినీ, ఆవరించివున్న గాలినీ, ఇంటిని అంటి పట్టుకునివున్న సమస్తాన్నీ భేదించుకుపోయి, దద దదలాడించింది. ఆ ఆక్రదనంలో—పైకి చెప్పలేని, మనస్సులో బలవంతాన అణిచిపెట్టుకున్న ఒకానొక బాధ వ్యధ, వేదన ఇమిడివుంది!

రెండుమూడు నిమిషాలదాకా అరుణ్‌కి మతిపోయి, నోటమాట రాలేదు. తరవాత కాస్త అసింటా నిలబడి, అడిగాడు:

"సంధ్యా!—ఏమిటిదీ? ఏం జరిగిందేం!"

ముఖం ఎత్తి చూసింది సంధ్య. చీరతోపాటు సంధ్య ఒంటిమున్న నగలన్నీకూడా వెన్నెట్లో ధగధగ మెరిసిపోతున్నయ్. అందాలు చిందే ఆమె లలాటంమీద చంద మామ కాంతులు పడటంతో, బాలచంద్రుడా అనిపించేటంతటి శోభతో వెలిగిపోతున్న దామె. కన్నీళ్ళతో బరువెక్కిపోయిన ఆమె విశాల నేత్రాలు మంటలు గక్కు తున్నాయి. ఇటువంటి స్త్రీ స్వరూపాన్ని అరుణ్ ఇదివరకెన్నడూ చూసివుండలేదు. కనుక ఇప్పుడు ఒక్కసారిగా మంత్రించినట్టు ముగ్ధుడైపోయాడు.

సంధ్య అన్నది —

"అరుణ్ దా!— పెళ్ళిపీటలమీదినించి నే పారిపోయొచ్చాను ఆ పెళ్ళి పీటలమీదికి మళ్ళీఇప్పుడు రావాలి నిన్ను తీసుకు వెళ్ళటానికే నే వచ్చాను ఇప్పుడు నాకు సిగ్గులేదు. ఎగ్గులేదు—భయంలేదు. భక్తిలేదు—మానం లేదు. అవమానం లేదు. ఏమీలేదు. నువు తప్ప నాకింక "నా" అనే వాళ్ళెవళ్ళూ లేరు లే. ఇహ లేచి రా!"

"ఎక్కడికి రాను?

"ఎక్కణ్ణించి ఇప్పుడొక వ్యక్తి లేచిపోయాడో, ఆ పెళ్ళిపీటలమీదికి!"

అరుణ్ కి హృదయం కలుక్కుమంది జరిగిన సంగతేమిటో అతడికి స్పష్టంగా తెలిసిపోయింది ఏదో పేచీవచ్చి పెళ్ళికొడుకు పక్షంవాళ్లు వరుణ్ని తీసుకుపోయుంటా రని గ్రహించాడు. అయితే, హిందూ సంఘంలో ఇలాంటి సంఘటనలు తరచుగా పుట్టుకొస్తూనే వుంటాయి ఇదేం కొత్తకాదు వింతకాదు. అలాంటి లక్షలాంభై వాటిల్లో ఇదోటి. కనుక, ఆ లేచిపోయిన వరుడు ఖాళీచేసిన పెళ్ళిపీట తనని ఆహ్వానిస్తోందన్న మాట! ఏది ఏమయినా గాని, ఇవాళ తన పెళ్ళి జరిగే తీరాలని సంధ్య కోరికగా తెలుసుకున్నాడు, అరుణ్.

ఈవిధంగా అరుణ్ తన మనస్సులో తను ఎంతగానో కష్టపడ్డాడు. అయినా ఇతరుల్ని కష్టపెట్టలేకపొయ్యాడు. అంతేగాక తనకున్న స్నేహంతోటీ, ప్రేమతోటీ ఇలా చెప్పాడు! "సంధ్యా!— నీఅంతట నువ్విక్కడి కిలా రావడం ఏం బాగులేదు సుమా! లోకంలో ఇటువంటివెన్నో జరుగుతూనే వుంటాయి. పోనీగాని. మీనాన్న యినా, మరెవరైనా రాలేకపోయారా ఇక్కడికి'—" అన్నాడు.

"మానాన్నా?—భయపడిపోయి ఆయనెక్కడో దాంకున్నాడు. అమ్మపోయి చెర్లో పడ్డది. పదిమందీ పరుగెత్తుకెళ్ళి తీసి, ఒడ్డున పడేసి పొట్టమీద అడుగేసి తొక్కి ఆ నీళ్లు కక్కించి, ఓ గదిలో పడేశారు. ఇలాటి స్థితిలో నేను నీ దగ్గరకి పరుగెత్తు కొచ్చేశాను; అరుణ్ దా!—లోకంలో ఇంత ఘోరం మరెక్కడైనా వుంటుందా?— మేమిహ ఎల్లా బతికేదీ, అరుణ్ దా!—" అంటూ విలపించింది సంధ్య

సంధ్య అన్న చివరమాటలతో మళ్ళీ ఒకమారు అరుణ్ మనస్సు తోడుకు పోయింది. "నేను తక్కువ కులం బ్రాహ్మణ్ని సంధ్యా! నన్ను కట్టుకుంటే మీ కులానికి రక్షణవుండదు. దేశంలో కులీనులు కావలసినంతమంది ఉన్నారు. ఈలోగా అలాంటివాళ్ళని వెతకటం కోసమే. బహుశా మీనాయన వెళ్ళి ఉంటాడు."

ఏడ్చింది సంధ్య—"లేదు లేదు అరుణదా!—ఆయన భయపడి పారిపోయాడు. నన్నెవరూ ఇహ పరిగ్రహించరు. ఎవరూ నన్నింక పెళ్ళి చేసుకోరు. అరుణ్ దా!—

నువ్వే నన్ను ప్రేమించాలి. నువ్వే పెళ్లాడాలి. చాలాకాలంగా వస్తున్న నా మానాన్ని నువ్వే కాపాడాలి!'' అంటూ వాపోయింది.

ఇంతిలా తెగబడి మాటాడింది, సంధ్య. ఇదిచూసి అరుణ్‌కి చాలా కష్టమనిపించింది. ఆమె చేతులున్చుకు లేవతీనామని అతడు ప్రయత్నించాడు.

"ఊహుఁ—వొద్దొద్దు. నే లేవను. ఒంటో ఓపికా, శక్తీ ఉన్నంతవరకూ ఇలానే నీ పాదాలముందు పడివుంటా.

"కులరక్షణ జరగదూ అన్నావే? ఎవరికులం అరుణదా? ఎవరికులం? అసలు కులం ఎవరికుంది? నేను బ్రాహ్మణ పిల్లనుకాదు. అరుణదా! బ్రాహ్మలపిల్లను కాదు! నేను మంగలి పిల్లను!!—అందులో కూడా నేను మంగలిపిల్లను కాదు!!!—నేను ముట్టుకున్న నీళ్ళు మరెవళ్ళూ ముట్టుకోరు. నా నీళ్ళెవరూ తాగరు. ఓయ్. దేవుడా!—నా కిటువంటి శాస్తి ఎందుకని చేశావ్? నీకు నేనేం అపరాధం చేశా?" నని చెప్పి, హృదయతాపం వెల్లడించింది, సంధ్య.

ఇదంతా అరుణ్‌కి వింతతోచింది. ఉలిక్కిపడ్డాడు! ఈమెకుగానే పిచ్చెత్త లేదు కదా. అని అనుకున్నాడు. మెదడు వేడెక్కి పోవటంవల్ల, వికృతమైన ఇలాంటి మంటలు పుట్టుకొస్తున్నా యేమోనని అతడూహించాడు.

ఇవన్నీ జరిగివుండవ్. సంధ్య ఇంటో పోటాడివుంటుంది. అందుకనే ఇక్కడికి పారిపోయొచ్చింది అని ఉద్దేశించాడు. మెల్లిగా ఆమెను సముదాయించి, శాంతపరిచి మళ్ళీ ఇంటికి పంపెయ్యొచ్చునని ఆలోచించుకున్నాడు.

స్నేహపూర్వకంగా అభిమానంతో ఆమె తల నిమురుతూ, అన్నాడు—"సరేకాని సంధ్యా—నిన్ను మీ ఇంటికి తీసుకుపోతా పద లే!"

సాష్టాంగంగా నమస్కరించి, అతడి పాదాలు రెండూ పట్టుకులేచింది సంధ్య.

"పద! ఇలా నువు తప్పక నాతో వస్తావని నాకు తెలుసు. కానయితే, నేను, చెప్పే మాటలు నాలుగూ విన్నాకనే బయల్దేరు,—కాకపోతే, ఈ సంగతులు నాకు మాత్రం ఏం తెలుసు? నీకు మాత్రం ఏం తెలుసు —

"ఒకరోజున నిన్ను నే నేమన్నానో గుర్తుందా?—"కులం తక్కువ వాడివి!— అని అన్నాను. అవునా? ఆ పాపమే ఇలా బద్ధలై వుంటుంది. నేను బ్రాహ్మణపిల్లనికాదు అని రుజువయి పోయిందిప్పుడు. అయ్యో!—నే నిహ ఎలా బతికేది అరుణదా? ఎలా బతికేదీ?—"

ఈ విధంగా సంధ్య మనస్సులో పరిణమించిన యాతన చూస్తే అరుణ్ మనసు మళ్ళీ ఎటూ నిశ్చయించుకోలేని అనుమానస్థితిలో పడింది. ఇదంతా నిజంగానే

రిగించేమో. సంధ్య చెబుతున్నదంతా యదార్థమేనేమో అని తోచింది.

మెల్లిగా ఇలా అడిగాడు—"ఈ సంగతు లెవరు చెప్పారు? నీకెలా తెలిశాయ్? ఎవరు రుజువు చేశారు?"

"ఎవరా?—గోలోక ఛటర్జీ! ఇంకెవరు? ఆఁ—ఆయనే!—నాతోటి నేమన్నాడో తెలుసా? తెలియదు కాబోలు! పోనీలే. ఆ గొడవకేం? అలా వుండనీ—

"కన్యాదానం చెయ్యటానికని మా అమ్మ పీటమీద కూచుంది. మా నాయనమ్మ అక్కడే నిలబడి మాటాడక చూస్తూవుంది. సరిగ్గా ఆ సమయంలో—పెళ్ళిళ్ళ పేరయ్య తెలుసుగా? మృత్యుంజయ భట్టాచార్యులు—ఎవరో ఇద్దర్ని తనకూడా వెంట బెట్టుకువచ్చాడు.

"ఆ ఇద్దరిలో ఒకడు మా నాయనమ్మని పిలిచాడు. "అక్కయ్యగారూ!—మమ్మల్ని ఎరగరూ మీరు!" అనడిగాడు. రెండో అతడు మా అమ్మని వేలెత్తి చూపించి, నాయనమ్మతో ఇలా అన్నాడు—"నువ్వు నీ కొడుక్కి ఈ జగద్ధాత్రిని చేసుకుని. ఈమె కులం కాస్తా పాడుచేశావ్. మళ్ళీ ఇప్పుడు మనమరాలి నిచ్చి ఈ కొత్త పెళ్ళికొడుకు జాతిని కూడా చెరుస్తున్నావ్. ఏంపని ఇది?—'

"ఆ తరవాత మా నాన్నని చూపిస్తూ, అందర్నీ పిలిచి ఇలా చెప్పాడు: "ఏమండోయ్! మీరంతా వినండి!—ఈ ప్రియముఖర్జీగారు బ్రాహ్మణ కులోత్తముడని మీరనుకుంటారు. ఈయన బ్రాహ్మడు కాదు. మంగలి హీరాయ్‌గాడి కొడుకు!!!—"

"ఏమిటిది? నీకేం వెర్రెత్త లేదు గదా! ఇలా వాగుతున్నావేమిటి?" అనడిగాడు. అరుణ్.

ఈ ప్రశ్న సంధ్యకు వినిపించినట్టు లేదు. తను చెబుతూ చెబుతూ మధ్యలో ఆపేసిన గొడవే మళ్ళీ అందుకుని ఇలా చెప్ప నారంభించింది—

"అప్పుడు మృత్యుంజయ భట్టాచార్యులు గంగా జలంతో నిండిన ఘటమొకటి తెచ్చి, మా నాయనమ్మ ముందర పెట్టాడు. "ఇదంతా నిజమవునా, కాదా చెప్పు!—ఎవరికొడుకో యదార్థం చెప్పు! మాకుంన ముఖర్జీ కొడుకా? మంగలి హీరాయ్ కొడుకా? చెప్పు!—అంటూ గదమాయించాడు.

"అరుణదా!—అప్పుడు మా నాయనమ్మ తల వంచుకు నిలబడివుంది. కాని అబద్ధమాడలేకపోయిందిః

"ఇది నిజమేనండీ; బాబూ! అంతా నిజమే!!—భయంకరమైన సత్యం!! ఇప్పటిదాకా మీరను కుంటున్నట్టు నేను సద్బ్రాహ్మణినీ కాను. ఈ సంధ్య బ్రాహ్మణ పిల్లాకాదు!!!" అని చెప్పి చిత్రమయిన ఈ యదార్థం మనస్సు విప్పి తేటతెల్లంగా

వెల్లడించింది.

ఇప్పుడిహ అరుణ్ మనస్సులో లవలేశమూ అనుమానం లేకుండా పోయింది. పిడుగు పడ్డట్టుగా విశ్చేష్టుడై నిలబడిపోయాడు.

సంధ్య మళ్ళీ అందుకుంది—

"వాళ్ళలో ఒకడు అనాడు—అంటే మా నాయనమ్మ చిన్నతనంలో జరిగిన భోగట్టా యావత్తూ పూస గుచ్చినట్టు వివరించాడు. ఆ వివరించిన వాడిది మా నాయనమ్మ గారి వూరే. ఇలా చెప్పాడు:

"ఈ కాశీతారకు ఎనిమిదో యేటనే పెళ్ళయింది. పెళ్ళి అయిన పధ్నాలుగు పది హేనేళ్ళ తరవాత ఒకతడు వచ్చాడు. నేనే మీ అల్లుణ్ణి. ముకుంద ముఖర్జీని" అని చెప్పి ఇంటో ప్రవేశించాడు. అలా అతగాడు రెణ్ణాళ్ళున్నట్టుండి, కొత్త పంచెల చాపూ, అయిదు రూపాయిల రొఖ్ఖమూ పట్టుకు వెళ్ళిపోయాడు—" అని చెప్పి. "ఓయ్, భగవంతుడా!" అన్నది సంధ్య.

అరుణ్ నోట మాటరాక, అలాగే నిలబడి వున్నాడు.

"అన్నట్టు—ఏం చెప్పాను అరుణదా?"

"ఆఁ—ఆఁ—గుర్తొచ్చిందిలే. అప్పటినుంచీ—ఆ తరవాత అతను తరచూ వస్తూ పోతూ వుండేవాట్ట! ఆ వయస్సులో మా నాయనమ్మ బలే అందంగా వుండే దిట!—తరవాత తరవాత వాడు డబ్బు తీసుకోవటం మానుకున్నాట్ట. ఇలా ఉండుండి ఒక రోజున వాడు పట్టుపడేసరికీ, మా నాన్న పుట్టాట్ట!!!—

"అవురా! —నేనే గనక తల్లినై వుంటే, ఉన్న పాళంగా మెడ పిసికేసి అవతల గిరాటేసేసే దాన్ని!—వెధవ బిడ్డని .. కంతిరీ వెధవని.... ఇలాంటి బిడ్డని పెంచ టమూ, పెద్దవాణ్ణి చెయ్యటమూనా, ఛీ ఛీ!!—" అనేసింది, వొళ్ళు తెలియని ఆవేశంతో?

"అన్నట్టు—ఏమన్నాను అరుణదా? నేనేమన్నానూ ఇప్పుడూ?"

అరుణ్ అస్పష్టంగా ఇలా చెప్పాడు: "పట్టుబడీ"—అన్నట్టున్నావ్.

"ఆఁ—ఆఁ—అదే — పట్టుబడిపోయాడు! పట్టుబడిపోయి ఏం చెప్పాడను కున్నావ్?—ఇలా అని చెప్పాడు!—

"ఈ పాడుపని నా అంతట నేను బుద్ధి పూర్వకంగా చెయ్యడం లేదండి! మా దొరగారు ముకుంద ఛటర్జీగారు ఎలా ఆజ్ఞాపిస్తే అలా నడుచు కుంటున్నానండి. ఆయన వృద్ధులై పోయారండి. అదీగాక, ఆయిదా రేళ్ళాయె, పక్షవాతంతో తీసు కుంటున్నారండి కనక, దొరవారు కొందరి పేర్లు మాకు చెబుతారండి. 'నువ్వి క్కడికి వెళ్ళు, నువ్వా యింటికి వెళ్ళు" అని చెప్పి పురమాయిస్తారండి. ఆయన



చెప్పిన చోట్లకి నియమం ప్రకారం మేం పోయొస్తుంటామండి. ఈ విధంగా మేం ఆర్జించుకు వచ్చే డబ్బులో సంగోరుపాలు ఆయనగారిది. తక్కింది మాదిన్నండి.

''దొరగారు మమ్మల్ని పిలిచి ఇలా చెప్పారండి—'బ్రాహ్మల పేర్లన్నీ కంఠస్థంగా వల్లించుకోండి! గోత్రాలు జాగ్రత్త సుమండీ!—జంధ్యాలు తయారుచేసి అట్టె పెట్టుకోండి! నేను చెప్పిన చోట్లకి పొండి. వాళ్ళని పీడించి డబ్బు బాగా గుంజుకోండి. తెచ్చే డబ్బులో మీకు సగం, నాకు సగం!''

తుళ్ళిపడ్డాడు. అరుణ్. ''ఆతగాడు ఇలాంటి పనులు ఇంకా చేశాడటనా?''

అనడిగాడు, ఆశ్చర్యంగా.

సంధ్య ఇలా చెప్పింది—

"ఆఁ—ఇంకా పది పన్నెండు చోటుల్లో ఇల్లాగే చేస్తున్నాడట. రోజూ వచ్చే ఆదాయంలో సగభాగం ఎప్పటి కప్పుడు వాళ్ళ ధొరకి సమర్పిస్తున్నాట్ట!—

"అతడింకా విశేషాలు చెప్పాడు! 'ఇలాంటి వ్యాపారం మాకేం కొత్త కాదు. మా ముకుంద ముఖర్జీ గారొక్కరే కాదు, ఈ పని చేసేది. ఆ కోస్తాలో చాలా మంది బ్రాహ్మలు దూర దేశాల్లో ఉంటూవుంది. ఇదో వ్యాపారం సాగిస్తారు. వచ్చిన లాభాలు వాటాలుగా పంచుకుని, ఇతరుల సాయంతో డబ్బు పోగుచేసు కుంటున్నారు.'' అని చెప్పాట్ట."

మింగేదా మన్నంత కోపమొచ్చింది అరుణ్‌కి. గర్జిస్తూ ఇలా అన్నాడు—

"ఇదంతా వ్రతిదీ అనటాని కేమాత్రం వీల్లేదు. అక్షరాలా యదార్థమే అయివుండాలి. లేకపోతే—బ్రాహ్మణకులంలో గోలోక ఛటర్జీవంటి కసాయివాడూ, కిరాతకుడూ ఎలా పుడతాడు?—పైగా, ఇలాంటివాళ్లేకదూ, హిందూ సమాజానికి అధిపతులు, శిరోమణులు తలకట్లు అయి కూర్చున్నారు! సరేలే, తరవాత?—"

"తరవాత నేముందీ?—ఆ పసిగుడ్డుని వేసుకుని మా నాయనమ్మ తిన్నగా కాశీకి లేచిపోయింది. ఆనాటినించీ ఆమె సన్యాసిని అయి కూచుంది. అప్పట్నించీ ఆమె ఎవళ్ళకీ తన మొహాన్ని చూపించటంలే ఇదీ ఆమెగారి కథ!—

"ఇహ తనకి యజమాని అయిన ముకుంద ముఖర్జీని హీరాయ్ అడిగాట్ట—"ఏమండీ, ధొరగారూ!—మాకు పట్ట గతులేమయినా ఉంటయ్యా? పరలోకానికి పోయాక అక్కడ ఏమని సమాధానం చెప్పుకునేదీ?" అని.

"అందుకా మొనగాడు ఇలా బదులు చెప్పాట్ట—'నీ కెందుకురా పిచ్చివాడా, ఆ దిగులూ? ఆ పాపం నాది కాని నీది కాదుగదా! కనక, పరలోకంలో ఈ ప్రశ్న వచ్చినప్పుడు నే చెప్పుకుంటాన్లే సమాధానం, జవాబ్దారీ నాది!—'' అని

అయినా పాపభీతి, దైవభీతి ఆ హీరాయ్‌గాణ్ని వొదల్లేదు. మళ్ళీ యిలా ప్రశ్నించాడట :—

"సరేలెండి, నా సంగతీ మీ సంగతీ అలా వుంచుదాం. పాపం!—ఈ విధంగా బలి అయిపోయిన ఆడవాళ్ళ గతి ఏమిటండీ, ప్రభూ?"

"ఈ మాటకు ముకుంద ముఖర్జీ నవ్వుతూ యిలా జవాబు చెప్పాట్ట—

"మధ్యని నువ్వెందుకోయ్ ఇలా బాధ పడిపోతున్నావ్! వాళ్ళందరూ నా పెళ్లాలు గాని మీ పెళ్ళాలు కారు గదా!—అనక ఆ భారం, బాధ్యతా మీ కెందుకూ?—

ఇంతకూ వాళ్ళెలా వుంటారో నా కళ్ళతో నే చూడనేలే దింతవరకూ. ఇహ చూడ బోయేదీ లేదు. అటువంటి ఆ స్త్రీలకు గతులుంటాయా లేదా అనే విషయం మీ కెందుకు. నా కెందుకు ?—మన పనల్లా ఒక్కటే—రొక్కం !—రోజు కెన్ని రూపాయ లొచ్చాయీ అనేదే బెంగా. అంత్రమమ్మా. తతిమ్మా గొడవలతో మనకి పని లేదు. చాలు చాల్లే—పోయి నీ పని చూసుకో ! అన్నాట్ట.

"అరుణదా !—ఇంతకథ యిలా ఉండటంవల్లనే కాబోలు, ఒకవాడు ఈ ప్రసంగం వచ్చేటప్పటికల్లా మా నాయనమ్మ ఏం చెప్పుతుందో తెలుసా ?—"జాతిని బట్టి వీడు ఎక్కువ, వీడు తక్కువ వాడు అని నిర్ణయించడం మానవులకు అసాధ్య మైనపని కేవలం అసాధ్యం. ఆ సంగతి భగవంతుడికే తెలియాలిగాని వేరే దారి లేదు. కాబట్టి మనుష లెవళ్ళూ ఒకళ్ళ నొకళ్ళు చూసి కులహీనులు, తక్కువ జాతివాళ్ళు అని రోత పడకూడదు, ఎంతమాత్రం అసహ్యించుకోకూడదు" అని చెప్పింది.

"మా నాయనమ్మ కడుపులో ఇంత అర్థం దాక్కునుందని అనాడు నేను ఎంత మాత్రం తెలుసుకో లేకపోయా, అరుణదా !—ఆవిడ మాటలకు అర్థం ఈనా డిలా తెలుసుకోవలిసుంటుందని కొంచెమయినా అనుకోలేదు నేను.

"సరే కాని—చాలా పొద్దోయింది. మవ్వెన్నడూ నన్ను గురించి కష్టపడ నక్కర లేదు అరుణదా !—కాని, అరుణదా !—నీ త్యాగమూ, నీ గొప్పదనమూ నా జీవి తంలో ఎన్నడూ మరిచిపోలేను ' అని చెప్పి, రెప్ప వాల్చక అరుణ్ కేసి చూస్తూ ఊరుకుంది.

అప్పుడు అరుణ్ సంకోచంతోనూ, నిశ్చితం లేని స్వరంతోనూ ఇలా అన్నాడు :
"అవును కాని, ఇప్పుడు నేను నీతో రాలేను, సంధ్యా !"

చకితురాలయింది సంధ్య.

"ఎంచేత రాలేవు ·—నువు నాతో రాకపోతే నాకు నిలవ నీడేదీ ? నే నెల్లా బతి కేదీ ?—" అనడింది.

ఇది అంతులేని ప్రశ్న. దీనికి సమాధానం ఏమని చెప్పాలో యెంత కొట్టుకున్నా అరుణ్‌కు చటుక్కున స్ఫురించలే. కొంచెం సేపయిన తరవాత మెల్లి మెల్లిగా అన్నాడు—

"ఇప్పటికి కాస్త క్షమించు సంధ్యా !—నన్ను ఆలోచించుకోనీ కాస్సేపు !" అన్నాడు.

"ఆలోచించు కోవటమా ! ! !—" అంటూ తెల్లబోయి దదేకదృష్టితో—ఆ అంధకారంలో అతడి ముఖం ఎంతవరకు చూట్టానికి వీలవుతుందో అంతదాకా

చూడటానికి ప్రయత్నించినట్టుంది!—

ఆ తరవాత దీర్ఘంగా గంభీరమైన ఒక నిట్టూర్పువిడిచి. మెల్లిగా లేచి నించుంది.—

"సరేలే. మంచిది. ఘటన ఎలావుంటే అలా జరుగుతుంది. ఆలోచించుకో! బాగా ఆలోచించుకో! అందుకు కాస్సేపే కాదు. ఇహ బతికున్నంతవరకూ నీకు తీరికే!!—

"నేనూ యిన్నాళ్ళ నించీ రాత్రనక పగలనక ఆలోచనలో పడి కొట్టుకుపోయా. "నా కంటే నువు తక్కువ' అని నే నెన్నాళ్ళు అనుకున్నానో, అన్నాళ్ళూ యిదే ఆలోచించాను నేను. ఇప్పుడు ఆలోచించాల్సిన వంతు నీది. మంచిది. సరే, నే వెళుతున్నా!—" అని అనేసి, లేచి నిటారుగా నిలబడింది. నిలబడేసరికి, పొడయిన ఆమె చీర చెంగు జారి నేలమీద పడ్డది. వెంటనే ఆమె వంగి ఆ చేలాంచలం తీసుకుని సర్దుకుంటూ వుండగా సంధ్యకు తన దృష్టి తనమీదనే పడింది!—

తనని తను చూచుకునేసరికల్లా అకస్మాత్తుగా. వణికి పోయింది. ఒళ్ళు కంపర మెత్తిపోయింది!

"హా! భగవాన్!!—ఈ పెళ్ళిచీర కట్టుకునే టప్పుడు. నగలు అలంకరించుకునే టప్పుడు, లలాటంపైన ఈ చందనరేఖలు దిద్దుకునేటప్పుడు, ఈ పసుపు కుంకుమలు రాసుకునేటప్పుడు ఇదంతా ఇలా అవుతుందని ఎవరూ అనుకోలేదు కదా!" అని పైకి అనబోయేటప్పటికి ఆమె కంఠస్వరం రుద్ధమయింది.

"ఇహ నాకు సెలవు అరుణదా!" అని మరొక్కసారి చెప్పి నమస్కారం చేసి, వెళిపోయింది.

అరుణ్ నిశ్చలంగా అలా నిలబడే వున్నాడు. కానయితే, సంధ్య కనుచూపు మేరలో దాటిపోగానే అతని నిశ్చలత కాస్త నీళ్ళు కారిపోయింది. చలించి పోయింది!

చెప్పలేని వ్యాకులతతో, వేగిరపాటుతో అక్కడున్న నవుకర్లను పిలవ నారంభించాడు. మాటి మాటికీ, పిలుపుమీద పిలుపూ, పిలుపుమీద పిలుపూ—ఇలా వాళ్ళని కేక వెయ్యటంలోనే అతడి మనస్సంతా లగ్నమైపోయింది.

"ఒరే, శిబూ!—వెళ్ళు, ఆమెతో కూడా వెళ్ళు! ఆమెను జాగర్తగా పంపిరా! పంపేసిరా!—" అని ఒకమూల వాళ్ళని తొందరపెడుతూ వచ్చాడేగాని, ఎంత మాత్రం మనస్సు నిలవలేదు. ఈ విధంగా నవుకర్లని వేగిర పెట్టి, పంపాడేగాని, వాళ్ళని హెచ్చరిస్తూ, తనే ఉరుకులూ పరుగులతో సంధ్యను అనుసరించాడు!—

# 13

ప్రియముఖర్జీ అతి రహస్యంగా, చాటుగా, ఎంతో జాగ్రత్తగా ఒక పని చేస్తున్నాడు:
ఏమిటా పని?—

ఎడంచేత దీపం పుచ్చుకున్నాడు. పెట్టెలో ఏదో వస్తువు వెతికి వెతికి తీసి, దాన్ని కుడిచేత్తో ఒక గుడ్డపేలికతో కడుతూ కడుతూవున్నాడు. అంతలోనే "నాన్నా!" అని వెనకవించి పిలుపు వినిపించింది.

వినబడే సరికల్లా బెదిరిపోయాడు. దీపం కిందపెట్టాడు లేచి నిలబడి, "ఎవరదీ? సంధ్యా!—ఇదుగోనమ్మా. ఇప్పుడే నే వెళ్ళిపోతున్నాను—ఇహ ఆలస్యం లేదు" అన్నాడు.

అతి కష్టంమీద సంధ్య ఉబికివచ్చే కన్నీళ్ళను ఆపుకుంది. "ఏం చేస్తున్నావ్ నాన్నా" అనడిగింది.

తోకరా తిన్నాడు. ప్రియబాబు పీళ్ళు నములుతూ అన్నాడు: "ఏబ్బే, ఏం లేదమ్మా! నేనా? ఏదీ? ఏముందీ?—"

అతడి చేతిలోవున్న గుడ్డపేలిక చూపింది సంధ్య. "అందులో ఏమిటుందీ? నాన్నా? ఏమిటి మూట కట్టావ్?" అని అడిగింది.

తీరా పట్టుబడే పొయ్యాడు ప్రియబాబు. అంచేత చిన్నతనమనిపించింది. కంఠ స్వరం వినయంగాపెట్టి యిలా అన్నాడు—"కొద్దిగానే—కాసిన్నే—యెక్కువ కాదమ్మా! రెమిడీలు వెంట వేసుకుపోతున్నా—ఇంకా, అదుగో ఆ మెటీరియా మెడికా—పెద్దదికాదు, చిన్నది—చివిగిపోయింది కూడా అట్టలు కూడా ఊడి పోయినయ్—ఇదివరకెన్నడూ ఎరగనిచోటు—సరికొత్తచోటు కదూ?—ఏమయినా ఖాళీ, ఊరికే కూచుంటే యేముందీ? కొంచెం ప్రాక్టీసు చేసుకోవాలిగా? అందుకనే యివి తీసుపోకుదామని అనుకుంటున్నా."

"అయితే, ఈ కాసిన్నయినా తీసుకుపోవటానికి అమ్మ ఒప్పుకోలేదా, నాన్నా?"

ఒక నిశ్చయం లేని భావంతో తల ఊపి ఏదో అన్నాడు,—ప్రియబాబు. అతడేం చెప్పాడో సంధ్యకు సరిగ్గా తెలీలేదు.

"మరి, నువ్వు ప్రాక్టీస్ ఎక్కడ పెడతావ్ నాన్నా?" అనడిగింది.

"బృందావనంలో. ఎంతెంతమందో యాత్రికులు అక్కడికి వస్తూపోతూ వుంటారుకదా. వాళ్ళకి మందలిస్తే నెలకో నాలుగయిదు రూపాయలన్నా కిట్టక పోతాయా సంధ్యా? ఆ మాత్రం వస్తే నాకు చాల్లే. ఏదో బాగానే గడిచిపోతుంది.

అందుకు సంధ్య చెప్పింది—

"తప్పక వస్తాయి నాన్నా! ఎందుకురావూ? తప్పక వస్తాయ్ వాలుగయిలేం ఖర్మం యింకా ఎక్కువగానే వస్తాయి అయితే—నువ్వక్కడ ఎవర్నీ ఎరగవుగా!— వాయనమ్మ చీకటితోనే కాశీకి వెళ్ళింది కదా, నువ్వు ఆవిడతో కూడా ప్రయాణం చెయ్యలేకపోయావా? ఎంతో బాగుండిపోను. అలా ఎందుకు చేశావుకాదు. నాన్నా."

"అమ్మతోనా ప్రయాణం? కాశీకా? ఉహుం—వెళ్ళనమ్మా వెళ్ళను! ఇహ నే నెవరి మెడకూ ఉరిపొయ్యి దలుచుకోలేదు. సంధ్యా!—నా మూలంగా మీ రందరూ కష్టాల పాలయ్యారు. ఇహ నే నెవరికీ కష్టం కలిగించను. తల్లీ!—బతికిన శాల్రో జులూ నావల్ల ఎవ్వరికీ కష్టం కలక్కుండా, ఆ బృందావనంలో నే ఒక్కణ్నీ పడివుంటా!

తండ్రికి దగ్గరసా వెళ్ళింది సంధ్య. అతడి చేతులు రెండూ, తన చేతుల్లోకి తీసుకుంది—"నాన్నా!—నిన్ను నేను ఒంటరిగా వొదిలిపెట్టలే నాన్నా!—నీతో కూడా నేనూ వస్తా!—" అన్నది.

ప్రియబాబు మెల్లిగా తన చేతులు లాక్కుని విడిపించేసుకున్నాడు. కూతురి తల నిమురుతూ, ఇలా అన్నాడు—

"అదేమిటమ్మా పిచ్చితల్లీ!—అదేమిటీ?—అదేం కుదరదు నాతో నువ్వేక్కడి కని రాగలవు, తల్లీ!—నువ్వు మీ అమ్మదగ్గిరే ఉండిపో! పాపం, ఆవిడగారు నా మూలంగా చాలా కష్టా లనుభవించింది.

"చూడూ, ఇక్కడ నా మందుకోసమని వాళ్ళూ వీళ్ళూ వస్తుంటారు కదా? వాళ్ళ కిన్ని మాత్రల్లు పడేస్తుండు. తెలిసిందా?

"మరోమాట: మీ అమ్మ గనక సరే అని ఒప్పుకునే టట్టయితే, నా వైద్య పుస్తకాలు ఆ విపినుడి కిచ్చేసెయ్. అతడూ పాపం, నిరుపేదవాడు, గర్భ దరిద్రుడు! పుస్తకాలు కొనుక్కునే తాహతు ఎక్కడుంది? కొనుక్కో లేకపోవటాన్నే. తగినంత చదువు లేక, సరైన వైద్యం అబ్బింది కాదు." అని చెప్పాడు.

సంధ్య తలతిప్పి, ఇలా అంది:

"కాదు, నాన్నా!—ఏమయినా కానీ, నేను నీవెంట రాక తప్పదు, వచ్చే తీరుతా! ఇదుగో నామాట!" అంటూ, ఒక చిన్నమూట ఎత్తి తండ్రికి చూపించింది. తుండుగుడ్డతో కట్టిన ఆ చిన్న మూటలో రెండు కోకలున్నాయి, సంధ్యవి.

ఏనాడూ ఎదిరించి మాటకు మాట చెప్పడం ఎరగడు ప్రియబాబు. కనక, ఇప్పుడు కూతురి మాటకు ఒప్పుకుని ఇలా అన్నాడు—"సరే, పద! కాని అదుగో, మీ

అమ్మమాత్రం నీకోసమని చాలా దుఃఖిస్తుంది సుమా. సంధ్యా! '

మొన్నటిరోజున తన తండ్రికి అందరిఎదటా ఎంత అవమానం జరిగింది! ఎంత అభాసు కలిగింది! ఆ దుర్గతిఅంతా సంధ్య తన కళ్ళారా చూసిందాయె!

అది జగద్ధాత్రి సొంతఇల్లు కాబట్టి ఇంత రభసా గందరగోళమూ జరగటానికి వీలయింది కాని. మరోచోట నయితే ఇటువంటి గొడవ సంభవించేదా! ఈ అవమానం సంధ్య నరనరాలకూ పట్టిపోయింది. కాని. ఇప్పుడు తండ్రికి సమాధానం చెప్పేటప్పుడు ఆమాట యేమీ ఎత్తకుండా. అదేం జరగనట్టే ఉండిపోయింది.

తండ్రి ఎంత చెప్పినా. సంధ్య మాటి మాటికీ తలతిప్పి. "కాదునాన్నా! నేనిక్కడ ఉండేదే లేదు. నీతో వచ్చే తీరుతా. నేనూ నిన్నొదిలేస్తే. ఇహ నిన్ను చూసే వాళ్లెవరు నాన్నా? ఎవళ్ళు నీకు అన్నం వండిపెడతారు? ' అనడిగింది.

ఇలా చెప్పి. ఆమె తండ్రి మందులూ. పుస్తకాలూ తీసుకుని మూట కట్టేసింది. అతడి చెయ్యిచ్చుకుని. "లే నాన్నా! వెళదాం. పద! మనం ఇప్పుడే బయల్దేరాలి. లేకపోతే పన్నెండు గంటలబండీ అందుకోలేం!" అంటూ తొందరపెట్టింది.

* * *

జగద్ధాత్రి తలుపులు లోపల బిగించుకుని. గదిలో కూర్చుని వుంది. సంధ్య వెళ్ళి ఆ గది గుమ్మం ముందర సాష్టాంగపడి. ఇలా చెప్పింది:

"అమ్మా! మేం వెళ్ళిపోతున్నాం. నావి రెండు కోకలు మాత్రం పట్టు కెళుతున్నానమ్మా! మరేం తీసుకెళ్ళటం లేదు." అని అంటూ అపళంగా బావురుమని ఏడ్చింది.

లోపలినుంచి జవాబేం లేదు.

వెంటనే సంధ్య కళ్ళు తుడుచుకుని. అన్నది—"అమ్మా! — నిందలతో. అపకీర్తితో మిళితమైన మాలిన్యాన్ని మేం ముఖాలకు పూసుకునే వెళుతున్నాం తల్లీ!— దీన్ని గురించి మీ సంఘంలో ఎటువంటి విచారణా జరగదు. కాని —ఎవరియొక్క మహాపాతక భారాన్ని మేం నెత్తిన వేసుకుని మోసుకుంటూ లేచి పోవలసివచ్చిందో. ఆఖరికి వారిని విచారణ చెయ్యటానికయినా. ఒక డున్నాడనే పరమసత్యం ఎప్పటికైనా నీకు తెలుస్తుందిలే!"

ఇదివరకటిలాగానే గది లోపలిభాగం స్తంభించుకుపోయి నిశ్శబ్దంగా వుంది. వెనకటి మల్లెనే తలుపులు మూసుకునే వున్నాయి. ముందు దారితీశాడు తండ్రి. అతడి వెనకాతలే సంధ్య బయల్దేరి వెళ్ళింది.

ఆ దగ్గరలోనే ఉన్న ఒక చెట్టుకిందలో ఎవరో గాని నిలబడి వున్నట్టు కనిపించింది. వెన్నెల వెలుగు బాగావుంది కనక ఆ నించునివున్న వ్యక్తి ఎవరో ప్రియ

బాబుకి వెంటనే గుర్తు తెలిసిపోయింది.

"ఎవరదీ, అరుణ్ కదూ?" అంటూ పలకరించాడు.

"ఆఁ—అవును. మీరీ పన్నెండు గంటల బండికి వెళతారని విన్నాను. చూసి పోదామని...."

"సరే—చూశావుగా నా ఖర్మం!—మా అమ్మాయి నన్ను పట్టుకుని వదిలిపెట్టకుండా వుంది! ఏ క్షణాన నే నెక్కడికి పోతానో. ఎక్కడ ఎలా వుంటానో—ఏమిటో! — చూడు నాయనా, దీని వెర్రి ఏమిటో కాస్త నువ్వాలోచించు!" అన్నాడు.

నోట్లోంచి మాట రాలేదు అరుణ్ కి. కొంచెంసేపుండి, "నువ్వూ వెళుతున్నావా? సంధ్యా" అనడిగాడు.

"ఆఁ—" అనిమాత్రం అని ఊరుకుంది. సంధ్య

ఒకటి రెండు క్షణాలు ఊరుకున్నాడు అరుణ్. తరవాత ఎంతో సంకోచిస్తూనే ఇలా అన్నాడు—"ఆనాడు రాత్రి నా మనస్సు స్థిరం చేసుకోలేకపొయ్యాను సంధ్యా! కాని, ఇవాళ స్థిరం చేసుకున్నాను. నువ్వు చెప్పిన మాటలన్నీ నాకు నమ్మితే —"

ఉభయుల మధ్యనీ జరుగుతున్న ఈ సంభాషణకు తుదామొదలూ తెలియలేదు ప్రియబాబుకి ఏమిటో గ్రహించలేక, కళ్ళప్పగించి చూస్తూ ఊరుకున్నాడు.

ప్రశాంతమైన కంఠస్వరంతో, ఎంతో నిశ్చలంగా నిదానంగా ఇలా చెప్పింది సంధ్య!

"అరుణదా! ...ఆనాడు నేనూ అతలా కుతలం అయిపొయ్యాను! కాని ఈరోజున నా మనస్సుకి కూడా స్థయిర్యం చిక్కింది. "ఆడదాని జీవితంలో పెళ్ళి చేసుకోవటం ఒక్కటే పనా, లేక వేరే ఏమైనా పన్లున్నాయా?" అనే సమస్యకు జవాబు తెలుసుకుందామనే వుద్దేశంతోటే నేనిప్పుడు మా నాన్నగారితో వెళ్ళిపోతు న్నాను. ఇహ మాకట్టే వ్యవధిలేదు. మాటాట్టానికి సావకాశం చాలదు. కనక, నీకు శక్తివుంటే నన్ను క్షమించు!"

ఇలా చెప్పి సంధ్య తండ్రి చెయ్యిచ్చుకుని ముందుకి దారి తీసింది. అరుణ్ వారి వెనకాలే రెండు మూడడుగులు వేసేసరికి, సంధ్య వెనక్కి తిరిగి ఇలా అంది—"మాతో నువ్వెందుకు అరుణదా? వద్దు, ఇంటికి వెళ్ళిపో!"

అప్పుడు అరుణ్ ఊరుకోక యిలా అడిగాడు: "అయితే, ఈ కష్ట కాలంలో మీ అమ్మని విడిచిపెట్టేసి పోతావా సంధ్యా?"

అందుకు సంధ్య బదులు చెప్పింది...."నేనేం చేసేది, అరుణదా! ఇన్నాళ్ళదాకా నేను అమ్మనీ నాన్ననీ—ఇద్దర్నీ సేవించే భాగ్యం కలిగింది నాకు! కాని ఇప్పుడు



అందులో ఒహర్ని విడిచిపెట్టడం తప్పనిసరి అయింది  గత్యంతరం లేకపోయింది.

"అయితే— నేను విడిచిపెట్టేసినా బెంగలేదు. ఆవిడకో ఉపాయం ఉన్నదని అను కుంటున్నా నేను. ఈ తమాషా అంతా చూచి ఆనందించటానికని విన్నటిరోజున ఎంతోమంది పెద్దలు వేంచేశారు కదా! వారిలో కొంతమంది ముఖ్యులు దీనికేదో ప్రాయశ్చిత్తముందని చెప్పారు. ఉంటే మంచిదేగా! ...అప్పుడిహ ఆవిణ్ని కని పెట్టుకునుండేవాళ్ళు కావలసినంతమంది ఉన్నారన్నమాట మరో లోటుండదు.

"కాని, మా నాయన్ని కనిపెట్టుకు నుండేవాళ్ళెవరూ లేరీ ప్రపంచంలో.... నేను తప్ప మరెవరున్నారు?... నాన్నా! ఇహ నిలుచుంటే కాదు, పద, పద!"

సంధ్య ముందుగా నడుస్తూంది, ప్రియబాబు వెనకనే కాలు సాగించాడు. అరుణ్ స్తబ్ధుడై, అక్కడే నిలుచుండిపోయాడు.

* * *

తండ్రీ, కూతురూ మరికొంత దూరం సాగిపోయారు. చూస్తే, బలే సందడిగా వుంది. అక్కడ జన సంచారమంతా ఎంతో హుషారుగా కనిపించింది.

"భేష్ భేష్! వంకాయ కూర యెంత బాగుందిరా?" అన్నాడొకడు. "పనసకాయ

ఏమి పాకాన పడ్డదోయ్!" అంటూ యింకొకాయన మెచ్చుకుంటున్నాడు. "ఇవాళ కుదిరిన ధప్పళం లాంటిది నా జన్మలో చూసి ఎరగను!" అని చెప్పి మరొహ పెద్ద మనిషి పొగడి పొగడి ఆనందిస్తున్నాడు.

ఈ విధంగా భోజన పదార్థాలను ప్రశంసించుకుంటూ కొందరు బొజ్జలు నిమురు కుంటూ తాంబూలాలు సేవిస్తూపోతున్న వారు ఇంకొందరూ, అంతులేని సంతృప్తితో యిళ్ళకు మళ్ళుతున్నారు.

ఈ సందట్లో, ఆ వచ్చే జనంలో ఎవరయినా తమను ఆనవాలు పడతారేమోనని, కొంపదీసి కనిపెట్టేస్తారేమోననీ భయపడింది సంధ్య. అంచేత, తండ్రి చెయ్యిచ్చు కొని, దారికి పక్కగా నిలబడి, వాళ్ళంతా ఒక్క పిట్టకూడా కనబడకుండా వెళ్ళిపోయిం దాకా ఉంది. అప్పుడు మళ్ళీ ప్రయాణం బయల్దేర దీసింది.

వాళ్ళిద్దరూ సందు మళ్ళారు. అప్పుడు తెలిసింది....ఈ విందుభోజనాలకు గల కారణమేమిటో. పక్కనున్న మామిడితోపులోంచి, గోలోక భట్జీ మహాశయుడి ఇంటి ముంగిట కాగడాలు వెలుగు కనిపిస్తూంది, ఏదో కలకల ధ్వనులూ వినిపిస్తూన్నాయి.

"ఇదుగో, ఇక్కడ పచ్చడి వడ్డించండి!"...."పెరుగు ఎవరి చేతిలోవుంది!" "లడ్డూలు, లడ్డూలు, చప్పున పట్రా!....వారికి కొంచెం కూర వడ్డించూ!".... ఇలా కేవయ్యా భక్ష్యాలూ! రా, గమ్మున!"....అంటూ రకరకాలుగా అనేకమైన కంఠస్వరాలు ఆ ప్రదేశమంతటా ప్రతిధ్వనిస్తున్నాయి!!....

అప్పుడు ప్రియబాబు చెప్పాడు, కూతురితో!

"అన్నట్టు—గోలోక భట్జీ గారింటో ఇవాళ బూజంబంతి కాదూ! విందుల సందర్భం వస్తె మట్టుకి, ఆయన మహాబాగా అతిశ్రద్ధగా చేస్తాట్ట!— ఇవ్వ టయిదారు వాళ్ళని పిలిచివచ్చాడని చెప్పుకుంటున్నారు! బ్రాహ్మలూ—శూద్రులూ— అష్టాదశ వర్ణాలకూ ఆహ్వానం వెళ్ళిందిట! ఒక్కపిట్టని కూడా విడిచిపెట్ట లేదుట!!—"

తెల్లబోయింది, సంధ్య!—

"ఇప్పుడు బూజంబంతేమిటి నాన్నా!" అనడిగింది.

"అహ!—! ఆ ప్రాణముఖర్జీ కూతుర్ని చేసుకుంటున్నాడుగా ఆయన! మొన్ననే లగ్గం!"

"ఏమిటేమిటీ!!— "హరిమతినా!!!—ఐవ్వపుణంతా!—" అన్న మాటలు మాత్రం ఆమె నోటివెంచి వెలువడినయ్

"అఁ....అఁ....అదే, అదే, హరిమతే గావష్ణు, ఆ అమ్మాయిపేరు. పాపం,

పేద బ్రాహ్మడు! బతికిపొయ్యాడు! పిల్ల పెద్దమనిషయి....'' అనబోయి.

"ఏమిటే సంధ్యా! అలా చూస్తావ్?'' అన్నాడు. ప్రియబాబు.

''ఏబ్బే. ఏం లేదునాన్నా!....పద, పద....మనం తొందరగా వెళ్ళాలి!—''
అని చెప్పి తండ్రి చెయ్యి పట్టుకుని. ఇంచుమించు లాక్కుంటూ రైలుస్టేషన్
కేసి గబగబా నడిచింది.

* * *

తండ్రిని తీసుకుని సంధ్య స్టేషన్లోకి వచ్చేసింది. అప్పటికింకా రైలు
రావటానికి ఒక అరగంట ఆలస్యముంది. అది ఒక పల్లెటూరి రైలుస్టేషను.
పైగా రాత్రిపూట కాబట్టి జనం అట్టేమంది లేరు. జనసంచారం ఎక్కువగా లేదు.
స్టేషన్ ప్లాట్‌ఫారమ్ చివరని దట్టంగా గన్నేరు చెట్లున్నాయి. ఆ చెట్ల నీడలో ఎవరో
ఒకామె కూచుని వుంది.

వీళ్ళద్దరినీ చూడంగానే ఆవిడ తొందరపడి ముఖంమీదికి పయిటలాక్కుని కప్పేసు
కుంది.

కొంచెం పక్కకి జరిగి నించున్నాడు ప్రియముఖర్జీ. కానయితే సంధ్యయొక్క
తీక్షణమైన వాడి చూపునించి మాత్రం ఆ వ్యక్తి తప్పించుకో లేకపోయింది.

ఒక్కక్షణం ఆగి చూసింది. సంధ్య ఆశ్చర్యపోయింది. ''ఇదేమిటి జ్ఞానదీదీ!
ఒక్కత్తెవీ ఇక్కడున్నా వేమిటి?'' అనడిగింది.

సంధ్య తనని సరిగ్గా గుర్తించిన సంగతి తెలుసుకుంది జ్ఞానద. వెంటనే చేతులు
రెండూ చాపి. సంధ్యను కౌగలించుకుని బావురుమని ఏడ్చింది! సంధ్య పొందిన
ఆశ్చర్యానికి అంతులేదు.

ఒకవంక తనకి కలిగిన దౌర్భాగ్యానికే సంధ్య ఇదైపోయి కుళ్ళుతూ వుంది.
ఇంతలోనే తన ఇంటి పక్కన మరో దురదృష్టవంతురాలి కర్మం ఇలా కాలిపోయాం
దని ఆమె కే మాత్రమూ తెలియదు. కాని. ప్రియబాబుకి ఒక్కసారిగా ముఖం
మాడిపోయింది.

''అక్కా! జ్ఞానదా! ఎంతదాకా ఈ ప్రయాణం?'' అనడిగింది సంధ్య.

జ్ఞానదకు గొంతు పెగల్లే. మాటబైటికి రాలే. తలమాత్రం తిప్పి ఊరుకుంది.
అలా తిప్పడంలో "నే నెక్కడి కెళ్ళాలో నాకే తెలియదన్న'' భావం వెల్లడవుతూంది.

తరవాత ఎవరూ ఏమీ మాటాడలే. రైలు వచ్చే వేళయింది. టికెట్లు కొనాలిగా!
తనుక. మాటాడదామని ప్రియబాబు ప్రయత్నించి ప్రయత్నించి చివరి కెలాగో
తెగించి అడిగాడు....

''జ్ఞానదా! ఏ వూరెళ్ళాలి? టికెట్టు తీకావా?"



ముందులాగానే జ్ఞానద తల ఆడించి. "లే....దు" అని చెప్పింది. ఆమె కళ్ళల్లోంచి నీళ్లూరుతున్నాయి. గద్గదస్వరంతో మెల్లిగా అడిగింది" మీరెక్కడికి వెళుతున్నారు? అని.

"బృందావనం!" అన్నాడు ప్రియబాబు.

"సంధ్య కూడా వస్తుందా మీతో?" అనడిగింది.

"ఆఁ....వస్తుంది"

కొంగుముడి మెల్లిగా విప్పింది జ్ఞానద. కొన్ని రూపాయలు తీసి ప్రియబాబు పాదాలముందు పెట్టింది.

"టికెట్టు కెంతవుతుందో తెలియదు నాకు. నా దగ్గిర యాభై రూపాయలు మాత్రం వున్నాయి. ఈ రూపాయిలు మీ వద్ద వుంచుకోండి. నాక్కూడా బృందావనికో టికెట్టు కొనిపెట్టండి"

"నన్ను బృందావనానికి మాత్రం చేరిస్తే చాలు. ఆపైన నాకీ లోకంలో ఎవరినీ యింతకంటే ఎక్కువగా కోరేదేమీ ఉండదు!" అన్నది.

క్షణకాలం పూరుకున్నాడు, ప్రియనాథ ముఖర్జీ. చివరికి మెల్లి మెల్లిగా ఇలా అన్నాడు. ఆదరంతో....సానుభూతిగా:

"సరేలే. రా అమ్మా రా. నువ్వు మాతోటే రా!"....

# కనకపు సింహాసనం

## ● బలివాడ కాంతారావు

వీళ్లు నలుగురూ నెత్తిమీద బాధ్యత బరువుతో నిత్యం నలిగిపోయే పరిపాలకులు. పారిశ్రామిక సంస్థల పరిపాలన వ్యవహారాలు చర్చించడానికి యేర్పరచిన సెమినార్‌లో పాల్గొనడానికి రాజధానికి వచ్చారు. ఈ ఫైవ్‌స్టార్ హోటల్లో ఓ సాయంత్రం నాలుగు గదులనించీ నాలుగు కుర్చీలు లాక్కొని వరండాలోనికి వచ్చారు. నిత్యం చక్రాల రణ గుణ ధ్వనులనించి ఒక్క నాలుగు రోజులు ప్రశాంత వాతావరణంలోనికి.

మిగతా ముగ్గురూ సరదాకు ఆడినా రామచంద్రరావుకు యీ జీవంలేని పేక ముక్కల్లో ఒకరీతి కట్టుబాట్లకు లోనైన సంఘం కనిపిస్తుంటుంది. కొంత సేపటి వరకు ఆ విశాలమైన వరండాలో తన వెనుకవేపు జరుగుతున్న విశేషాలమీద దృష్టిపోలేదు. ఎదరగా కూర్చున్నవాడు ఒకసారి అటు చూడమని సైగ చేసే వరకూ వెనుతిరిగి చూడలేదు.

ఇద్దరు కొత్తగా పెళ్ళయినజంట. ఆమె యింకా పెళ్ళి ముస్తాబుతోవున్నట్లే వుంది. ఝరీతో నిండిన యెర్రని చీర, బంగారు గాజులతోపాటు ఎర్రని గాజులు అతి నాజూగ్గా వుంది ఆమె. పటిక పంచదార చిలకలావుంది. చందమామ ఛాయతో, చేతిలో ధాన్యపు కొంకులతో నిల్చున్న లక్ష్మిలావుంది.

తన పెళ్ళి గుర్తుకు రాగానే రావు దృష్టి పేకాటమీద సన్నగిల్లింది. ఆటీను రాణి తన అద్దాలరాణిలా అగపడగానే సరి ఆడ లేనని చెప్దామనుకున్నాడు. కానీ మర్యాదకు ఆడుతున్నాడు. రీతిని తప్పుతున్నాయ్ ముక్కలు. ఈ కొత్త జంట విదేశాలు పోతున్నారేమో! వాడి ప్రవర్తన చూస్తుంటే విదేశాల్లో మెసలి వచ్చిన వాడిలా వున్నాడు. ఎటువంటి సంశయం లేకండా యీ పెద్దల సమక్షంలో యింగ్లీషులో యింగ్లీషు పద్ధతిలో పెళ్ళాన్ని దగ్గరగా లాక్కుంటూ ప్రేమ వొలకబోస్తున్నాడు.

రావు ఒకసారి లేచి విల్చునిచూసాడు. ఈ వరుడు యింతగా వుద్రేకంతో ఎగిరి పోతున్నది—కుంకుమబొట్టుతో కస్తూరిలా పరిమళిస్తున్న పెళ్ళాన్ని చూసికాదు. దిగువగా స్విమ్మింగ్‌పూల్‌లో విదేశవనితల విహారాన్ని చూసి: స్కాచ్‌విస్కీ అనుకుని ఆస్వాదిస్తున్నాడు.

రావుకు చాలా అలవాట్లు వుండాలని ఆ రోజుల్లో పెళ్ళం కోరుకునేది తను సిగరెట్టు మానివేసినందుకు విసుక్కుంది. మళ్లీ తాగించాలని ప్రయత్నం చేసింది. ఆ యిల్లు నచ్చలేదు ఆ ఫర్నిచరు కాల్చేమంది. అసలు యీ దేశమే నచ్చలేదు. విదేశాల్లో వుండిపోదామనే యింత పెద్ద వుద్యోగస్తుడ్ని పెళ్ళాడా నన్నది. అప్పటికీ విదేశాలంటే విసిగినరావు కాదన్నాడు. ఆ రోజువించే యిద్దరి మధ్యా యెడముఖాలు పెడముఖాలు—తగువుల వాతావరణం....

ఈ కొత్తజంట ఆతగాడికీ ఆమెకు వయసులో తేడా యిరవై యేళ్ళయినా వుంటుంది. అప్పుడే వాడికి పట్టబుర్ర వచ్చేస్తోంది. ముక్కు ఆ ముఖానికి పెద్దదే. ఆ పెదాలు మోటువే. అల్లిబిల్లిగా పెరిగిన యీ పిల్లను యే తలిదండ్రులు యీలాకాయిలా కాయిచేత పెట్టేసారో: ఐనా ఆ పెళ్ళికూతురు యౌవ్వనంలో ఆడది పువ్వులానే వుండాలని పోల్చుకున్నట్లుంది. మొగుడు అందిచ్చిన పీరూపాలూ రెండూ ఆమెకు రుచిగానే వుండి వుండాలి

రోజంతా సమస్యలతో నలిగి ఇంటికి వచ్చేసరికి తన యిల్లు కోరికల నరకంగా కనిపిస్తుంది. ఒకటి కావాలంటే అది రాటానికి కొంత ఆలస్యం జరిగిందీ అంటే తన చేతగాని తనం మిగతావాళ్ళ ప్రయోజకత్వం ముందు పెట్టి పెళ్ళం నానామాటలు కురిపించేది—రాను రాను యీ తత్వం పెరిగి ఓగాపీ తరగలేదు. ఎలాగో అడిగిన వస్తువు యింటోకి వచ్చేసరికి అంతకంటె విలువైన కోరికలతో మళ్ళీ జీవితం మామ్మూలే....

రావు యింక పేకాట ఆడలేకపోయాడు. ఒంటిగా ఒకమూల కూర్చొని యీ కొత్త పెళ్ళికూతురువేపు చూస్తూ యేవేవో భావల జీవాల్లో మెసలుతూ కాస్పేపయినా తన యింటిని మరచిపోదామను కున్నాడు. మిగతా ముగ్గురికీ పేకాటమీద మనసులేదు. ఆజంటమీదే దృష్టి. ఆమె పల్లెటూరి పడుచో లేక పల్లెటూరిలాంటి పట్నంవించో వచ్చి వుంటుందను కున్నాడు. సహజమైన సిగ్గుతో వెలిగిపోతోంది. లేటసీరులా కనిపిస్తూ మొగుడ్ని తేజరిల్లే వెలుగు చేసుకుని ప్రతిబింబించు కుంటోంది. అలికిన అరుగుమీద పూసిన పూలగోలం పెట్టినట్లు వరండాలో విల్చునివుంది.

తూరుపువేపు గుండ్రని పౌంటన్ చుట్టూ విరబూసిన పూలమొక్కలు. పూలతుప్పలను వదలని తేనెటీగలు.




విప్పిన గొడుగుల్లా విచ్చున్న చెట్ల పొదల్లోనించి తొంగిచూస్తున్న చిలకలు. మైనాలు. చీకటిపడగానే రంగు రంగుల వెలుతురును చీల్చుకుంటూ పైకెగసే నీటిధారలు. వరండాలో నగిషీ కిటికీలమీద నమ్మకంగా కూర్చొని కునుకుతూ కులుకుతున్న పావురాలు.

ఈ వాతావరణంనించి "మైడియర్ డార్లింగ్" అంటూ నడుం నొక్కుతూ గదిలోనికి తీసుకపోయాడా భారతీయుడు. ముగ్గురి పరిపాలకుల బొమలు ఒకసారి పైకెగసాయి. చేతులు మూతులూ కదిలాయ్.

"ఇది పెళ్ళం అంటావులేక....?" ఒకాయన గొణిగాడు.

"ఆ(డెవ్....కొత్తగా పెళ్ళయి వుండాలి....?" రావు సమర్ధించాడు.

"హోటల్లో రూముకోసం.....యీ వేషం కాకూడదా?"

"ఆమె బజారు మనిషని పొరపాటునైనా వూహించడానికి...."రావు ఆమెను సమర్థించాడు.

"చూపులు చూసి మోసపోకండి"

"నాకంటికి ఆమె అసలైన...."రావు మాటలు పూర్తి చెయ్యనివ్వకుండా ఒకాయన "భారత నారీమణిలా వుందంటారు.

ఒక్కసారి ఆ వల్ల కళ్ళద్దాలు తీసి చూడండి. వాళ్ళిద్దరి వయసులో తేడా.... ఏ తండ్రీ అంత తేడాతో పిల్లను విసిరే స్తాడనుకోను ''

''వా డెలాంటి కష్టాల్లో వున్నాడో? వాడు విదేశాల్లో మంచి హోదాలో వుండ కూడదా?'' రావు యింకా సమర్థిస్తుంటే ''ఈ పెద్ద పట్టణాల్లో యెవరు యెవరో చెప్పుకోవటం చాలా కష్టం. ఎలాగూ మూడురోజులుంటాంగా అసలు గుట్టు లాగుదాం'' అన్నాడొకాయన

''ఎలా వీలౌతుంది?'' రావుకు అప్పీ ప్రశ్నలే.

''అయితే హీరో అవ్వాలి చాతకాక పోతే విలన్‌గానైనా మారాలి. మధ్యే మార్గంలేదు ''

''వీళ్ళ సంసారంలో కత్తిపట్టుకుని ప్రవేశిస్తారా?'' ఈ ప్రశ్న నాలిక చివర వరకూ వచ్చినా ఆపేశాడు.

రావుకు నిద్దర పట్టలేదు. ఇంత చక్కని మానవ ప్రతిమను యింత సుందర ప్రదేశంలో యింత అమాయక మైన ప్రేమతో చూడగలిగినందుకు ఆనం దించకుండా. అభాండాలు వెయ్యటం తనకు నచ్చలేదు పరువుమీద వాలినా ఆవిడే గుర్తుకొస్తోంది. కాస్సేపు తన జీవితం అంతా నెమరు వేసుకున్నాడు. వీధిలో తన చుట్టూవున్న మనుషులూ ఒకరీతిలేని శబ్దాలు. అపకతవకమనుషులు కాలికివేస్తే మెడకు, మెడకువేస్తే కాలికి బందాలు వేసేవాళ్ళు. అపసత్యాలు—ఈ రీతిలేని శబ్దాలనుంచి ఒక కమ్మని రాగంగా ఆలాపింప చేద్దామనే తన ప్రయత్నంలో కనీసం కాస్త మనోవిబ్బరాన్ని ప్రసాదించే ప్రశాంత వాతావరణం యింట్లోలేదు. జీవితం డబ్బు యిచ్చే సుఖాల సుడిగాలిలో చిక్కుకుంది. లోకం తన ఒంటికి బురద అంటించింది. పెళ్లాం అది కడిగే గంగా ప్రవాహం కాలేదు. పెళ్ళాం ఒక ముళ్ళచెట్టే అనుకుంటే పోనీ ఒక తియ్యనిపండు లేక ఒక గులాబి పువ్వు—అవును ఆమె పళ్ళను రాల్చింది. నలుగురు బిడ్డలు వాళ్ళు ఆమెలా పుల్లనిపళ్లే—ఒక్కటి గులాబి పువ్వు కాలేదు. తియ్యని పండుకాలేదు.

నిద్దరరాక బయటకు వచ్చాడు ఒరం డాలో ఒక్కడు. వెన్నెల వెలుగులో పచ్చని పట్టుచీర పమిట సవరించుకుం టున్న అన్నపూర్ణలా ప్రకృతి కని పిస్తోంది. కాస్పేపు యీ పచ్చని పరదాల ప్రపంచంలో ఒక్కడే....ఎవరికోసమో యెదురు చూస్తున్నట్లు నిల్చున్నాడు ఆ రూపు తను వూహించుకోవాలి. ఆ సుఖం రుచి తెలీదు. అది పాలవెల్లిలా అందనిది అనుకున్నాడు. ప్రయత్నిస్తే అది దొర కదు. ఆ పాలవెళ్ళి ఆకారం శబ్దం— కవనంలో, సంగీతంలో, చిత్రణలో అదృష్టవంతులకే దొరుకుతుంది. ఈ సుఖం అర్థంచేసుకున్న భార్యలో మగనికి దొరుకుతుంది!



ఇలా యేవేవో అనుకున్నాడు. ఈ వట్టబుర్ర పెళ్ళికొడుకు అలాంటి అదృష్ట వంతుడు. అర్థంచేసుకుని ఆరాధించే యిల్లాలు దొరికింది. ఆమె అతని బురదను కడిగే గంగాప్రవాహం. ఆ మొరటుమనిషి కన్నీరు. ఆ ముళ్ళడొంకమీద వాసన పూవు.

రావు తలుపు తట్టాడు ఏడుస్తున్న ఆమె తలుపు తీసింది. ఇంకోలా సంభో దించలేకపోయాడు.

"ఎందుకేడుస్తున్నావు చెల్లీ' అని అడిగాడు.

"ఇంత రాత్రయింది. ఇప్పుడే వస్తా నని వెళ్ళారు. ఇంకా రాలేదు"

"ఎక్కడికెళ్తున్నదీ చెప్పలేదా?"

"ఉహుఁ"

"దగ్గర డబ్బుందా?"

"పర్సు తీసుకు వెళ్ళాడు."

"భోజనం చేశారా?'

"ఆయన వస్తారని చూస్తున్నాను."

"నే చూస్తాను. నువ్వు భోజనం చెయ్యి"

"ఆయనలేనిది.... నాకు ఆకలిలేదు."

ఆ ఏడుపు ఒక ప్రవాహంలా వస్తోంది. లోకంకోసం యేడ్చే కల్లిబొల్లి యేడుపు కాదు. ఆమె తపన హృదయంవించి

భ_క్తితో వస్తోంది. తన భార్యలా డబ్బు. హోదా చూసికాదు. ఒక చిన్న సంఘటన ఒక కొండంత అభిమానం—ఒక చిన్న మర తిప్పగా ఒక కొళాయివించి నీళ్ళ ధార పడినట్లు!

ఎలాగయినా యీ వు_త్తమ యిల్లాలి భ_ర్తను యీ రాత్రే ఆమె దగ్గరగా చేర్చా లన్నంత తపన చూచి మిత్రులు నవ్వారు. వేళాకోళం చేశారు. సాయంత్రం మేం అన్నది ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో మన్నారు. వీళ్ళు మనకెందుకీ గొడవలు ఇందులో అనవసరంగా జోక్యం చేసు కోకు. చిక్కుకుంటే బయట పడలేవని అన్నారు. అప్పటికీ వినకపోతే నీ ఇష్టం అనేశారు.

రావు పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి రిపోర్టు యిచ్చాడు. తిరిగివచ్చాడు. ఆమె యింకా వెక్కి వెక్కి ఏడుస్తోంది. తలచి తలచి ఏడుస్తోంది. ఏమి జరిగివుండాలి? ఎన్నెన్నో కారణాలు వూహించుకున్నాడు.

ఆమె పరిస్థితి చూసి అతని రూపాన్ని వర్ణించి అన్ని పెద్ద ఆసుపత్రుల కేజు యాల్టీలకు ఫోన్ చేశాడు. రెండు నైట్ క్లబ్‌ల్లోనికి వెళ్ళాడు. తిరిగి వచ్చేసరికి ఆమె పరిస్థితి బాగాలేదు. దగ్గరలేకపోతే యెటువంటి అఘాయిత్యం జరుగుతుం దేమోనని దగ్గరగావుండే ధైర్యం చెప్పు తున్నాడు. ఎంత చెప్పతున్నా ఆమె అధైర్యం హెచ్చుతోందిగానీ తగ్గలేదు.

తెలతెలవారింది. ఇద్దరూ ఆమె గదిలో నిద్దరలేక వగం చచ్చి కూర్చున్నారు. మగడు మహారాజులా దిగబడ్డాడు. ఆమె ఆవేశంతో పక్కకు చేరితే వాడు అవ మానంతో రావువేపు చూస్తూ....

"ఎవడు వీడు? ఇక్కడెందు కున్నాడు?"

"ఆయన చాలా శ్రమపడ్డారు...." అందుకుంది ఆమె.

కోపంతో అక్కడేవున్న బల్ల గుద్దుతూ అతగాడు అరిచాడు "నా విషయాల్లో జోక్యం విన్నెవరు చేసుకోమన్నారు?"

"మీరేమయ్యారోనని ఏడుస్తుంటే..."

"ఏ మౌతాను? నా యిష్టంవచ్చిన దగ్గర కెళ్ళాను. నాకు నచ్చినవాళ్ళ దగ్గర కెళ్ళాను....వరకానికెళ్ళాను...." ఇంకా ముందుకువెళ్తూ "నేను లేనప్పుడు నా పెళ్ళాం ఒక రైవుంనగా నా గదిలోనికి చొచ్చినందుకు....పోలీసుకి యిప్పుడే ఫోను చేస్తాను" అంటూ ఫోనెత్తాడు.

రావు మెల్లగా గది బయటకు నడి చాడు. ముగ్గురు మిత్రులు తగినశాస్తి జరిగినందుకు నవ్వుతున్నారు. ఆ వరండా చివర నిల్చొని ఒక బేతింగ్ బ్యూటీ యిదే చూస్తోంది. తన గదిలోనికి వెళ్ళి గడియవేసి పరుపుమీద వాలాడు. కిటికీ నించి చూశాడు. తోటమాలి ఒక వాడిన పువ్వును తెంపిపారేశాడు. ఈ వయసులో కుటుంబ బాధ్యలతో తన భార్య పువ్వు కాలేదు. ఈ బాధ్యతల బరువుతో తను తేనెటీగ కాలేదు.

కనకపు సింహాసనం అందరికీ దొర కదు. దొరికినా కూర్చున్న వాళ్ళంతా మహారాజులు కాలేరు.

—




నేను నవమన్మధుణ్ణి. అయితే నేం? నా భార్య కురూపి. సన్నగా, పొట్టిగా, నల్లగా ఉంటుంది. కాలు పెడగావేసి నడుస్తుంది. చిన్నకళ్లు. కాని అందమైన జుట్టూ, కోయిల కంఠస్వరమూనూ! ఆ రెండు విషయాల్లోనూ భగవంతుడిట్లా ఎందుకు చేశాడో నాకైతే తెలీదు. ఇంకా కాపరానికి వచ్చేనాటికి కాస్తనయం. అది పెళ్ళినాటికి చెప్ప శక్యం కాకుండా ఉంది

నా పెళ్ళి స్థిరమైన రోజుకు నాకు పెళ్ళంటే ఏమిటో తెలీదు. "ఈ పిల్లే పెళ్ళికూతురు" అని దాన్ని నాకు చూపించినపుడు నాకు దానిమీద ఏమో మమకారం కూడా కాస్త కలిగింది. ఏ మగవాడు ఏ ఆడదాన్ని చేసుకున్నా ఒకటేననీ, జరిగినవీ, జరగబొయ్యేవీ—పెళ్ళిళ్ళన్నీ రాసి పెట్టి ఉండినవే నని నాకు చాల కాలమై తెలుసు. ఎవరిభార్య అందంగా ఉన్నదీ, ఎవరిభార్య అనాకారి అయిందీ అన్వేషించే వాళ్ళు పనీపాటా లేని బుద్ధిహీనులని నేను నమ్మాను. అందం దేనికి? కూరొండుకుంటారా? పెళ్లికి నాకు పధ్నాలుగేళ్ళు.

అయితే సంబంధం స్థిరపడి ముహూర్తం సమీపించేలోపుగా, ప్రమాదం జరిగిపోయిందని నేను తెలుసుకున్నాను. మా నాన్న వినకుండా మా తల్లివాళ్ళూ అన్నారు. ఆ మాటలు వింటే పుతం వేసేస్తాడు మా నాన్న! నలుగురూ అయన్ని ఈ సంబంధం కుదిర్చినందుకు ఆడిపోసే మాటలూ, నా భావిగతి గురించి పడ్డబాధా విచారాలూ గమనించేటప్పటికి నాగుండెలో దిక్కు-పుట్టింది. దాంపత్యంలో తీరా అందచందాలతో పని ఉందేమోననే సంశయం నాలో పుట్టుకొచ్చింది.

నాలో ఏ విశేషమూ లేదని గట్టిగా నమ్మిన నాకు నేనో నవమన్మధుణ్ణనే సువార్త ఈ సందర్భంలో చెవిని పడింది.

కాని అందుమూలంగా నా సంతోషం జాస్తి కావటానికి బదులు దిగులే జాస్తి అయింది. ఇటువంటి నాకా ఆ కురూపి!

ఒకరాత్రి ఎవరూ చూడకుండా పక్కలో పడుకొని ఏడిచాను;—దేవుణ్ని ప్రార్థించాను. ఈ సంబంధం తప్పించమని. ఐతే దేవుడు నాకు సాయపళ్ళేదు. సామాన్యంగా మా నాన్న తలపెట్టినపనికి దేవుడడ్డుపడడు అడ్డుపడాలని కొంత ప్రయత్నం చేసినవాళ్లు ఓడిపోయినారు. వాళ్లు దేవుడికన్న మొనగాళ్లు కారని రూఢిగా తేలిపోయింది.

నా పెళ్ళి అయింది—ఆ కురూపికే. నా భార్యపేరు సుందరి—సుందరీ మాణిక్యం; హ్రస్వనామం సుందరి.

నా జన్మకుతీరని అపచారం జరిగినట్టు భావించుకున్నాను. కాలక్రమాన అయినా నాకు న్యాయం జరగకపోతుందా అనుకున్నాను కాని నా భార్య చచ్చిపోయి, నాకు మరో పెళ్లికాలేదు! అక్కడకూడా ఆశాభంగమే అయింది.

నా భార్య కాపరానికి రావటానికి సిద్ధంగా ఉంది కురూపి దానితో కాపరం చెయ్యటం మొదలుపెట్టిన తరవాత నాలో ఏ మార్పు కలిగేది నాకు తెలియదు; కాని ఏదో మార్పు కలుగుతుందనీ, అది వాంఛనీయమైన మార్పుకాదనీ మాత్రమే నే నెరుగుదును

నా భార్య కాపరానికి వచ్చింది. ఆ గర్భాదానంనాటి రాత్రి నేను నా భార్యకేసి చూడటానికి జంకాను. తప్పనిసరిగా చూడవలసి వచ్చేటప్పటికి అది నా కళ్ళకు ఆ[illegible] అసహ్యంగా కనిపించలేదు. బహుశా నేను దాని అనాకారి తనం గురించి ఉన్న దానికి మించి ఊహించటంవల్లనేమో!

"ఈ మొహంకాక ఇంకేమొహమైతే నాకు బాగుండేది!" అని ప్రశ్నించుకుంటే, నా కింకేమొహమూ అక్షణాన స్ఫురణకు రాలేదు 'ఈ భార్యను నువ్వు స్పృశించరాదు! దీనితో నీకెటువంటి స్నేహభావమూ పనికిరాదు ఇప్పుడు దీనితో ఎటువంటి సంబంధమైనా పెట్టుకుంటివా, అనుమానాస్పదమైన పత్రంమీద సాక్షి సంతకం చేసినట్టే!" అని నా అంతరాత్మ హెచ్చరించసాగింది అంతరాత్మకేం తెలుసు. పాపం? మనం ఏమంటే అదల్లా అంటుంది సమయం వచ్చినప్పుడు అట్లా అనమని నేను దానికి నా పెళ్లి అయిన మర్నాటినుంచీ, ఈ నాలుగేళ్ళబట్టీ, చెబుతూ వచ్చాను.

"ఇదో కొత్త అనుభవం చేతికి అందుబాటులోకి వచ్చింది! నిన్నెవరూ శిక్షించరు! తరువాత నీ కిష్టమైనా కాకపోయినా, ఈ అనుభవం ఏమిటో తెలుసుకో! ఇంతలో వచ్చిన నష్టం ఏముంది!" అని ప్రకృతి నన్ను హెచ్చరిస్తూ ఉంది.

కేవలమూ జిజ్ఞాసతో కూడుకున్నవాణ్ణయి నేను నా కురూపిభార్యను సమీపించి చెయ్యి పట్టుకున్నాను. నేను మొదలువరికిన చెట్టల్లే పడిపోలేదు. కాని

నా భార్య తల వంచుకుని సిగ్గుపడటం నాకు ఆపుకోని ఆనందం కలిగించింది. సిగ్గనేది నా భార్య కురూపి మొహానికి ఏమైనా అందం చేకూరుస్తుందేమోనని బలవంతాన దాని మొహం పైకెత్తి చూశాను. దాని కళ్ళు తడిగా ఉన్నై. ఒకటి రెండు చుక్కలు చెక్కిళ్ళమీదిగా జారినై.

ప్రపంచంలో ఉన్న అందమైన మొహాల్లో అందమైన మొహం కనిపించినా నా హృదయం అంత చలించి ఉండదు. నేను అంతరాత్మనూ, ప్రకృతినీ, నన్నూ ఒక్కసారిగా మరిచిపోయి ఆదుర్దాగా "ఎందుకేడుస్తున్నావు?" అన్నాను.

కాంతివంతమైన దీపంకేసి చూడబోయి చూడలేక పోయిన దానల్లే నా భార్య తల తిప్పుకొని ఏమీ లేదన్నట్టు తల ఆడించింది. నేను కళ్ళనీళ్లు తుడువబోతే నా కన్నముందే తన చీర చెంగుతో కళ్లు తుడుచుకుంది. అంతమేర చీర నల్లగా అయింది.

"నీ ఒంటిరంగు చూడు: తిరిగి ఎట్లా వస్తున్నదో?" అన్నానుకాని మాట నోరు జారి వచ్చేసిన తరవాత భయం వేసింది- అది మళ్ళీ ఏడుపు మొదలు పెడుతుందేమోనని.

కాని అదృష్టవశాత్తూ అటువంటిదేమీ జరగలేదు. పైగా అది కొంచెంగా నవ్వి. చాలా సన్నగొంతుతో. దాని కోయిల కంఠస్వరంతో "అటువంటిదాన్ని చేసుకున్నారు! ఏరికోరి!" అన్నది.

"నీ గొంతులో యెంత అందం పెట్టాడు దేముడు!" అన్నాను. "పోనివ్వండి. ఆమాత్రమన్నా—" అని మానేసింది నా భార్య

కేవలం జిజ్ఞాసతో నా భార్యను కౌగిలించుకొన్నాను నాకేమీ రోతగాని. బాధగాని కలక్కపోవటం చూసి ఆశ్చర్య పడ్డాను పైగా దాని చెంప నా చెంపకు తగలగానే చాలా ఆనందం కలిగింది. ఆ తరవాత పరిపూర్ణమైన విర్లిప్తతతో— ఆనందంపొందే ఆశ ఈషణ్మాత్రమైనా లేకుండా—దాని మొహం చేతుల్లోకి తీసుకొని మూతి ముద్దుపెట్టుకున్నాను. అంతకన్న ఇంకో ముద్దయితే మాత్రం యెక్కువ వేడిగా. ఎక్కువ ఘాటుగా. ఎక్కువ తియ్యగా ఉండవచ్చునని నాకు తోచింది.

"ఎవరైనా చూస్తే నవ్వుతారు!" అన్నది నా భార్య.

"నన్నట్లా అంటే మరింత రేగుతాను!" అని. రుజువుకూడా చేశాను.

"మీ రెంత మంచివారు!" అన్నది నా కురూపి భార్య. పాపం. దానికి భావ ప్రకటన చేసేటందుకు భాషలేదు ఐతే దాన్ని అర్థం చేసుకునేటందుకు భాష అవసరం లేకపోయింది.

ఆ కురూపిభార్యను ప్రేమించి నేను సంఘానికి చాలా ద్రోహంచేసి ఉండాలి.

అందరూ నన్ను విడ్డూరంగా చూడ సాగారు. "ఈ పెళ్లానికే ఇంత ఉబ్బి తబ్బిబ్బులవు తున్నాడు. ఇంకొకరంటి దొరికితే" అని వారంటున్నట్టు నాకు శూడిగా తెలిసింది.

ఆడతనమంటూ ఉన్న ఏ పదార్థాని కైనా నేను "పడతా" ననే విశ్వాసంతో కాబోలు ఒక ముప్పై అయిదేళ్ళ పూర్వ సుందరి ఒకామె నాతో సరస సల్లాపా లారంభించింది. ఆవిణ్ణి ముద్దు పెట్టు కుంటే వెచ్చగా, మాటుగా, తియ్యగా ఉంటుందని నాకేమీ నమ్మకం చిక్క లేదు. ఆవిడజోక్యం వదిలించు కున్నాను. నేను సంఘానికి ద్రోహం చేశానని నాకే నమ్మకం కలిగింది. తప్పుపనులు చేసి నంతమాత్రంచేత సంఘం కన్నెర్ర చెయ్యదు—అ చేసే తప్పుడుపనులు తప్పులుచేసే వాడల్లే చేస్తే. ఐతే నేను ఈ విషయంలో కొంచెం నిర్లక్ష్యంగా ప్రవర్తించి ఉంటాను. నా భార్య నా కనుచూపు మేరలోకి వస్తే నేను తప్పని సరిగా నవ్వేవాణ్ణి. కళ్ళతో మాట్లాడే వాణ్ని. నాభార్య బదులు చెప్పేది కాదు. కాని స్వీకరించేది. నా కంటి భాషకోసం వెతికేది.

"నా వంక అట్లా చూడకండి! నా ఒళ్ళంతా జల్లు మంటుంది! అంతా కని పెట్టి యెగతాళిచేస్తారు. ఇప్పటికే వడ లేకుండా ఉన్నాను....వాళ్ళు అనేది నవ్వు తూనే అంటారు గాని ఇవతలవాళ్ళ కెట్లా ఉండేదీ ఆలోచించరు!" అని నన్ను వైశ్రివేటుగా మందలించేది

"ముందు ముందు నీమొహం చూడని రోజులొస్తై! నీ చేతి మంచినీళ్ళు కూడా తాగని రోజులొస్తై! ఇంత కురూపితో ఎన్నాళ్ళు కాపరం చేస్తారు—ఎంత నవ మన్మధులైతేనేమటుకు: ఈ నాలుగు రోజులూ ఏదోవిధంగా గడిచిపోనివ్వక నా కడ్డం చెబుతావేం?" అని నేను దాన్ని గట్టిగా కోప్పడేవాణ్ణి.

దానిమీదట నా భార్యకు పశ్చాతాపం కలిగి తన ముక్కుతో నావీపులో చక్కిలి గిలి పెట్టేది—నేను ఎప్పటికీ ఆ మాట అననని వాగ్దానం చేసేవరకూ!

ఒకసారి నాభార్యతో ఎవరో ఒక ఇల్లాలు "ఏమమ్మాయ్ నీ మొగుడు నువ్వెంత చెబితే అంతటగా!" అనటం నాచెవిన పడ్డది. ఆ రోజునించీ పని పెట్టుకుని నా భార్య యెడల వినయ విధే యతలు కనబరచ సాగాను.

"మీరు నన్నిట్లా చంపుకు తింటున్నా రేమండీ!" అన్నది నా భార్య. "ఏ" మన్నాను. "మీరు నా చెప్పు చేతల్లో ఉన్నారని అంతా అనుకుంటున్నారు. నిజంగా వాళ్ళకేం తెలుస్తుందీ!"

"నిజమేమి" టన్నాను.

"పోనిస్తురూ!" అన్నది నా భార్య దిగులుగా.

"పిచ్చిదానా. నీకు వాళ్ళతో ఏమిటి! వాళ్ళ మాటలు నే వేం పాటిస్తున్నాను!"




"మీకేం? మగవాళ్ళు. మీకు జరుగుతుంది!"

"నువ్వా మగవాడివే? ఇంత కోతి అడదెట్లా అవుతుంది."

"అదీ. మాటతోపేపే పద్ధతి!"

తన అనాకారితనం నా భార్యను చాలా వేధిస్తున్న దని చాలాకాలం తెలీదు. ఒకనాడు సుందరి "ఈ జన్మకు మీకు నేనే గదా పెళ్ళాన్ని?" అన్నది. "ఏమయితే!"

"ఏమీ కాకేం? నేను కురూపిని. మీ రందగాళ్ళమా!"

"కురూపితో కాపరం చేయటం కష్టమా? కాదూమరీ?'

'నేను కష్టపడుతున్నట్టు కనిపిస్తున్నానా!"

"ఇది సొంతం పెళ్ళాందని నే ననుకుంటున్నానా?"

"పోనీ. అందగాడితో కాపరం చెయ్యటం సులభమా? నీకు హాయిగా వెళ్ళుతున్నదా?"

"మీకెవరు సమాధానం చెబుతారు?"

అప్పుడు నే నన్నాను: "నేను మాత్రం నిన్నే పట్టుకుని వేళ్ళాడుతున్నానా ఏమిటి? ఎవరన్నా అందగత్తె

కావాలంటే నాకు దొరక్కపోతుందా?"

"ఏదో చేసి కొంపమీదికి తీసుకు రండి!"

కేవలమూ అసూయ వెళ్ళకక్కినవాళ్లు వెళ్ళకక్కగా నన్ను శాస్త్రోక్తంగా చేసి విమర్శించినవాడు మా మేనమామ కొడుకు. వాడు పత్రికల్లోనూ అక్కడా బూతు కథలు రాస్తూంటాడు. వాడు నాకూ, నా భార్యకూ ఉన్న సంబంధం పశుకామమని రుజువుచేశాడు. అయితే, విజ్ఞాని కనక పశుకామంలో తప్పేమీ లేదన్నాడు. మళ్ళీ, నేను మరొకస్త్రీని యెరగని కారణంచేత నా భార్యమీద నాకున్న ప్రేమలో విశిష్టత ఏమీ లేదన్నాడు.

"నా భార్య నా వంక ఎట్లా చూస్తుందో నువ్వెరగవు!" అన్నాను. "నన్నెంత గాఢంగా కౌగలించుకుంటుందో ఊహించలేవు" అన్నాను. "అదే నేననేది!" అన్నాడు వాడు. అయినప్పటికీ నీ ప్రేమ నా గౌరవాన్ని ఆకర్షిస్తున్నది!" అన్నాడు.

వాడు నా ప్రేమను పశుకామం అనటం నేను సహించలేకపోయినాను. నేనింకో ఆడదాన్ని ఎరగనందుకు అవమానం కలిగింది. నా భార్యలో ప్రత్యేకత లేదని అనటంకంటె ఇంకేం అవమానం కావాలి?

నా దృష్టి వెంటనే కనకం మీదికి పోయింది. అది ఒకప్పుడు దాదాపు నాకు భార్య అయినంతపని జరిగింది. "నువు నాకు మొగుడి తర్వాత మొగుడంతవాడివి!" అని నాతో నవ్వుల కనేది. నేనుకాదని ఒక తేళ్యంగాడి కిచ్చారు దాన్ని. అది తప్పుడు పనులకు యింకా దిగలేదేమోగాని దిగడానికి మాత్రం సిద్ధంగా వుందని నాకు రూఢిగా తెలుసు. ఒకటి రెండుసార్లు ఉత్తరాలు పట్టుకుని దాన్ని చిదకగొట్టడం కూడా జరిగింది. వాళ్ళింటికి నేను స్వేచ్ఛగా వెళ్ళిరాగలను.

వాళ్ళింటికి వస్తూపోతూ ఉండడం ప్రారంభించాను. కనకం నాకోసం ఎంతోకాలంగా కనిపెట్టుకుని ఉన్నదానల్లే నేను చెయ్యి చాచగానే అందించింది. కాని మా దొంగతనం వెంటనే బయటబడింది. నేను దానికొంగు పట్టుకు లాగుతూండగా దానిమొగుడే చూశాడు. ఇక అక్కడో క్షణంకూడా ఉండ బుద్ధిపుట్టలేదు.

అక్కణ్ణించి నే నింటికి పోలేదు. ఎటుపోతున్నదీ తెలియకుండా ఊరువిడిచి చాలాదూరం వెళ్లాను. పాడు పనిచేసి బయటపడ్డా ననేదికూడా నన్ను బాధించ లేదు. ఈ అనుభవం — కనకంతో — అనుభవం — నన్ను మార్చింది. ఎంత చెడ్డా కవిగాడు కొంత నిజమే చెప్పాడు. వెనక ఎన్నడూ కలగని విచారం ఒకటి నన్నిప్పుడు పట్టుకుంది: నాకు కనకమే భార్యఅయి ఉండకూడదూ? లోకంలోనున్న అందగత్తె లంతా ఎవరిభార్యలో కావటానికి నేనేం పాపంచేశాను? కనీసం సుందరి సంసార పక్షంగానైనా ఉండ

కాదూ? మరీ కురూపి.... అందులో కూడా అంత ఉనకత్ర ఐద్దనంటి మనిషి!

నే నింటికి తిరిగివచ్చేటప్పటికి పొద్దు గూకింది. ఇంటో అడుగు పెట్టగానే ఇల్లంతా ఎగిరిపొయ్యేటంత పైరావణ తతన.

"—ఇటువంటి కురూపి ముండను కట్టుకోవటమేం? ఊళ్ళోవాళ్ళ కోడళ్ళ మీద పడటమేం? తనకు ఆడతోడు లేదూ?" అని అరుస్తున్నది కనకం అత్త గారు.

"ఒకవేళ నీవు పొరబాటు పడివుంటా వేమో!" అని మా అమ్మ ప్రారంభించ గానే. "చాల్లేవమ్మా! నా కోడలు చెప్పలా! వారంరోజుల నించీ దాన్ని ఏమిటో పలకరించబోతాట్ట అర్థం కగులు తాట్ట! ఇవాళ కొంగుపట్టుకు లాగాడు. రేపు చేయపట్టుకు లాగుతాడు!'

నేను విర్భాంతపోయినాను. ఒక మహాఇల్లాలు అంత అవ్యాచంగా మాట్లాడ డానికి ప్రయత్నిస్తుందని నేను దైవ సాక్షిగా, ఎన్నడూ భావించలేదు. ఈ పోట్లాటకు రావటంలో ఆవిడకు కొంత ఆనందం కూడా లేకపోలేదని గ్రహించ గలిగాను. ఎవరిపతుత్వం ఎవరు ఎట్లా బయట పెట్టుకునేదీ ఎవరమూ చెప్ప లేం?....కనకం దివ్యంగా బొంకిందన్న మాట! పిరికిపక్షి! అందుకనే కాబోలు నేను దాన్ని దాని మొగుడివాత వదిలేసి నాదారిన వెళ్ళాను. మా సుందరిని— మా కోతిని ఎప్పుడన్నా ఇట్లా ఇతరుల వాత విడిచిపెట్టి ఎరుగుదునా?—

సుందరి! దాన్ని ఈ ముసలిముండ పెడేటన ఎంతమాట అన్నది! ముందు ఆ ముసలిదాన్ని చిత్రవధ చెయ్యాలా. సుందరి ఈ తుపానులో ఏమూల చిక్కి పోయిందో చూడాలా! ముసలిదాని జోలికి పోవటం ఆ క్షణాన వివేకం కాదని పించింది. సుందరికోసం నా గదిలోకి పరుగెత్తాను. నే మాహించినట్టే సుందరి దుఃఖసముద్రంలో మునిగిఉంది నన్ను చూడగానే కళ్ళు తుడుచుకుంటూ. నా మూలంగా మీరెంత మాటలుపడుతున్నారో చూడండి! .... కాస్త జాగ్రత్తగా ఉండరూ? నేను చెప్పలేదా? నన్ను చేసు కోవటం ఊరికేపోదని!" అన్నది.

"ఇది నీకేమీ సంబంధించిన విషయం కాదు. నేను కనకం కొంగుపట్టుకు లాగు తుండగా దానిమొగుడు చూశాడు"

"అయ్యోయ్యో! ఏం పన్లండీ ఇవి! నాకేం సంబంధం లేదంటారేం? నేను చక్కనిదాన్నయితే మీ రిటువంటి పనులు చేస్తారా?" "ఏమి చెయ్యకుండా. నువ్వు కూడా చక్కనిదానివే నని రుజువు చెయ్యటం ఎట్లా మరి?" అన్నాను మా అనాకారి సుందరికి దగ్గిరికి జరుగుతూ.

ఆగష్టు నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ. పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు జూలై ౫ వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుములేదు.

# చింత చచ్చినా...




పాలగుమ్మి పద్మరాజు

అది నాలుగు మండువాల భవంతి. దాని వయస్సు రెండు వందల సంవత్సరాలు. రెండు పక్కల పెంకు కిందికి దిగిపోయింది. ఒక్కొక్కగదే వాస యోగ్యం కాకుండా పోతుంటే, పంతులుగారూ భార్యా తమ ఆవాసాన్ని బాగున్న గదుల్లోకి మార్చుకుంటూ వస్తున్నారు. ఇప్పుడు తూర్పు భాగంలో రెండు మండువాలూ మారిపోయాయి. పశ్చిమార్థంలో పంతులుగారి నివాసం.

ఆ ఇంట్లో వస్తువులన్నీ సుమారు ఇంటివయస్సు గలవే. ఒక పంతులుగారూ, భార్యా తప్ప మండువాలన్నీ వర్షాకాలంలో జలమయమయిపోతాయి. నీరవతలికిపోయే తూములు పూడిపోవడం వల్ల. అందుచేత ఆ ఇంట్లో కర్రసామానులు అసలు వయస్సుకంటే ముసలివిగా కనిపిస్తాయి.

పంతులుగారి తండ్రిది పెద్ద జమీ. తన చిన్నతనంలో ఆ ఇంటికోత చూసిన గుర్తుంది ఆయనకు. అంటే, వివరాలన్నీ గుర్తుంచుకోగల వయస్సు

ఆయన కొచ్చేసరికి. జమీ పోవడం తండ్రి మరణించడం. మిగిలిన ఒక్క మామిడితోటమీదా వచ్చే ఆదాయంతో తను బతకడమేకాక. అంతపెద్ద ఇంటి బాగోగులు చేయించడం వంటి మార్పు అన్నీ అకస్మాత్తుగా వచ్చి పడ్డాయి. అంచేత చిన్ననాటి స్మృతులు—అంటే ఆ యిల్లు మూడు పువ్వులూ ఆరు కాయ లుగా ఉన్న రోజుల స్మృతులు— ఎప్పుడో కలలో కనిపించిన దృశ్యాల్లాగ ఆయనకు జ్ఞాపకం ఉన్నాయి.

భార్య రోగిష్టి. ఆయనే వండి. తను తినవలసిన స్థితి. ఆయనకు కాలక్షేప మల్లా సోమసుందరంగారితో. వెనకటి కబుర్లు చెప్పుకుంటూ కూచోడు. సోమ నాథం పంతులుగారికంటే పదేళ్ళు పెద్ద— అంచేత ఆ ఇంటి సితిసంపదలు. పంతులు గారికంటె. స్పష్టంగా చూసివారాయన ఆయనకు పంతులుగారంటే నిజమైన అను రాగం—ఆ ఇంట పుట్టినందుకు భక్తి కూడా.

పంతులుగారంటే ఆ ఊళ్లో అందరికీ భక్తే. స్థితిగతులు ఎలాంటివైనా ఆయన ఔదార్యం అందరూ గుర్తించిన వారే. నడివయస్సులో ఆయన ఆ ఊరికి మకుటం లేని రాజు నూటికి తొంభై పంతులు తగాదాలన్నీ ఆయనముందు పరిష్కారమై పోయేవి.

పంతులుగారి మనసు ఎంత మంచిదో. పేరు అంత పెద్దది. అది ఆ ఊళ్ళో అందరికీ తెలిసిన విషయమే గనక ఎవరూ అట్టే పట్టించుకోరు. ఎవరన్నా కావి పనిచేస్తే వాళ్ళ ఇంటికి వెళ్ళి. ఏమయ్యా. నువ్విలాంటి పని ఎందుకు చేశావు అని కర్ర విరిచినట్లు అనేసేవాడు. ఆయన మీద భక్తివల్ల ఆ ఆసామీ ఏమీ అన లేక పోయేవాడు. అంచేత కావి పనులు చెయ్యడానికే జడిసేవారు ఆ ఊరి జనం.

అయితే క్రమంగా రోజులు మారాయి: ఆయనకు తెలీకండానే ఆయన పలుకు బడి తగ్గిపోయింది. ఆ సంగతి చూచా యగా ఆయనకు తెలిసినా. అది గుర్తించ డానికి ఆయన మనస్సు ఒప్పుకోలేదు. కారణం. యీ తరం కుర్రవాళ్లెవరూ ఆయన పుట్టు పూర్వోత్తరాలు ఎరగరు. పైగా పైనుంచి వచ్చిన కుటుంబాలు కొన్ని ఆ ఊరికి కొత్తగా వచ్చిన పంచ దార ఫ్యాక్టరీకి సంబంధించినవి. అసలీ ఊరి సంగతిగాని. ఆ నాలుగు మందు వాళ భవంతి విషయంగాని ఎరగరు. అంచేత వాళ్ళకి ఆయనమీద గౌరవం ఉండడానికి అవకాశాలు తక్కువ. ఆయన క్రమంగా ఊరి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోడం మానేశాడు. అంచేత ఆయన మాట కాదనిపించుకునే పరిస్థితి రాలేదు. ఆయన తప్పించుకున్నాడనండి. కాని. ఆయనలో ఒకమూల యీ ఊరి కింకా మకుటంలేని రాజుననే భ్రమ చచ్చి పోలేదు.

ఆయనకు పెద్ద సమస్య ఆయన

యువ

కొడుకు రంగయ్య. రంగయ్య ఇప్పు డెక్కడో ఉత్తరాదిని ఉద్యోగంలో ఉన్నాడు. రంగయ్య తన తాతగారి సంగతి విశదమేగాని చూపినవాడుకాడు. అతను పుట్టినప్పటినుంచీ దారిద్ర్యంతప్ప మరొకటి ఎరగడు. అంచేత తన తండ్రీ, సోమనాధంగారూ కలిసి వెనకటి కబుర్లు ఏకరువు పెడుతూంటే అవన్నీ పట్టి కట్టు కథలను కునేవాడతను. వీళ్లైనప్పు డల్లా సోమనాధంగారిని వేళాకోళం చేస్తుండేవాడు. తండ్రిని ఏమనడానికీ సాహసం చాలక.

ఒకసారి రంగయ్య చిన్నతనంలో ఒక సంగతి జరిగింది. తోడిపిల్లలతో కలిసి అతను చెడుగుడు ఆడుతుండగా, ఒక సంపన్న గృహస్థు కొడుకు కూత కొస్తే, అతన్ని కిందపడేసి, గుండెల మీదెక్కి కూర్చున్నాడు ఆ సంపన్న గృహస్థు సరదాగా ఆట చూస్తున్నవాడు పట్టరాని కోపమొచ్చి, రంగయ్యని ఏడు తరాలు అటూ ఇటూ తిట్టరాని తిట్లు తిట్టాడు. రంగయ్య అన్నింటికీ ఒక చిరునవ్వు సమాధానంగా పారేశాడు.

ఈ సంగతి పంతులుగారికి తెలిసింది. ఆయన ఇంట్లో ఉన్న పాత తుపాకీ తీశాడు. భార్య అడ్డుపడటబోతే ఆమెను పక్కకీడ్చేసి గుమ్మంలో కొచ్చారు. అక్కడ కూర్చున్నాడు. ఇంతవరకూ ఆ తిట్టిన సంపన్న గృహస్థుమీద తుపాకీ పేలుస్తాడనుకున్న భార్య అతనక్కడ కూర్చోవడం చూసి బెదిరిపోయింది.

ఇంటికి రాని చవట పీనుగని. పెద్దల్ని తిడుతుంటే ఏం చెయ్యకుండా ఇంటికి తిరిగొస్తాడా. ఒక్క గుండు దెబ్బతో యీ అగమానాన్ని తుడిచిపెట్టే స్తాను.....అని అరిచాడు. భార్య కెవ్వున కేకేసి మూర్ఛపోయింది. సోమనాధం గారూ, ఇరుగు పొరుగువాళ్ళూ వచ్చి వారించడానికి ప్రయత్నించారు. కాని లాభం లేకపోయింది

అయితే రంగయ్య మాత్రం ఇంటికి తిరిగిరాలే. ఈ సంగతి అతనికెలాగో తెలిసింది గాబోలు. చీకటిపడ్డ తరవాత పంతులుగారి కోపం ఆదుర్దాగా మారింది. ఇంకా రాలేదేం యీ పీనుగ....అన్నాడు సోమనాధంగారితో.

పోనీలెండి, రాకపోతేనేం, ఎక్కడో ఆత్మహత్య చేసుకుని ఉంటాడు. చెరువు లున్నాయి, రైలుంది....అన్నాడు కొంటెగా సోమనాధం.

చాల్లేవయ్యా, ఏమిటీ అపశకునం మాటలు? అన్నాడు పంతులుగారు. ఏమీ లే—ఇంటికొస్తే మీరెలాగా కాల్చేస్తారు. అంచేత ఏ చావైతేనేం?

ఆ తరవాత సోమనాధం, పంతులు గారూ కలిసి ఊరంతా గాలించారు. రంగయ్య జాడలేదు. ఆనాడు అంతర్థాన మైన రంగయ్య అయిదు సంవత్సరాల

తరవాత మిలిటరీ దుస్తుల్లో ప్రత్యక్షమయాడు.

అప్పుడు సోమనాథంగారన్నారు.... ఆవేళ మీరు భయపెట్టింకొక మిషగాని, ఏదో పాత చూసుకుని అబ్బాయి వెళ్ళిపోయేవాడే.... అని.

రంగయ్య తన తండ్రి తన్ను చంపడానికి తీసిన తుపాకీ తెరిచి చూశాడు. పకపక విరగబడి నవ్వాడు. ఆ తుపాకి తుప్పుపట్టి పోయింది. లోపల గొట్టం అంతా పూడిపోయింది. అది పంతులుగారి తండ్రిగారు ఉపయోగించేవాడు వెనకటి రోజుల్లో. అయినా ఇది పాతకాలపు తుపాకి... అన్నాడు రంగయ్య.

ఏడిశావు. దీంతో మీ తాతగారు రెండు పెద్దపులుల్ని చంపారు.... అన్నాడు పంతులుగారు.

అయుండొచ్చు అయితే ఇప్పుడిది పిల్లిని కూడా చంపలేదు. మా పిస్టలు చూశారా. దానికంటె ఎంత చిన్నదో. ఇది పేల్చామంటే ఇంక తిరుగులేదు.... అన్నాడు రంగయ్య.

పంతులుగారు పాత తుపాకిని అప్యాయంగా నిమిరాడు. దాంట్లో తాత తండ్రుల ప్రభావం ఒక్కసారి ఆయన రక్తనాళాల్లోకి పాకినట్లు అనిపించింది. కాని అది వల్లని గడ్డకట్టుకుపోయిన ప్రభావం అది పేలదు. కొడుకు చేతితో చిన్న పిస్తోలు చేత్తో పట్టుకు చూశాడు. అది ప్రాణంలో బరువెక్కిపోయినట్లుంది. ఈ పాత కొత్తల మధ్య అంతరం అకస్మాత్తుగా ఆయనకు పెద్ద దెబ్బలాగ మనస్సులో తగిలింది. వెనకటి రోజుల ప్రభావం జీవచ్ఛవం లాంటిది. బరువేగాని కదలిక లేనిది. ఈ కాలపు కొత్త శక్తి చిన్నదైనా చురుకు మెదులుతుంది. వింతగా. రెంటికీ ఆ ఆయుధాలు రెండూ చిహ్నాలుగా అనిపించాయి ఆ క్షణంలో పంతులుగారికి.

రంగయ్య తల్లిని బుజ్జగించాడు. తండ్రితో తనవాని గురించి చర్చించాడు. ఈ పాత ఇంట్లో మిగిలిన గది ఒకటే. ఇంక కొద్ది రోజుల్లో కూలిపోతుంది. అంచేత తనతో ఎద్దనీ ఆగ్రా తీసుకుపోడానికి నిశ్చయించానని చెప్పాడు. ఈ ఇల్లు ఎవరికైనా అమ్మేసి వెళ్ళిపోదామన్నాడు. వద్దని చెప్పడానికి కూడా మనసు రాలేదు పంతులుగారికి

అర్ధరాత్రి వేళ పిస్తోలు మోత రంగయ్యని లేపింది పరుగెత్తి వెళ్ళాడు పడమటి వరండాలో పంతులుగారి శరీరం రక్తపు మడుగులో పడి ఉంది. ఆయన చేతిలో తన పిస్తోలుంది.

చూస్తూ అలాగే నిలబడి పోయాడు రంగయ్య.






నేనీ యింట్లో చేరి యివాల్టికి రెండు సంవత్సరా లయింది. ఈ యింట్లో నేను కసువు వూడుస్తున్నాను; అంట్లు తోముతున్నాను. తీరిక సమయాల్లో పిల్లలను యెత్తుకుని ఆడిస్తున్నాను. నీళ్ళు కాయటం, మొదలైనవన్నీ నేనే చేస్తున్నాను. మా యజమానురాలు పనిమీద ఉంటే కూరలు మొదలైనవన్నీ నేనే కోస్తూంటాను. నిజం చెప్పాలంటే ఈ యింట్లో నేను చెయ్యని పని అంటూ లేదు.

నేను పని బాగా చెయ్యగలిగిందాన్నే. ఏదన్నా ఎక్కువపని చెప్పినా, "మొదట్లో ఈ పని మనం అనుకోలేదు" అని అనే దాన్ని కాదు; అనుకునేదాన్ని కూడా కాదు. మిగిలిన పనులు చేసినట్లే చేసేదాన్ని. నాకు ఈ పనులన్నీ చేసి, బట్టలు ఉతికి నందుకు ప్రొద్దున అన్నం పెట్టి ఎనిమిది రూపాయలు యిచ్చేవాళ్ళు. సరిగ్గా నేను పనిలోకి ప్రొద్దున్నే ఏడుగంటలకల్లా వెళ్ళేదాన్ని. పనిపాటలు అన్నీ పూర్తి అయింతర్వాత పిల్లల్ని యెత్తుకు తిప్పే దాన్ని. పదిగంటలకు అయ్య భోజనం చేసి, ఆఫీసుకు వెళ్ళేవారు. పిల్లలందరూ అదే టైమ్‌కు భోజనాలు చేసుకుని స్కూళ్ళకు వెళ్ళేవాళ్ళు. ఇంక చంటి పిల్లలు యిద్దరు మిగిలేవాళ్ళు. అయ్య వెళ్ళిన తర్వాత నేనే చంటిపిల్లలను ఇద్దర్నీ పెట్టుకు కూచుంటే అమ్మ అప్పుడు స్నానంచేసి, ఉతికిన బట్టలు కట్టుకుని భోజనానికి కూర్చునేది. ఆమె భోజనం ముగించివచ్చి నన్ను అన్నం తినమనే వరకూ, రోజూ పదిగంటలయ్యేది. నాకు మొదట్లో కష్టం నిపించేది కాదు. కాక పోతే తొమ్మిదిగంటలయ్యాం దగ్గరనుంచి ఆకలయ్యేది. అయితేనేం? ఆకలి అవగానే యేదో వొకటి తినాలనిపించేది కాదు. ఆకలి అయితే అవుతుంది అంతే. అది యెప్పుడూ అవుతూనే ఉంటుంది. కాక పోతే కాళ్ళు ముడుచుకొని కూర్చుంటే సరిపోయేది.

నా కళ్ళముందు నాకు ఆకలి అయ్యేటప్పుడు వాళ్ళు చిరుతిండ్లు తింటున్నా, నాకు తినాలనిపించేది కాదు. కానీ కాలం గడిచినకొద్దీ నా బుద్ధి మారింది. వాళ్ళు చిరుతిండు తిన్నప్పుడల్లా నాకూ తిన బుద్ధి అయ్యేది. ఈ మార్పుకు కారణం ఏమిటో, ఎందుకొచ్చిందో నేను చెప్ప లేను.

నేను ఈ యింట్లో పనిచేసుకుని నా యింటికి వెళ్ళేప్పటికి, ఎప్పుడూ రాత్రి ఎనిమిదిగంటలకు తక్కువ అయ్యేది కాదు. నేను వెళ్ళేటప్పటికి మా అమ్మ యింకా వచ్చేదికాదు. మా అమ్మ వొక పెద్దయింట్లో పనిచేస్తూ వుండేది. రాత్రుళ్ళు వాళ్ళు అన్నాలు పూర్తి అయ్యేటప్పటికి యే పదిగంటలో అయ్యేది. అప్పుడు వాళ్ళు తినగా మిగిలిన అన్నం పట్టుకుని మా అమ్మ వచ్చేది. ఈలోగా నేనే కుండలు కడిగి అన్నం వండేదాన్ని. గొడ్డుకారం వేసుకుని యింత తిని పడుకునేదాన్ని. ఒక్కొక్కప్పుడు నిద్ర ఆపుకోలేక, వొచ్చినదాన్ని వచ్చినట్లే పడి నిద్రపోయేదాన్ని. మా అమ్మ పని ముగించుకుని వచ్చి, అక్కడ మిగిలిన అన్నం యేమన్నా వుంటే నన్ను లేపి రెండుముద్దలు తినిపించేది; లేకపోతే లేదు. తనూ నా ప్రక్కనే చెంగు పరుచుకొని పడుకుని నిద్రపోయేది.

తెల్లవారి ఐదుగంటలకు లేచి, నన్ను లేపి, తను పనిలోకి వెళ్ళేది. నేను యిల్లు వూడ్చి, కుండలు కడిగి, ఏడు గంటలకల్లా నే పనిచేస్తున్న యింటికి వెళ్ళేదాన్ని. ఎప్పుడన్నా మా అమ్మ లేపి నప్పుడు లేచి, మా అమ్మను బయటకు వెళ్ళనిచ్చి, మళ్ళా పడుకుని నిద్రపోయేదాన్ని. ఏ ఎనిమిది గంటలకో నిద్ర మెలుకవ వచ్చేది. గుండె గుభేలుమనేది. అదరాబాదరా పనిలోకి వెళ్ళేదాన్ని. ఇక యజమానురాలికి ఏం చెప్పి ఏం లాభం? "తెల్లవారి లేవగానే నరాలు ఒకేపెట్టున లాగినై. లేవలేకపోయాను" అని చెప్తే ఆమె వింటుందా? "నేను నిద్రపోయాను. ఎందుకు పోయానో నాకే తెలియదు" అంటే వూరుకుంటుందా? "ఈ పని అంతా ఎవరు చేస్తారనుకున్నావే. నీ తాత గాడు చేస్తాడనుకున్నావా?" అంటుంది. "ఇల్లు చూడు. యెలావుందో — ఈ పిల్లల్ని యెవరు చూస్తారనుకున్నావ్ నీ అబ్బ!" అంటుంది. "ఇలా అయితే కుదరదు. రేపటినుంచి రాకు. ఇంకొక పనిమనిషిని చూసుకుంటాం. మాకు పని మనుష్యులే దొరకరనుకున్నావా? పని మనుషులు దొరక్క నిన్ను పెట్టుకున్నాం అనుకున్నావా?' అని నానామాటలూ అంటుంది. నేను ఏమన్నా మాట్లాడకుండా వూరుకునేదాన్ని. తప్పు నాదే అనిపించేది. ఏడుగంటలకు వస్తానన్నాను, రాలేకపోయాను. ఎవర్నని ఏం ప్రయోజనం? ఏమన్నా తలవంచుకుని పని చేసుకునేదాన్ని. అది తప్పే అయ్యేది. "బెల్లం కొట్టిన రాయల్లే పలుకవేమే!" అనేది యజమానురాలు, "దున్నపోతుమీద వాన పడ్డట్టే" అనేది. "ముంగి. అన్నీ కడుపులో పెట్టుకొని చెయ్యదలచింది చేసి వూరుకుంటుంది" అనేది అనని యీ తప్పు నాది అనుకునేదాన్ని నేను కానీ క్రమ క్రమేణా నా బుద్ధి మారింది .... మళ్ళీ యెదురుతిరిగి మాటలు అన బుద్ధి అయ్యేది. ఈ మార్పుకు కారణం ఏమిటో ఎందుకు వచ్చిందో నేను చెప్పలేను.




ఈ మార్పు వచ్చినప్పటినుంచీ అనేక ఆలోచనలు నాలో కదుల్లాడ మొదలు పెట్టినై. ఎక్కడ నుంచి వచ్చినయ్యో ఈ ఆలోచనలు! అంతకు ముందు ఏమైనయ్యో! పొద్దున చేసిన చిరుతిండి అయ్యకు నాతోనే పంపేది. ఆ చిరుతిండి చూస్తే నాకు తినబుద్ధి అయ్యేది మొదట్లో ఆ యింట్లో చేసుకున్న కూరలు నాకు రుచించేవిగాదు! నా పచ్చడి మెతుకులే నాకు బాగుండేవి అక్కడ అన్నంతిన్నా. ఇంటికి వెళ్ళి మళ్ళీ పచ్చడి మెతుకులు తినబుద్ధి అయ్యేది. తినేదాన్ని కూడా. ఇప్పుడు కూరల రుచి తెలిసింది. తాలింపు వేస్తూంటే నోరూరుతుంది ఒకవేళ నాకు యివన్నీ వేసి పెడతావని. నేను పనిలో చేరినప్పుడు అనకపోయినా, నా యజమానురాలికి ఈ మాత్రం దయ ఎందుకు లేదా అనిపించేది.

నేను చిన్నదాన్ని. ఇన్ని రకరకాల వంటకాలు చూస్తూ, తినేవాళ్ళకు చేర వేస్తున్నాను కదా! నాకూడా తినాలని వుంటుందని యెందుకు అనుకోదో నా యజమానురాలు! నాకు పెడితే యేం పోయిందో! పిల్లలకు పెట్టిన చిరుతిండ్లు వారు సరిగా తినవే తినరు. యిటుకెలికి, అటుకెలికి పారవేస్తారు. అంతా యెత్తి

నేను పారవెయ్యాలి. ఆ ప్లేట్లన్నీ నేను కడగాలి. అప్పుడు నాకెట్లా వుంటుంది? మనస్సులో ద్వేషం పెరుగుతుందంటే యెందుకు పెరగదు? పారవెయ్యనన్నా పారవెయ్యవచ్చు గానీ. నాకు పెట్టకూడదు నాకూ తినాలని వుంటుందనీ. పారవేసే బదులు నాకు పెట్టవచ్చనీ నా యజమాను రాలికి తట్టినట్లే కనబడదు. అసలు ఆమె నన్నుగురించి ఏమనుకుంటూ వుందో? నేను మనిషినని ఆమెకు తెలుసున్నట్లే లేదు. నేను మనిషిననే అని ఆమెను నమ్మించటం ఎట్లా"

నేనిట్లా కళ్ళుపోతూంటే యే వంటి గంటకో పిలిచేది నా యజమానురాలు. "అన్నం తీసుకు వెళ్ళి తినవే" అని. ఏ మన్నం అది—వాళ్ళు రాత్రి తినగా మిగిలిన అన్నం! రాత్రి మిగిలిన యే పులుసో యింత వేసివుండేది! అంతకు ముందు యింట్లోవాళ్ళందరికీ. ఉప్మాలూ. ఇడ్డెన్లూ నేను చేసి వేశాను చేతితో వేయించిన యిగుర్లూ. పులుసులూ వడ్డించాను. వాళ్ళు విస్తళ్ళలో సగానికి సగం వదిలేశారు. అవన్నీ ఎత్తేశాను. తీరా ఒంటి గంటవరకూ ఆకలి ఆపుకుని అన్నం తినాలనిపించేవరకూ నిన్న రాత్రి వండిన అన్నం! అందరూ తినగా మిగిలిన అన్నం! నీళ్ళు కారుతున్న అన్నం! ఆ అన్నం చూడగానే కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగేవి. పోనీ ఈ అన్నమే నేను రాగానే పెడితే. నా యజమానురాలికి పోయేది ఏముంది? వాళ్ళు ఒకసారి చిరుతిండి తిని. మళ్ళీ అన్నాలు ముగించుకుని అప్పుడా ఈ అన్నం నాకు పెట్టేదేముంది గానే పెడితే. ఆవిడకుపోయేది ఏముంది? కానీ పెట్టదు. ఒకవేళ వాళ్ళు ముందుగా భోజనాలు ముగించుకున్నా. నేనీ అన్నం కోసం ఒంటిగంటదాకా ఉండవలసిందే. అంతగా కాలం గడవకపోతే ఆవిడ వొక్క గుక్కెడు విదపోయవస్తుంది. ఎందుకిట్లా చెయ్యటం?

నేను ఉండబట్టలేక. ఒకరోజు నా యజమానురాలిని అడిగాను: "ఆకలి అవుతూవుంది. ముందుగా అన్నం పెట్టమని ఈ మాటకు ఆమె ఇంతఎత్తునలేచి. "ఎంతపొగరేనీకు? నేము తినకముందు నీకు పెట్టాలా? ఇంట్లో తిని బలిసి వొంటికి కావరం పట్టిందే నీకు! ఇక నిన్ను వొక్క క్షణం వుంచుకోను. పో యిక్కడనుంచి" అని ఇంట్లోంచి తరిమి వేసింది.

నేను కాళ్ళీడ్చుకుంటూ నా గుడిసెకు వెళాను. ఎక్కడనించి వచ్చిందోనిద్దుర: నేలమీదపడి మొద్దు నిద్దురపోయాను. రాత్రి ఎప్పుడో మా అమ్మవచ్చి లేపింది. నేను జరిగినదంతా చెప్పాను. మా అమ్మకు యెక్కడలేని కోపం వచ్చింది. "ఓసి నీ తాడు తెగ! వాళ్ళు యెప్పుడు పెడితే అప్పుడు తినక నీ కేం రోగం వచ్చిందే! వాళ్ళతోపాటు పెట్టమంటావటే నీకు? నా రెక్కల కష్టం నాకే సరిపోవటంలేదు ఇక నిన్నెక్కడ పోషించేపే నేను? చావు....చావు" అని చితకగొట్టింది కొట్టి కొట్టి తనూ అపుర్నఏడ్చింది....నన్ను కావులించుకొని.... "దేవుడెందుకు తీసుకుపోడే మన బోటి వాళ్ళని" అని గుండె పగిలేట్టు ఏడ్చింది.

# "మేడ్ ఫర్ ఈచ్ అదర్"

- యర్రంశెట్టి శాయి

బ్యూటీస్ క్లబ్ వాళ్ళు "మేడ్ ఫర్ ఈచ్ అదర్" పోటీలు నిర్వహిస్తున్నారన్న వార్త మా ఊరంతా దావానలంలా వ్యాపించి పోయింది ఆ ఊళ్ళోని ఏ భార్యాభర్తల జంటయినా అందులో పాల్గొన వచ్చుననీ, ప్రవేశ రుసుం ఏమీలేదనీ. ఎన్నికయిన జంటకు మంచి నగదు బహుమతీ, ఆలిండియా టూరూ ఏర్పాటు చేయబడునని స్టేట్ బాంక్ దగ్గిర గోడమీద అంటించిన ఓ పోస్టరులో చదివాను బజారునుండి అన్ని ఆఫీసులకు దారి అదే కావడంవల్ల నాతో పాటు మా ఆఫీసులోని స్టాఫంతా ఆ కాగితం చదివేశారు. ఆ రోజంతా అదే చర్చకూడా జరిగింది ఆఫీసులో. 'రెండు వేల రూపాయలు బహుమతంట" అన్నాడు రత్నారావు మొదటి పుకారు గాలిలోకి వదుల్తూ, రాజారావునీ. అతనిభార్యనూ మా ఆఫీసు తరపున ఆ పోటీలో పాల్గొనమని కోరారు కొంతమంది. వాళ్ళను బలపర్చిన వాళ్ళల్లో నేను ఒకణ్ని రాజారావు కాలేజివదలి క్రొత్తగా సర్వీసులో చేరిన యువకుడు. సరిగ్గా సంవత్సరం క్రితమే అతనికి వివాహమయింది. పెళ్ళికి మా ఆఫీసంతా హాజరయింది. అబ్సెంటూ, లేట్ లేకుండా పెళ్ళిలో అందరూ రాజారావునీ, అతని భార్యనూ చూసి 'చక్కని, అందమయిన జంట!" అని బోలెడు సార్లనుకొన్నారు అనుకొని వదలక ప్రక్కవాళ్ళతోకూడా అవుననిపించారు. నాకూ నిజమేననిపించింది. రాజారావుకి మంచి పర్సనాలిటీ ఉంది. మొఖాన్న ఎప్పుడూ చిరునవ్వుతప్పితే మరోభావం కనిపించదు. తెల్లని అతని పాలభాగంపై ముంగురులు ఎప్పుడూ పరిగెడతుంటే చూడ్డానికి ఎంతో ముచ్చటగా ఉండేది. అతని భార్య అతనికంటె అందంగా ఉంది.

అయితే మా ప్రపోజల్ విని ఏమీ ఉత్సాహం చూపకుండా మామూలుగానే చిరునవ్వు నవ్వి పైళ్ళు చూసుకోసాగాడు రాజారావు.

"ఏమంటావోయ్!" అన్నాన్నేను అంతటితో వదలక.

"ఎందుకండీ; ఇవన్నీ........నాకేమంత ఇష్టంలేదు........" అన్నాడు నాన్చుతూ.

"తప్పేముంది గురూ! అర్హతఉండీ

అలా చదుస్తా వెందుకూ? వాళ్ళు చూసే అందం, అన్యోన్యతా, ఆకర్షణ మీ ఇద్దరిలో బ్రహ్మాండంగా ఉన్నాయి. సాధారణంగా మీలాంటి భార్యా భర్తలు అరుదుగా కనిపిస్తారు. భర్త అందంగా ఉంటే భార్య వికారంగా ఉంటుంది. వైస్‌వర్సా ...మరి ఈ ఎడ్వాంటేజ్ ఎందుకు ఉపయోగించుకో కూడదు?...." రత్నారావు అడిగాడు.

"నా మిసెస్‌ని కూడా కన్సల్ట్ చెయ్యాలండీ! ఆవిడ వప్పుకుంటుందో, వప్పుకోదో........" అన్నాడతను.

"భలేవాడి వోయ్! వప్పుకోడానికి ఇందులో ఏం తప్పుందనీ? ఒహవేళ వప్పుకోకపోతే మేమందరం వచ్చి నచ్చ చెబుతాంలే. నువ్వు అందులో ఎన్నికయితే మన ఆఫీసుకే గర్వ కారణం కదుటోయ్!" అంటూ దబాయించాడు రమణ.

నేనూ, రమణా, మిగతా కొంత మందీకలసి రాజారావు ప్రమేయం లేకుండానే అతని పేరు పోటీల్లో ఇచ్చేము

సత్తిరాజు తనూ పోటీ చేస్తానన్నాడు. ఎంచేతంటే తనూ వాళ్ళావిడా అంద వికారంగా బావుంటారట

పోటీ రోజు రానేవచ్చింది. పోటీ చూడ్డాని కొచ్చేవాళ్ళకు టిక్కెట్టు పెట్టడం చేత మా ఆఫీసునుంచి ఇద్దరు ముగ్గురం తప్పితే మిగతా వారెవ్వరూ రాలేదు.

పోటీ జంటలన్నీ అక్కడే గార్డెన్‌లో తిరుగుతున్నారు ఒకరినొకరు పలుకరించు కొంటూ. అదికూడా ఓ పరీక్షట రాత్రి ఎనిమిది దాటాక స్టేజిదగ్గరకు చేరుకొన్నారందరూ. ఒక్కొక్క జంటా స్టేజిమీద కనబడాలిట. మైకులో పేర్లు చదువుతున్నారు వరుసగా. నా భార్య జయ అందరినీ పరీక్షగా చూస్తూ తను స్వతంత్రంగా అందరికీ మార్కులు వేస్తోంది.

"ఏంటి మమ్మీ, పిన్నాకవి ఇక్కడికి తీసుకొచ్చావ్?" అంటూ మా జానకి మారాం మొదలుపెట్టింది.

"ఏయ్! గొడవచెయ్యకు!" అన్నాను కోపంగా.

రాజారావూ, అతని భార్యా స్టేజిమీద కొచ్చారు. అంతవరకూ కనబడినవాళ్ళల్లో వీళ్ళదే పైచేయి అనిపించింది నాకు. మెల్లిగా జయ మార్కులపట్టీ వంక చూశాను. ఎనభై శాతం మార్కులేసింది. లిస్టులో అదే పెద్దమొత్తం. క్లబ్ సెక్రటరీ అంతా అయిపోయాక క్లబ్బుగురించీ, ఈ పోటీ ఏర్పాటుచేయడానికి తామెందుకు తలచుకొందీ, దీనికయే ఖర్చు ఎవరు భరిస్తోందీ, అంతా సవిస్తారంగా విన్నవించాడు. ఆ పోటీ న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించినవారిని సభకు పరిచయం చేసి వారిని ఆ పోటీ ఫలితాలు తెలుపవలసిందిగా కోరాడు ఒక నిర్ణేత స్టేజిమీదకు వచ్చి రాజారావు పేరు చదివాడు. ఆ ప్రదేశమంతా చప్పట్లతో మార్మోగి




పోయింది.

రాజారావు, అతని భార్యా వేదికమీద కొచ్చి అందరికీ నమస్కరించారు.

“డాడీ! రాజారావు మామయ్య కదూ?” ఆశ్చర్యంగా అడిగింది జానకి.

“అవును!”

“మరి అక్కడ నుంచున్నాడెందుకూ?”

“అతను పోటీ గెలిచాడు!”

“ఏం పోటీ?”

“మేడ్ ఫర్ ఈచ్ అదర్!”

“అంటే?”

“అంటే....” బుర్ర గోక్కున్నాను. ఎలా చెప్పాలో తెలియలేదు.

“అంటే దేముడు వాళ్ళిద్దరినీ ఒకరి కోసం ఒకరిని సృష్టించాడు ...మామయ్య కోసం అత్తయ్యనీ. అత్తయ్యకోసం మామయ్యనీ....”

ఇంకేదో చెప్పాలనుకొన్నాను గానీ ... కుదరలేదు. నా అవస్థ చూసి జయ నవ్వేసింది.

జానకికేమీ అర్థమయినట్లు లేదు. సిన్మాకెప్పుడెల్దామంటూ మారాం మొదలు పెట్టింది.

“నే చెప్పలే! ఖచ్చితంగా వీళ్ళే గెలుస్తారనీ?” అంది జయ.

అందరూ రాజారావు దంపతులను అభినందిస్తున్నారు. నేనూ జయాకూడా వెళ్ళాము.

“ఏమోయ్! నే చెప్పలే! అవ్వే వద్దు సార్ అన్నావుగా! ఇప్పుడేమంటావ్?” అన్నాను నవ్వుతూ.

జవాబివ్వకుండా చిరునవ్వు నవ్వా డతను.

మర్నాడు మా ఆఫీసంతా చాలా కోలాహలంగా ఉంది. అందరూ రాజారావు కోసం ఎదురుచూస్తున్నారు.

“పార్టీ ఇవ్వాల్సొస్తుందని ఎగ్గొట్టలేదు గదా?” అనుమానంగా అన్నాడు

రమణ.

"ఎన్నాళ్ళని అలా తప్పించుకో గలడు?" సత్తిరాజు అన్నాడు.

ఆరోజు రాజారావు ఆఫీసుకి రాలేదు. ఆఫీసుకి లీవ్‌లెటర్ పంపించాడు. అందరూ చాలా నిరుత్సాహపడిపోయారు.

"బహుశా వాళ్ళిచ్చిన చెక్ ఇవాళ 'కాష్' చేస్తున్నాడేమో!" అని సరిపెట్టు కొన్నారు కొంతమంది.

మర్నాడు అతను రావడంతోనే అందరూ చుట్టుముట్టేశారు కంగ్రాచ్యు లేషన్స్ అంటూ.

"అందరూ శేషగిరి హోటల్‌కి పదండి! రాజారావు ఈ సంతోషమయిన సమయంలో అందరికీ ఘనమయిన పార్టీ ఇస్తాడు!" అంటూ అరిచాడు సత్తి రాజు.

అందరూ హోలోమని హోటల్లో దూరిపోయారు.

స్వీట్లు హాట్లు ఎగిరిపోయినయి.

బిల్లు చెల్లించి బయటపడ్డాడు రాజారావు.

ఆ పైై ఆదివారంనుంచి టూర్‌కి పంప డానికి క్లబ్ నిర్ణయించిందని తెలియజేశా డతను. భారత దేశంలోని అందమయిన ప్రదేశాలు రైల్లో తిరిగి చూడాలిట. ఫస్ట్ క్లాస్ ఛార్జీలు—మిగతా ఖర్చులూ—అంతా క్లబ్ వారిదే.

అతను టూర్‌లో ఉన్నప్పుడే అతనికి ట్రాన్స్‌ఫర్ అయింది. అందరికీ చాలా విచారం కలిగింది అతను వెళ్ళిపోతున్నం దుకు. ఘనమయిన సెండాఫ్ పార్టీ ఏర్పాటుచేశారు. అతను వెళ్ళిపోయాం తర్వాత చాలా కాలంవరకూ ఎవ్వరికీ గుర్తులేదు. సంవత్సరం అవగానే తిరిగి బ్యూటీస్ క్లబ్‌వారు 'మేడ్‌ఫర్ ఈచ్ అదర్' పోటీలు నిర్వహించారు. ఆరోజు అందరం రాజారావుని తలుచుకొన్నాం. ఆరోజే ఆఫీసు పనిమీద నేను విజయవాడ వెళ్ళటం తటస్థించింది రాత్రి అలంకార్ ఎయిర్ కండిషన్డ్‌లో భోజనం చేసి బయటికొస్తూండగా రాజారావు లోపలి కొస్తూ ఎదురయ్యాడు.

"హలో రాజారావ్!" అన్నాను ఆనందంగా.

నన్ను కౌగలించుకొన్నంత పని చేశా డతను.

"ఏమిటోయ్ విశేషాలు!" అన్నాను. "ఈమె ఎవరు?" అనడిగాను అతని ప్రక్కనే ఉన్న ఓ స్త్రీని ఉద్దేశించి. ఆమెను అంతకు ముందు నేను చూడ లేదు.

"అన్నట్లు మీకు పరిచయం చేయనే లేదు... రజనీ! ఈయన నేను మొదటి పనిచేసిన ఆఫీసులో హెడ్‌క్లార్క్. పేరు విఘ్నేశ్వరరావు. ఈమె నా మిసెస్ సార్!"

"నమస్తే!" అందామె చిన్నగా.

నా కంతా అయోమయంగా ఉంది. మౌనంగా ఆమెకు ప్రతి నమస్కారం చేశాను.



''ఒక్కసారిటు వస్తావూ!'' అన్నాను రాజారావుతో.

''మీరడగబోయేదేమిటో నాకు తెలుసు. నా అసలు భార్య సుందరి ఏమయిందా అని. ఇక్కడికొచ్చిన క్రొత్తలోనే ఇద్దరం విడాకులు తీసుకున్నాం సార్! మాకు పెళ్ళయిన దగ్గర్నుంచీ కూడా ఏమాత్రం సరిపడేది కాదు. ఎప్పుడూ కొట్లాటల్లోనే రోజులు గడుస్తుండేవి. ఏమయితేనేం, ఇద్దరం చదువుకొన్న వాళ్ళం కాబట్టి త్వరలోనే మేల్కొని విడిపోయాం. తర్వాత ఈ మధ్యనే రజనిని చేసుకొన్నాను....''

అతను సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"నేను నడుస్తున్నానేగాని మనసు మనసులో లేదు. ఏదో అనుకోని సంఘటన జరిగినట్లు, అందులో నాకూ భాగమున్నట్లు అనిపించసాగింది.

'షేడ్ ఫర్ ఈచ్ అదర్!'' పోటీ గుర్తుకొచ్చింది నాకు. వెన్వెంటనే గట్టిగా నవ్వేశాను.

# ఆత్మవంచన

ఆదివారాలు గడపడం చాలా కష్టమైన విషయం అని నా అభిప్రాయం. అందరూ ఆదివారం ఎప్పుడొస్తుందా అని సోమవారం నుంచే ఎదురుచూస్తుంటారు. కాని నాకు మాత్రం ఆదివారం రావడం కొంచెం బాధగానే ఉంటుంది. ఆఫీసులో గడిచినట్లుగా టైము ఇంటిదగ్గర గడవదు. అందుచేత ప్రొద్దుటినుంచి సాయంకాలం దాకా ఏంచెయ్యాలో తోచక ఏడుస్తుంటాను. మధ్యాహ్నం పూట నిద్ర పోయే వాళ్ళకయితే ఏ బెంగాలేదు. కాని నాకా అలవాటులేదు.

ఇవాళకూడా ఆదివారమే. మధ్యాహ్నం దాకా అటూ ఇటూ తిరిగాను. మధ్యాహ్నం భోజనం చేశాక ఏం చేద్దామా అని ఆలోచించాను. మా ఆవిడేమో వంటింట్లో ఏదో పని చేసుకుంటున్నట్లుంది. ఆవిడ అలమారులో ఉన్న ఏదో నవల చదువుదామని తీశాను. ఎవరో శాస్త్రి పేరున్న రచయితే రాసింది. తీరా చదవడం మొదలుపెడితే చాలా చెత్తగా ఉంది ఇటువంటి వెలా రాస్తారో తెలీదు. కథ షరా మామూలే. హీరోయిన్ గొప్పవాడి కూతురు. హీరో చాలా పేదవాడు. వీడికి ప్రపంచంలో ఉండాలిసిన గొప్ప లక్షణాలన్నీ ఉన్నాయి. బాగా పాడతాట్ట బ్రహ్మాండంగా బొమ్మ లేస్తాట్ట. మరేమో అద్భుతంగా కథలు రాస్తాట్ట ఇంకా ఏమేమో చాలా ఏడిశాయి. హీరోయిన్‌కి ఇవంటే చాలా యిష్టంట అందుచేత ఆవిడగారు గొప్పా బీదా తారతమ్యాలు వదిలేసి నోషలిస్ట్ అయిపోయి వీడిని తెగ ప్రేమించి వాడి కళ్ళలోకి అలా చూస్తూ అలా పేజీలకి పేజీలు డైలాగులు చదివేస్తూంటుంది. ఏవంటుందో నాకు అక్షరంముక్క అర్థం కాలేదు సరిగ్గా అటువంటి డైలాగే ఒకటి చదవలేక సతమత మైపోతూండగా మా ఆవిడ ఎప్పుడు వచ్చిందో మరి.

''ఇది విన్నారా'' అంది.

నా బొంద ప్రతివాళ్ళకీ యిదొక జబ్బు. వాళ్ళకి తెలిసింది వాళ్ళు చెప్తేనే కాని యివతలివాడికి తెలియదని వాళ్ళకి తెలుసు. అయినా ఎందుకో అలా అనడం మాత్రం మానరు.

''ఏమిటో ఆ ఇది'' అన్నాను.

''మా భాస్కరం అన్నయ్య మళ్ళీ

శ్రీరంగం ఎ. శ్రీనివాసరావు

పెళ్ళి చేసుకుంటున్నాట్టండీ" అంది ఏదో బ్రహ్మాండమైన వార్త చెప్పిన దాని లాగ. దానితో నేను ఆశ్చర్యంలోపడి ఉక్కిరిబిక్కిరి అయిపోతానని ఆవిడ భావించిందిలా వుంది. అలా అయితే చాలా పొరపాటు పడింది. నా కందులో పీసమెత్తు కూడా ఆశ్చర్యపడాలిసింది లేదు. అందుచేత్లే."

"అందులో ఏముంది? నేనే నావో వీళ్ళ చెప్పాను వాడు అచ్చితంగా మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడని" అన్నాను అంటిస్తూ.

నా మాటలు చాలా ఆశాభంగం కలిగించేయని మొహం చూస్తూనే తెలుస్తోంది. "నీకే తెలుసునే నేను సుమండీ" అంది.

"నే ననుకున్నాను. ఇంతకీ ఎవరో ఆ మహాతల్లి పాపం" అన్నాను.

"అదే నండీ ఆ గా అంటారు ఏమో యింకా తెలీలేదు. పోనీలెండి. పాపం రాధపోయినప్పట్నుంచీ పిల్లల్తో వాడొక్కడే అవస్థపడుతున్నాడు. ఎవత్తెనో చేసుకుంటే కాస్త పిల్లల్ని చూసుకొని వేళకింత వండిపెడుతుంది" అంది వాళ్ళన్నయ్య కష్టాలు తలుచుకుని.

నాకు పెద్ద పొళ్ళు మండింది. వాళ్ళన్నయ్య పెళ్ళామైతేనేమో పిల్లల్ని ఆడింపడానికీ, వొండి పెట్టడానికేనా, తనేమో యిల్లంతా పెత్తనం చెలాయించడానికీ, నా మీద దాడి చెయ్యడానికీనా! అంటే ఆడబుద్ధి. ఏదో అందామనుకున్నాను కాని అప్పటికి ఏదో జ్ఞాపకంవచ్చి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

దాంతో నా కింహ ఆ నవల చదువ బుద్ధికాలేదు. నా ఆలోచనలు భాస్కరం మీదకి మళ్ళాయి. ఇక్కడ భాస్కరాన్ని గురించి చాలా చెప్పాలి. అసలు నే రాయాలిసిందే వాడి గురించి. ఈ ముందు చెప్పిందంతా కేవలం ఉపోద్ఘాతం మాత్రమే.

నాకు అసలు ఎందుకో మనుషులంటే చిరాకు. జంతువుల్లో అయితే రకరకాల జాతులుంటాయి. వాటివల్ల వాటి స్వభావాలు తెలుస్తుంటాయి. పెద్దపులి క్రూరమైనదనీ. పాము కరుస్తుందనీ. కుక్క విశ్వాసం కలదనీ ఇలాగన్నమాట. కాని మనుషుల్లో అలాకాదు. అందరూ వొకటే జాతికి చెందినవారు. కాని ఏ యిద్దరూ వొకలాంటి వాళ్ళు కారు. మొత్తంమీద అందరూ ప్రమాదకరమైన వారే అనుకోండి.

అందరిలోకీ నాకు ఆత్మవంచన చేసుకునే వాళ్ళంటే విపరీతమైన అసహ్యం. వీళ్ళు ఎదుటివాళ్ళని మోసం చెయ్యడమే కాకుండా తమ్ము తామే మోసం చేసుకుంటారు. సరిగ్గా ఆ జాతివాళ్ళల్లో యీ భాస్కరం వొకడు.

వాడు యిప్పుడు నా బావమరిదే అయినా వాడిని నేను చదువుకునే నాటి నుంచీ ఎరుగుదును. వాడిలో చెప్పుకోదగ్గ విశేషాలు లేవు. మామూలుగా ఉంటాడు.

కన్నూ ముక్కూ లాంటివి ఏవి ఎక్కడుండాలో అక్కడే ఉన్నాయి. సుమారు రంగు. అంతెందుకు మనం పొద్దున్నే లేస్తే బజార్లో చూసే లక్ష తొంభై మంది మామూలు జనంలో వీ డొకడు. అంతకు మించి వాడిలో ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలనిపించే ప్రత్యేకలాంటి ఏమీ లేదు. అయితే నచ్చిన పిల్లనిచ్చేటంత వాడలా అనుకోవడం లేదు. వాడి ఉద్దేశంలో వాడు చాలా అందగాడు. వాడికీ జబ్బు పట్టుకోవడానికో చిన్న పిట్ట కథ ఉంది

నేను చదువుకునే రోజుల్లో నేను హాస్టల్లో ఉండేవాడిని. వీడేమో బయట వేరే ఇంట్లో రూము తీసుకుని ఒక్కడూ ఉండేవాడు. వాడి రూములో నన్నూ కూడా ఉండమని పోరేవాడు. కాని నేనే వాడితో ఇష్టంలేక పోలేదు. వాడి ఇంటిగల్లా యన మీదా యింట్లో ఉంటున్నాడు. అతను బాగా వయసు మళ్లినవాడు. దగ్గరగా ఏభై అయిదేళ్లుండొచ్చు. అతని భార్య అతనికి రెండవ భార్య. ఆమె చాలా చిన్నది. మహా ఉంటే ఇరవై ఏళ్లు ఉంటాయి. అందంగానే ఉండేది. పేద వాళ్ళవడంచేత ఏదో బరువుదిగుతే చాలను కొని ఆమె తల్లిదండ్రులు ఇతనికిచ్చివేసి ఉంటారు. కాని పాపం ఇతనివల్ల ఆమెకి సహజమైన కోర్కెలేం తీరలేదను కుంటాను. అటువంటివి ఇవ్వలేనివాడు అంత చిన్నదాన్ని పెళ్ళి చేసుకోవడం ఆ ముసలాయన తప్పు.

అయితే కథల్లోలాగ ఆవిడ పతివ్రతలా కూర్చోలేదు. తన క్కావాల్సిన సుఖాన్ని వేరేవాళ్ళద్వారా పొందడానికి ప్రయత్నించింది. అయితే ఆవిడ యింకెవ్వరి దగ్గర పొందినా బాధలేదు. కాని ఆవిడ దృష్టి తనకి బాగా అందుబాటులో ఉన్న భాస్కరంమీద పడింది. ఒకే యింట్లో ఉన్నందువల్ల వాళ్ళ కార్యకలాపాలకి ఆటంకం రాలేదు. కాని ఆ రూములో భాస్కరమే కాకుండా ఇంకెవరున్నా కూడా ఆవిడ అలాగే ప్రవర్తించుండేది. ఆమెకా సమయంలో కావాల్సింది వయసులో ఉన్న మగవాడు కాని అతని అందం కాదు. కాని వీ బుఱ్ఱ కది తట్టలేదు. వాడి ఉద్దేశంలో అందమైన ఆడది భర్త ఉండి కూడా తనని కోరి వచ్చిందంటే తాను చాలా అందగాడి ననుకున్నాడు. అదే వాడు చేసుకున్న పెద్ద వంచన. నే నెన్ని సార్లు వాడికి అసలుసంగతి చెప్పినా వాడికి ఎక్కలేదు.

అప్పట్నుంచి వాడు దారినిపోయే ప్రతి ఆడదీ వాడివైపే చూస్తోందనుకొనేవాడు. మేమిద్దరం కలిసి బజార్లో నడుస్తుంటే ప్రక్కగా వెళ్ళిన అమ్మాయిని చూపించి. "చూడరా, నావేపు ఎలా దొంగ చూపులు చూస్తోందో. ఆ చూపులోనే తెలుస్తోంది దాని సంగతి ' అనేవాడు.

నాకు చాలా కోపం వచ్చేది అసలు ఆడదాన్ని అది, ఇది అనేవాడిని లెంప కాయ కొడదామనుంటుంది.

"అలా ఎందుకనుకుంటావు. దారిన పోయేవాళ్ళు మామూలుగా చూడటంకూడా తప్పే? దానికి యీ వెధవ అర్థాలు తీస్తావేం? అసలా మాటకొస్తే వాళ్ళవైపు దొంగచూపులు చూస్తోంది నువ్వే" అన్నా నొకసారి.

వాడు నావేపు చిరాగ్గా చూశాడు.

"ఒరే! నీకింకా అనుభవంలేదు. నాకు తెలుసు ఇటువంటి విషయాలు. నాకు అనుభవం ఎక్కువ."

వీడి పిండాకూడు.

"అసలంతెందుకు. మా క్లాసులో సగంమందికి పైగా ఆడపిల్లలు నేనంటే పడి చస్తారు" అన్నాడు.

ఇక లాభం లేదనుకున్నాను. వీడికన్నా దరిద్రుడు మరొకడుండడు

"నువ్వంటే ఇష్టపడే ఆడది భస్తేనే నయంలే" అన్నాను.

వాడు మొహం మాడ్చుకుపోయేడు.

ఎప్పుడో ఏ అమ్మాయిదగ్గరో వెట్టి వేషాలు వేసి తన్నులు తింటాడనుకున్నాను. కాని వీడు ఎంతసేపూ వాళ్ళే వీడిదగ్గరకి వస్తారని కలలు కనడంవల్ల వీడంతట వీడు అటువంటి ప్రయత్నాలేం చెయ్యకపోవడంవల్ల ఆ ప్రమాదాలేం రాలేదు.

నాకెప్పుడూ వాడు ఎంత అందమైన అమ్మాయిని పెళ్ళాడుతాడో చూద్దామని పించేది. వాడి మాటల్నిబట్టి వింటే క్లియోపాత్రా, హెలెన్ అంతా వచ్చినా మొహంమీద ఉమ్మేసేవాడిలా మాట్లాడే వాడు. అంచేత వీడికీ జన్మకి పెళ్ళి కాదేమో అనికూడా అనుకున్నాను.

కాని ఎంతోకాలం కాకుండానే వాడి పెళ్ళికి రావల్సిందిగా వాడి దగ్గర్నుంచి శుభలేఖతోపాటు ఉత్తరంకూడా వచ్చింది. రాధట ఆ అమ్మాయి పేరు. పేరు బావుంది. అమ్మాయి ఎలా ఉంటుందో చూద్దామనుకున్నాను పెళ్ళికి వెళ్ళాను. ఆ అమ్మాయి చక్కగా ఉంది. మొత్తానికి అదృష్టవంతుడే. అమాయకురాలుగా కూడా ఉంది. ఎటొచ్చీ వీడు నా దగ్గరకొచ్చి సొదంతా వెళ్ళబోసుకున్నాడు.

'వాళ్ళ నాన్న వాడికి చాలా అన్యాయం చేస్తున్నాట్ట. వాడింతకాలంగా తనకి సరిపోయే అమ్మాయికోసం వెదుకుతున్నాట్ట. ఎంతమందిని చూపినా అటువంటిది లేదుట కాని దొరికేదాకా ఆగడానికి తను సిద్ధమేనట. ఈలోగా వాళ్ళ నాన్న తొందరపడ్డాట్ట కట్నంకోసం ఆశపడి ఇటువంటి అమ్మాయిని కట్టపెడుతున్నాట్ట. ఎంత వద్దన్నా వినలేదుట తన సుఖసంతోషాల్ని కన్నతండ్రి యిలా నాశనం చెయ్యడంకన్నా ఘోరం ప్రపంచంలో ఎక్కడా ఉండదుట. వాడికీ పెళ్ళి చావుతో సమానంట. ఆ భాస్కరం ఇవాల్టితో మరణించాట్ట ఇకమీదట మేమందరం చూసేది జీవచ్ఛవం భాస్కరాన్నిట.

ఇంకా యిలగే చాలాసేపు వాగేడు.




వాడు అక్కడున్న పందిరిగుంజ ఏదైనా పీకి వాడిని చావగొడదామనిపించింది. ఆ అమ్మాయిని చూసి ఆగేనుకాని లేకపోతే అంతపనీ చేసేవాడినే. వెధవది జైలుకి పోతే పోయాను. ఇటువంటి వెధవలు పబ్లిగ్గా తిరగడం చూడటంకన్న అదే నయం. ఇంక ఇటువంటివాడితో ఆ అమ్మాయేం కాపరం చేస్తోంది. అంత కన్నా ఘోరం ఇంకొకటుండదు.

సరిగ్గా ఆ పెళ్ళికి వెళ్ళినప్పుడే అరుణని (అంటే ప్రస్తుతం మా యావిడ) చూశాను. ఒకటిరెండుసార్లు మాట్లాడాను. చాలా నెమ్మదస్తురాలిలా కనపడింది (అప్పుడు!) నయమే ఆ అన్నకి ఇటువంటి చెల్లెలుండటం అనుకున్నాను.

పెళ్ళి తరువాత వాడే ఓసారి మెల్లిగా కదిపాడు అరుణ సంగతి. "మా చెల్లెలికి సంబంధాలు చూస్తున్నామనుకో. కాని ఏవీ అంతగా నచ్చటంలేదు. ప్రతీ వెధవకీ బోలెడు కట్నాలు కావాలి (యీ వెధవ తీసుకోనట్లు!) ఇవ్వడానికే కాదుకాని అంత యివ్వాల్సిన అర్హత లేదెవరికీ

నిన్ను చూసేక మా వాళ్ళకి నీకిస్తే బావుంటుం దనిపించిందట. అందుకని నన్నడగమన్నారు. బలవంతం ఏంలేదు. నాకు బాగా తెలుసు కాబట్టి. నువ్వు పెద్ద అందగాడివి కాకపోయినా ఫరవాలే దనుకో....'' అన్నాడు.

ఇంక ఇలాంటివాడితో మాట్లాడ్డం అనవసరం. వెంటనే నో ర్మూసుకు పొమ్మందామనుకున్నాను కాని అన్నని బట్టి చెల్లెల్ని కాదనడం అన్యాయం అను కున్నాను. అందులోనూ అరుణని చూస్తే అలా అన బుద్ధి (బుద్ధిః కర్మానుసారిణీ) కాలేదు. మొత్తంమీద వొప్పుకోవడం మా పెళ్ళి జరగడం అయిపోయింది.

తిరిగి వాడి విషయానికొస్తే నే ననుకున్నది అక్షరాలా నిజమైంది. రాధ తన్వంత కూడా సుఖపడలేదు. వాడు ఆమెని యమ యాతనల పాలుచేశాడు. ఆమె సినిమాలూ, షికార్లూ ఏంవీలేవు. అన్నీ వాడొక్కడూ వెళ్ళాల్సిందే. ఆమె వాడితోరావడం వాడి కిష్టంలేదుట. ఆమెతో వెళ్ళడానికి వాడికి సిగ్గనిపిస్తుందిట. అందరూ వాడినిచూసి కట్నంకోసం అటు వంటి దాన్ని చేసుకున్నందుకు నవ్వు తారట. అసలు రాధతో మాట్లాడ్డమే వాడికి యిష్టంలేదుట. ఆమెతో కాపరం చేస్తున్నాట్ట. మొత్తానికి రాధ వాడితో నరకం అనుభవించింది.

వాళ్ళకి ఇద్దరు పిల్లలు పుట్టారు. తరు వాత పాపం ఆమె మూడవ కాన్పులో కనలేక చనిపోయింది. ఒకరకంగా అదృష్ట వంతురాలు. అప్పటికైనా సుఖ పడింది. బ్రతికిన న్నాళ్ళూ ఏం సుఖ పడింది కనక. ఆమె చావు వార్తవిని నేను చాలా బాధపడ్డాను. పరామర్శకని భాస్కరం దగ్గరకి వెళ్ళాను.

నన్నుచూసి వాడు భోరుమని ఏడ్చాడు.

''చూశావురా. రాధ నన్నిలా అన్యాయం చేసి వెళ్ళిపోయిందో. నేనేం పాపం చేశానని నన్నిలా వదిలి వెళ్ళి పోయింది. అంతమంచి దానికి యింత అన్యాయం ఎలా జరిగింది. మనిషెలా వున్నా మనసెంత మంచిదిరా. మేద్దరం ఎంత సుఖంగా ఉన్నాం. భగవంతుడు మా యిద్దర్నీ చూడలేక పోయాడు. ఈ పిల్లల్ని నాకు వదిలేసి తను వెళ్ళి పోయింది. వీళ్ళని నేనెలా పెంచను'' అన్నాడు బెక్కుతూ.

మొదట వాడిని చూసి జాలివేసినా వాడి మాటలవీ విన్నాక అదంతా పోయి కోపం వచ్చింది. రాస్కెల్, ఇంతచేసీ యింకా యిలా ఎలా మాట్లాడ గలుగు తున్నాడో. అయితే అసలు సంగతేమి టంటే వాడిదంతా నటించటం లేదు. తను చెప్పేదంతా శుద్ధ నిజమని వాడిని వాడే నమ్మించుకున్నాడు. నేనా రోజే నిశ్చయించాను ఏడు సంవత్సరం తిరిగే లోగా మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడని.

* *

వాడి రెండోపెళ్ళి వార్త విన్న చాలా

కొందరలోనే నేను ఏదో పనిమీద వెళ్తూ వాడి ఊళ్లో ఆగాను. వాడు పూర్వం కన్న దుక్కలాగున్నాడు. నన్నుచూసి వెధవ నవ్వొకటి నవ్వి.

"నా పెళ్ళి గురించి వినే ఉంటావు" అన్నాడు ప్రపంచంలో అదొక్కటే ముఖ్యమైన వార్తలాగ.

"ఆఁ" అన్నాను క్లుప్తంగా.

"ఏం చెయ్యమంటావు చెప్పు. నాకేమో ఇంకో జన్మకి ఎవర్ని పెళ్ళాడ్డ ఇష్టంలేదు. రాధని మర్చిపోవడం సాధ్యంకాదు (అసలొకప్పుడా జ్ఞాపకం ఉంటా) అసలు నా మట్టుకు నాకు భార్య అవసరం లేదు. నాకు జీవితంమీద విరక్తి వచ్చేసింది. కాని ఈ పిల్లల్ని చూస్తుంటే కడుపు తరుక్కుపోతోందిగా ఏలాగైనా తీర్చొచ్చు కాని తల్లిలేనిలోటు తీర్చలేం. వాళ్ళకోసం కాకపోయినా వీళ్ళ కోసమైనా తప్పదు మరి. అందుకే వొప్పుకోవాల్సొచ్చింది" అన్నాడు వేదాంతి మొహంపెట్టి

ఇంతకాలం సహించిన నేను ఇంక ఉండబట్టలేకపోయాను. నాకు పరమ అసహ్యం వేసింది వాడంటే వెంటనే.

"ఇంతవరకూ నువ్వు యీ చచ్చు పేలాపన [illegible] బతుకు ఎంతకాలమని యిలా అసంకల్పంగా వాగుతావు. ఈ వాగుడులోనే రాధనలా హింసలుపెట్టి ఆమెకి చిన్నయెత్తు సుఖం లేకుండా చేశావు. ఆమె పోయాకకూడా నీకు బుద్ధి రాలేదు. అటువంటప్పుడు మళ్ళీ ఎందుకు మరో ఆడదాన్ని బాధ పెడతావు ఇప్పటికైనా నీ ఆత్మవంచన మానేసి ఉన్నది ఉన్నట్లు మాట్లాడు. నువ్వు యిప్పుడు మళ్ళ పెళ్ళి చేసుకుంటోంది ఊరివాళ్ళ కోసంకాదు. నీ పిల్లలకి తల్లిలేదనీ కాదు. అసలుసంగతి చెపుతావిను, నీకు ఆడదాని సుఖం కావాలి అంచేత ఆడివ్వడానికి మరో భార్య కావాలి ఆ సంగతి ధైర్యంగా వొప్పుకో. అంతేకాని యిలా జీవితాంతం నిన్ను నువ్వు వంచించుకోకు." అని గబ గబా అనేసి వచ్చేశాను.

వాడు నా మాటలువిని వెర్రివాడివి చూసినట్లు చూశాడు లాభంలేదు నా నోరు నొప్పేకాని వాడికి ఏమిచెప్పినా నెత్తికెక్కదు. అటువంటి వాళ్ళంతే వాళ్ళు అలా జీవితాంతం ఆత్మద్రోహం చేసుకుంటూనే ఉంటారు. అటువంటి వాళ్ళున్నంతకాలం ఈ ప్రపంచం బాగు పడదు. వాళ్ళు లేకుండాపోవడం అన్నది అసంభవం. అది మన ఖర్మ అంతే.



# పొత్తు కుదిరింది!

పంతుల జోగారావు

వరహాలు శెట్టి, అతని ముగ్గురు కొడుకులూ మళ్ళీ కలిసే ఉంటున్నారుట! నా కాశ్చర్యం వేసింది. శెట్టి కుటుంబంతో నాకు బాగా పరిచయముంది. చిన్నప్పు డెప్పుడో ఒకే స్కూల్లో చదువుకున్నాం.

నాకు తెలిసినంతవరకూ శెట్టికి కొడుకులతో ఒక్క నిసరు పడేదికాదు. ఆస్తంతా అతని స్వార్జితమే. కొడుకులు దుబారా చేసేస్తున్నారంటుండేవాడు.

ఓరోజు నేనే అన్నాను: "శెట్టీ! ఎందుకయ్యా యిలా వాళ్ళ నాడిపోసుకుంటావు? ఏం తిన్నా, నువ్వు కన్నవాళ్లే కదా!"

శెట్టికి నామాట రుచించలేదు. కొడుకులమీద రోజూ బోలెడు కంప్లెంట్లు చేసేవాడు. కలిపించినప్పుడల్లా ఆ ఆరోపణలు వినాల్సిన అగత్యం నాకు తప్పేదికాదు.

"పంతులూ! కొడుకులంటే మీ కొడుకులయ్యా! ఏం వినయం! ఏం విధేయత! మా వెధవలూ ఉన్నారు - చేట పెయ్యల్లా. పెళ్ళాలొస్తే కళ్ళు నెత్తికెక్కుతయ్య.... పెద్దోడు చూశావా, బెల్లంచెక్కల వ్యాపారంపెట్టి ఎవడో పోలీసోడితో తగువు పెట్టుకున్నాట్ట—వ్యాపారం అలాగయితే సాగుతుందా?"

"రెండోవాడు సత్తినారాయణ లేడూ? చినసెంటర్లో కిరాణాకొట్టు తెరిచి బేరాల్లేక ఏడుస్తున్నాడంట...."

"మా నర్సింగు (మూడో అబ్బాయన్నమాట) జీలకర్రలో యిసక కలిపాడని చెప్పి హెల్త్రోడు పట్టుకున్నాడంట. మూటయాభై కిలం వదిలిందిటలే.... పెద్దోడ్ని కాతరు చెయ్యకపోతే ఏమవుతుంది చెప్పవయ్యా!"

కొడుకుల పేరెత్తితేనే అగ్గిరాముడయిపోయే శెట్టి, ఈ మధ్యనే "వరహాలు శెట్టి అండ్ సన్స్" పేరిట పెద్ద ఫ్యాన్సీ స్టోర్సు ఒకటి తెరిచాడట!

కొంతకాలంగా గ్రామాంతరంలో ఉండివచ్చిన నాకీ వార్త ఆశ్చర్యమే కలిగించింది. వాళ్ళకింత పొత్తు ఎప్పుడు కుదిరింది చెప్మా? నా ఊహ కందలేదు!

సాయంత్రం బజారుకెళ్తూనే శెట్టి కొట్లో దూరాను! బాగా పెద్ద దుకాణమే. బేరం బాగా జోరుగా ఉంది. శెట్టి నన్ను నవ్వుతూ రిసీవ్ చేసుకుని సోడాతెమ్మని రెండో కొడుకుని పురమాయించాడు. తక్కిన యిద్దరూ బేరాలు చూసుకుంటున్నారు.

శెట్టిని అభినందిస్తూ ఉత్కంఠ పట్టలేక అసలు సంగతి అడిగేశాను. శెట్టి నిమ్మళంగా చెప్పాడు: "ఎవడితోనూ అనకయ్యా పంతులూ! నువ్వు కనుక చెబుతున్నాను—మొదట్లో యీ కొట్టు ఒక్కడ్నే పెడదామనుకున్నాను. ఇన్‌కం టాక్సు వాళ్లు తొక్క ఒలిచేస్తారు. వ్యాపారాలో చితికిపోయి ఉండటంతో వీళ్ళు మూడు మాట్లాడుకుని వచ్చేశారు.... అండ్ సన్స్ అనబట్టి ఆరువేలు ఇన్‌కమ్‌టాక్సు తగ్గింది మరి ...లేకపోతే వీళ్ళ లెక్కా జమా నాకుందేటి కాదయ్యా!...."

# కోటి విద్యలూ...

పెద్దింటి రామమూర్తి శ్రీలక్ష్మి

ఆఫీసుకు టయామయిందంటూ గోడ గడియారం తొమ్మిదిసార్లు హెచ్చరించింది. చేతిలోంచి పేపరును అమాంతం విసిరేసి వంటింట్లోకి పరిగెట్టాను. ఇవ్వాళ తొందరగాకూడా పోవాలి. ఓ అర్జంటు పని పీకలపైనుంది. ఆఫీసు ఫైలొకటి ఇవ్వాళే పంపేయాలని ఆఫీసరుగారి హుకుం.

"సుశీ .... టైమ్ తొమ్మిది ... వంట గింట అయిందా" అంటూ పీటకోసం చూసాను. కాని అప్పటికే కంచం పెట్టి, పీటవాల్చి సిద్ధం చేసుంది.

"ఏమిటీవేళ విశేషం? రోజూ ఓ అర గంట వంటింటిలోంచి హాల్లోకి, హాల్లోనుంచి వంటింటిలోకి పచార్లు చేయించే దానివి ఈ రోజు ఇంత టంచనుగా పెట్టేస్తున్నావ్" అంటూ కూర్చున్నాను

ఓ చిరునవ్వు పారేసి, పైట బిగించి వడ్డన కుపక్రమించింది వడ్డించిన ఆధరువులను చూసి మరింత ఆశ్చర్యపడ్డాను. అన్నీ నా కిష్టమైన వంటకాలే.

"ఇవ్వాళేమైనా షాపింగుకెళ్ళాలా?" అన్నా మా ఆవిడ చీరవంక భయంగా చూస్తూ.

"మీరు మరీను. మొన్ననే కదా కనకాంబరం రంగుచీర కొన్నది. అయినా ఎప్పుడూ నాకేగాని మీరొక్కటీ తీసుకోరు" అంది ఎయిర్‌కండిషన్డ్ (చిల్లులు పడిన) బనియన్‌వైపు చూస్తూ.

అది జాలిపడటమో, ముందు విషయానికి ఉపోద్ఘాతమో నా కర్థం కాలేదు.

"మీ నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరాలు వచ్చి చాలా కాలమయిందనుకుంటాను" అన్నాను పుట్టింటికెళ్ళే పథకం ఏమైనా వుందేమోనని.

"అబ్బే! మొన్ననే వ్రాసారు కదండీ అయినా ఉత్తమానం వ్రాయటానికేముంటాయి?" అంది మజ్జిగ తేవటానికి లోపలికెళుతూ.

భోజనంచేసి చేతులు కడుగుతుంటూంటే టవలందిస్తూ, "అలంకార్‌లో

కొత్త సినిమా వచ్చింది....'' అంటూ ఫవల్ తీసుకుంది.

ఇదన్నమాట ప్లాను. మొదటిరోజు. పైగా ఎవరో పద్మశ్రీ నటించిన సినిమా అంటూ అడ్డు చెప్పాలనుకున్నాను. కాని ''త్వరగా వచ్చేస్తారు కదూ'' అంటూ గోముగా అడిగిన సుజాత కద్దుచెప్పలేక పోయాను

సుజాత కళ్ళలోకి చూస్తూ ఉంటే ఆఫీసరు సింహం పిల్లిగా మారిపోయింది. నే చేయవలసిన, మూడవలసిన ఫైల్సు మంచు ముక్కల్లా కరగిపోయాయి.

"మరి నే వచ్చేసరికి సిద్ధంగా వుండాలి" అన్నాను చొక్కాచేతులు పైకి మడుచుకుంటూ.

ఆనందంతో అసలే పెద్దవైన సుజాత కళ్ళు మరింత వెడల్పయ్యాయి.

'త్వరగా వస్తారు కదూ మరి'' అంటూంటే మా ఆవిడ ఇక ఆఫీసుకు బయలుదేరమని గడియారం ఇంకొక్కమారు హెచ్చరించింది.

ఆఫీసులో గడియారంతోబాటు నేను. నాతోపాటు గడియారం పోటీపడుతుంటూ మూడు గంటలదాక వచ్చాము. ఇంతలో మా ఆవిడకిచ్చిన వాగ్దానం గుర్తుకొచ్చింది. ఆ వేళ పంపాల్సిన కొన్ని కాయితాలకు సంతకాలు. వాటితోబాటు పర్మిషను తీసుకుందామనుకున్నాను.

ఆయన గదిలోకెళ్ళాను. ఇంతకు ముందు మా ఆవిడ కళ్ళలో పిల్లిగా మారిపోయిన మా ఆఫీసరుగారు శాప విమోచనం కలిగినట్లు మళ్ళీ సింహంగా మారిపోయున్నారు.

మొదటి ఫైల్ తీసారు. చదివి 'వెరీగుడ్' అని అన్నారు. పర్మిషను అడుగుదామనుకున్నాను. మళ్ళీ అంతలోనే మనసు మార్చుకుని ఇంకొన్ని గుడ్లంనుకుని కోరిక కోరుదామనుకున్నాను.

ఇంకోటి చదివి 'నైస్' అన్నారు. ఇంతకంటె మెచ్చుకోలు సంపాదించి అడుగుదామనుకున్న కోరికను ఇంకో ఫైలుకు వాయిదా వేసాను.

ఇంతలోనే ' ఇదేమిటి ఇలా వ్రాసారు?'' అన్నారు కళ్ళజోడు సవరించుకుంటూ. ''అయ్యో భగవంతుడా. ఇందాకా అడిగేసుంటే బావుండేదే'' అని విచారపడ్డాను.

మళ్ళీ ''ఓహ్ ఇదా! బాగా వ్రాసారు'' అన్నారు సంతకాలు పెడుతూ.

ఫైల్సు తీసుకుని ''ఇవ్వాళ ఓ గంట పర్మిషన్ కావాలి'' అన్నా నసుగుతూ. 'నో ...సారీ'' ఇత్యాది పదాలు ఉపయోగించే ఆఫీసరు ఏమీ మాట్లాడకపోవటం ఆశ్చర్యం కలిగించింది.

తలెత్తి ఆశగా చూసాను. దానికేం భాగ్యం తీసుకోండి అన్నాడు. వ్వాట్ ఆఫీసరుగారేనా ఇలా మాట్లాడేది. దీనిని బట్టి సింహాల్లోకూడా మనుషులుంటారని తేలింది. చాలా ఆనందం కలిగింది.




థ్యాంక్యూ సార్ అని వెళ్ళబోతూంటే "అవునుగానీ ..." అంటూ ఆపారాయన. కారణా లడుగుతారేమోనని నీరసంగా వెనక్కు తిరిగాను.

"మీ ఇల్లు గుడిదగ్గరన్నారు కదూ." అంటూ చూసారు.

"అవును సార్."

"ఆ గుడిపక్కనే ఇల్లొకటి కట్టిస్తున్నాను తెలుసుగా!" ఆగాడు.

"ఆహా! తెలియకపోవడం ఏమిటండీ. మొన్న చూపించారుగా" అన్నాను.

"అదే. అక్కడ పనివాళ్లు సరిగా వర్క్ చేస్తున్నారో లేదో ఓమారు చూసి వెళ్ళండి. నాకు తీరికలేదు" అన్నారు.

ఇలా చిన్నచిన్న పనులు మాకు పురమాయించటం మా ఆఫీసులో ఎవరికీ కొత్తేమీ కాదు.

"అలాగే సార్" అని బయటపడ్డాను.

ప్లాటుదగ్గర కెళ్ళాను. కూలీలు అందరూ తీరిగ్గా కూర్చున్నారు. కొందరు బీడీలు తాగుతూంటే మరి కొందరు సినిమాల గురించి చెప్పుకుంటున్నారు. ఒకరిద్దరు చెట్టుకింద జోగుతున్నారు. పారలు. తట్టలు. గునపాలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. నారాక అందరిలోను సంచలనాన్ని కలిగించింది.

ఆడవాళ్ళు తలపై కుదురులని సవరించుకొని తట్టలు తీసుకొని బయలుదేరారు. మగవాళ్ళు బీడీలు పారేసి నెమ్మదిగా గునపాలు తీసుకుని బయట తవ్వడాని కుపక్రమించారు.

ఒకచోట ఒక కూలీమటుకు బీడీ

తాగుతూ అదకూలీలతో సరసా లాడు తున్నాడు. ఒళ్ళు మండింది. పని చెయ్యంండ్రా అని దబ్బలిస్తే ఇదీ వీళ్ళ వరస. వీళ్ళందరిని పోషిస్తూ ఇల్లు కట్టించటం సామాన్యమైన విషయం కాదు అందుకనే "ఇల్లు కట్టి చూడు" అనేకవిగా కూడ "పెళ్ళి చేసిచూడు" అనే కష్టతరమైన బాధ్యతలలోకి తోసేసారు.

"ఇక్కడ వాడివేనా నువ్వు?" అధి కార దర్పంగా అడిగాను.

"ఆఁ" అన్నాడు నిర్లక్ష్యంగా చిర్రెత్తు కొచ్చింది

"మరి పనిచెయ్యవేం?" కోపంగా అడిగాను

"చేసేదేమిటి" అంటూ, ఆ కూలీదాని వేపు తిరిగి 'ఈ గాజులేడ కొన్నావ్" అంటూ దాని చేతులు సవరిస్తున్నాడు.

"ఇదిగో... నిన్నే" తీక్షణంగా పిలి చాను. ఇక్కడ నీకు డబ్బులిచ్చేది సరసాలాడటానికనుకున్నావా?" గద్దిం చాను.

"సరసా లెవడాడాడు. సరిగా మాటా డవయ్యా" అంటూ కయ్యానికి దిగ బోయాడు. ఇంతలో ఇంకో కూలీ మధ్యలో కల్పించుకుని వాడిని లాక్కు పోయ్యాడు.

"పిచ్చోడు బాబూ. వాడితో మీకేటి?" అని సర్ది చెప్పాడు.

టైము చూసుకున్నాను. నాలుగవు తూంది. ఎండలో తీక్షణత తగ్గుతూంది. సుజాత ఈపాటికి ఇంటిదగ్గర ఏం చేస్తూం టుందో ఊహిస్తూ ఓ పదినిముషాలు గడిపాను. ఇక వెడదామను కుంటు న్నాను. ఇంతలో బాబుగారూ అంటూ ఒక కూలీ నన్ను హెచ్చరిస్తూ పక్కకు తొయ్యడం నేలమీద ఒక గునపం పాతుకు పోవటం లిప్తపాటులో జరిగిపోయాయి. హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు మాన్పడి పోయాను. దూరంగా కూలీ పారిపోతూ కనిపించాడు.

పక్కకు పడడంవల్ల మోచేతులు గీరుకుపోయాయి. అప్పటికే కూలీ లందరు పనులు వదిలేసి చుట్టూ మూగారు.

"ఎంతపని చేసాడు దొంగ."

"సర్పయ్యగారిని చూసుక పోయుంటే ప్రాణాలు పోయేవి కాదంటావా"

"దొంగ చచ్చినాడు పని చేయలేదని నాలుగు మాటలంటే ఏమొచ్చింది" అం దరూ తలో విధంగా వ్యాఖ్యానిస్తున్నారు.

"ఎల్లండెహె పన్లు చేసుకోండి" అంటూ చుట్టూ మూగిన కూలీలను పం పించేసాడు నన్ను పక్కకుతోసి కాపా డిన కూలీ. వాడివేపు చూసాను. ఇరవై ఏండ్లుంటాయి. చిరిగిన చొక్కా. నిక్కరు మనిషి పేదఅయినా మనసు చాలా గొప్పది.

"ఎంత గండం గడిచింది. అదృష్టం బావుండి లేకపోతే" ఆపైన ఊహించ టానికే భయం వేసింది

వెళ్ళి పోతున్న ఆ కూలీని పిలిచాను.

"నీ పేరేమిటి?"

"నర్సయ్యంటారు బాబూ" అన్నాడు చేతులు కట్టుకుని.

"ఇదో నర్సయ్యా! ఈవేళ నన్ను సమయానికి ఆదుకున్నావ్.

ఇదుంచు. అంటూ వాడిచేతుల్లో అయిదు నోటుంచాను.

"ఇదెందుకు బాబూ! నాస్నే నేంచే సీమయినా కట్టదు కదా నే చేసిందేముంది" అంటూ తీసుకోవటానికి నిరాకరించాడు.

"ఇలాంటి అయిదు లెక్కిచ్చినా కొంచెం. ఏదో నాతృప్తికోసం" అని వాడిచేతుల్లో బలవంతంగా దాన్ని ఉంచాను. అక్కడ నుంచి మెల్లగా ఇంటివైపుకు నడక సాగించాను.

ముందు నా సహోద్యోగి ప్రకాశం వెళ్తున్నాడు. చప్పట్లుకొట్టి పిలిచాను.

"ఏం ఇంకా ఇంటికి పోలేదా?" అన్నాడు ప్రకాశం

"లేదు. ఆఫీసునుంచి ఇంటికొస్తూ మన ఆఫీసరుగారి ప్లాటుకెళ్ళి వస్తున్నాను. అక్కడ ఓ చిన్న అడ్వెంచర్."

"ఏమయిందేమిటి?" కుతూహలంగా అడిగాడు.

"ఒకకూలి పనిచెయ్యకపోతే కోప్పడ్డాను. వాడు కాస్త చంపటానికి తయారయ్యాడు."

"అయినా ఎవరో రక్షించుంటారు. లేకపోతే ఇంకేమైనా జరిగిందా?" అన్నాడు మామూలుగా.

"రక్షించక పోయుంటే ఇక్కడెందుకుంటాను. ఈపాటికి ఆసుపత్రిలో వుండే వాడినికదా" ఆందోళన పడవలసిన సంఘటనకు కనీసం ఆశ్చర్యం కూడా ప్రకటించక పోవడం నాకు కోపం తెప్పించింది.

కొంచెం దూరం ఇద్దరం మాట్లాడుకోకుండా నడిచాము ఇద్దరం "చౌరస్తా" దగ్గర విడిపోయాము.

"తనదాకా వస్తేనే గాని తెలియదు. ఆయినా ఇలాంటివి అనుభవించాలి గాని చెప్తే ఇలాంటి పిచ్చి సన్యాసులకు ఏం బోధపడతుంది." అనుకున్నాను.

నాకోసం సుజాత ఇంటిదగ్గర కాచుకునుంది. మురికైన బట్టలను, మట్టి కొట్టుకుపోయిన మోచేతులను చూసి కంగారుగా దగ్గర కొచ్చింది ఏమయిందంటూ.

సాధ్యమైనంత తేలికగా, క్లుప్తంగా చెప్పాను జరిగిన విషయాన్ని. నేను కూడా దానిని ప్రకాశం తీసుకున్నంత తేలికగా తీసుకుందా మనుకుని ప్రయత్నించాను. కాని నా వల్ల కాలేదు. శ్రీమతి కాశింబె ఎక్కువగా బాధ పడింది. ఎంత చెప్పినా వినకుండా సినిమా ప్రోగ్రాం కాస్తా గుడి ప్రోగ్రాం కింద మార్చేసింది.

మర్నాడు ఆఫీసులో మధ్యాహ్నందాక చెప్పుకోదగ్గ సంఘటనలు లేకుండా నే

గడిచిపోయింది. మూడు గంటల ప్రాంతంలో ఆఫీసరుగారు ప్లాటు వగ్గర పనెలా సాగుతుందో చూడాలంటూ వెళ్ళిపోయారు.

పది నిముషాలు గడిచాయి.

ప్రకాశం నా దగ్గరకొచ్చి త్వరగా బయలు దేరాలి యివ్వాళ మీకో వింత చూపిస్తాను అన్నాడు. నిన్నటి సంఘటనతో ప్రకాశంమీద నాకు సదభిప్రాయం తగ్గింది.

నేను కూడా "వింతలేముంటాయ్ అన్నీ మామూలుగానే వుంటాయి నాకు" అన్నా ఎగతాళిగా నవ్వి.

కాని ప్రకాశం వదల్లేదు. చివరకు బయలుదేరక తప్పింది కాదు.

సరాసరి ఆఫీసరుగారు ఇంటిప్లాట్ దగ్గరకు తీసుకొచ్చాడు. ఇక్కడికెందుకు వచ్చినట్టు? ప్రశ్నార్థకంగా ప్రకాశంవేపు చూశాను. ఇద్దరం చెట్టు నీడలో నిలబడ్డాము. పైన పక్షులు రొదచేస్తున్నాయి. ఎండలో చురుకు పాలు తగ్గలేదు.

నిన్నటి విషయాన్ని పదేపదే జ్ఞప్తికి తెచ్చే ఆ స్థలం నాకు నచ్చలేదు. ప్రకాశం నన్ను తట్టి చూడమన్నట్టుగా కళ్ళెగరేశాడు. అటువైపు చూశాను. నిన్ననాతో ఘర్షణపడిన కూలీయే. యివ్వాళ ఆఫీసరుగారితో వాదిస్తున్నాడు.

"రాస్కెల్ వాడే నిన్న నన్ను చంపడానికి ట్రై చేసింది" ముందుకు పోబోతున్న నన్ను ప్రకాశం చేయి పట్టుకు ఆపాడు.

"వదులు వాడి అంతు తేలుస్తాను" అన్నా కోపంతో చేయి విడిపించుకుంటూ.

"ప్లీస్ వెయిట్ అండ్ సీ. వింతని ముందే చెప్పాను గా అన్నాడు ప్రకాశం నా చెయ్యిని మరింత గట్టిగా పట్టుకుంటూ.

ఘర్షణపడిన కూలీ గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

ఆ కూలీ వెనక్కు వెళ్ళినట్టే వెళ్ళి ఆఫీసరుగారి మీదకు లంఘించాడు. అతని చేతుల్లో పదునైన ఆయుధమేదో వుంది. దీనిని కూడా ప్రకాశం మామూలుగా తీసుకోవటం సహించలేక పోయాను. నేను ఆయనను హెచ్చరించేలోనే నిన్న నన్ను రక్షించిన సర్వయ్య ఆఫీసరుగార్ని పక్కకు నెట్టెయ్యడం జరిగింది. ఈ లోపల ఆ కూలీ తప్పించుకుని పిక్కబలం చూపించాడు.

"ఆశ్చర్యం నిన్న నాక్కూడా ఇలాగే జరిగింది. నిజంగా కూలీ సర్వయ్య దేవుడయుండొచ్చు... నా మాటలను మధ్యలో ఆపుతూ "ఇవాళే కాదు కొత్తగా వచ్చిన ప్రతివారికి దేవుడవుతాడు" అన్నాడు ప్రకాశం తమాషాగా నవ్వుతూ.

"మరి ఆఫీసరుగారు కొత్తవారేం కాదుగా?" వ్యక్తం చేశాను.

"కాని మోసానికి కొత్తవారే" అన్నాడు ప్రకాశం.



"మరి ఈ మోసాన్ని ఆఫీసరుగారికి చెబితే" అన్నానావేశంగా.

"చెప్పినా ఇప్పుడెవరూ నమ్మరు. జరిగిన సంఘటనలాటిది. మనం చెయ్యగలిగేదేం లేదు. అటు చూడండి" అన్నాడు.

మొహమాటం పడుతూనే ఆఫీసరుగారి దగ్గరనుంచి కృతజ్ఞతలతో బాటుగా డబ్బులు కూడా అందుకున్నాడు నర్సయ్య.

చాలాసేపటివరకు నేనేమీ మాట్లాడలేక పోయాను.

"పదండి ఏమిటలా వున్నారు?" అంటూ ప్రకాశం నా భుజంమీద తడుతూ "ఇన్ని ఎత్తులూ, మోసాలు.... అన్నీ కూటికోసం. జస్ట్ ఫర్ ఎ ఫ్యూ డాలర్స్ మోర్" అన్నాడు బాధగా నవ్వుతూ.

—

## జూలై నెల

# భావపరిచయ పోటీ



### బహుమతి పొందిన వ్యాఖ్య

ఆ॥వె॥ రోగమణపనెంచి రోగికిమందీయ
చెవులుకొమ్ములొచ్చె, చిత్రముగను !
విస్తుపోయిచూచె-వెటరినరీమందులు
వాడినట్టి మందవైద్యుడపుడు.

— గౌరవజ్ఝల సుబ్రహ్మణ్యం. ఏలూరు.




"నువ్వేం చెప్పదలుచుకున్నావు అని నన్నెవడూ ఏలదీసి అడక్కపోతే చిన్న కథ చెబుతాన్రా మీకు" అన్నాడు శంకరం మమ్మల్ని చుట్టూ పోగు జేసుకుని. "అడగంలే చెప్పు" అని సావధానంగా కూర్చున్నాం.

"అది చాలా మారుమూల పల్లెటూరు. చిన్న అరుగుబడి తప్ప ఒక వంతెన లేదు. ఒక రోడ్డులేదు. కరెంటు సంగతి అడగనక్కర్లేదు ఆ ఊరు మొహం పైవాళ్ళు చూడకపోవడానికి కారణం ఊళ్ళోవాళ్ళు మొహమొహాలు చూసుకోకపోవడమే. ఎద్దెమంటే తెద్దెమనేవాళ్ళు ఎక్కువ. ఎద్దెమనేవాళ్ళు యువకులు. తెద్దె మనేవాళ్ళు వయోవృద్ధులు. వందపైన బ్రతకడంలో రికార్డులు స్థాపించి ఇంకా బ్రతుకుతున్న ముసలివాళ్ళు ప్రతి పనిని అడ్డంకొట్టి దానివల్ల ప్రయోజనాల సంగతి ఎలా ఉన్నా అనర్థాలని భూతద్దంలో చూపించి ఆపి వేసేవారు. ఈ పనిచేస్తే మన ఊరు సర్వనాశనమైపోతుంది ఫలానా అమ్మవారి శాపం ప్రకారం అనేవారు. నాలుగు ముక్కలొచ్చి పట్నం చదువులకెళ్ళి ఉద్యోగాల్లో స్థిరపడ్డ వారు ఊరు బాగు కోసం ఆలోచించి పెట్టలేదు సరి కదా, "భూగోళంలోకెల్లా దిక్కుమాలిన ఊరు" అని తిట్టుకొనేవారు.

"కాలం గడిచేకొద్దీ, ఒకరిద్దరు తప్ప ఆ ఊరి వయోవృద్ధులు ఒకరి తర్వాత ఒకరు కాలం చేశారు. యువకుల సంఖ్య పెరిగింది. వాళ్ళ గుండె నిబ్బరమూ పెరి

గింది. తెగించి తెప్పను తగులబెట్టి కాల వకి అడ్డంగా చిన్న వంతెన కట్టించు కొన్నారు. వంతెనదాటి అవతలవాళ్ళతో ఇచ్చి పుచ్చుకోడాలు జరిపారు. కానా తె త్తెరు కాలి బాటను వెడల్పుచేసి చిన్న రోడ్డు వేయించుకొన్నారు. చకచకా ఊరు పెరుగుతూ వచ్చింది. పట్టణానికి దారి ఏర్పడ్డంతో చదువులూ వ్యాపారాలూ పెరి గాయి. ఈ లోగా కరెంట్ వేయించాలని తీకట్లో ఉన్న పల్లెటూళ్ళకోసం దేశం వెర్రి లైట్ వేసి వెతుకుతుంటే ఈ ఊరు కనిపించింది. అంతే పక్కనున్న పట్టణం తొంచి కరెంట్ లాగడం మొదలెట్టారు. ఆ ఊరి జనం అంతా సంబర పడి పోయారు. "కోటి రూపాయలు పెట్టినా రాని కరెంట్" అడగకుండా వస్తుంది అని కేరింతలు కొట్టేశారు. ఊరివైపు పెరుగుతూ వస్తున్న కరెంట్ తీగల్ని ఎదురెళ్ళి చూశారు. వడ్డిమీద చేతు లుంచుకొని పనులు చేయించే యింజ నీర్లనీ చకచకా స్తంభాలు పాతి ఉడతల్లా పైకి పాకి తీగల్ని బిగించే పనివాళ్ళనీ చూసి మురిసిపోయారు.

"కాని మిగిలిన యిద్దరు వృద్ధులు కంటతడి పెట్టారు. స్టాటిస్టిక్స్ తీసకొనే వాళ్ళకి తెలియకగానీ, ప్రపంచంలోకెల్లా ఎక్కువకాలం బ్రతికిన ఘనత వాళ్ళదే.

"ఊళ్ళోవాళ్ళంతా వారి దగ్గరికి వెళ్ళి ఎందుకు విచారిస్తున్నారు అని అడిగారు.

"మనూరికి అనర్థం వస్తుందర్రోయ్ అని వాపోయారు వాళ్ళు.

"అనర్థంకారు. దీని పేరు కరెంటు అన్నాడు ఒకతను.

"కరెంట్ లేవోయ్. కాశీకి వెళ్ళినపుడు దీన్ని కళ్ళారా చూశాము. యిది చాలా ప్రమాదం"

"ఏ అమ్మవారైనా శాపం యిచ్చిందా యిది రాకూడదని."

"నీ మొహం శాపం యివ్వాలా. ఇది కొంపలు తగుల బెట్టుతుంది. యిళ్ళ మీద నిప్పులు రాలుస్తుంది. ఊరు ఊరంతా బూడిదయి పోతుందర్రోయ్" అని బిగ్గ రగా ఏడవడ సాగించారు. "మీ ఖర్మ తగులదండి" అనుకుంటూ జనంవాళ్ళిద్దర్నీ వదిలేసి వెళ్ళిపోయారు.

"ఆ వూరికి కరెంట్ వచ్చేసింది. ఊరంతా దేదీప్యమానంగా వెలిగి పోయింది. వారిద్దరు మూలుక్కుంటున్నా ఆ రాత్రి కోళ్ళు మేకలు విరివిగా తెగాయి. ఉన్న ఎత్తులోనే అధికారులకి విందులు చేసేరు. ఊరు వూరంతా పండుగ చేసు కొంది. ఆ కాంతిలో మొహమొహాలు చూసుకుని జనం ముచ్చటపడ్డారు. వయ సులో ఉన్న దంపతులు కొత్త వెలుగులో మళ్ళీ శోభనం చేసుకున్నారు. ఊరంతా వెల్తురు ముద్దయి పోయింది.

"ఈ సందడి చల్లబడకుండానే టెలి ఫోన్లు వేస్తారని మరో శుభ వార్త. "ఓ ర్తిస్సాదియ్యా ఏం అదృష్టంరా" అని అనుకున్నారు. ఇంకా మిగిలిన ఆ యిద్దరు వృద్ధులు మళ్ళీ కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు.

"మళ్ళీ ఏం పోయేకాలం వచ్చిందీ" అన్నట్టు అడిగారు జనం.

"ఏమో బాబూ మీకు చెప్పలేం. హాయిగా ఆముదం దీపాలతో బ్రతికే

వాళ్ళం. కరెంటు లైట్లు తెప్పించి కళ్ళు పోగొట్టారా. స్తంభాలమీద విప్పుతీగల్తో వెలగాటం ఆడుతున్నారా. ఇక దీన్ని తీసుకరండి'' అన్నారు విరుపుగా.

''దీనివల్ల ప్రమాదమేమిటో.''

''ఏవిటా. మీ చెవుల్ని యంత్రాలు చేస్తుంది మీలో సుఖం పెంచి కాలు కదపనీకుండా చేస్తుంది మిమ్మల్ని మొద్దుల్లా బద్ధకస్తుల్లా చేస్తుంది చావండి మీ ఖర్మ ఎలా ఉందో అంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

''జనం టెలిఫోను తీగల్ని చూడ్డానికి వెళ్ళారు. పత్నీ ఇంజినీర్లు పనివాళ్ళ కోలాహలం ఒకరిద్దరు తెలిసిన ఇంజినీరుని ''అయ్యా ఫోను వల్ల లాభాలు తెలవిస్తారా'' అని అడిగారు ఆయన పైపై సర్దుకొని ''సహాజ్ మీ ఊరుకి నిప్పంటుకొందనుకో....'' అని ఎందుకో ఆగిపోయాడు.

''ఛఛ బలేవారండి మీరు. ఊరికి నిప్పేమిటి. ఆ ముసలోళ్ళూ ఆ మాటన్నారు. మీరు అలాగే అంటున్నారు'' అని విసుక్కొన్నారు. ఇంజినీరు ''అది కాదయ్యా నా ఉద్దేశ్యం. టౌన్‌లో నీళ్ళ కార్లుంటాయి ఫోన్లో పిలిస్తే నిమిషంలో వచ్చి ఆర్పేస్తాయి.'' అన్నాడు.

జనానికి ఉపయోగం వచ్చినా ఉదాహరణ రుచించలేదు. ఇంజినీరుమాత్రం బాధపడ్డాడు. సరైన ఎగ్జాంపుల్ ఎన్నుకోనందుకు.

చివరకి టెలిఫోన్లు వెలిసాయి. బాగా డబ్బున్న కొంపలు పంచాయతీ ఆఫీసు లోన్లు పెట్టించుకొన్నాయి.

''అంతా బాగానేఉంది కానీ అమావాస్యకి పౌర్ణమికి ఆ వృద్ధుల ఏడుపు. యింజినీరు మాటలు గుర్తొచ్చి ఉలిక్కిపడతారు ఊళ్ళో జనం.''

శంకరం కథ చెప్పడం ఆపి సిగరెట్టు వెలిగించుకొన్నాడు.

''ఇలా ఉండగా ఒకరోజు ఏం జరిగిందో తెలుసా?'' అన్నాడు.

''ఏం జరిగింది'' అన్నాం ముందుకు వంగి.

''కరెంటు తీగ తెగిపడి ఒక పాటాకు కొంప గుప్పుమంది. మంటలు పైకి లేవాయి అంతకుముందు స్వతహాగా ఆర్పుకొనే జనం ఫోనుమొహం చూపి ఆగిపోయి టౌన్‌లో నీళ్ళకార్లని పిలిపించారు. మంటలు చుట్టూ అల్లుకొని వ్యాపించాయి. కానీ నీళ్ళకార్లు వచ్చేలోగా చివరంటా కాలిన బీడీలా తురతురమంది ఊరు'' అంటూ ముగించాడు.

మేమంతా డిసప్పాయింట్ అయ్యాం. వెధవకథ అనికూడా అనేశాం. నలుగురం నానా మాటలు అన్నాం.

''ఇది శిలంలేని కథ.''

''పాపిష్టి వెధవా. బంగారంలాంటి ఊరుని తగలబెట్టావు కదరా.''

''కరెంటు పాత్రకి టెలిఫోను పాత్రకి తీరని అన్యాయం చేసావు కదరా.''

''నువ్వేం చెప్పదలుచుకున్నావు దీని ద్వారా.''

శంకరం తల విదిలించి ''అదే అడగవద్దన్నాను ముందు'' అని బాధపడ్డాడు.

—



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"క్రింద టాక్సీ వుంది. డబ్బులు యివ్వాలి. డ్రైవర్ రిసెప్షన్ దగ్గర వున్నాడు." తగ్గు స్వరంతో అన్నాను.

"టాక్సీయా!" ఒక్కక్షణం మతిపోయినట్టు చూసిన అతను నన్ను లోపలికి రమ్మనమని పిలిచాడు చప్పున వెళ్ళి హాంగర్‌కివున్న షర్ట్ తీసి వేసుకుని, డ్రాయరు సొరుగులాగి పర్స్ తీసుకుంటూ, 'కూచో! నేను యిప్పుడే వస్తాను'" అంటూ బైటికి వెళ్ళిపోయాడు

నేను సోఫాలో కూర్చున్నాను యిక్కడికి ఎలా వచ్చానో నాకే తెలియదు. కానీ రావటం అనేది చాలా మంచి పని చేసినట్టుగా అనిపిస్తోంది. నేను గదిని కలియచూశాను. అతను పడుకుని చదువుకుంటున్నాడు కాబోలు. మంచం దగ్గర టేబిల్ లైట్ వెలుగుతోంది.

చదువుతున్న పుస్తకం మంచం మీద బోర్లా పెట్టి వుంది.

నా మనసుని ఎంతగా ఇతర విషయాల లగ్నంచేయాలని ప్రయత్నించినా సాధ్యంగావటంలేదు. మాటిమాటికీ నాన్నగారి మాటలే గుర్తుకువస్తున్నాయి. ఆ మాటలు గుర్తుకు వచ్చినప్పుడల్లా, అవి శూలాల్లా ఒక్కొక్క కిన్నిటిపొరని ఛేదిస్తున్నాయి. మనసారా ఒక్కసారి ఏడవాలనిపిస్తోంది. కానీ — నేను యిక్కడికి ఏడవటానికిరాలేదు. అతన్ని సలహా అడగటానికి వచ్చాను జరిగిందంతా చెప్పి యిందులో నా అపరాధం ఏమిటో తీర్పు అడగటానికి వచ్చాను. కనీసం ఒక్క వ్యక్తి నోటి మంచి అయినా నేను

చేసింది పొరపాటులేదని వినాలనిపిస్తోంది. అలా వినకపోతే నాకు మనసు స్థిమితం తప్పుతుందేమోనని భయంవేయసాగింది.

అసలిలా ఎందుకైంది? అమ్మ చెప్పినట్టూ విని బొమ్మలా వుండగా యిలా ఎందుకు చేసాను! నేను చేసినందువల్ల అందరికీ ఆగ్రహం రావటం మినహా జరిగిందేమిటి!

మోకాళ్ళమీద మోచేతులు ఆనించి, అరచేతుల్లోకి ముఖం వంచుకుని కూర్చున్నాను. ఎంత ప్రయత్నించినా కనుకొలకుల్లోకి వచ్చి నిండుతున్న నీళ్ళని నిగ్రహించుకోవటం సాధ్యం కావటంలేదు.

కృష్ణ తిరిగి వచ్చినట్టుగా అడుగుల సవ్వడి. తలుపులు మూసిన శబ్దం వినిపించింది.

"ఛీ—ఛీ! నేను ఏడవకూడదు! నేను పిరికిదాన్ని కాదు! అతని తీర్పు కోసం వచ్చానే తప్ప సానుభూతికోసం రాలేను.

"మీనా! ఏమైంది?" నా దగ్గరగా వచ్చి అడిగిన అతని గొంతులో ఆదుర్దా ప్రతిధ్వనిస్తోంది

నేను మాట్లాడలేక పోయాను.

"చెప్పు. మీనా. ఇంట్లో ఏదయినా గొడవ జరిగిందా?"

అవునన్నట్టు తల వూపాను.

"ఏమైంది?" ఏ విషయంమీద?"

నేను సమాధానం చెప్పలేదు.

క్షణం ఆగి అడగలేక అడిగాడు.

"నా దగ్గరకు రావడం సారధికి తెలిసిందా? నా మూలంగా ఏదయినా స్పర్ధ వచ్చిందా?" లేదన్నట్టు తల తిప్పాను.

"రాజు ఎవరో మీ అమ్మకి తెలిసిందా?"

అదీ కాదన్నట్టు సూచించాను.

"మరి? యింకేం జరిగింది? మామయ్య యింట్లో వున్నారా!"

వున్నారన్నట్టు తల తిప్పాను.

రెండు నిముషాలు గడిచాయి. దుఃఖం నిగ్రహించుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాను.

వున్నట్టుండి కృష్ణ చెయ్యి నా నుదుటి మీద పడింది. నా తల చేత్తో వెనక్కి నొక్కుతూ, "ఏది? తలెత్తు. ఒక్కసారి యిలా చూడు" అన్నాడు.

ఇక ఏడుపు నిగ్రహించుకోవటం నా వశంకాలేదు. రెండు నిముషాలు చూసిన తరవాత అతను హఠాత్తుగా నా పక్కన కూర్చున్నాడు.

"అరెరె. ఏమిటిది? పోన్లే. అంత చెప్పలేని విషయం అయితే అడగనే అడగను. కానీ నువ్వు ఏడవకు! ఏయ్. విన్నే! నీకే చెప్పేది!

ఛ—ఛ! అల్లరి పిల్ల మీనా—నా కొంటె మరదలు మీనాయేనా యిలా ఏడవటం!"

అనురాగ పూరితంగా, ఆత్మీయంగా వున్న ఆ మాటలతో నా ఏడుపు కట్టలు తెంచుకున్నట్టు మరింత ఉధృతమైంది.

నాన్నా, రాజు దగ్గర ఒక కేమెల్ రంగుల పెట్టె ఉంది. వాడు వాటితో ఎంత చక్కటి బొమ్మలు వేస్తాడను కున్నావు? ఆ రంగులు ఎంతో అందంగా, మెరిసిపోతూ ఉంటాయి. అవి చాలా కాలం ఉంటాయని వాడన్నాడు. అందుకని, నాపుట్టిన రోజుకు నాకొక రంగుల పెట్టె కావాలి. అది నాకు తెచ్చి పెట్టవా నాన్నా?




# కేమెల్
## ఆర్ట్ కలర్స్



కేమ్లిన్
ప్రైవేట్ లిమిటెడ్,
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్,
జె.బి. నగర్,
కుర్లా-అంధేరి రోడ్,
బొంబాయి-59.

**నా పుట్టిన రోజొస్తోంది, నాన్నా... నాకొక కేమెల్ రంగుల పెట్టె కావాలి.**



PRATIBHA 70-4-TEL

"మీవా! ఏమిటిది—చిన్నపిల్లలా!" చాలా తగ్గుస్వరంతో అంటూన్న అతని మాటలు ఆ దుఃఖంలో ఆలంబనగా అని పించటంతో అప్రయత్నంగా నేను అత నికి మరింత దగ్గరగా జరిగాను. ఆ తర్వాత నిముషంలో అతను నన్ను దగ్గ రకు తీసుకున్నాడో—లేక నేనే అతనికి మరింత చేరువయ్యానో నాకు తెలియదు నాతలమాత్రం అతని గుండెలకి ఆనింది.

కృష్ణ నాతలమీద చెయివేసి నిము రుతూ అన్నాడు. "నీకు నిజంగా ఏడ వాలని అనిపిస్తుంటే మనసారా—కరువు తీరా ఏడ్చేయి! ఒక్కసారి ఏడిస్తే మన సులో వున్న భారం అంతా తగ్గి తేలికగా అనిపిస్తుంది"

* *

దాదాపు అరగంట తర్వాత—కృష్ణ లేచివెళ్ళి గ్లాసులో నీళ్ళు తెచ్చి బలవం తంగా నాచేత తాగించాడు.

నేను తాగిన గ్లాసు అందుకుంటూ మృదువుగా అన్నాడు. "వెళ్ళి ఒక్క సారి ముఖం కడుక్కుని వస్తావా! ముక్కు కళ్ళు ఎలా వాచిపోయినాయో అద్దంలో ఒక్కసారి చూసుకో."

నేను లేచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాను. చల్లటి నీళ్ళతో ముఖం అంతా కడుక్కు న్నాను. కృష్ణ చెప్పింది నిజమే! ఏడ్చిన తర్వాత మనసు తేలికగా వుంది.

నేను యివతలకి రాగానే పిల్చాడు.

"అయిందా ముఖం కడుక్కోవటం! యిలారా! కూర్చో! ఏం జరిగిందో యిప్పుడు చెప్పు." అన్నాడు.

నేనుసాధ్యమైనంతతక్కువమాటల్తో క్లుప్తంగా రాజుమీద ఏదోషం కల్పించ నట్టుగా జరిగినదంతా చెప్పాను.

నానోటినుంచి వెలువడుతున్న మాటలు వింటున్న కొద్దీ అతను విశ్చేష్టు డవటం, చివర చివరకి ముఖం పాలి పోవటం జరిగింది.

నేను చెప్పింది శ్రద్ధగా—పూర్తిగా విన్న తర్వాత అన్నాడు.

"రాజు యింత సమస్యకి కారణం అయిందా!"

"దాన్నేమీ అనకు. యిందులో దాని తప్పేంలేదు. చేసిందంతా నేను"

"అయితేమాత్రం!" కృష్ణ కుర్చీలో నుంచి చటుక్కున లేచి ఫోన్ దగ్గరకు వెళ్ళాడు.

"ఏమిటిది? ఎవరికి ఫోన్ చేస్తున్నావు నువ్వు?" అన్నాను.

"మామయ్యకి. రాజుని తక్షణం యిక్కడకు తీసుకు రమ్మనమని చెబు తాను"

నేను మెరుపులా లేచి అతని దగ్గ రకి వెళ్ళాను.

ఫోన్ లాక్కుంటూ అన్నాను.

"నీకెలా తెలిసిందంటే ఏం చెబు తావు?"

"ఎలా తెలియటం ఏమిటి? నువ్వు యిక్కడకు వచ్చావని, అంతా చెప్పావని

# అద్భుతమైన రుచి
## ఒక లక్షణమైతే



# బలవర్ధకమైన పోషకత్వం మరొక శ్రేష్ఠమైన లక్షణం

అహా! కరకరలాడిస్తూ తినటం పోషణ పొందటం ఎంత బాగుంటుంది! పార్లే గ్లూకో బిస్కట్లలో పాలు, గోధుమ పంచదారలోని సారం, అత్యధికంగా ప్రోటీన్లు, విటమిన్లూ కూడా ఉన్నాయి.




## పార్లే గ్లూకో బిస్కట్లు
### ప్రత్యేకించి పిల్లలకు ఎంతో మంచివి

భారతదేశంలో అత్యధికమైన అమ్మకం కలిగిన బిస్కట్లు

everest/4f/PPTel

అంటాను.''

"ఆహా! ఏం తెలివి! చాలాగొప్ప పని చేస్తావు. నేను యిందుకేనా యిక్కడకు వచ్చింది?''

''మీనా— కానీ—'' అతని కళ్ళలో క్రోధపు ఛాయలు తొంగిచూస్తూనే వున్నాయి. కానీ నాకేం భయం అని పించలేదు.

ఫోన్ పెట్టేస్తూ అన్నాను

''నేను ఇక్కడ వున్నానని ఎవరికీ తెలియకూడదు. ముఖ్యంగా నాన్నగారికి అందుకే మీదగ్గరికి వచ్చాను.''

కృష్ణ నా ధోరణేమిటో అర్థం గానట్టు చూసాడు.

మళ్ళీ ఫోన్ తీయబోయాడు. నాచెయి అతనిచేతిమీద బలంగా ఆనించి ఆపే సాను.

''నీకేమైనా మతిపోయిందా? కనీసం నువ్వు యిక్కడకి వచ్చానని— క్షేమంగా వున్నానని అయినా చెప్పాలి. లేకపోతె వాళ్ళు యీ అర్ధరాత్రి నువ్వు ఏమయి పోయావోనని ఎంత ఖంగారు పడ్తారో తెలుసా?''

''తెలుసు. నేను కోరుకునేది అదే! ఆలా జరగాలనే నా వుద్దేశ్యం!''

''నీ మొహం!'' అతను నా చెయి లాగివేయ బోయాడు.

''నేను ఫోన్ చేయొద్దని చెబు తున్నాను.'' కోపంతో గట్టిగా అన్నాను.

'ఫోన్ చేయటం నా ధర్మం! నేను చేసి తీర్తాను." కృష్ణ నాచేయిలాగి రిసీవర్ ఎత్తాడు.

నాకు అతని తిరస్కారం చూస్తే రోషంలాటిది వచ్చింది.

'హలో 'కృష్ణ రిసెప్షన్‌కి మాయింటి ఫోన్ నెంబరు యిచ్చి కనెక్టు చేయమని కోరాడు.

''యిదుగో, ముందే చెబుతున్నా. నేనిక్కడ ఒక్క క్షణం కూడా వుండను.'' అవతల ఫోన్ రింగ్ అయి ఎవరో తీసి నట్టున్నారు

కృష్ణ మాట్లాడాడు.

''హలో! హనుమంతరావుగారు కాదా? ఎవరు? మామయ్యేనా? మామయ్యా! నేను! కృష్ణని మాట్లాడుతున్నాను.''

నేను వూపిరి బిగబట్టి చూడసాగాను. కృష్ణ తలెత్తి నావైపు చూసాడు. తర్వాత ఏమనుకున్నాడో ఏమో! మీనా యిక్కడ వుంది నా దగ్గరకు వచ్చింది. మీరు ఖంగారు పడకండి. ఆ? సరే! అలాగే! రూమ్ నంబరు 128 మీరు వెతుక్కునే శ్రమ లేకుండా. నేనే క్రిందకి వచ్చి వెయిట్ చేస్తాను" కృష్ణ ఫోన్ పెట్టేసాడు.

ఈ సంభాషణ పూర్తిగా ఆలకించిన నేను, గబగబా గుమ్మంవైపు నడిచాను.

అతను రెండంగల్లో వచ్చినట్టుగా నా దగ్గరకి వచ్చి నా జబ్బపట్టుకుని ఆపేసాడు.

''ఎక్కడికి వెళ్తున్నావు? మామయ్య ఇప్పుడు యిక్కడికి వస్తానని చెప్పాడు."

"విన్నాను. అందుకే వెళుతున్నాను."

"ఎక్కడికి?"

"ఎక్కడికో అక్కడకి. నీకెందుకు చెప్పాలి?" నాకు నువ్వెవరవని చెప్పాలి? స్నేహితుడివా? అప్పుడివా? బంధువివా?"

"అన్నీ! పోనీ నువ్వేది అనుకుంటే అది."

"వదులు నన్ను. అసలు నీ దగ్గరకి రావటం నాది పొరపాటు. ఏ మామీ దగ్గరకో వెళ్ళుంటే నిశ్చింతగా ఆశ్రయం దొరికేది." అంటూ గుంజుకున్నాను.

"మీనా! ఏమిటి యీ ఆవేశం. ఎవరి మీద నీ కోపం?"

"నీమీదా—నీమీదా—నీమీద! నువ్వు నాకు నిజమైన స్నేహితుడివని, నామాట మన్నిస్తావని గంపెడంత ఆశతో వచ్చాను. అది భ్రమ అని ఇప్పుడు తెలిసిపోయింది. నీకు నాన్నంటే వున్న గౌరవం నామీద లేదు. అతని చేతులు మెల్లగా నన్ను చుట్టేసినాయి.

"మీనా! నీ యిష్టం లేనిదే యిక్కడ మంచి మామయ్య కాదు, దేవుడుకూడా తీసుకువెళ్ళలేడు సరేనా?"

"నీ మాటలు నిజమేనన్న నమ్మకం ఏమిటి?"

"నాకు అబద్ధాలు ఆడటం రాదన్న సంగతి నీకు తెలుసు."

నేను అతని చేతులు వదిలించుకో బోయాను. కానీ సాధ్యం గాలేదు. అతని చేతుల్లో బందీగా అయిన నేను కోపంగా చూస్తూ అన్నాను.

"వదులు నన్ను."

"వదలను."

"జాగ్రత్త! ఇప్పుడు వదలకపోతే జీవితాంతం భరించాల్సి వుంటుంది నీ యిష్టం."

అతని కళ్ళలో ఆశ్చర్యంలాటిది కదలాడింది. వెంటనే చేతులు పట్టు సడల బోయినాయి. కానీ మళ్ళీ ఎందుకో అంతలోనే ఆగిపోయినాయి.

"ఫర్వాలేదు. నీ బెదిరింపులకి నేనేం భయపడను." అతను నవ్వాడు.

అందమైన అతని పలువరుస తళుకుమంది. ఆ నవ్వు నిష్కల్మషంగా, వేయి వెన్నెలలు కురిపించినట్లుగా వుంది. నా చెవుల్లో కోటివేణువుల నాదం మృదుమధురంగా వినిపించింది. అపరూపమైన కాంతితో, తళుకులాడుతున్న అతని కళ్ళలోకి చూస్తూ, నన్ను నేను మర్చిపోయినట్టుగా నిలబడ్డాను. మా యిద్దరిలో మొదటగా తేరుకున్నది అతనే!

అతని చేతులు విడివడినాయి. నా చెయి పట్టుకుంటూ, మృదుగంభీరమైన స్వరంతో అన్నాడు. "బుద్ధిమంతురాలిలా లోపలకి రా! వచ్చి కూర్చో!"

* *

నాన్నగారు వచ్చి వెళ్ళిపోయారు. ఆయన దాదాపు గంటకి పైగా వుండి వెళ్ళారు. నన్ను ఇంటికి రమ్మనమని






# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్ని అరికట్టుతుంది.

**ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా రక్షిస్తుంది.**

ఇది దంతవైద్యునిచే సృష్టింపబడింది. ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన పదార్థాలు దీనిలో ఉన్నాయి. నియమానుసారం, రాత్రి, ప్రొద్దుట, ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకుంటే, ఇగుళ్ల బాధలు, దంతక్షయము మీ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం నేర్పటానికి ఇదే మంచి తరుణం. క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పటం ఉత్తమం. కావున, నేడే ప్రారంభించండి.

**ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.**




**ఫోర్‌హాన్స్**
దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్‌పేస్టు

---

**ఉచితము** "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పది భాషలలో*, మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ 10031, బొంబాయి-1 బిఆర్, వద్ద దొరకును.

పేరు ______________________ వయస్సు— Y—11 -

చిరునామా ______________________



*పోస్టు ఖర్చులకై, 20 పైసల తపాలా బిళ్లలు పంపండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉరుదు, బెంగాలీ, తమిళం, తెలుగు, మళయాళం, కన్నడ భాషలలో ఏది కావాలో సూచిస్తూ, దాని క్రింద గీతగీయండి.

92F-152D TEL

కృష్ణచేత అడిగించారు. నేను రానని మొండిగా అనేశాను. అసలు నాన్నగారు ఆ గదిలో అడుగు పెట్టగానే నేను లేచి అవతలవున్న డ్రెస్సింగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాను. కృష్ణ లోపలకివచ్చి, ఇక్కడ "నిలబడ్డావేం? మామయ్య వచ్చారు యివతలకిరా!' అన్నాడు.

నేను రానని తిరస్కరించాను.

గంటకిపైగా కూర్చున్న నాన్నగారు నా హఠంవల్ల తను పడుతున్న వేదన అంతా కృష్ణకి వివరించాడు. నాకు వయసు పైబడుతున్నకొద్దీ బొత్తిగా జ్ఞానం లేకుండా పోతున్నాదన్నారు నేను అసలు చెప్పేవాళ్ళులేక చెడిపోతున్నానట! నాన్నగారు వచ్చి నన్ను బ్రతిమలాడుతారని. అనునయంగా ఏదో చెబుతారని. జరిగిన దానికి బాధపడతారని ఎంతో ఆశగా చూసిన నాకు తీవ్రమైన ఆశాభంగం కలిగింది. నే నిలా చెప్పకుండా సరాసరి కృష్ణ దగ్గరకు రావటం ఆయనకి యింకా కోపం తెప్పించింది.

"మీరు వెళ్ళండి మామయ్యా! నేను తర్వాత మీనాని తీసుకువచ్చి దింపుతాను" కృష్ణ నచ్చచెబుతున్నట్టుగా అన్నాడు.

ఆయన వెళ్ళిపోయేముందు నే నున్న గది గుమ్మందగ్గరకి వచ్చి అన్నాను,

"మీనా! నువ్వు చిన్న పాపాయివి కాదు. బుద్ధి తెలిసిన దానివి. మీ అమ్మ నీమీద పెట్టుకున్న ఆశలు వమ్ముచేయకు. నలుగురిలో నవ్వులు పాలయేలా ప్రవర్తించకు. అది నీకు—మాకూ కూడా మంచిదికాదు. గుర్తుపెట్టుకో." అనేసి వెళ్ళిపోయారు. నే నెన్నడూ ఎరగని ఆ కర్కశత్వం ప్రతిధ్వనించింది ఆ మాటల్లో. నాన్నగారికి ఏమైంది? ఆయన ఎందుకిలా మారిపోయారు? అదే నాకు బొత్తిగా అర్థం కావటంలేదు

నాన్నగారిని క్రిందవరకూ పంపి కృష్ణ తిరిగివచ్చాడు వస్తూనే అన్నాడు

"నువ్వు చాలా పొరబాటు చేశావు మీనా. నువ్వు చెప్పకుండా వచ్చినందుకే ఆయన బాధ పడుతుంటే, యిప్పుడు రానని మొరాయించి యింకా కోపం తెప్పించావు.

"అవును. నాన్నగారికి యీ మధ్య తరచుగా నామీద విసుగు వస్తోంది. అందుకే వాళ్ళకి దూరంగా వుండదలుచుకున్నాను."

"ఎన్నాళ్ళుంటావు?"

"జీవితాంతం. దూరంగా వుంచేనే పిల్లలమీద తలిదండ్రులకి. తలిదండ్రుల మీద పిల్లలకి ప్రేమాభిమానాలు ఎక్కువవుతాయి. నాకు బుద్ధి తెలిసినప్పటినించి వాళ్ళ కళ్ళెదుటే వున్నాను. యిక యిల్లరికం భర్త వస్తే ముందు జీవితం అంతా అలాగే వుండాలిసి వస్తుంది. అందుకే పారధి నాకు నచ్చలేదు."

"మీ అమ్మావాళ్ళనికాదని ఎక్కడకు వెళ్తావు నువ్వు?"

"విమలూరు వెళ్తాను."

అతను యిబ్బందిగా చూశాడు. అంత లోకే నవ్వేశాడు.

"బాగుంది. కానీ నేను ఒప్పుకోక పోతే?"

"నువ్వా! నీ యిష్టం ఎవరికికావాలి? మా తాతయ్య దగ్గరికి నేను వెళ్తాను."

"వెళ్తావు. నిజమే! కానీ పిల్లలేని వరాయి పిల్లని అమ్మ ఏ అధికారంతో ఉంచుకోగలుగుతుంది?"

నేను ఆలోచించాను. నాకు ధైర్యం లాటిది వచ్చింది. సంకోచాలన్నిటిని వది లించుకున్నాను.

"సరే! వెళ్ళేముందే ఆ అధికారం ఏమిటో సంపాదించుకునే వెళ్తాను."

"ఏమిటా అధికారం?"

"ఆ యింటి కోడలిగా వెళ్తాను."

అతను చకితుడైనట్టు చూశాడు.

గదిలో అతి విచిత్రమైన నిశ్శబ్దం ఏర్పడింది

నన్ను అతను పరీక్షగా సీరియస్‌గా చూడసాగాడు.

నేను తగ్గుస్వరంతో చెప్పేశాను.

"ఇంతకంటే ఎలా చెప్పాలో నాకు తోచటంలేదు. యింకేమీ అడగకుండా నా మనసు నువ్వు గ్రహిస్తే నేను ధన్యు రాలిని! కృతజ్ఞురాలిని కూడా!"

చాలా సేపటివరకూ. అతనేం సమా ధానం చెప్పలేదు. నన్నేం! ప్రశ్నించ లేదు.

"మాట్లాడవేం?" చివరకి నేనే అడిగాను.

"ఏం మాట్లాడను! ఒంటిమీద తెలివి లేనట్టు నువ్వు ఏదో అనేస్తుంటే నేనేం జవాబు చెప్పను."

"యిదా నువ్వు నన్ను అర్థం చేసు కుంది?"

"అతను నా చేయిపట్టి ఇలాకూర్చో." అంటూ తన కెదురుగానున్న సోఫాలో కూర్చోపెట్టాడు. "యిప్పుడు చెప్పు. సీరియస్‌గా మాట్లాడు" అన్నాడు.

"నేను యింతక్రితంనుంచి సీరి యస్‌గానే మాట్లాడుతున్నాను. నువ్వే వినిపించుకోవటం లేదు. నేను నిన్ను ఒక విషయం అడిగాను. సమాధానం చెప్పాల్సింది నువ్వు."

"మీనా! నా వుద్దేశ్యంలో యిది సాధ్యంకానిపని!"

"ఎందుకని! కారణంచెప్పు?"

"నీకు తెలియదా? మనిద్దరి జీవితాలకి హస్తి మశికాంతరం అంత తేడావుంది. కొన్ని వూహలు వూహించటానికి చాలా అందంగానే వుంటాయి. కానీ అనుభవం లోకి వచ్చేసరికి అరివిలా అంతమవు తాయి. చివరకు మిగిలేది అశాంతి, మనస్పర్థలూ! సిరిసంపదలమధ్య మల్లె పువ్వులా నాజూకుగా పెరిగిన నువ్వు—"

"ఆరాజా తనం మనసుదికాని, శారీ రకమైనదికాదు. అది వాడకుండా వుండా

మీ బహుమాన
ట్రాన్సిస్టర్‌కు
మీరు విలువిస్తే



మీ
ట్రాన్సిస్టర్ రేడియోకై
వాడండి

# ఎవరెడి

**1050**

ట్రాన్సిస్టర్ బ్యాటరి




యీ రౌండ్ బ్యాటరి
ట్రాన్సిస్టర్లకై శక్తినిచ్చేందుకు
మరియు సంరక్షించేదుకు
ప్రత్యేకంగా చేయబడింది.

- హెచ్చు కాలం ఒకే విధమైన శక్తి నిస్తుంది.
- హెచ్చు లీక్ నిరోధక శక్తిగలది—మీ ఖరీదైన ట్రాన్సిస్టర్ భాగాలను పాడుచెయ్యదు.
- స్పష్టమైన. ధ్వని వికలతలేని శబ్దగ్రహణ కలుగ జేస్తుంది.
- అమోఘంగా పనిచేస్తుంది, అధిక మన్నిక.

రూ.1.10
పన్ను అదనం

UNION CARBIDE

ప్రతి మాదిరి ట్రాన్సిస్టర్ రేడియోకి
ఒక 'ఎవరెడి' బ్యాటరీ ఉంది. కావలసినది తీసుకోండి.

లంటే నీలాటివాడి అండ చాలా అవసరం. నువ్వు వూహలు అని ఏదేదో అంటున్నావు. నీ గు రిం చి నా కెలాటి వూహలు అల్లుకోలేదు. నా కళ్లెదుట కన్పిస్తున్నదంతా వా స్త వ మే! నువ్వు డబ్బుసంగతి అడ్డు చెబుతున్నావు. నాకది పెద్ద దాటకాని అడ్డుగా అనిపించ టంలేదు. ఈరోజు బళ్ళు రేపు ఓడలు అవచ్చు. ఆస్థి. అంతస్థు అన్ని వున్నా యని ఏరి కోరియిచ్చిన వాళ్ళు బికార్లుగా మారిన సంఘటనలు నే ను చూసాను. దురదృష్టం అనేది మనకు వ్రాసిపెట్టి వుంటే అది ఎక్కడున్నా తరుముకొని వస్తుంది. దానికి కలిమిలేములు అడ్డు రావు.''

"యిక నేను నీకు నచ్చచెప్పలేను." విస్సహాయంగా చూసాడతను

"వద్దు. ఆ ప్రయత్నం మానేయి. అత్తయ్యకి వెంటనే మనసంగతి వుత్తరం వ్రాస్తావని చెప్పు."

"కానీ— నేను—రాజు పెళ్ళి అయితే కాని చేసుకోకూడదను కుంటున్నా''.

"ఈ కుంటి సాకులుతీసి అవతల పారేయి. రాజుకి లక్షణంగా మనిద్దరం మన చేతులమీదుగా పెళ్ళి చేద్దాం.''

"మీనా!'' అతనికళ్ళలో సంభ్రమం లాటిది కన్పించింది.

"నువ్వు కొన్ని సందేహాలు బైట పెట్టావు. నేను వాటికి తగిన సమాధానాలు చెప్పాను. ఇప్పుడు కూడా నువ్వు కాదనేఅంటే నువ్వు పిరికివాడి వని, మా అమ్మ నీటికి భయపడ్తున్నావని డబ్బుగల నన్ను చేసుకోటానికి బెదురుతున్నావని అనుకుంటాను. ఇందాక సాయంత్రం నువ్వు "నాధైర్యంగురించి ఇప్పుడు సవాలు చేయకు" అన్నాను. నేను నిజంగానే సవాలు చేస్తున్నాను. నీలోవున్న శక్తిసామర్థ్యాలు—తెగింపు—తెలివితేటలు నిజం అవునో కాదో నాకిప్పుడు తెలుస్తుంది. మాటలకి—మనుష్యుల చేతలకి ఎంత దూరమో యిప్పుడు తెలుస్తుంది." కృష్ణ నవ్వాడు. నవ్వుతూనే అన్నాడు

"నాకుంది యీ బెదిరింపు. నా మెడకి వురి బిగిస్తున్నావా"

"నువ్వేలాగైనా అనుకో! నాకు కావాల్సింది నీకంటి నిర్మొహమాటమైన సమాధానం!"

"సరే. సమాధానం చెప్పేముందు— నేను నీకు కొన్ని విషయాలు చెబుతాను. వింటావా!"

"మనిద్దరికీ సంబంధించినవైతే వింటాను"

"మనిద్దరికీ కాదు. అవి నా ఒక్కడికే సంబంధించినవి. ఇన్ని సంవత్సరాల తర్వాత మళ్ళీ యిలా గతం నెమరు వేసుకోవాల్సి వస్తుందని, అందులోనూ నీ ముందు నా మనసులో గుప్తంగా వున్న యీ కలలోనం చెప్పాల్సి వస్తుందనికాని నేను కలలోకూడా అనుకోలేదు. నువ్వు

ధైర్యం, సాహసం అంటూ సవాలుచేసి నా మెడకి వుచ్చు బిగిస్తున్నావు కాబట్టి చెప్పక తప్పటంలేదు.''

''చెప్పు.'' కుతూహలంగా చూసాను.

''నేను మీ యింట్లో అడుగు పెట్టటానికి ఎందుకు యిష్టపడటం లేదో మామయ్య నీకు ఎప్పుడూ చెప్పనేలేదు కదూ?''

లేదన్నట్టు తలవూపాను. అతని గొంతు గంభీరంగా పలికింది.

''మీనా! నేను చదువు తక్కువ వాడిని! పల్లెటూరివాడిని! మోటుమనిషి నేమో కూడా! కానీ జీవితంలో ఎప్పుడైనా ఎక్కడైనా అవమానం పొందితే దెబ్బతిన్న పాములా నా మనసు ఆ సంఘటన మర్చిపోదు! అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా బుసలు కొట్టూనే వుంటుంది. కాలం కలిసివచ్చి, అవకాశం దొరికితే కసితీరా కాటువేస్తుంది కూడా మీ అమ్మ నన్ను ఒకరోజున తీవ్రంగా అవమానించింది. ఆ రోజు నే జన్మలో మీ యింట్లో అడుగు పెట్టకూడదని శపథం చేసుకున్నాను ''

నేను చురుగ్గా చూసాను. నా గుండెల్లో ఏదో భయంలాంటిది కదిలింది కృష్ణముఖం గతస్మృతులు కళ్ళ ఎదుట కవ్విస్తున్నట్లుగా కఠినంగా వుంది.

అతను చెప్పసాగాడు.

''అవి నేను S. S. L. C. చదివే రోజులు. ఇంకా పరీక్షలు అవలేదు. మా ప్రాంతం అంతా పెద్ద తుఫాను వచ్చింది. శనివారం సాయంత్రం యింటికి వచ్చిన నేను, ఆరాత్రి కుంభవృష్టిగా వర్షం, పెనుగాలి ప్రారంభం అవటంతో స్కూలుకి వెళ్ళటానికి మళ్ళీ బైలుదేర లేకపోయాను. శనివారం సాయంత్రం ప్రారంభమైన ఆగాలి, వర్షం వరసగా నాలుగు రోజులు తగ్గకుండా 24 గంటలు కురిసింది. ఏర్లు పొంగినాయి. కాలవలు కట్టలు తెగినాయి చెట్లు, యిళ్లు నేల కూలినాయి. కాలు కదపటానికి వీలుకాకుండా ఎక్కడ చూసినా నీరు! నీరు! వూళ్ళన్నీ జల ప్రళయంతో భీభత్సంగా తాండవించినాయి. ఎన్నో కుటుంబాలు ఆశ్రయహీనం అయినాయి. మాది పెంకుటిల్లు ఆ వానలో, గోడలు వాలి, యిల్లంతా ధారలు కురుస్తున్న ఆ చిన్నయింట్లో అమ్మ, నేను, పిల్లలం ప్రాణాలు అరచేత్తో పెట్టుకుని ఆ నాలుగురోజులు గడిపాం. ఏ క్షణంలో యిల్లు కూలుతుందో, ఏ నిముషంలో మృత్యువు మమ్మల్ని కబళిస్తుందో అని గజగజలాడాం. పోతే అందరం ఒక్కసారి పోవాలి, లేకపోతే అందరం బతకాలి ఒకళ్ల పోయి ఒకళ్ల బ్రతికే బాధ మాకు వద్దు అంటూ దైవాన్ని ప్రార్థించాము నేను.

తుఫాను తగ్గింది. మా యిల్లు కూలకపోవటం మాతోపాటు అందరికీ ఆశ్చర్యం వేసింది. మాపక్క రెండు యిళ్లు కూలినాయి. ఇంకో పక్కయింటికి పైకప్పు

లేచిపోయింది. వాళ్ళు పడిన అవస్థ అంతా యింతా కాదు. అమ్మ, నేను, పిల్లలం అందరం మళ్ళీ పునర్జన్మ ఎత్తి వచ్చినట్టే భావించాం. కానీ ఆ బ్రతికిన సంతోషం మాకు ఆట్టే రోజులు నిలవ లేదు. పంటలన్నీ పాడయిపోయినాయి, పశువులు చాలా చనిపోవటంతో పాల చుక్క కరువైపోయింది. ఎక్కడ చూసినా కరువు! కరువు! ఎవరి ముఖంలో చూసినా ఆకలి! ప్రభుత్వం సహాయం పంపింది, కానీ అది ఒక మూలకికూడా రాలేదు. ఆ వచ్చిందికూడా పరపతి వున్న వాళ్ళకే అందింది.

ఎలాగో అతి కష్టంమీద యిల్లు బాగు చేసుకున్నాం. బజారులో అన్ని వస్తువులు మండిపోతున్నాయి. మా చేతిలో చిల్లి గవ్వ లేదు. ఒకరోజు రెండురోజులు కాదు. వారాలు తరిగిపోసాగినాయి. అక్కడికి వూళ్ళో కాస్తో కూస్తో వున్న వాళ్ళు పది, పాతిక సాయం చేసారు. కానీ అది ఏ మూలకి? ఇంట్లో ఉపవాసాలు మొదలయినాయి. మణి, మధు మరీ చిన్న పిల్లలు. ఆకలికి వుండలేక పిచ్చి పట్టి నట్టు ఏడ్చేవాళ్ళు. ఒక్కోసారి ఏడ్చిఏడ్చి మధు ప్రాణం కడబట్టింది. అమ్మ చివరకి మామయ్య పేరుమీద వుత్తరం వ్రాసి డబ్బు పంపమని కోరింది. అప్పటికే మీకూ, మాకు మనస్పర్థలు వున్నాయి. ఆ యింటిమీద కాకి మా యింటిమీద వాలటంలేదు.

అయినా సరే. అమ్మ అభిమానం విడిచి మామయ్యకి రెండు ఉత్తరాలు వ్రాసింది. వాటికి జవాబేరాలేదు. మామయ్యకి ఆ ఉత్తరాలు అంది వుండవని. అందితే డబ్బు తప్పకుండా పంపివుండే వాడని అమ్మ దృఢనమ్మకం చివరకి,నాన్న గుర్తుగా. ప్రాణప్రదంగా దాచుకున్న వుంగరం అమ్మేసి నన్ను హైదరాబాద్ వెళ్ళి మామయ్యకి మన విషయం చెప్పమని పంపింది.

నేను బైలుదేరేటప్పుడు మధుకి జ్వరం. మాగన్నుగా స్పృహలేకుండా పడివున్న వాడినిచూస్తే, నేను తిరిగివచ్చే వరకూ వీడు దక్కడని భయం వేసింది. ఎలాగో మొండి ధైర్యం తెచ్చు కొని బైలుదేరాను.

హైదరాబాద్ వచ్చాను. అంతకు ముందు రెండు నెలల క్రితమే స్కూల్ తరపున ఎక్స్‌కర్షన్‌కి నేను యీ వూరు రావటంతో, ఆ రోడ్డు అవీ తేలికగానే తెలిసినాయి. మీ ఇల్లు సులభంగానే కనుక్కోగలిగాను. ఆ రోజు—నేను వచ్చేసరికి మీ యిల్లంతా చాలా సందడిగా ఆటూ యిటూ తిరుగుతున్నారు. నేను 'హనుమంతరావుగారు' కావాలి అన్నాను. మీ తాయారమ్మ కన్నులు ఎగాదిగా చూసి "ఎవరునువ్వు" అంది. మాసినబట్టలతో, పేదరికం ఓడుతూ, వచ్చిన నేను ఆయన మేనల్లుడిని అని చెప్పుకోటానికి సిగ్గు పడ్డాను.

# మీ సేవాభిలాషి

# స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్‌తో మీరు వ్యవహరించేటప్పుడు, మీరు సామాన్యమైన బ్యాంకింగ్ సౌకర్యాలన్నీ పొందుతారు. అంతేకాదు, మరో ప్రత్యేకత కూడా!

మీ గురించీ, మీ ఆర్థికవిషయాల గురించీ వ్యక్తిగతంగా మేము తీసుకునే శ్రద్ధే ఈ ప్రత్యేకత. మేము చూపే శ్రద్ధ విషయంలో, మాకు ఏ ఒక్కరూ తక్కువ వారనిపించరు. సేవచేయటమే మా లక్ష్యం. ఆ సేవనే సకాలానికి, సామర్థ్యంతో, సగౌరవ ప్రదంగా అందజేస్తాము.

ప్రధాన కార్యాలయ భవనం
హైద్రాబాద్.




## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్

అయినా చెప్పక తప్పలేదు.

తాయారమ్మ లోపలికి వెళ్ళి చెప్పగానే మామయ్య యివతలికి వచ్చారు

నన్ను చూడగానే "ఇదేమిట్రా కృష్ణా! యిప్పుడు వచ్చావు?" అంటూ ఆదుర్దాగా అడిగారు. క్లుప్తంగా మాకు వచ్చిన యిబ్బంది అంతా చెప్పాను నేను చెబుతుంటే మామయ్య కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"నేను వూళ్ళోలేను. కలకత్తాకి వెళ్ళి నిన్ననే తిరిగివచ్చాను రేపో ఎల్లుండో బైలుదేరి విమ్మలూరు వద్దామనుకుంటు న్నాను." అన్నాడు.

నన్ను లోపలికి రమ్మనమని ఆద రంగా తీసుకెళ్ళాడు

అక్కడన్ని పిండివంటలతో భోజ నాలు వడ్డించి వున్నాయి

"రా! రా! ఈ రోజు మీనా పుట్టిన రోజు" అన్నాడు.

నువ్వు పట్టుపరికిణీ జాకెట్‌తో, ఒంటి నిండా ధగధగలాడే నగలతో ఎవరో ఆడవాళ్ళ మధ్య వున్నావు.

"మామయ్య భోజనానికి పంక్తిలో తన పక్కన కూర్చోమని చెప్పాడు. కానీ యింతలో మీ అమ్మ అక్కడికి వచ్చింది. "అక్కడెవరుకూర్చోమన్నారు నిన్ను లే. లే! అవతలి గదిలోకి వెళ్ళు అక్కడున్నాయి యిస్త" అంటూ కసి రింది.

నేను లేచి అవతలగదిలోకి వెళ్ళాను.

"వెధవబట్టలూ వాడూను. భికారి వెధవలా" అని విసురుగా వినిపించింది. నేను చివ్వున వెనక్కి తిరిగాను. నా గుండెలు మండిపోయినాయి.

అక్కడ చేతికి అందినదితీసి ఆవిడ ముఖంమీద విసరికొట్టేవాడినే! కానీ యింతలో వంటబ్రాహ్మణుడు "పక్కకు తప్పుకోవయ్యా! అని అరవటంతో అవ తలకి వెళ్ళాల్సి వచ్చింది.

నేను భోజనం చేయలేదు. తర్వాత మామయ్య అడిగితె చేసానని చెప్పాను. ఆసాయంత్రం ట్రెయిన్‌కి వెళ్ళి పోతా నని చెప్పాను.

మామయ్యా ప్రస్తుతానికి ఒక వేయి రూపాయిలు యిస్తానని అవి తీసు కెళ్ళ మని తర్వాత తనువచ్చి అమ్మతో మాట్లా డతానని చెప్పాడు.

అడ్రసు తీసుకోటానికి నాకు రోషం అనిపించింది. కానీ మామయ్యా మంచి వాడు. మేమంటే అభిమానం వున్న మనిషి. అందులో వుత్తచేతుల్తో వెళ్ళి గంపెడంత ఆశతో ఎదురు చూస్తున్న అమ్మని నిరాశ పరచలేను. అందుకని తప్పనిసరిగా తప్పుకున్నాను.

మామయ్య డబ్బు యిస్తుండగా ఎవరో పిలవటంతో ముందు హాల్లోకి వెళ్ళాడు. నేను డబ్బు జాగ్రత్తగా కవ రులో పెడుతుండగా యింతలో మీ అమ్మ అక్కడకి వచ్చింది. ఆ డబ్బు చూడగానే ఆవిడ నా దగ్గరకి వస్తూ.

"ఎక్కడిది ఆడబ్బు?" అని అడి

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!




పిల్లల శక్తి చదువుల్లో ఆటల్లో త్వరగా హరింపు అయిపోతుంది. శక్తిని తిరిగి సమకూర్చటానికి ప్రతి దినం వారికి బోర్న్‌విటా ఇవ్వటం మంచిది. క్యాడ్‌బరిస్ తయారుచేసిన రుచికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారల సంతులిత మిశ్రమం—బోర్న్‌విటా




## శక్తి, ఉత్సాహం మరియు
## రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!

Bensons/4664 Tel

గింది మామయ్య యొచ్చారని చెప్పాను.

''మామయ్య యొచ్చారా? యిస్తారు! ఆయన మంచితనం ఆసరాచేసుకుని మీ అమ్మ నన్ను పీక్కుతినాలని చూస్తోంది. ''ఆయన పరసమాడు! కనీసం నాకు మాటమాత్రం అయినా చెప్పలేదు.''

''అత్తయ్యా! మాకు చాలా యిబ్బందిగా వుంది.'' నన్నచెప్పబోయాను. ఆమాట వినగానే ఆవిడ విరుచుకు పడింది.'' యిబ్బందా? యిబ్బంది లేనిది ఎవరికి? ఏ చెట్టుకి అంతగాలి అంత యిబ్బందిగావుంటే నువ్వు—మీ అమ్మ పిచెల్లెళ్ళు వెళ్ళి ఎక్కడైనా అడుక్కుతినండి. అంతేగాని మా కొంపలమీదకి రావద్దు. మమ్మల్ని జలగల్లా పీల్చి పిప్పి చేయొద్దు.''

గబ గబా రాళ్ళవర్షంలా కురిపించేసి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

నేను విశ్లేష్టునని అయాను. ఆడబ్బు నాకు వికృతంగా కనిపించింది. ''అంత యిబ్బందిగా వుంటే —నువ్వు— మీ అమ్మ పిచెల్లెళ్ళు వెళ్ళి ఎక్కడైనా అడుక్కుతినండి' యీ మాటలు నన్ను శూలాల్లా పొడిచినాయి. డబ్బు అక్కడ టేబిల్ మీద పెట్టేసి వచ్చేసాను. వెళ్తున్నానని మామయ్యకి చెప్పలేదు నేను వచ్చేస్తుంటే నువ్వు నా ఎదురుగా వచ్చావు. నీ చేతిలో ఖరీదయిన విదేశీ రబ్బరుబొమ్మ వుంది. నీకు పూలజడ వేసారు.

నన్ను చూడగానే. ''ఏయ్! నా జడకి

గుండీ పట్టుకుంది. తియ్యవూ?" అంటూ వెనక్కి తిరిగావు. నిన్ను ఒక్కతోపు తోయాలన్నంత ఆవేశం వచ్చింది. కానీ ఎలాగో నిగ్రహించుకున్నాను నీ జాకెట్ గుండీని పట్టుకున్న జడని విడిదీసాను ఆరోజు నువ్వు పెట్టుకున్న నగలు, కట్టుకున్న ఆకుపచ్చ జరీగళ్ళ లంగా, జాకెట్టూ నాకిప్పటికీ గుర్తుకు వున్నాయి.

అక్కడనుంచి సరాసరి స్టేషన్‌కి వచ్చి యింటికి వచ్చేసాను. రెండురోజులు భోజనం లేదు. నా కళ్ళు తిరిగిపోసాగినాయి. ఆకలిబాధకంటే మీ అమ్మ అన్న అవమానపు మాటలు రంపాల్లా నా గుండెల్ని చీల్చసాగినాయి.

ఇంటికి తిరిగి వచ్చాను. మామయ్య వూళ్లోలేడని అమ్మతో అబద్ధం చెప్పాను.

రెండు రోజుల తరవాత మామయ్య మా విమ్మలూరు వచ్చాడు. డబ్బు తీసుకోకుండా, చెప్పకుండా వచ్చేసినందుకు చీవాట్లు వేశాడు. తన వెంట తెచ్చిన డబ్బు అమ్మ కివ్వబోయాడు. నేను అమ్మని అది ముట్టుకోవద్దన్నాను. అది తీసుకుంటే నేను యింట్లో ఒక్కక్షణం కూడా వుండనన్నాను.

అమ్మ మామయ్య యిద్దరూ తెల్లబోయారు.

"మేం డబ్బులేకపోతే పస్తులుంటాం. లేకపోతే అడుక్కుతింటాం అంతేకానీ నీ డబ్బువద్దు" అన్నాను

నా ధోరణికి అమ్మ విస్తుపోయింది.

మామయ్య వెళ్ళేముందు నన్ను దగ్గరకి పిలిచి, నిజం చెప్పు రా కృష్ణా" మీ అత్తయ్య ఏమైనా అందా?" అని అడిగాడు. నేను సమాధానం చెప్పలేదు. ఆయన వెళ్ళిపోయాడు. ఆ తర్వాత రెండు సార్లు మనియార్డర్ చేశాడు నేను తిరగకొట్టాను.

ఆ వారంలోనే నేను బందరు వెళ్లాను. ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసులో లారీలు బస్తాలు ఎత్తటం, దింపటం చేసే కూలీగా చేరాను. ఒకసారి మా వూరి కర్ణంగారు చూసి,యిదేమిటోయ్ కృష్ణా. యిదేంపని?" అంటూ నన్ను తీసుకు వెళ్ళి ఒక కోమటి కొట్లో పద్దులురాసేపని ఇప్పించాడు. ఆ కోమటి చాలా మంచివాడు. ఎక్కువ వడ్డీ వేసుకున్నా అడిగినంత సామాను ఇచ్చేవాడు. నేను యింట్లో భోజనానికి కావాలిసిన సరకులన్నీ వారం, వారం ఆ కొట్లోంచి తీసుకు వెళ్ళేవాడిని. అంత క్లిష్టపరిస్థితుల లోనూ, నేను చదువు అశ్రద్ధచేయలేదు. పరీక్షలు బాగానే వ్రాశాను.

(ఇంకా వుంది)

---

Published by A. Thirupathi Rayudu at No. 1, Arcot Road, Madras-2.
and Printed by G. Veera Brahmam at his Anuradha Acchagam,
146, T. H. Road, Madras-21.
Controlling Editor: "CHAKRAPANI"

# Kleertone

# క్లీర్‌టోన్ - సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

'క్లీర్‌టోన్' రకరకాల విద్యుత్ ఉపకరణాలకు పెట్టింది పేరు. నాణ్యమైన ఈ ఉపకరణాల వెనుక, ఏళ్ళ తరబడి సాధించిన తయారీ అనుభవం ఉన్నది. అందుకే, దేశమంతటా వేల కొద్దీ గృహిణులు 'క్లీర్‌టోన్' ఉపకరణాలనే వాడుతున్నారు.
మీ సొమ్ముకు తగ్గ విలువగల వస్తువులు కావాలంటే, 'క్లీర్‌టోన్' విద్యుత్ ఉపకరణాలనే కొనండి. ఈ ఉపకరణాల సర్వీస్ కొరకు దేశమంతటా 1,500 కు పైగా క్లీర్‌టోన్ డీలర్లు విస్తరించిఉన్నారు.




ULKA KL-3-71

నేషనల్ రేడియో & ఎలెక్ట్రానిక్స్ కంపెనీ. లిమిటెడ్ (జనరల్ రేడియో & అప్లయన్సెస్ డివిజన్.) బొంబాయి . ఢిల్లీ . కలకత్తా . మద్రాస్

One Rupee
& Fifty Paise

Regd. No. M
H









ప్రతి యింట తప్పక వుండదగిన...

# జిందా
# తిలిస్మాత్




దగ్గు, జలుబు, తలనొప్పి
వళ్లునొప్పులు, డిసెంట్రి కల



# ఫారూఖీ






## దంత మంజన్

శుభ్రతకు, ఆరోగ్యకరమైన దంతములకు

తయారు చేయువారు:- **కార్ఖాన జిందా తిలిస్మాత్** హైదరాబాద్